# ప్రబంధములలో ప్రకృతి వర్ణనలు

## TREATMENT OF NATURE IN TELUGU PRABANDHAS



1974వ సంవత్సరమున

శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయమువారిచే

డాక్టరేట్ పట్టమునకు ఆమోదింపబడి

సర్వోత్తమమైనదిగా నిర్ణయింపబడిన

సిద్ధాంత గ్రంథము

డాక్టర్ అంతటి నరసింహం

This work has been awarded the

"LATE K. BALARAMI REDDY MEMORIAL MEDAL"

for THE BEST THESIS in Telugu for the year 1974.



# రచయితను గూర్చి—

జననం: 1925లో. కడపజిల్లా, వెంకటరాజుపల్లి.

విద్యాభ్యాసం: రాజంపేట బోర్డుహైస్కూలు, అనంతపురం ఆర్ట్సు కాలేజి, వాల్తేరు ఆంధ్ర విశ్వవిద్యాలయం. తెలుగు ఎం.ఏ., హిందీ విశారద; డాక్టరేట్ బిరుదు, S.V. యూనివర్సిటీ. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల ప్రత్యేకాధికారి, సెక్రెటేరియట్.

కావ్యములు: నవసృష్టి (హిందీలోకి అనువదింపబడుతున్నది). (కం) కాళరాత్రి.

సాంఘిక నవలలు: ఆదర్శం, భావం, సంసారం, ప్రేమ భిక్ష, శోభాదేవి, శంపాలత, చీకట్లో కాంతిరేఖలు, స్వాగతం (హిందీలోకి "అప్ బీతీ" అన్న పేరుతో అనువదింపబడినది).

చారిత్రక నవలలు; గామరాయలు.

బాలసాహిత్యం: కోట వీరన్న సాహసం, ఉదయగిరి పోలన్న ధైర్యం, మంత్రాల రామన్న మొండితనం, కవిగారి బాల్యం.

నాటకాలు: సహజీవనం, సమరసత్వం, మానవత్వం, పరిష్కారం, భువన విజయం, ఎక్కడి గొంగడి అక్కడనే.

పరిశోధన: ప్రబంధములలో ప్రకృతివర్ణనలు (1974లో S.V. యూనివర్సిటీలో సర్వోత్తమమైనదిగా నిర్ణయింపబడినది.) మరాఠీ భాషలోనికి సంక్షిప్తరూపమున అనువదింపబడుతున్నది.

అభిమాన విషయములు: అస్పృశ్యతా నివారణ, కులాంతర వివాహాలు, వర్ణ వర్గభేద నిర్మూలనం, స్త్రీ విద్య.

# అంకితము

తల్లి : శ్రీమతి అంతటి సుబ్బమ్మగారు
తండ్రి : శ్రీయుతులు అంతటి పెంచలయ్యగారు

పనసతొనల్, మరందమును, పాలును, చక్కెర, నేయి, మీగడల్
పనుపడ మేళవించి, కడుపారగ జుర్రగ నాత్మ కెంత యిం
పును గలిగించు, దానికి నపూర్వము, వందలకోట్ల రెట్ల తీ
పునుగల దమ్మయన్ బలుకు పువ్వుల గుత్తుల మెత్తనైనదై

అమ్మా నన్ భవదీయ గర్భమున నత్యాకాంక్షమై మోసి, క
ష్టమ్ముల్ సైచి, భవమ్ము నిచ్చి, పరిరక్షా శ్రద్ధమై కాచి, పూ
తమ్మౌ జ్ఞానదమైన విద్యగఱపం దండ్రిన్ బురింగొల్పి, న
న్నిమ్మాడ్కిన్ కవిజేసినావు గొనుమా యీ కావ్యమున్ వడ్డిగా.

నను జిన్నప్పటినుండి యాంధ్ర కవితానానాగతుల్ శ్రద్ధతో
గన బ్రోత్సాహమొనర్చుచున్ నిశలలో గావ్యాల నెంతో పఠిం
పనిదే నిద్రకు బంపనొల్లని మహాభవ్యాత్మ శ్రీ పెంచలా
ర్యునకుం గావ్యము మత్పితౄణ వినివృత్త్యోద్యోగినై యిచ్చెదన్.

# కృతజ్ఞత

"ప్రబంధములలో ప్రకృతి వర్ణనలు" అను అంశముపై పరిశోధన చేయుట కను
తి నిచ్చిన శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయము వారికిని- ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము
రికిని నా కృతజ్ఞతలు.

శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయాంధ్ర విభాగమున కధ్యక్షులుగ నుండుచు ఏత
షయముపై పరిశోధనకు నన్ను ప్రోత్సహించి పథః ప్రదర్శకులుగ నున్న డా॥
యన్. రెడ్డిగారికిని నా ప్రత్యేక కృతజ్ఞతలు.

పరిశోధనా కార్యక్రమములో నన్ను ప్రోత్సహించి పరిశీలన యందనేక విధము
గ తోడ్పడిన డా॥ తిమ్మావజ్ఝల కోదండ రామయ్యగారికిని శ్రీ కె. సుబ్బరామప్ప
రికిని శ్రీ శౌరి రాయన్ రఘుపతిగార్లకును (శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ
ళశాఖ), డా॥ జీరెడ్డి చెన్నారెడ్డిగారికిని శ్రీ జాస్తి సూర్యనారాయణగారికిని
శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయాంధ్ర శాఖ), సర్వశ్రీ పి. నూకాలరావు, సూర్య
రాయణ, కె. గోపాలకృష్ణయ్య, టి. కె. ఆర్. రామానుజాచార్యులుగార్లకును
ప్రభుత్వ కళాశాలలో సంస్కృతాంధ్ర శాఖలు) ఈ సిద్ధాంత వ్యాసమును టైపు
యుటలో - తమ పనిగా భావించి- అహర్నిశలు శ్రద్ధ వహించి టైపు చేయించి
గ్రాఫులు దిద్దిన శ్రీయుతులు డి. ఇమాం సాహేబు, సి. హెచ్. వెంకటేశ్వరరావుల
ు (కడప ప్రభుత్వ కళాశాలాంధ్రవిభాగము) డాక్టర్ అక్కిరెడ్డికిని (మద్రాసు) నా
తజ్ఞతలు. నా యీ కృషిలో ప్రత్యక్షముగను, పరోక్షముగను తోడ్పడిన వారందఱ
ు నా కృతజ్ఞతలు.

ఏతత్ సిద్ధాంత గ్రంథమునకు న్యాయనిర్ణేతలుగ వ్యవహరించిన ప్రఖ్యాత విమ
కులు డాక్టర్ దివాకర్ల వెంకటావధాని గారికిని, డాక్టర్ బి. రామరాజుగారికిని,
క్టర్ సి. నారాయణరెడ్డిగారికిని నా కృతజ్ఞతలు.

# విజ్ఞాపన

సిద్ధాంత వ్యాసములు గూడ విషయమును బట్టి వ్యావహారిక భాషలో వ్రాయ వచ్చునని యిటీవల శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయాంధ్ర విభాగమునకు సంబంధించిన బోర్డ్ ఆఫ్ స్టడీస్ నిర్ణయించినది. నేను ఈసిద్ధాంత వ్యాసమును వ్యావహారిక భాషలోనే వ్రాయ సంకల్పించి తర్వాతవిరమించి, సులభప్రామాణిక భాషలో వ్రాసి పూర్తిచేసితిని.

అర్థావగతికి భంగము వాటిల్లునన్న చోట్ల తప్ప, అరసున్నలును, శకటరేఫములను ఉద్దేశ పూర్వకముగ వదలివేయబడినవని మనవి. చాలచోట్ల విసంధి పాటింపబడినది,

# అభివందనములు

ఈ రచనను అచ్చొత్తించుటకు ఆర్థిక సహాయము గావించి ప్రోత్సహించిన ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ విద్యా సాంస్కృతిక వ్యవహారాలశాఖ వారికిని, రమ్యముగా అచ్చొత్తించుటకన్ని విధాలుగా సహాయపడిన చారీ & కంపెనీ వారికిని, ప్రూఫులు దిద్ది రమణీయాకృతిలో గ్రంథము వెలువడుటకు కారణభూలతుయిన ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ కార్యదర్శి శ్రీ బుడ్డిగ సుబ్బరాయన్ గారికిని, అంతర్జాతీయ తెలుగు సంస్థ డిప్యూటీడైరెక్టరు శ్రీ గంగిశెట్టి లక్ష్మీనారాయణకును, వై. ఆంజనేయులు (భాషా సమితి) గారికిని, కంట్రోలు రేటు కాగితమును మంజూరుచేసిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారికిని, ముఖపత్రము నాకర్షణీయముగ రచించి యిచ్చిన ప్రముఖ కవి చిత్రకారులు శీలా వీర్రాజుగారికిని ప్రత్యేకాభివందనములు,

# విషయ సూచిక

## ప్రథమ ఖండము

## ద్వితీయ ఖండము

## ప ట్టి క లు

# ఉపోద్ఘాతము

తెలుగు ప్రబంధాలలో ప్రకృతివర్ణనలు అతివేలములును, రమణీయములును, రసోదంచితములును. ఏ కవియైనను, ఏ నాటివాడైనను, ఏ భాషలోనైనను, ప్రకృతిని వర్ణింపక కవి కాలేదు. ప్రకృతియే కవిత్వావిర్భావమునకు ఉద్దీపనకారణము.

తెలుగు ప్రబంధాలలోని ప్రకృతివర్ణనలు అమేయ ప్రతిభా సంపూర్ణములు. అమోఘ పరిశీలనా సంజాతములు.

ఆంధ్రులకున్న సాహితీసంపద అత్యధికమైనది. ఆంధ్రకవుల వారసత్వము గూడ చాల పురాతనమైనదియును, విశిష్టమైనదియును. అంతకు పూర్వము కనీసము రెండు మూడు శతాబ్దములనుండి కావ్యరచనయుండి యుండినను, మనకు లభ్యమగుచున్న సాహితీ రూపము నన్నయ నాటినుండియే.

నన్నయ, భారతమును అనువాదము చేసినాడు. మూలభారతములోని ప్రకృతి వర్ణనలనుగూడ అనువాదము చేసినాడు. కాని యథాతథముగ గాదు. మార్పులను, చేర్పులను చాలగా చేసినాడు. ఎన్నియో ప్రకృతి వర్ణనలను స్వతంత్రముగచేసినాడు.

తర్వాతివారయిన తిక్కనాదులు, అనువాద కవులయ్యును, ప్రకృతి వర్ణనలు చేయవలసినచోట కొంత స్వాతంత్ర్యమునే అవలంబించినారు.

కావ్యానువాదకర్తలయిన శ్రీనాథాదులు యథామాతృకముగ అనువాదము కావించిన వారయ్యును, ప్రకృతివర్ణనలు చేయుసమయమున స్వాతంత్ర్యము నవలంబించినారు.

తెలుగు ప్రబంధ సాహిత్యము అనువాద సాహిత్యము గాదు. అందలి ప్రకృతి వర్ణనలును స్వతంత్రములు. అక్కడక్కడ పూర్వసంస్కృత కవుల ననుసరించినను వానికిని వీనికిని బింబ ప్రతిబింబ భావము కలదనుట పొసగదు. ఆంధ్రప్రబంధకారులు వర్ణించిన ప్రకృతివర్ణనలు అతి స్వతంత్రములు. స్వకపోలకల్పనలు. స్వీయ పాండితీ ప్రతీకములు. స్వీయవిజ్ఞాన విలసితములు. అశేష శేముషీ ప్రదర్శకములు.

ప్రబంధవర్ణనలగూర్చి కొన్ని ప్రత్యేక రచనలు గలవు గాని అవి సమగ్రములు గావు. కావున ఆంధ్రప్రబంధము లందంతట గల వివిధ ప్రకృతి వర్ణనల సాకల్యమును ఆంధ్రపాఠకుల కందింప ప్రయత్నించుచున్నాను. ఈ సిద్ధాంత వ్యాసమందు వర్ణనా ప్రధానములయిన తెలుగు ప్రబంధములలోని ప్రకృతివర్ణనా విశేషములును, అందాయా కవుల ప్రతిభా చమత్కారములును, ప్రధాన విషయములు.

ప్రాచీన ఆంధ్రకృతుల కన్నిటికిని సంస్కృత వాఙ్మయము జీవగఱ్ఱ. ఆ కవులంద
ఱును సంస్కృతభాషయందును అందలి శాస్త్రములందును అపార పాండిత్యముగలవారు.
రచనా విధానములలో పెక్కువిధములుగా సంస్కృత కావ్యాదుల ననుసరించినవారు.

అందువలన ఆంధ్ర ప్రబంధ ప్రకృతివర్ణనా వివరణకు పూర్వరంగముగా సంస్కృత
మందలి వైదిక లౌకిక సాహిత్యమందలి ప్రకృతి వర్ణనలు పరామర్శింపబడినవి.

తమిళ కన్నడములవలె తెనుగు గూడ ద్రావిడ భాషయేగాన ఇందలి ప్రకృతి
వర్ణనలకును అందలి ప్రకృతి వర్ణనలకును సంబంధము గలదేమో కనిపట్టుటకై తమిళ
కన్నడ ప్రబంధ పరిశీలనగూడ స్థూలముగ కావింపబడినది.

ఈ సిద్ధాంతవ్యాసము మొత్తము రెండు ఖండములుగ విభజింపబడినది.

మొదటి ఖండము మరల నైదు ప్రకరణములుగా విభజింపబడినది.

ఇందు మొదటి ప్రకరణమున కవి, కవిత్వము. ప్రకృతివర్ణన అనువానియొక్క
వివరణమును, రెండవ ప్రకరణమున ప్రకృతి వివిధరూపముల గురించిన వివరణమును,
మూడవ ప్రకరణమున వేదవాఙ్మయమందలి ప్రకృతివర్ణన గూర్చియు, నాల్గవ ప్రకరణ
మున లౌకిక సంస్కృత వాఙ్మయమందలి ప్రకృతివర్ణనల గూర్చియు, అయిదవ ప్రకరణ
మున తమిళ కర్ణాట వాఙ్మయమందలి ప్రకృతి వర్ణనల గూర్చియు, దిఙ్మాత్రకముగ వివ
రింపబడినది. ఆంధ్రప్రబంధకారులు కావించిన ప్రకృతివర్ణనలగురించి మాత్రమే ద్వితీయ
ఖండమందు తులనాత్మక పరిశీలన జరుగుచున్నదిగాన సర్వ ప్రకృతి స్వరూపస్వభావములను
పూర్వకవు లే దృష్టితో పరిశీలించి వర్ణించిరో తెలిసికొనవలసిన అవసరమును పురస్కరించు
కొని వేదములందలివియును, రామాయణాది పూర్వ కావ్యములందలివియునైన, ప్రకృతి
వర్ణనలను కొలదిగ ప్రథమ ఖండమున ప్రదర్శించుట జరిగినది.

ద్వితీయ ఖండము ద్వాదశ ప్రకరణములుగ విభజింపబడినది. అందు మొదటి
ప్రకరణమున ప్రబంధనిర్వచనమును గురించియు, "అష్టాదశవర్ణన సంస్కృత లాక్షణికులు"
అనుదానిని గుఱించియు, "అష్టాదశవర్ణనలు, తెలుగు లాక్షణికులు" అనుదానిని గురించియు
వర్ణన పద్ధతిని గుఱించియు వివరింపబడినది. ద్వితీయ ప్రకరణమున తులనాత్మక పరిశీల
నకై యెన్నుకొన్న అష్ట ప్రబంధముల గుఱించియు, ప్రకృతివర్ణనల తులనాత్మక పరి
శీలనయు జరిగినది. తృతీయ ప్రకరణమున పురవర్ణనయును, చతుర్థ ప్రకరణమున
సముద్రవర్ణనయును, పంచమ ప్రకరణమున పర్వత వర్ణనయును, షష్ఠ ప్రకరణమున వన
వర్ణనయును, సప్తమప్రకరణమున శైత్యోపచార వర్ణనయును, అష్టమ ప్రకరణమున
ఋతు వర్ణనయును. నవమప్రకరణమున నదీ సరోవర వర్ణనలును, దశమ ప్రకరణమున
సూర్యోదయాది వర్ణనలును, ఏకాదశ ప్రకరణమున సూర్యాస్తమయాది వర్ణనలును,
ద్వాదశ ప్రకరణమున చంద్రోదయాది వర్ణనలును పరిశీలింపబడినవి.

ఈ తులనాత్మక పరిశీలనమే ఈ సిద్ధాంత వ్యాసమునకు జీవగఱ్ఱ. కుమార సంభవ, మనుచరిత్ర, పారిజాతాపహరణ, ఆముక్తమాల్యద, కళాపూర్ణోదయ, ప్రభావతీ ప్రద్యుమ్న, వసుచరిత్ర, విజయవిలాసములందలి, ప్రకృతి వర్ణనలను పరస్పరము పోల్చుటయు వైదిక లౌకిక, సంస్కృత కావ్యములందలి ప్రకృతి వర్ణనలతో గూడ వానికిగల సంబంధమును వివరించుటయు, తమిళము మొదలగు దాక్షిణాత్య భాషాకావ్యములందలి ప్రకృతి వర్ణనలకును, వానికిని సంబంధము గలదేమో వివరించుటయు జరిగినది.

ఒక్కొక్క కవి ప్రకృతి వర్ణన చేసిన విషయమును, ఆ ప్రకృతి వర్ణననే మరియొక కవి చేసినపుడు వారి నొకరి నొకరితో పోల్చు సందర్భమునను, వచన రూపమున వ్యాఖ్యానించుటకంటె వారి పద్యములనే ఉదాహరణములుగ నిచ్చుచో, శైలీ సౌందర్యముతో పాటు విషయ ప్రదర్శనము గూడ ప్రత్యక్షీకరించినట్లగునన్న భావముతో ఆయా సందర్భములందలి పద్యములనే ఉల్లేఖించుట జరిగినది. దానితోబాటు వ్యంగ్యశ్లేష చమత్కారాద్యర్థములును, అంతరాంతరార్థములును గూడ వ్యక్తములగును.

కడపటిది కేవలము ఉపసంహారము. అనగా పై చర్చల సారాంశము.

ఈ సిద్ధాంత వ్యాసమున మరొక ప్రత్యేకత గలదు. ప్రతి ప్రకరణమును కూలంకషముగ చర్చించిన అనంతరము కడపట ఆ ప్రకరణ చర్చా సారాంశము నొసగుట జరిగినది. చదివిన విషయమును పాఠకుడు మననము చేసికొను సారంశమా అన్నట్లిది రచింపబడినది. అన్ని ప్రకరణాంతములందలి సారాంశ సమాహార స్వరూపమే కట్టకడపట రచించిన ఉపసంహారము.

# ప్రథమ ప్రకరణము

## 1:1 కవి

'కవి' శబ్దమున కీ క్రింది నైఘంటికార్థములు గలవు.

కవయతే చాతుర్యేణ కవిః (కబృవర్ణే) వబయో రభేదః
= చాతుర్యముచేత వర్ణించువాడు. —గురుబాలప్రబోధిక

అమరకోశమున 'కవి' శబ్దము పండితాది శబ్దములకు పర్యాయముగ తెలుపబడినది.

"విద్వాన్ విపశ్చిద్దోషజ్ఞః స్సన్సుధీః కోవిదోబుధః
ధీరో మనీషిజ్ఞః ప్రాజ్ఞః సంఖ్యావాన్ పండితః కవిః"

—అమరము : బ్రహ్మవర్గము

ధీశక్తి, వ్యుత్పన్నత మొదలగు గుణములు గలిగి భాషారూపమున వర్ణనాత్మక రచన చేయువాడు 'కవి'యని గ్రహింపవచ్చును.

"నానృషిః కురుతే కావ్యం" అన్న సూక్తిని బట్టి 'కవి' ఋషితుల్యుడు. ఋషికి ఏకాగ్రత ముఖ్యము. అట్టి యవధానమే కవికి గూడ ముఖ్యము. ఋషికి గల తపశ్శక్తికి సదృశమైనట్టి శక్తి సంపదగలవాడే కవి యని భావము.

'కవి' శబ్దము పరమాత్మ శబ్దమునకు అభిన్నముగ గూడ వాడబడినది.

"గణానాంత్వా గణపతి గ్ం హవామహే
కవిం కవీనాముపవశ్రమ స్తమం
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత
ఆనః శృణ్వన్నూతిభిః సీదసాదనమ్" —ఋ 2-3-23-1

[హే బ్రహ్మణస్పతే! దేవగణములపతియును, కవులకు కవియును, కీర్తిని కలిగియున్నట్టియును, ప్రసిద్ధులకు ప్రసిద్ధుడవును, వేదమంత్రములకు స్వామి యయినవాడవును అయిన నిన్ను ఆవాహనము చేయుచున్నాను]

"కవిర్మనీషీ పరిభూస్స్వయంభూః" (కవి స్వయంభువే)

—ఈశావాస్యోపనిషత్తు - మంత్ర. 8

పై వేదోక్తుల ననుసరించి కవి పరమాత్మకు సాటి యగుచున్నాడు. సృష్టికర్త తన ఇచ్ఛాజ్ఞాన క్రియా శక్తులచే, జగత్సృష్టి నెట్లు చేయునో అట్లే కవి గూడ

కావ్యసృష్టి చేయును. కవి కావ్యప్రపంచ సృష్టికర్త యని పరమార్థము.
అంతేగాక

"నియతి కృతనియమరహితాం హ్లాదైకమయీ మనన్యపరతంత్రాం
నవరస రుచిరాం నిర్మితిమాదధతీ భారతీ కవేర్జయతి"

[సృష్టికర్త నియమములను ఉల్లంఘించిన సృష్టిగలవియు, ఆనందగర్భితమయి నవియును, స్వతంత్రమయినవియును, నవరస రుచిరమయినవియును అగు కావ్యసృష్టి కర్తలయిన కవుల కావ్యములు ప్రకాశించుగాక]

అనిన మమ్మటాచార్యుని మతము ననుసరించి కవి, సృష్టికర్త నియమముల నైతను మించి సృష్టి చేయువాడని తెలుచున్నది.

'కవి' యన సామాన్యుడుగాడు. ప్రతిభావంతుడును, ఋషితుల్యుడును, సృష్టి కర్తృసదృశుడును, సృష్టికర్త నియమములను గూడ మించిన సృష్టి చేయగలవాడును అయి, వాగర్థముల సాహాయ్యమున కవితాసృష్టి చేయువాడని సిద్ధాంతము.

ఆంగ్లమున 'కవి' శబ్దమునకు సమానార్థక పదము పొయెట్ (Poet). పొయెట్ శబ్దము, అర్థము గూడ గ్రీకు, లాటిన్ పదముల ననుసరించి ఆంగ్లములోనికి వచ్చినవి.[1]

Poet (N) M.E. poete < O.F poete

< po ēta < GK po (i) ē t ē s

One who makes, an artificer.

A poet is one who imitates the unreal world అని ప్లేటో తెలుపగా, The poet is a maker, a visionary అని అరిస్టాటిల్ ప్రతిపాదించియున్నాడు. లాటిన్ భాషలో poeta అను పదమునకు vates అను పర్యాయ పదము గూడ గలదు. vates అనగా సమాజమును నడపు ముందుచూపు గలవాడని యర్థము (prophet). Prophet అనగా ఋషి.

పై వ్యుత్పత్తుల బట్టి పాశ్చాత్య మతము ననుసరించి గూడ, కవి యనగా, సార్థక పదములతో శబ్దప్రపంచ నిర్మాణము చేయువాడనియు, కళాత్మక నిర్మాణము చేయువాడనియు, సమాజమును నడిపించు ముందుచూపు గలవాడనియు నర్థము.

## 1:2 కవిత్వము

సంస్కృతాలంకారికులమతమున కవిత్వమును కావ్యమును, సమానార్థకములు. గద్య పద్య నాటక లక్షణ గ్రంథాదులన్నియు కావ్యములే :

1. Klain Earnest : A Comprehensive Etymological Dictionary of the English Language, vol. 1.2, pp. 1207.

"శబ్దము ననుసరించి యర్థమును, అర్థము ననుసరించి శబ్దమును ప్రయోగించుటే కావ్య" మన్నాడు భామహుడు.[2]

"గుణాలంకార యుక్తార్థములు గలది కావ్య"మన్నాడు వామనుడు.[3]

"నిర్దోష పదములతో, గుణములతో, అలంకారములతో, రసములతో కూడు కొన్న పదములే కావ్యము" భోజుడు.[4]

"గుణాలంకార రీతి రసోపేతమై, సందర్భశుద్ధి గలిగిన సాధు శబ్ద ప్రయోగము గలదే కావ్యము" వాగ్భటుడు.[5]

"రసాత్మకమైన వాక్యమే కావ్యము" విశ్వనాథుడు.[6]

"రమణీయార్థ ప్రతిపాదక శబ్దముతో గూడినది కావ్యము" జగన్నాథరాయలు.[7]

పై నిర్వచనములను సమన్వయించి "దోషరహితమై అర్థయుక్త పదములతో గూడి, రసపూర్ణమును, రీతియుక్తమును, ధ్వని సమన్వితమును, అలంకార సహితమును అయిన వాక్యములతో కూడిన రచన" కావ్యము అని నిర్ణయింపవచ్చును.

పాశ్చాత్యుల కవిత్వ నిర్వచనమును గమనింతము.

"సదాదర్శమునకు ప్రాతినిధ్యము వహించునదే కవిత్వము.[8]

"ప్రకృతి యొక్కయు మానవుని యొక్కయు బింబ ప్రతిబింబ భావనయే కవిత్వము. కవి ప్రశాంత చిత్తముతో (సమాధిలో) నున్నపుడు పునరావర్తనము చెందు భావోద్రేకము నుండి జనించు నిరాటంక ప్రవాహమే అది. సర్వజ్ఞానమునకు పరమావధియై భావుక హృదయ మెంత యమరమో అంత అమరమైనట్టిదే కవిత్వము."[9]

---

2. శబ్దార్థ సహితౌ కావ్యం.
3. గుణాలంకారయుక్తార్థౌ కావ్యం.
4. నిర్దోష గుణాలంకార రసవద్వాక్యం కావ్యం.
5. గుణాలంకార రీతి రసోపేతః సాధు శబ్దార్థ సందర్భః కావ్యం.
6. వాక్యం రసాత్మకం కావ్యం.
7. రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యం.
8. "Poetry is the representative of the Ideal" - Aristotle.
9. "Poetry is the image of man and nature. It is the spontaneous overflow of powerful feelings. It takes its origin from emotion recollected in tranquility. It is the first and last of all knowledge and it is immortal as the heart of man." —WORDSWORTH.

"ఆత్యానంద స్థితినిబొందిన అత్యుత్తముల మనస్థితులకు సంబంధించి అత్యానంద మయినట్టియు, అత్యుత్తమమయినట్టియు భావసంకలనమే కవిత్వము. అది అన్ని వస్తువులను ప్రేమాస్పదములను చేయునదియు తర్కమునకు సుదూరమైనట్టిదియు నైనది."[10]

"ఆలోచనాయుక్త పదములతో మూర్తీభవించిన నిరంతర భావతీవ్రతయే కవిత్వము"[11]

"ఉత్కృష్టమైన సత్యరూపశక్తులకు సంబంధించి భావనాయోగజనితమైనట్టియు, రసశక్తిజనితమైనట్టియు మూర్తుల ప్రతిబింబింపజేసి ఏకత్వములోని వైవిధ్యరూపముతో భాషను లయపూర్ణముగావించి వెలువరించిన ఉత్కంఠ వాగ్రూపమే కవిత్వమనియు, అన్నియును కవితావస్తువులే అనియు, దాని లక్ష్యము ఆనందమున ముంచెత్తుట అనియు" అన్నాడు జేమ్సు హెన్రీ లీ'హంట్.[12]

"భౌతికాది శాస్త్రములకు సరిగా విరుద్ధమైనది కావ్యకళ. దీని ధ్యేయము ఆనందము. సత్యము గాదు" అన్నాడు కోల్ రిడ్జి.[13]

"మానవుని మాటలు పరాకాష్ఠను పొందు సంపూర్ణ స్వచ్ఛానందము కవిత్వము" అన్నాడు మాత్యూ ఆర్నాల్డ్.[14]

ఆంగ్ల కవి విమర్శకుల యొక్క నిర్వచనముల ననుసరించి "రసాలంకారభరితమై, సార్థక పదప్రయోగముగలదియై, ఆనందమే పరమావధిగాగల రచన"యే కవిత్వమని తేలుచున్నది.

కవిత్వ నిర్వచన విషయమున ప్రాక్పశ్చిమ కవి విమర్శకుల దృష్టియందు ఎన్నదగిన భేదము లేదని భావింప వచ్చును.

---

10. "Poetry is the best and happiest moments of the happiest and best minds. It turns all things to loveliness and poetry differs from logic"—SHELLY.

11. "What is poetry but the thought and words in which emotion spontaneously embodies itself"—MILL.

12. "Poetry is the utterance of passion for truth, beauty and power of embodying and illustrating its conception by imagination and fancy and modulating its language on the principle of variety in uniformity. It means one that whatever the universe contains and its ends are pleasure and exaltation '—Henry Le' Hunt.

13. "Poetry is the antithesis of science having for its immediate object pleasure, not truth"—Coleridge.

14. "Poetry is simply the most delightful and perfect form of utterance that human words can reach"—Mathew Arnold.

## 1:3. ప్రకృతి

ప్రకృతి అర్థమునకు గురుబాల ప్రబోధికలోని వ్యుత్పత్తి :

ప్రకృతి : ప్రారంభః క్రియతే అనయేతి ప్రకృతిః (దీనిచేత జగత్ప్రారంభము చేయబడుచున్నది).
జగత్సృష్టియే ప్రకృతి యయినపుడు విశ్వమంతయు ప్రకృతియే యన వలసి వచ్చుచున్నది.

ప్రకరోతి పురుషోప భోగార్థం శబ్దాది భోగ్యానితివా ప్రకృతిః
= పురుషోపభోగము కొరకు శబ్దస్పర్శాది భోగవస్తువుల చేయునది.
[కాలవర్గము - అమరము]

ప్రకృతిర్యోనిలింగేచ = ఉపాదానకారణమునకును, స్త్రీ పుం నపుంసక లింగములకును, సప్తాంగములకును, పౌరశ్రేణులకును, స్వభావమునకును భగమునకును, సత్వరజస్తమోగుణములయొక్క సామ్యావస్థకును పేరని కొందరందురు. [నానార్థవర్గము - అమరము]

ప్రక్రియతేఅనయాంకార్యమితి = దీనిచేత కార్యము చేయబడును.
[నానార్థవర్గము - అమరము]

పై నిర్వచనముల ననుసరించి ప్రకృత్యర్థములనంతములు. ప్రకృతి యెంత అనంతమో దాని యర్థములును అనంతములు. ఇంద్రియగోచరమైనదంతయును ప్రకృతియే. ఈ ప్రకృతి బాహ్యప్రకృతి. మనస్సునకును బుద్ధికినిమాత్రమే అంతర్దృష్టి ఫలముగా గోచరించునది అతఃప్రకృతి. భావావిర్భావమునకు అంతఃప్రకృతి మూల స్థానము. మనోవికారమే భావము. బాహ్య ప్రకృతి ఆలంబనోద్దీపనాదులకు మూలము. ఈ ద్వివిధ ప్రకృతుల కలయికయే కవిత్వావిర్భావమునకు హేతుభూతమగుచున్నది.

అంతర్బాహ్యప్రకృతులే కవిత్వావిర్భావమునకు కారణమని సారాంశము. అంతర్బాహ్య ప్రకృతులను సమన్వయించి వర్ణించుటే కవిత్వము.

## 1:4 వర్ణన

వర్ణన అనగా వర్ణించుట. వర్ణస్తుతౌ (కొనియాడబడునది, కొనియాడునది) అని గురుబాలప్రబోధిక. ఏ వస్తువునయినను సరే - దాని బాహ్యాకారమును, దానిని పురస్కరించుకొని ఉత్పన్నములగు భావాలను; అంతరాకారమును, దానిని పురస్కరించుకొని ఉత్పన్నములగు భావాలను; వర్ణించుట వర్ణన అగుచున్నది. అంతర్వర్ణ

నలును - బాహ్యావర్ణనలును - అన్నియును వర్ణన క్రిందికి వచ్చును. వర్ణనతో కూడు కొన్నదే కవిత్వమగుచున్నది. వర్ణన అనగా కవిత్వము.

కవి = కబృ = వర్ణే (వబయోరభేదః) కవయతీతికవిః = వర్ణించువాడు కవి. కాబట్టి వర్ణన అనగా కవిత్వమనియు, కవిత్వమనగా వర్ణన అనియు తెలుచున్నది.

ఆత్మానందము పొంది కవి వర్ణన చేయుచున్నాడు. అది ఆత్మార్థమేగాక పరార్థముగాగూడ పరిణమించవచ్చును. దానివలన ప్రతిఫలముగూడ లభింపవచ్చును. కాని కవి తానానందమును పొందనిదే కవిత్వము వ్రాయడు. వర్ణన చేయడు. ఆనందాది భావవ్యక్తీకరణకొరకే కవి వర్ణనలు చేయును. ఆనందప్రదమయిన దృశ్యమును గాని, దుఃఖప్రదమైన దృశ్యమునుగాని చూచి భావోత్కంఠితుడైన కవి తన అనుభూతిని ఇతరులకు పంచగోరి వర్ణన చేయుచున్నాడు, అందువలన అతడాత్మతృప్తిని బొందుచున్నాడు. ఆ కవిత్వమును చదివి ఇతరులుగూడ తదానందమునే పొందినపుడు చూచి ఆనందించుచున్నాడు.

"కావ్యం యశసే ఒ ర్థకృతే వ్యవహార విదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతా సమ్మిత తయోపదేశయుజే"

అన్న మమ్మటుని వచనము ననుసరించి కావ్యప్రయోజనము నిర్దేశింపబడుచున్నది.

కవి చేయు ప్రకృతివర్ణనలకు బహుముఖప్రయోజనములు గలవు. ప్రకృతి వలన ఉద్దీపనను పొంది భావానందమును పొందిన కవి, పాఠకులుగూడ సదానందమును పొందుట కొఱకు ప్రకృతివర్ణన చేయును.

సుబోధకత కొఱకయి గూడ ప్రకృతివర్ణనలు చేయబడుచున్నవి. మానవుని అంగములకును, ప్రకృతి వస్తువులకును - మానవుని స్వభావమునకును, ప్రకృతి స్వభావమునకును - మానవుని చేష్టలకును, ప్రకృతి చేష్టలకును - సామ్యావస్థను వర్ణించి కవిత్వము సుబోధకము చేయుచున్నాడు కవి. ఉపమానను వలన ఉపమేయము అర్థమగుటయు ఉపమేయమువలన ఉపమానము అర్థమగుటయు ప్రకృతి వర్ణన వల్లనే జరుగుచున్నది.

కథావస్తువు గల కావ్యరచనల యందుకూడ వాతావరణ సృష్టికొఱకు ప్రకృతి వర్ణనలను చేయుచున్నాడు కవి. వర్ణిత వ్యక్తులయొక్క పరిస్థితులను, వారి చేష్టలను, సమర్థించుట కొఱకును పాత్రలయొక్క బాహ్యాంతర ప్రవృత్తులను అర్థము చేసికొనుట కొఱకును - వాతావరణ కల్పనకై ప్రకృతి వర్ణనలు గావించుచున్నాడు.

వర్ణితపాత్రల చేష్టలయెడ సానుభూతి కలిగించుటకు గూడ ప్రకృతివర్ణనలు దోహదకారు లగుచున్నవి.

ప్రకృతివర్ణనకు వీనన్నిటికంటె మించిన ప్రయోజనము మరియొకటి యున్నది.

అది సుందరముగ - మనోజ్ఞముగ - ప్రతిభాప్రదర్శకముగ - ప్రభావపూర్ణముగ కావ్యమును చెప్పుట.

సాహిత్యావిర్భావము ప్రకృతి వర్ణనలతోనే మొదలయిన దనవచ్చును. వేదములు ప్రధానముగ ప్రకృతి వర్ణనాత్మక రచనలేగదా ! ఇతివృత్తప్రధానములైన సంస్కృత పురాణాదులందు గూడ ప్రకృతివర్ణనలు అధికముగా చోటు చేసికొన్నవి. ఈ ప్రకృతి వర్ణనల ప్రాధాన్య ప్రభావములను తెలిసికొనియే తర్వాతి కావ్యకర్తలును, లాక్షణికులును కావ్యములందు అష్టాదశవర్ణన లుండవలెనను నియమము గూడ గావించిరి. కేవల ప్రకృతివర్ణనలు గల సాహితీ ప్రక్రియలు గూడ విశ్వసాహిత్యమందు లేక పోలేదు.

ఈ ప్రకరణమందు చర్చింపబడిన విషయ సారాంశమిది :

1. కవియనగా ప్రతిభావంతుడును, ఋషితుల్యుడును, సృష్టికర్తృ సదృశుడును, సృష్టికర్త నియమముల గూడ మించిన సృష్టి చేయగలవాడును అయి, వాగర్థముల సాహాయ్యమున కవితాసృష్టి చేయువాడని యర్థము.
2. పాశ్చాత్యుల దృష్టి ననుసరించిగూడ కవి, యతివంటివాడును, ముందు చూపుగలవాడును, సార్థకపదములతో శబ్దప్రపంచ సృష్టి నిర్మాణము చేయువాడును అగుచున్నాడు.
3. కవిత్వనిర్వచన విషయమున ప్రాక్ పశ్చిమ కవి విమర్శకుల దృష్టియందు ఎన్నదగిన భేదము లేదు.
4. ప్రకృతియనగా అంతస్సును బాహ్యమునుగూడ అగుచున్నది. అంతర్బాహ్య ప్రకృతుల సమన్వయించి వర్ణించుటే కవిత్వ మగుచున్నది.
5. వర్ణనయొక్క ప్రయోజనము బహుముఖమైనది.

# ద్వితీయ ప్రకరణము

## ప్రకృతి - వివిధ రూపములు

**2:0** సృష్టికర్త మనోజ్ఞముగ రచించిన మహాకావ్యమే ప్రకృతి. ఈ ప్రకృతి నానా రూప విలసితమై మానవునకు ఆలంబనోద్దీపన విభావరూపములతో, వర్ణనాత్మక రూప చిత్రణకు భావముల నొసగుచున్నది. కావ్యజగత్తుకు సంబంధించినంతవరకు మానవుడును ప్రకృతియును ఆధారాధేయ భావముల భజించుట జరుగుచున్నది.

### 2:1 ప్రకృతి - మానవుల పరస్పర సాన్నిహిత్యము

పృథివ్యప్తేజోవాయురాకాశములు పంచభూతములు. అవి కేవలము ప్రాకృతికములు. ప్రాణులన్నియు పాంచభౌతికములు. సర్వశరీరములును పంచభూతములనుండి జన్మించి, పంచభూతముల సహాయమున జీవించి, వానిలోనే లయమగుచున్నవి.

జీవయుక్తుడగు మానవునకును, పాంచభౌతిక ప్రకృతికిని నిరంతర సంబంధమున్నది. మానవుడు తన జన్మకును, ఆహారాదికములకును ప్రకృతిపైనే ఆధారపడుచున్నాడు. అది తెలిసికొన్న తర్వాత ఆహారమును కీర్తించినాడు. ఆదికావ్యములయిన వేదోపనిషత్తులలో అన్న ప్రాశస్త్యమును గొప్పగ ఉగ్గడించినాడు.[1]

అన్నము ప్రకృతిలో ధాన్యరూపమునను, ఫలరూపమునను, కందముల రూపమునను, శాకరూపమునను, మత్స్యమాంసాది రూపమునను ప్రత్యక్షమగుచున్నది. ఆహార రూపముననేగాక సహకార రూపమునగూడ ప్రకృతి మానవునికి సహకరించుచున్నది. ఆహారాదికములకై శ్రమించిన ప్రాణి విశ్రాంతి తీసికొనవలసియున్నది. ఇందుకు ప్రాణులు రాత్రిని శరణుజొచ్చుట సంభవించుచున్నది. ఈ రాత్రిందివములును మాస సంవత్సరములును భూసూర్యాది ప్రకృతి శక్తులయొక్క ఆత్మభ్రమణమువల్లను, భూమి సూర్యుని చుట్టు తిరుగుటవల్లను, చంద్రుడు భూమిచుట్టు భ్రమించుట వలనను కలుగుచున్నవి.

ప్రకృతి సూత్రబద్ధమై నిరంతరము, నియతమార్గమున సంచరించు ఈ ప్రకృతి శక్తులు సమయగణనకు ఉపకరించుచున్నవి.

---

1. "అన్నం బ్రహ్మేతివ్యజానాత్, అన్నాద్ధ్యేవఖల్విమాని భూతానిజాయన్తే"
"అన్నంననింద్యాత్ తద్వ్రతం. ప్రాణోవా అన్నమ్. శరీరమన్నాదమ్"
"అన్నంనపరిచక్షీత"
—తైత్తిరీయోపనిషత్, పుటలు 143, 152, 154.

దైనందిన సమయగణనకు సూర్యచంద్రులేకాక శుక్రనక్షత్రమును, ధ్రువనక్షత్రమును, సప్తర్షి మండలమును గూడ ఉపకరించుచున్నవి.

ఇంతేగాక మానవుడు, తన చుట్టుప్రక్కలనున్న మానవేతర ప్రాణి ప్రకృతి యొక్క సహజ వ్యాపారమువలన గూడ సమయ గణన చేయుచున్నాడు. ఆహార నిద్రాదికములగు నలవాట్లు ప్రాకృతికమే యయినను మానవుడు వాని నిర్ణీతతను ఉల్లంఘింపగలడు. కాని మానవేతర ప్రాణికోటి యట్లుగాదు. మానవుడు తన మేధ చేత ప్రకృతిని జయించుచున్నాడు. సాధారణ ప్రకృతి నియమముల నుల్లంఘించు చున్నాడు. కాని మానవేతర ప్రాణకోటి తద్భిన్నము.

ప్రకృతి మానవుల పరస్పర సాన్నిహిత్యములో ప్రకృతియందు మానవతారోపణ యొకటి. మానవుడు మేధాయుక్త చైతన్యమూర్తి. మానవేతర ప్రకృతి తద్విరుద్ధము. అయినను మానవుడు తన ఆనంద దుఃఖములను ప్రకృతిలో ప్రతిబింబింప జేసికొనుచున్నాడు. తనయందలి దుఃఖానందాదుల సహానుభూతిని ప్రకృతిలో నున్న ట్లుగా ఊహించుట కలవాటు చేసికొన్నాడు.

మనమేదృష్టితో ప్రకృతిని చూతుమో, ఆ దృష్టితోనే ప్రకృతి మనకు కనిపించును. ప్రకృతిని అందముగా నూహించి వానిని ఉపమానములుగా స్వీకరించుటతో వానికిని మానవులకును (అంగములు కూడ కావచ్చును) సమానత పాటించుట జరిగినది.

మానవుల సుఖదుఃఖములకు చేతనాప్రకృతి యొక్క సానుభూతి గలదు. ఈ ప్రకృతి మానవుని తనలోని వానినిగా భావించి - అట్టి సానుభూతి విశ్వాసముల ప్రకటించుచున్నది. మానవుడు గూడ తానున్న అప్పటి పరిస్థితిని పురస్కరించుకొని, తత్సంబంధిక భావదృష్టితో ప్రకృతిని చూచి - అట్టి భావములనే ప్రకృతి గూడ గలిగి యున్నట్లుగా చూచుచున్నాడు. మనము పెంచు కుక్కలు, పశువులు, జింకలు, పక్షులు ఇత్యాదులిందు కుదాహరణలు.

కావ్యములలో నీ మానవతారోపణ విశేషముగా కనిపించుచున్నది.రామాయణమున వాల్మీకి ఇట్టి వర్ణనలను చాల చేసియున్నాడు.

రాముడు సీతకై విలపించుచున్నాడు. అటులనే సీత గూడ ఎడబాటుచే దుఃఖించుచు రావణునితో పోవుచున్నది. చుట్టుపట్టుల గల ప్రకృతిని జూచి తత్సాహాయ్యము నర్థించినది. పతివ్రతకు ఇక్కడ అన్యాయము జరుగుచున్నది. ఒక అసహాయ స్త్రీకి ఘోరవిపత్తు సంభవించుచున్నది. ఆమె యొక్క దుఃఖమును చూచి,

"గాలి వలన వృక్షాలు కదలినవి. పక్షిధ్వనులు అను మధురధ్వనులతో - శాఖాగ్రములు అను చేతులతో - భయపడవలదు అని సీతకు అభయమిచ్చి నట్లున్నది."[2]

ఇక అచేతనములలో సైతము హృదయస్పందనమున్నట్లు వాల్మీకి మహాకవి నిరూపించుచున్నాడు. సీతకు కలిగిన బాధకు పర్వతములే చలించినట్లు వర్ణించుచున్నాడు.

"పర్వతములు - కన్నీళ్ళవలె కారు జలప్రవాహములతో - పైకెత్తిన చేతుల వలె కన్పట్టు శిఖరాగ్రములతో - రోదనము చేయుచున్నవా అన్నట్లు కనబడెను."[3]

"జింక పిల్లలు భయముతోడను, దీనముఖముతోడను ఏడ్చినవి."[4]

పర్వతములు జడములు. జింకలు మానవేతర జంగమములు. వానియందు మానవతారోపణ గావింపబడినది.

ప్రకృతికి మానవునిపై సానుభూతి గలదు. ప్రవరుడు త్రోసివేసిపోయిన యనంతరము వరూధిని చాల ఏడ్చినది. గుండెలు పగులునట్లేడ్చినది. కుమిలిపోయినది. ఆమె ఆ పరిస్థితికి ప్రకృతి గూడ కఱగిపోయినది. సూర్యునికే కోపము వచ్చినట్లుగా పెద్దన వర్ణించినాడు. వరూధినిని అంత కష్టములపాలు చేసెగదా యని ఆ మహీసురాధమునిపై కోపించెనా యన్నట్లు సాయంసూర్యుడు ఎఱ్ఱబడినట్లు వర్ణించినాడు. (సూర్యుడును వరూధినియును సురలుగదా.)[5]

ఈ విధముగ నెన్నిరీతులతోనో ప్రకృతి మానవసాన్నిహిత్యము కావ్యములందు ప్రకటితమయి యున్నది.

మానవ మానవేతర ప్రాణికోటి యంతయును ప్రకృతిజన్యమే గాబట్టియును, వాని యందలి అంతరాత్మలు, ఏకైక పదార్థమై విశ్వమంతయు నిండి నిబిడీకృతమై యున్న పరమాత్మ నామాంకితమగు అనంత భావ పదార్థస్వరూపము లగుటచేతను, ప్రాణికి జరుగబోవు కష్టసుఖములు మరియొక ప్రాణి ద్వారా సూచింపబడుట ప్రాకృతిక నియమమై యున్నది.

---

2. ఉత్పన్న వాతాభిహతా నానాద్విజగణాయుతాః
   మా భైరితి విధూతాగ్రా వ్యాజహ్రురివ పాదపాః —రామా-అరణ్య-52-36.

3. "జలప్రపాతాస్రముఖాః శృంగైరుచ్ఛ్రిత బాహవః
   సీతాయాం హ్రియమాణాయాం విక్రోశన్తీవ పర్వతాః" —52-37.

4. "విత్రస్తకాదీనముఖా రురుదుర్మృగ పోతకాః" —అరణ్య - 52-42.

5. "తరుణి ననన్యకాంత నతిదారుణ పుష్పశిలీముఖవ్యథా
   భర వివశాంగి నంగభవు బారికి నగ్గము సేసి క్రూరుడై
   యరిగె మహీసురాధము డహంకృతితో నని రోష భీషణ
   స్ఫురణ వహించెనోయన నభోమణి దాల్చెఁ గషాయ దీధితిన్" —మను. 3-10

తన దృక్పథాన పడిన యితర ప్రాణుల గమనాగమనముల బట్టియు, వాని అఱుపులను బట్టియు,పూసుకొన్న కృషి యొక్క ఫలాఫలములను గమనించి ఎంతో కాలము పరిశీలించిన మానవుడు శకునశాస్త్రమును సృష్టించినాడు.

ఇందులో బల్లి పలుకులు - కాకి కూతలు - కాకి గమనము - పిల్లి ఎదురువచ్చుట- పాము ఒకవైపునుండి మరియొకవైపు పోవుట - కుక్క చెవులాడించుట - నక్క కూతలు - నక్క ఎదురుపడుట - చెవులపిల్లి కనిపించుట-మొదలగున వెన్నియో గలవు. ఇట్టి శకునభావములు అన్ని సమాజములందును, అతి ప్రాచీనకాలమునందుండియు పరంపరాగతముగ సంక్రమించుచు వచ్చినవి. కార్యకారణ సంబంధము లేకున్నను ప్రజల విశ్వాసములకు పాత్రములై కవుల ఆదరణమును గూడ పొందినవి.

ఆదికావ్యమగు రామాయణమందిట్టి శకునములు కథాగతిలో అంతర్భాగముగ అనేక స్థలములందు వర్ణితములు.

ఉదాహరణకు :

మాయావి మారీచుని సహరించిన యనంతరము "రాముడు పర్ణశాలాముఖముగ వచ్చుచున్నాడు. సీతను చూడవలెనను తమకముతో వచ్చుచున్నాడు. వెనుకనుండి నక్క అఱుపు భయంకరముగ వినవచ్చినది. సీతకు ఆపద వచ్చినదేమో అని శంకించినాడు".[6]

స్వప్నావస్థలో కన్న దృశ్యములు గూడ శకునములుగా పరిగణింపబడుచున్నవి. ఉదాహరణకు త్రిజట స్వప్నదృశ్యము :

"రావణుడు పుష్పకవిమానమునుండి క్రిందపడి,ఒక ఆడుదానిచేత ఈడ్వబడుచుండెను".[7]

ఈ దృశ్యము రావణావమానమొక స్త్రీవలన జరుగునని సూచించును. అంతే గాదు. "రావణుడు పందిని, కుంభకర్ణుడు ఒంటెను, ఇంద్రజిత్తు మొసలిని అధిరోహించి దక్షిణదిశకు ప్రయాణము చేయుచున్నారు."[8] దక్షిణ దిశ యనగా యమునిదిక్కని అర్థము. అనగా వారు చనిపోవుదురని తాత్పర్యము.

ప్రహస్తుడు యుద్ధమునకు పోవునప్పటి అపశకునములు :

---

6. "తస్య సన్ త్వరమాణస్య ద్రష్టు కామస్య మైథిలీమ్
క్రూరస్వనో ఽథ గోమాయు ర్వినినాదస్య పృష్ఠతః" —రామా. అరణ్యా. 57-2.
"చింతయామాస గోమాయో స్స్వరేణ పరిశంకితః" —రామా. అరణ్యా. 57-3.

7. "విమానాత్పుష్పకాదద్య రావణః పతితో భువి
కృష్యమాణస్త్రియా దృష్టో భ్రాన్తచిత్తాకులేంద్రియః" —రామా. సుంద. 27-23.

8. "వరాహేణ దశగ్రీవ శ్శింశుమారేణ చేంద్రజిత్
ఉష్ట్రేణ కుంభకర్ణశ్చ ప్రయాతా దక్షిణాందిశం" —రామా. సుంద. 27-30

"మాంసరక్తాహారులగు పక్షులు ఆకాశాన చేరి ప్రహస్తు రథమున కప్రదక్షిణముగా ఎగిరినవి."[9] దీనివలన ప్రహస్తునకు చావు తప్పదని అర్థము.

భారతమునందు గూడ అరణ్యపర్వమందలి యొక ఘట్టమున గల శకునమిట్లు వర్ణితము:

"ధర్మతనయుడు దీప్తంబయిన శివారుతంబువిని అతిశంకితచిత్తుండయి అనంతరంబ దక్షిణభుజాస్పందనంబువలక్షించి మీద లగ్గగునని..." భార. అరణ్య. 4-115.

నక్క అఱుపువలన అశుభమును శంకించినాడు ధర్మరాజు. దక్షిణాంసము స్పందించుట వలన మీద శుభమగునని కొంత ఊఱట పడినాడు. పురుషులకు దక్షిణాంస స్పందనమును, స్త్రీలకు వామాంస స్పందనమును శుభమని శాస్త్రమున్నది.

భీమాదులను నహుషుడు మ్రింగిన యనంతరము, వారేలకో రాలేదని శంకించు చున్న ధర్మరాజుకు తటస్థించిన శకునము లవి.

## 2:2 ప్రకృతి - సౌందర్య దృష్టి

కావ్యసృష్టికి ఒక మూలహేతువు సౌందర్య దృష్టి. ప్రకృతిలోని సుందరదృశ్య ములు ఉద్దీపనకు మూలకందములు. స్వచ్ఛప్రకాశముతో - పామునడకవలె మెలికల నడకతో-మంద్రధ్వనియుక్త బిలబిలధ్వనులతో - జిల్లుమను చల్లనైన మధురజలముతో- నాజూకుగా దుముకుచుండు సెలయేళ్లను - అక్కడక్కడ సెలయేళ్లు కలియగా బలిసి ప్రవహించుచు పోనుపోను బృహదాకారమును పొంది, గభీరతనుగూడ సంతరించుకొని వరదల కాలమున నడచుచున్న సముద్రమువలె కనిపించుచు, హేమంత శిశిర వసంతాది ఋతువులందు క్రమముగ కృశించి భూదేవి వేణీ సాదృశ్యమును పొందుచు, తన జలము లతో తీరప్రాంత మానవమానవేతర ప్రాణికోటికి జీవనదానము చేయుచు, సంతృప్తిని పొందిన ప్రాణికోటి భజించుచుండగా రమ్యాకృతితో ప్రవహించుచుండు నదులును - రంగురంగుల ప్రకాశముతో, వివిధములయిన ఆకారములతో, అనంతకోటి వాసనలతో కనులకును మనసునకును హాయినిగూర్చు పుష్పములును-నానా పుష్పాసవాస్వాదనా ఫలరూప గానామృతముచే తన్పింపజేయుచు పుష్పవతీలతానేకములపై క్రేళ్ళుఱుకుచు మ్రోయుచుండు తుమ్మెదలును - బాలరసాల పల్లవభక్షణచే మత్తెక్కి నేత్రారుణ ప్రభలతో, కషాయకంఠములతో కలనాదముల నొలికించు కోయిలలును-మలయజగంధ మును వహించి నానా పుష్పవాసనల హరించి వార్నిధినదుల శైత్యమును సంతరించు కొని బరువుగా మంద మందముగా మలయు మలయమారుతమును-ధావళ్యాధిక సువర్ణ కాంతితో శైత్యాధిక హిమశీకరములతో ప్రాణికోటిని పారవశ్యము పొందించుచు

---

9. వ్యాఘ్రభమాకాశమావిశ్య మాంసశోణిత భోజనాః
మండలాన్యప సవ్యాని ఖగాశ్చక్రూరథం ప్రతి'' —రామా. యుద్ధ. 57-35.

చంద్రికా విలసనమును - నానాపుష్ప ఫలభరితములయి, నానా మధుప శకుంత జంతు నివహముల ధ్వనిపూర్ణములయి, భూభూధర నిమ్నోన్నతానురూపమై శ్యామతరం గాకార సుందరము లయిన వనములును-సూర్యచంద్రోదయాస్తమయ సమయ సము ద్భూత కర్బుర కిరణ ప్రతిఫలనమున నానా వర్ణాకారములతో నేత్ర పర్వముచేయు మేఘా కాశములును - ఉద్దీపనము లగుచున్నవి.

వర్ణిత నాయికా నాయకుల యౌవనమును, సురూపమును, అలంకారాదులును, హావభావాదులును ఆలంబన విభావమునకును; చంద్ర, కోకిల, మలయమారుత, నదీ ఝురీత్యాదులు ఉద్దీపన విభావములకును హేతుభూతములగుచున్నవి.

సౌందర్యమెప్పుడును మనోహరమైనదియే. కావ్యముల యందీ సౌందర్యమును సాధించుటకు మనోహరమైన ప్రకృతి వస్తువుల సహాయమువలం బింపవలసియున్నది. ఆ ప్రకృతి వస్తువుల యొక్క స్వరూప స్వభావముల వ్యక్తము చేయునట్టి సార్థక పద ములను - అలంకారములను, గుణములను, రసాన్వితము చేసిన కావ్యములందు సౌంద ర్యము ప్రత్యక్ష మగుచున్నది.

## 2:3 ఆలంకారిక దృష్టి

అలంకార ప్రయోగము గూడ సౌందర్య దృష్టి వలననే జరుగుచున్నది. అంగనా శరీరమునకు హారాదు లెట్లలంకారములో కావ్యకన్యకకు ఉపమాద్యలంకారము లట్టి అలంకారములు. మానవులు ప్రకృతిలోని ధాతువులను, లోహాదులను గ్రహించి తమ అభిరుచి కనుగుణముగ అలంకరణముల సృష్టించుకొందురు. అటులనే కవులుగూడ ప్రకృతి వస్తువులనే ఉపమానములుగ దీసికొని ఉపమాద్యలంకార సహాయమున ఆలంకా రికమైన రచనా సృష్టి చేయుదురు.

కావ్యాలంకార వస్తువులు కేవలము ప్రకృతి వస్తువులు. అవి ప్రకృతి సిద్ధములే గాని సాధ్యములు కావు. అర్థాలంకారము లన్నియు ఉపమా సంబంధులు. అనగా ప్రకృతి వస్తు సంబంధులు. శబ్దాలంకారము లన్నియు నక్షర సంబంధులు.

సుబోధకత కొఱకును-రసపుష్టి కొఱకును, వాతావరణ సృష్టి కొఱకును, వర్ణిత పాత్రల యెడ సానుభూతి కలిగించుటకును-సౌందర్యమును సాధించుటకునుగదా ప్రకృతి వర్ణనలు చేయబడుచున్నవి. అందులకే ఈ ప్రకృతి వర్ణనలలో అలంకారము లెక్కువ చోటుచేసికొన్నవి.

మానవుని అంగములకును, ప్రకృతి అంగములకును-మానవుని స్వభావమున కును, ప్రకృతి స్వభావమునకును-సామ్యావస్థను వర్ణించి, కవిత్వమును సుబోధకము

కావించుటకు అలంకార ప్రయోగము జరుగుచున్నది. ఉపమానము వలన ఉపమేయ మర్థమగుటయు, ఉపమేయము వలన ఉపమాన మర్థమగుటయు ప్రకృతి వల్లనే జరుగు చున్నది. కావున ప్రకృతి వర్ణనలు చేయుటగూడ అలంకారము కొఱకయి యున్నది.

మన కావ్యము లన్నిటియందును శృంగార రసము ప్రాధాన్యము వహించు చున్నది. అందువలన స్త్రీ వర్ణనాదులు ప్రాధాన్యము వహించుచున్నవి. స్త్రీయొక్క అంగాంగ వర్ణన ఎంత బాగుగ చేసిన, అంత సొగసును కావ్యము సంతరించుకొనును. స్త్రీని, ప్రకృతిని, బాగుగ పరిశీలించిన భావుకుడు శృంగార రసావిష్టుడై ప్రకృతిలోని అందమైన-సుకుమారమైన-లావణ్యాయుతమైన-వస్తువులను, స్త్రీ అంగములతో పోల్చి వర్ణింపసాగినాడు. స్త్రీ వర్ణన చేయుటయన్న, ప్రకృతి వర్ణన చేసినట్లే భావింపవచ్చును.

స్త్రీని పోల్చుటకు ప్రకృతి వస్తువులను తీసికొనుటలో గూడ నొక పద్ధతి బయలు దేరినది. స్త్రీని దేనితో పోల్చవలెనో-కచమును, వేణిని, లలాటమును, కనుబొమ లను, కపోలములను, ముఖమును, నాసికను, కర్ణములను, కంఠమును, కనులను, అధరములను, దంతములను, బాహువులను, కరములను, వ్రేళ్ళను, నఖములను, స్తనములను, నాభిని, నూగారును, వళులను, పృష్ఠమును, జఘనమును, నితంబమును, ఊరువులను, చరణములను, పిక్కలను, కటాక్షమును, హాసమును, పలుకులను, గమన మును, వర్ణించు తఱి, వేని వేనితో పోల్చవలెనో చెప్పు సంప్రదాయము గూడ వృద్ధి అయినది. ఈ అంగాంగ వర్ణనల పోటీలు సుందర కావ్యసృష్టికి హేతుభూతమయినవి. ఈ వర్ణనలకు ఉపయుక్తమగు వస్తుసామగ్రి యంతయు ప్రకృతి నుండి లభించునదే.

## 2:8 ప్రకృతి-కవిసమయరూపము

అశాస్త్రీయమును, అలౌకికమును, పరంపరాయాతమును అయిన ఏ యర్థమును కవులు తమ కావ్యములందు ఉపనిబద్ధము చేసినారో-దానిని కవిసమయమందురు. అది దోషము కాదనియు, స్వీకార్యగుణమే యనియు పూర్వలాక్షణికులు అంగీకరించి యున్నారు. నిజమునకీ కవి సమయములు అసహజములుగ కనిపించినను కవిత్వ మునకు శోభావహములగుచున్నవే గాని భంగకరములు గావు.

ప్రథమముగ పదవ శతాబ్ది వాఁడగు రాజశేఖరుడు తన కావ్యమీమాంసయందు (14వ అధ్యాయము)

"అశాస్త్రీయ మలౌకికంచ పరంపరాయాతం

యమర్థం ఉపనిబధ్నంతి కవయస్స కవిసమయః."[1] అని కవిసమయ నిర్వచనము

1. కావ్యమీమాంస, అధ్యాయ 14, పేజీ 78.

చేసియున్నాడు. దేశదేశములను తిరిగి, వేదవేదాంగములను చదివి, అన్ని సమాజములను చూచి, ఎన్నో విషయములను విని, ఏయర్థములను సేకరించిరో - ప్రయోగించిరో- ఆయర్థములు దేశకాలభేదములవలన మార్పు చెందక తర్వాతి కవులచే గృహీతము లయినవి. అవియే కవి సమయములయినవి.

ఈ అశాస్త్రీయమును, అలౌకికమును, పరంపరాయాతమును అయిన అర్థమును వాడుట దోషము కాదని రాజశేఖరుడు చెప్పినాడు.

ఇవి కొన్ని స్వతస్సిద్ధము లనియు, మరికొన్ని స్వార్థబుద్ధితో ధూర్తులచేత కల్పింప బడినవనియు,స్వర్థతో కావింపబడినవనియు, స్వార్థసాధనకొరకు ప్రసిద్ధము చేసినారనియు రాజశేఖరుని అభిప్రాయము.

పదునాల్గవ శతాబ్దివాడగు విద్యానాథుడు గూడ తన సాహిత్యదర్పణమునందీ కవి సమయములగూర్చి రాజశేఖరు ననుసరించి వ్రాసినాడు. 16వ శతాబ్ది వాడగు కేశవమిశ్రుడు తన అలంకార శేఖరమందలి పదునైదవ మరీచిలో ఇట్లు వివరించినాడు.

> "అసతో౽పి నిబంధేన సతామప్యనిబంధనాత్
> నియమస్య పురస్కారాత్సంప్రదాయస్త్రిధా కవేః"

రాజశేఖరుని మతము ననుసరించి యీ కవిసమయములు మూడు విధాలు:

అవి: (1) స్వర్గ్యము, (2) భౌమము (3) పాతాళీయము.

ఇందులో భౌమము ప్రధానమైనది.

> "స్వర్గ్యపాతాళీయయోః భౌమః ప్రధానః
> సహిమహావిషయః సచచతుర్థా"
>
> — కావ్యమీమాంస - పుట 79.

ఆ నాలుగు రకములు ఇవి :

1. జాతిరూపము, 2. ద్రవ్యరూపము, 3. క్రియారూపము, 4. గుణరూపము. అనగా, భౌమము, జాతిద్రవ్యక్రియా గుణరూపములతో సాక్షాత్కరించుచున్నదని యర్థము.

ఈ జాతి ద్రవ్యక్రియా గుణ రూపములు, మరల అర్థనిబంధనము ననుసరించి ఒక్కొకక్కటి మూడు విధములుగానున్నవి. అవి 1. అసతో నిబంధనము, 2 సతోప్య నిబంధనము, 3. నియమ నిబంధనము.

1. అసతో నిబంధనము = లేకున్నను ఉన్నట్లు చెప్పుట

2. సతోఽప్య నిబంధనము = ఉన్నను లేనట్లు చెప్పుట

3. నియమ నిబంధనము = ఇట్లే యుండవలెనని నిబద్ధించుట

## కొన్ని వర్ణనానియమములు - కవిసమయములు

ప్రబంధ వర్ణనలను వర్ణించుతటి పాటింపబడు నియమములు గూడ కవి సమయము లగుచున్నవి. కేశవ మిశ్రుడు (16వ శతాబ్ది) తన అలంకార శేఖరమందు వర్ణనా పద్ధతిని వివరించినాడు.

"వర్ణ్యశ్చ రాజా దేవీచ దేశోగ్రామ పురీసరిత్
సరోబ్ధ్యరణ్యోద్యానాద్రి ప్రయాణరణవాజినః
హస్త్యర్క చంద్రావృతవో వివాహోథ స్వయంవరః
సురాపుష్పాంబు సంభోగః విశ్లేషమృగ యాశ్రమాః
కాలాఋతువయస్సంధీధాతువృక్షాభిసారికాః"

—అలంకారశేఖరం - 16వ మరీచి - శ్లో 1.

అనగా రాజు, రాణి, దేశము, గ్రామము, పురము, సరిత్తు, అబ్ధి, సరస్సు, అరణ్యము, ఉద్యానము, శైలము, ప్రయాణము, యుద్ధము, అశ్వము, గజము, సూర్యుడు, చంద్రుడు, ఋతువు, వివాహము, స్వయంవరము, సురాపానము, పుష్పాపచయము, సురతము, జలకేళి, విరహము, వేట, ఆశ్రమము, ప్రాతఃకాలము, మధ్యాహ్నము, సాయంకాలము, అంధకారము, ఋతుసంధి, వయస్సంధి, ధాతు, వృక్ష అభిసారికలను వర్ణించు సమయమున ఏయే యంశములను వర్ణింపవలెనో ఆ నియమమును వివరించినాడు. పూర్వకవులును, తరువాతి కవులును గూడ చాలవఱకు ఆ నియమముల ననుసరించుట జరిగినది. అతడు ఈ విధిని కవి సమయమని చెప్పలేదుగాని ఇది ఒక విధముగా నియమనిబంధన కవిసమయమని చెప్పవచ్చును. ఈ విషయము ద్వితీయ ప్రకరణము ప్రారంభమున విపులముగా చర్చించబడినది.

## కవిసమయములు - ఉపమానములు

కొన్ని వర్ణనలందు ఉపమావస్తువులు నిబద్ధింపబడినవి. అది నియమనిబంధన కవి సమయముగా పరిణమించినది.

కావ్యములన్నిటియందును స్త్రీ ప్రధానపాత్ర వహించి యున్నది. స్త్రీ యొక్క అంగాంగవర్ణన ఎంత సొంపుగ చేసిన, ప్రబంధమంత యింపును సంతరించుకొనును. ప్రకృతిని బాగుగ పరిశీలించిన భావుకుడు శృంగార రసావిష్టుడై ప్రకృతియందలి అంద

మైన, సుకుమారమైన, లావణ్యయుతమైన స్వరూప స్వభావాది సామ్యయుక్తమైన వస్తువులను స్త్రీ అంగములతో పోల్చినాడు.

ఉదాహరణలు:

| వస్తువు | ఉపమానము | సమానధర్మము |
|---|---|---|
| 1. దేహము | సరోజనాల | మృదుత్వము |
| | చంద్రకళ | ఉజ్జ్వలత్వము |
| | లత | మృదుత్వము |
| | విద్యుల్లత[1] | దీప్తి |
| 2. లలాటము | అర్ధచంద్ర[2] | ఆకారసామ్యము, ప్రకాశము |
| | స్వర్ణపట్టిక | సువర్ణచ్ఛాయ |
| 3. అధరము | కిసలయము | రక్తిమ, మృదుత |
| | ప్రవాళము | రక్తిమ |
| | బింబఫలము | రక్తిమ, ఆకారము |
| 4. కటి | అణు[3] | క్షీణత్వము |
| | సింహ | కృశత |
| 5. కపోలము | చంద్రమః | గౌరవర్ణము, స్వచ్ఛతః ప్రకాశము |
| | దర్పణము | తెల్లదనము, ప్రకాశము |
| 6. కరతలము | కిసలయము | రక్తిమ, మృదుత |
| | పద్మము | మృదుత్వము, ప్రకాశము, శైత్యము |
| | విద్రుమము | రక్తిమ |
| 7. కర్ణము | నవసంఖ్య | ఆకారము |
| | శ్రీ | ఆకారము |

1. విద్యుల్లతా విగ్రహన్-మనుచరిత్ర
2 అర్థచంద్రలలాట మవఘళింపగజాలు-మనుచరిత్ర
3. అణుమధ్యాతతిమీదనింత విరసంభౌ - వసుచరిత్ర

| | | |
|---|---|---|
| 8. పాపట | దండ | ఋజుత్వము, దైర్ఘ్యము |
| | నది | దైర్ఘ్యము |
| 9. కేశములు | చీకట్లు | నైల్యము |
| | ఆకాశము | నైల్యము |
| | చామరము | దైర్ఘ్యము, ఘనత్వము |
| | శైవాలము | నైల్యము,మృదుత్వము,దైర్ఘ్యము |
| 10. జడ | పాముపడగ | నైల్యము - ఆకారము |
| | అసి | నైల్యము, నైగనిగ్యము, |
| | భృంగావళి | నైల్యము, నైగనిగ్యము, |
| | సర్పము | కుటిలత, దైర్ఘ్యము, ఆకారము |
| 11. నడక | రాజహంస | మందత, ఠీవి |
| | గజ | మందత, ఠీవి |
| 12. గ్రీవము | కంబు | ఆకారము |
| | కపోతగ్రీవము | ఆకారము |
| 13. కనుబొమలు | తరంగ | కుటిలత |
| | భృంగావళి | నైల్యము |
| | ధనువు | ఆకారము |
| | సర్ప | జిహ్మత, నైల్యము |
| | స్మరచాప | ఆకారము |
| 14. ముఖము | చంద్రుడు | ఉజ్జ్వలత |
| | దర్పణము | ఉజ్జ్వలత |
| | పద్మము | వర్ణసామ్యము, మృదుత్వము |
| 15. నాసిక | తిలప్రసూనము | ఆకారసామ్యము |
| | సంపెంగమొగ్గ | ఆకారసామ్యము |
| | మన్మథతూణీరము | ఆకారసామ్యము |

| | | |
|---|---|---|
| 16. నేత్రములు | పద్మము | మృదుత, ఆకార సామ్యము |
| | మృగనేత్రము | ఆకారసామ్యము, చంచలత |
| | మీనము | ఆకారసామ్యము, సజలత |
| | కుముదము | నల్లనిచూపు |
| | చకోర | ఆకారసామ్యము |
| | ఖంజన | నైల్యము, ఆకారసామ్యము |
| | కందళీ కుట్మలము[4] | ఆకారము |
| 17. తారక (నేత్ర) | కజ్జలపాత్ర | నైల్యము |
| | ఖంజన | నైల్యము |
| | భ్రమర | నైల్యము |
| 18. చూపులు | బాణములు | వేధకత్వము |
| | భృంగావళి | నైల్యము |
| | మదిర | మాదకత, రక్తిమ |
| | ఉత్పల పంక్తులు[5] | నైల్యము |
| 19. దంతములు | కుందకోరకము | తెల్లదనము |
| | దాడిమీ బీజము | ఎరుపుగూడిన తెలుపు, ఆకారము |
| | ముత్యము | ఉజ్జ్వలత |
| 20. పలుకులు | వేణునాదము | శ్రుతిపేయము |
| | వీణానాదము | శ్రుతిపేయము |
| | చిలుకపలుకులు | శ్రుతిపేయము |
| | కోకిలనాదము | శ్రుతిపేయము |

---

4. "ప్రౌఢకందళీకుట్మలమివ" అనిరాగరూషిత యగు అవంతి సుందరి యొక్క నేత్రములను దండి వర్ణించినాడు-దశకుమార, ప్రథమోచ్ఛ్వాసము.

5. 'వికసితోత్పల పంక్తులు క్రుమ్మరింపగా' - మనుచరిత్ర

| | | |
|---|---|---|
| 21. బాహువులు | మృణాళనాళములు | మృదుత్వము, దైర్ఘ్యము |
| | శాఖలు | దైర్ఘ్యము |
| | వెదుళ్ళు (తమిళము)[6] | దైర్ఘ్యము - ఆకారము, సన్ననగా నుండుట |
| 22. నఖములు | నక్షత్రములు | ప్రకాశము |
| | చంద్రకళలు | ప్రకాశము |
| | కుందకళికలు | ప్రకాశము, తెలుపు, ఆకారము |
| | ముక్తాఫలములు | తెలుపు, ఆకారము |
| 23. స్తనములు | పూగములు[7] | కఠినత, ఆకారము (బాలికా స్తనము) |
| | తమ్మిమొగ్గలు | పరిపుష్టత (నిక్కినచనులు) |
| | బిల్వఫలములు | వలుదతనము, కఠోరత |
| | తాళఫలములు | వలుదతనము, తుంగత్వము |
| | కరికుంభములు | విస్తరత, ఔన్నత్యము |
| | కుండలు | ఔన్నత్యము, ఆకారము |
| | కొండలు | విస్తరత, దృఢత, ఔన్నత్యము |
| | చక్రములు | గుండ్రనితనము |
| | దబ్బపండ్లు | ఆకారము, గుండ్రనితనము |
| | చక్రవాకము[8] | మిథునభావము, గుండ్రనితనము |
| 24. నాభి | ఆవర్త | గుండ్రనితనము, గభీరత |
| | కూప | గుండ్రనితనము, గభీరత |
| | హ్రద | గుండ్రనివైశాల్యము, లోతు |
| | నద | గభీరత |

---

6. "ఆమె భుజములు కణుపులతో సున్న వెదురువలె పొడవైనవియును,సున్నవైనవియును"(శాంబిన్‌ కణ్ణిడై పురయిం నెడుమెన్ పణై త్తోళ్), అగనానూరు-52

7. కుచప్రరోహముల్ పోకలతోడి సామ్యమును పొందకమున్న - కళాపూర్ణోదయము.

8. ఘనతర స్తన చక్రవాకములనలరు నంబ - హరివంశము.

| | | |
|---|---|---|
| 25. వళులు | పాశములు | దైర్ఘ్యము |
| | తరంగములు | ఎత్తులు, తగ్గులు, దైర్ఘ్యము |
| | నిచ్చెన | క్రమమైన ఎత్తులు |
| 26. పృష్ఠము | కాంచనపట్టము | గౌరత్వము, ఒకేరీతిగానుండుట |
| | అరటిపట్ట (బోర్లించిన) | గుండ్రని దైర్ఘ్యము, ప్రకాశము |
| 27. జఘనము | పులినము | కుప్పలుగానుండుట, సమాకారము |
| 28. నితంబము | చక్రము | గుండ్రనితనము, వలుదతనము |
| | భూమి | విస్తారత, గురుత్వము, దృఢత్వము |
| 29. ఊరువులు | కరిహస్తము | మొదటలావుగానుండి క్రమముగా సన్నగిలుట |
| | కదళీకాండము | ,, ,, ,, |
| | కరభము | ,, ,, ,, |
| 30. చరణములు | పల్లవము | మృదుత్వము, రక్తిమ |
| | పద్మములు (ఎఱ్ఱని) | ,, ,, |
| | ప్రవాళము | రక్తిమ |
| 31. హాసము | వెన్నెల | శుక్లత్వము |
| | పుష్పము | శుక్లత్వము |
| | ఫేనము | శుక్లత్వము |
| | కైరవము | శుక్లత్వము |

పైన వివరింపబడిన వన్నియు (ఉపమానములు) ప్రకృతివస్తువులు. అలంకార శోభకును, రసపోషణకును ఉపయుక్తమగు వస్తువులు. వీని సాయమువలననే ప్రబంధము లన్నియు అతివేల మనోహరత్వమును పొందించుకొన్నవి.

పై ఉపమానము లన్నియు స్త్రీవర్ణన సందర్భముననే ప్రయోగించుట, కవి యందలి శృంగారభావమునకు నిదర్శనము. కావ్యశోభకు యౌవనాంగియొక్క వర్ణనయే ముఖ్యమని సారాంశము.

## 2:7 దోహదక్రియలు

దోహదమనగా నిచ్ఛ.[1] గర్భవతుల కిచ్ఛయుండును. దానిని దౌహృద లక్షణ మందురు.

సంస్కృతరూపమైన "దౌహృద" మునకు ప్రాకృతరూపము దోహదము. దౌహృదమనగా రెండు హృదయాలనియు (తల్లిది, బిడ్డది) బిడ్డయొక్క ఇచ్ఛ, తల్లియొక్క ఇచ్ఛతో జోడింపబడియుండుననియు నర్థము. గర్భిణియొక్క కోరిక తీర్చనిచో గర్భము దూషిత మగుననియు, అందుకు గర్భిణియొక్క కోర్కె తీర్చుట ముఖ్య ధర్మమనియు సామాన్యముగ నున్న భావము.

మదవతుల దోహదక్రియలవలన వృక్షములు అకాలమునందు పుష్పించుననుట కవి సమయము. దోహదక్రియలు స్త్రీల సౌందర్యాతిశయము నుగ్గడించును.

ఉదాహరణకు:

పాద తాడనముచే అశోకము చిగుర్చునన్నపుడు పాదము యొక్కయు అశోక కిసలయము యొక్కయు రక్తిమ సామ్యము ద్యోతక మగుచున్నది. ముఖాసవము వలన వకుళము పుష్పించు నన్నపుడు, ఆ రెండింటి గంధసామ్యము ద్యోతక మగుచున్నది. ఇట్లే మిగిలిన వాని నూహించుకొనవచ్చును.

పై విధముగ వృక్షములలో దోహదా కాంక్షను ఆరోపించి సుందర కన్యామణుల చేష్టల ద్వారా వాని యిచ్ఛాపూర్తిని కల్పించుట వలన, ఆ స్త్రీలయొక్క రూపగుణాధికముల ఉత్కర్షను చాటు నుద్దేశ్యము ద్యోతక మగుచున్నది.

సంస్కృతప్రబంధములలో దోహద వర్ణనలు విశేషించి యున్నవి. ఆంధ్రప్రబంధము లందీ వర్ణనలు అతివేల మనోహరముగా వర్ణింపబడినవి.

కవి సమయములవలె దోహదములు గూడ అశాస్త్రీయములే. అయినను రాజశేఖరుడు తన కావ్యమీమాంసలో వీనిని కవిసమయములుగా పేర్కొనలేదు. విశ్వనాథుడు మాత్రము అశోకవకుళముల దోహదము కవి సమయమన్నాడు.[2] అంతకు ముందు కనీసము కాళిదాసు నుండి గూడ దోహదములున్నను ఏ లాక్షణికుడును దోహదముల గురించి వ్రాయలేదు. 16వ శతాబ్ది లాక్షణికుడైన కేశవ మిశ్రుడు తన అలం

1. "అథదోహదం" అమరము (గురుబాల ప్రబోధిక) - నాట్యవర్గము, శ్లో. 27
— పుట 157 (1972)
దోహః=పూర్తిః — దుహ — ప్రపూరణే — తందదాతీతి దోహదం డుదాఞ్ దానే.
దోహమనగా పూర్తి, దానినిచ్చునది. ఏషణమిచ్ఛా ఇషు ఇచ్ఛాయాం ఇచ్ఛించుట - ఇచ్ఛ.
2. "పాదాఘాతాదశోకం వికసతి వకుళం యోషితామాస్యమద్యైః"
— సాహిత్య దర్పణ. 7—23—25,

కార శేఖరమందు ఈ అశోకవకుళ దోహదములను అసత్ నిబంధన కవిసమయముగా పేర్కొన్నాడు.[3]

కాళిదాసుని మేఘదూతమందలి

"రక్తాశోకశ్చల కిసలయః కేసరశ్చాత్ర కాంతః
ప్రత్యాసన్నౌ కురవక వృతేర్మాధవీ మండపస్య
ఏకః సఖ్యాస్తవ సహ మయా వామపాదాభిలాషీ
కాంక్షత్యన్యో వదనమదిరాం దోహద చ్ఛద్మనాస్యాః"

మేఘ. 2-18

అన్న శ్లోకమునకు వ్యాఖ్య వ్రాయుచు మల్లినాథుడు పై అశోకవకుళ దోహదములను కవి ప్రసిద్ధములన్నాడు. అతడు వ్రాసిన ఈ క్రింది శ్లోకము వలన మిగిలిన వృక్షముల (8) దోహదము గూడ వ్యక్తమగుచున్నది.

"స్త్రీణాంస్పర్శాత్ ప్రియంగు ర్వికసతి వకుళః శీధుగండూషసేకాత్
పాదాఘాతా దశోకస్తిలక కురవకౌ వీక్షణాలింగనాభ్యాం
మందారో నర్మవాక్యా త్పటుమృదు హసనా చ్చంపకో వక్త్రవాతాత్
చూతోగీతా న్నమేరు ర్వికసతిచ పురోనర్తనా త్కర్ణికారః"

— మేఘదూత (మల్లినాథ వ్యాఖ్య) 2-18

ప్రియంగు స్పర్శవల్లను, వకుళము ముఖాసవ సేచన వల్లను, అశోకము పాదాఘాతము వల్లను, తిలకము చూపులవల్లను, కురవకము అలింగనమువల్లను, మందారము నర్మపు మాటల చేతను, చంపకము మృదుహాసమువల్లను, చూతము ముఖవాయువు వల్లను, నమేరు సంగీతము వల్లను, కర్ణికారము నృత్యము వలనను అకాలమందుగూడ పుష్పించును అని అర్థము.

పై దోహదములను కావించువారు మదవతులై యుండవలెను.

ఈ దోహదములను వర్ణించుట వనవిహారముననే. అదియును వసంతర్తువుననే. ఆ ఋతువున అన్ని వృక్షములును పుష్పించుట ప్రకృతి సత్యము. మరి దోహదముల వలననే అవి పూచుచున్నవని చెప్పుట యేల. స్త్రీలయొక్క శృంగారచేష్టలను వ్యక్తము చేసి కావ్యమునకు మధురత నాపాదించుటకే యని భావింపవలసియున్నది. ఈ సత్యమునే రాజశేఖరుడు కావ్యమీమాంస యందు (18వ అధ్యాయమున) వసంత ప్రసంగమున నిట్లు చెప్పియున్నాడు.

---

3. "కేసరాశోకయోః సత్ స్త్రీ గండూషాత్పాదఘాతతః
మాసాంతరేపి పుష్పాణి"
— అలంకారశేఖర - 15 మరీచి

"నాలింగితః కురవక స్తిలకో నదృష్టో
నోతాడితశ్చ సుదృశాం చరణై రశోకః
సిక్తోన వక్త్ర మధునా వకుళశ్చ చైత్రే
చిత్రం తథాపి భవతి ప్రసవాన కీర్ణః

కావ్య. మీ - 18 అధ్యాయము

స్త్రీల ఆలింగనము లేకుండగనే కురవకమును, చూపు అవసరము లేకుండగనే తిల కమును, పాదతాడనము లేకుండగనే అశోకమును, ముఖాసవము లేకుండగనే వకు ళమును చైత్రమందు పూయుచున్నవి. చిత్రముగదా! కావున దోహదక్రియలు కవుల యొక్క మధురభావోత్పన్నములని తేలినది. ప్రబంధములందు దోహదక్రియ ఒక శృంగార చేష్టగా వర్ణితము.

**సారాంశము**

1. తొట్టతొలుత మానవుడు మానవేతర ప్రకృతిని భయాశ్చర్య భావముతో తిల కించినను తరువాత ఆరాధనా దృష్టితో చూడసాగినాడు.
2. జంత్వాదులు మొదట ఆహార రూపముతో ప్రత్యక్షమయినను, తర్వాత ఉప యోగి జంతువులు, ఆరాధనా దృష్టితోడను, ప్రేమ వాత్సల్య దృష్టితోడను చూడబడినవి.
3. ప్రపంచమందలి అన్ని ప్రాంతములలోని వ్యక్తి నామములును ఆయా ప్రాంత ప్రకృతి ననుసరించి వచ్చినవే.
4. మానవేతర ప్రకృతి జంతు పక్ష్యాదులు నియత జీవన విధానము కల్గియున్నవి. అందువలన అవి సమయ గణనకు పనికివచ్చుచున్నవి.
5. మానవ మానవేతర ప్రాణికోటియంతయును ప్రకృతి జన్యమే కాబట్టియును వానియందలి అంతరాత్మలు ఏకైక పదార్థమై విశ్వమంతయు నిండి నిబిడీ కృతమైన పరమాత్మ నామాంకితమగు అనంత భావ పదార్థస్వరూప మగుట చేతను, ప్రాణికి జరుగ బోవు కష్టసుఖములను, మరియొక ప్రకృతి ప్రాణిద్వారా సూచింపబడుట ప్రాకృతిక నియమమై యున్నది. దీనిని పురస్కరించుకొనియే కాలక్రమాన స్వప్న శకునాది శాస్త్రములు సృష్టింపబడినవి.
6. కావ్యములధికాంశములు పురుషుల చేతనే వ్రాయబడినవి గాన బలప్రకృతిని పురుషరూపముగను, బలహీనమును, అందమును అయిన ప్రకృతిని స్త్రీ రూప ముగను భావించుట జరిగినది.

7. ఉపమా ఉత్ప్రేక్షాద్యలంకారముల జననమునకు సుందర ప్రకృతియే ఆలంబనము. అనగా కావ్యసృష్టికి మూలకారణము సౌందర్యదృష్టి గూడ ముఖ్యమయినదిగ భావింపవచ్చును.

8. కవి సమయ ప్రాధాన్యము గలవి ప్రకృతి వర్ణనలు.

9. కవి సమయములు శాస్త్రమర్యాదలకును, లోకమర్యాదలకును భిన్నములైనవి.

10. కావ్యములకు ఇంపు సొంపులగూర్చునవి కవిసమయములు. రసపోషణ కివి ముఖ్యములు. రచనకివి శోభావహములు. వీనిని అలంకార సంజీవనులు అనవచ్చును.

11. కావ్యములలో ప్రయోగించిన కవిసమయముల వలన తత్కర్తలు పోషించిన కావ్య సౌందర్య సంబంధమైన దేశకాల స్థితులు అవగతమగును.

12. తెలుగు నందలి కవిసమయ సంప్రదాయము కేవలము సంస్కృత సంబంధి.

13. ఆంధ్ర ప్రబంధకారులందరును చాలవరకు కవిసమయములను పాటించినారు.

14. కావ్యప్రయోగములలోని మర్మము తెలుగుటకు కవిసమయమును తెలిసికొనవలసియున్నది.

15. దోహదములు ఒక శృంగార చేష్ట.

16. స్త్రీల దోహద చేష్టలకును పుష్పములకును సామ్యముండవచ్చును.

17. సర్వవృక్షములును పుష్పించు వసంతకాలముననే దోహదక్రియావర్ణన యుండుట ఒక విశేషము. స్త్రీలయొక్క వర్ణగుణాకారాదుల నుగ్గడించుట తప్ప మరేమియు గాదు.

18. దోహద క్రియావర్ణన వలన మదవతుల స్వేచ్ఛా శృంగార విహారాదులు వ్యక్తమగుచున్నవి.

19. దోహద వర్ణన సారస్వతమునకు ప్రముఖాలంకార మగుచున్నది.

20. ప్రబంధకారులందఱును అమేయ శృంగారభావ ప్రదర్శనమును కావించినారీ వర్ణనలో.

21. దోహద క్రియలు కవి సమయములే;

22. జాతక కథల కాలమునుండియు దోహదక్రియలున్నట్లు స్పష్టము.

# 3. తృతీయ ప్రకరణము

## వేదవాఙ్మయము — ప్రకృతివర్ణనలు

తెనుగు ప్రబంధాలలో ప్రకృతి వర్ణనలన్నపుడు సంస్కృత ప్రబంధములజోలికి పోనక్కరలేదుగాని, మన ప్రబంధకారులెల్లరును సంస్కృత వాఙ్మయమును (వేద వేదాంగములతో సైతము) తుణ్ణముగ జదివి తత్సంస్కారముతో తెనుగు కావ్యము లను వ్రాసియున్నారు. అందువలన సంస్కృత రచనలలోని ప్రకృతి వర్ణనల పరి శీలించి ఆ ఛాయలు తెనుగు ప్రబంధమునందలి ప్రకృతి వర్ణనలో కలవేమో - అను వాదానుసరణములుగలవేమో- చూడవలసియున్నది.

భారతీయ సాహిత్యమున ప్రకృతి వర్ణనలు ప్రప్రథమమున నెక్కడలభింపగలవని వెదకుచు పోయినచో మనకు లభించు పురాతన రచనలు వేదములు. వానిలో మొద టిది ఋగ్వేదము. ప్రపంచములో మొట్టమొదటి సాహితీ రూపము.

ప్రకృతి వర్ణనలకు రత్నాకరము ఋగ్వేదము. ఇందన్ని వర్ణనలను ప్రకృతి శక్తులకు మూర్తిమత్వము కల్పించి వర్ణించినవే! ఇంద్రాగ్ని వరుణాదిత్య చంద్రాశ్వి న్యాదులేగాక, ఆశ్రమములు-నదులు-సముద్రములు, పర్వతములు, వనములు, వ్యవసా యము, పశుపోషణ, వాణిజ్యము, రథయానము, ఆహార పానీయములు, జయపరా జయములు, డేగ, గుఱ్ఱము, గాడిద, ఎద్దు, పంది, మేక, హంస, ఆవు, పావురము, చాపలు, నగలు, మొదలగునవన్నియు వర్ణింపబడినవి.

ఋగ్వేదమున పర్వతారణ్య నదీ సిర్నిధి జలచరభూచర దావాగ్న్యాది భూతల ప్రకృతియును-మేఘ వర్ష ఝంఝూనిలాది అంతరిక్ష స్థాన ప్రకృతియును-సూర్యచంద్ర నక్షత్రాది ద్యుస్థాన ప్రకృతియును వైవిధ్యముతో వర్ణింపబడియున్నవి. ప్రస్తుత మొక్కొక్క ప్రకృతి శక్తినే పరికింతము.

## 3:1 ఇంద్రుడు

ఇంద్రుడు ప్రకృతిశక్తి

నిరుక్తకారుడయిన యాస్కుడు ఇంద్ర శబ్దము నీ క్రింది విధముగ నిర్వచించినాడు.[1]

| | | | |
|---|---|---|---|
| 1. | ఇరాందృణాతీతి:- | ఇంద్రః | భోజన పదార్థముల నుద్దేశించి తన్నిష్పాదకమైన జలము కొఱకు మేఘములను బ్రద్దలు కొట్టు వాడింద్రుడు. |
| 2. | ఇరాందదాతీతి— | ఇంద్రః — | వృష్టినిష్పాదనచే నన్నమును లోకమున కిచ్చువాడింద్రుడు. |
| 3. | ఇరాందధాతి— | ఇంద్రః — | సస్యమును జలదానముచే పోషించువాడు. |
| 4. | ఇరాందారయతీతి— | ఇంద్రః — | భోజ్యద్రవ్యములను పుట్టించుటకై కర్షకముఖమున భూమిని దున్నువాడు. |
| 5. | ఇంద వేద్రవతీతి— | ఇంద్రః — | సోమార్థము యజ్ఞభూమికి పరుగెత్తువాడు |
| 6. | ఇందౌరమతే— | ఇంద్రః — | సోమరసమున క్రీడించువాడు |
| 7. | ఇంద్ధేభూతాని— | ఇంద్రః — | ప్రాణుల దేహములందు చైతన్య రూపమున చొచ్చి వానిని ప్రకాశింప జేయువాడు. |

పై నిర్వచనము లన్నియు ఋగ్వేదములో ఇంద్రునికి సంబంధించిన ప్రార్థనలను మనసులో నుంచుకొని చేసినవే. నిర్వచనము ననుసరించి యింద్రుడు వర్షము నిచ్చువాడనియు అందువలన ప్రాణరక్షకుడనియు, సోమ పానేచ్ఛ గలవాడనియు విదిత మగుచున్నది. ఇంద్రుడనగా ప్రాణికోటికి అత్యుపయోగి యయిన ప్రకృతి శక్తిగానే కనబడుచున్నది. ప్రకృతి శక్తికి మూర్తిమత్వము కల్పించి ఇంద్రనామమిడి వర్ణించినట్లు స్పష్టమగుచున్నది.

ఋగ్వేదమందలి పది మండలములలోని 10580 ఋక్కులలోను—ఇంద్రుని కొక్కనికే సంబంధించినవి 250 గలవు. సామవేదమందలి ఇంద్ర పర్వము చాల పెద్దది. అదంతయు నింద్రుని ప్రశస్తితోనే నిండి యున్నది.

సర్వవిశ్వ ప్రవర్తకుడుగా ఇంద్రుడు వర్ణింపబడుచున్నాడు.

"యో అక్షిణే వచక్రియా శచీభిర్విష్వక్త స్తంభపృథివీముతద్యాం"[2]

---

1. సంస్కృత (వేద) వాఙ్మయచరిత్ర. పేజీ; 110. మల్లాది సూర్యనారాయణశాస్త్రి.
2. ఋ 10-89-4 వ్యాఖ్యాత శ్రీరాంశర్మా ఆచార్య సంస్కృతిస్థాన్, బరేలీ (1969)

(ఇంద్రుడు ఇరుసుచే రథ చక్రములను వలె బల కర్మముచే భూమ్యాకాశములను బట్టి యుంచెను).

మరియొకచోట:

"ససూర్యః పర్యురూవరాంస్యేం ద్రోవవృత్యాద్రథ్యేవచక్రా"

అని యున్నది. (ఇంద్రుడనేక విధములయిన తేజస్సులను, సారథి రథచక్రములను త్రిప్పునట్లు త్రిప్పుచున్నాడు).

— ఋ. 10 - 89-2 శ్రీరాంశర్మ ఆచార్య - బరేలి (యు.పి.) 1969.

పై వర్ణన ఇంద్రుడు విశ్వప్రవర్తక శక్తి యనియే తెలుపుచున్నది.

ఇంద్రుడు కాలస్వరూపుడుగా వర్ణించబడుచున్నాడు.

"విధుందద్రాణగ్ం సమనే బహూనాం యువానగ్ం
సన్తం పలితో జగార దేవస్య పశ్య కావ్యం మహిత్వా
ద్యా మమార సహ్యః సమాన"

(ఇంద్రుడు కాలస్వరూపుడు) (సర్వమును) చేయువాడు. యుద్ధమందు పలువురను పారద్రోలువాడును - పిన్నవయసువాడును అగు పురుషుని, ముసలితనము మ్రింగివేయుచున్నది. (ఇట్టి కాలస్వరూపుడైన)ఇంద్రుని యొక్క మహాకార్యమును(ప్రాణులకు ముసలితనమును కల్గించుట) చూడుము. ఎవడీనాడు చనిపోయెనో,వాడు రేపటి దినము బ్రతుకుచున్నాడు. (అనగా పునర్జన్మ పొందుచున్నాడు).

— సామ. ఐంద్రపర్వ. - అష్ట - 3 ఖండ, 10, క్రమసంఖ్య 305 బంకుపల్లి మల్లయ్యశాస్త్రి (1940).

ఇంద్రుడు వర్షాధిదేవతగను, మేఘములను బ్రద్దలుకొట్టువాడుగను వర్ణింపబడుచున్నాడు. మేఘమును, వర్షమును వర్ణించుట ప్రకృతి వర్ణనయే యగుచున్నది.

"ఇంద్రస్యనువీర్యాణి ప్రవోచం యానిచ కారం ప్రథమానివజ్రీ
అహన్నహి మన్వపస్తదర్ధ ప్రవక్షణా అభినత్పర్వతానాం" ఋ. 1-32-1

(వజ్రధారియైన యింద్రుడు చేసిన పురాతనము లయినట్టియు ముఖ్యము లయినట్టియు కృత్యముల వర్ణించుచున్నాను. అతడు మేఘములను బ్రద్దలుకొట్టెను. దాని నుండి భూమిమీదికి జలము పడునట్లు చేసెను. పర్వతములకు సంబంధించిన జలమును నదులుగా ప్రవహించునట్లు చేసెను).

"అహన్నహిం పర్వతే శిశ్రియాణం త్వష్టాస్మైవజ్రం స్వయం తతక్ష
వాశ్రా ఇవధేనవః స్యందమానా అంజః సముద్రమవ జగ్మురాపః" - ఋ.1-32-2

ఈ యింద్రునికి త్వష్ట చక్కగా ప్రయోగింపదగిన (శబ్దకారియైన)వజ్రాయుధమును చేసి యిచ్చెను. దానితో నితడు పర్వతముల నాశ్రయించి యున్న మేఘమును ఛేదించెను. దానివలన భూమిపై పడిన జలములు హంభారావముతో ధేనువులు తమ దూడలను చేరు నట్లు సముద్రమును చేరుచున్నవి.

మేఘమును, వర్షమును, నీరు ప్రవహించుటయును, పర్వతములును, ధేనువులును, వాని హంభారావమును, సముద్రమును - ఇవన్నియును ప్రాకృతికములే. ఈ ప్రకృతిని, ప్రకృతి ధర్మమును, అతిలోక సృష్టిగా భావించి ఇట్టి యీ ప్రకృతి ప్రవర్తనకు కారణము కల్పించి, ఆ శక్తికి మూర్తిమత్వమును కల్పించి ఇంద్రుడని నామకరణము చేసి నట్లున్నది.

కేవలము ప్రాకృతికమైన మేఘవర్షములను-నీరు సముద్రమువైపు పరుగిడుటను-గొప్పగా ఉత్ప్రేక్షించుట జరిగినది. మానవుడు పరిణమించి పరిణమించి, గొప్ప భావుకుడగు చేయి తిరిగిన కవియైన వెనుకనే ఇట్టి వర్ణనలు చేసియుండును.

## 3:2 అగ్ని

వేదములలో ఇంద్రుని యనంతరము అధికముగ స్తుతింపబడిన దేవత అగ్ని. అగ్ని కేవలము ప్రకృతి శక్తి. ఇది ఇంద్రియకమైన (CONCRETE) విషయము. అగ్ని అన్ని వస్తువులను దహింపజేయు సామర్థ్యముగలది. దవానల రూపమునను - బడబాగ్ని రూపమునను - తన ఔద్ధత్యమును ప్రకటించిన శక్తి. మాంసాద్యాహారమును కాల్చుకొని తినుటకును, వండుకొని తినుటకును, సహాయపడిన శక్తి. ఈశక్తికి - ఈ ప్రాకృతశక్తికి-మూర్తిమత్వము కల్పించి-అగ్నియను నామము నిడి- పూర్వ ఋషులు బ్రహ్మాండముగ గానము చేసినారు.

ఋగ్వేదమందలి 10580 ఋక్కులలో కేవలము అగ్నిని గురించి 200 ఋక్కులు గలవు. సామవేదమున ఆగ్నేయ కాండ మంతటి యందేగాక మిగిలిన భాగములలో ఇంకను చాల ఋక్కులు అగ్నిని గురించియే గలవు.

ఋగ్వేదమున మొట్టమొదటగా వర్ణింపబడిన ప్రకృతి దేవత అగ్నియే.

"అగ్ని మీళే పురోహితం యజ్ఞస్య దేవమృత్విజం హోతారం రత్న ధాతమం"

ఋ. 1.1.1.

(పురోహితునివలె యజ్ఞమును నడిపించువాడును-(దేవతల)పిలుచు వాడును, ఋత్విజుడై రత్నములను (యజ్ఞఫలముల)ధరించువాడును, అగు అగ్నిదేవుని స్తుతించుచున్నాను.

అగ్ని సర్వవ్యాపిగను,సర్వకర్మ ప్రతిపాదకుడుగను వర్ణింపబడుచున్నాడు. ఈశక్తిని గూర్చి ఇట్లుచెప్పబడినది.

"ఓ యగ్నీ నీవల్లనే రాత్ర్యభిమాని యగు వరుణుడు వర్షాది కర్మ సమర్థుడగుచున్నాడు. అహరభిమానియగుసూర్యుడు. తమోనాశకు డగుచున్నాడు. అర్యముడును దానాది సర్వ కార్యధురంధుడగుచున్నాడు. బండి కంటికమ్మి చక్రమును చుట్టియున్నట్లే, నీవు సర్వకర్మ ప్రవృత్తిచే విశ్వాత్ముడవై వరుణాదులను వ్యాపించియున్నావు."

—ఋ. 1-11-9

భయంకర దావాగ్ని రూపమున అగ్ని వర్ణింపబడుచున్నాడు. అగ్ని సర్వమును భయంకరముగ దహించును. ఇది గొప్ప దాహకశక్తి.

"అగ్ని అతి వేగముగా వనములు దహించుచున్నాడు. రమణీయుడును, సంతాపకుడును, అగు నితడు తన నల్లని జాడల నడుమ నల్లనిఅంతరిక్షమున సంచరించు నాదిత్యుని వలెనే ప్రకాశించుచున్నాడు."

—ఋ,2-4-6.

"అగ్నియే సర్వదేవతలును"

– ఋ. 1-164-46(1730) (బంకుపల్లి)-1940.

అగ్ని ప్రాణదాత. అగ్నియే సర్వస్వము. అగ్ని లేనిదే జీవము లేదు. బ్రతుకులేదు. తేజోరూపమున ప్రాణి యందున్నది అగ్నియే; ప్రతిప్రాణియు ప్రాణసహితమై జీవించుటకై ఆధారభూతమైన అగ్నిని పూర్వులు చాలరూపములలో సొగసుగ ఆలంకారికముగ వర్ణించి యున్నారు. ఈ ప్రకృతి శక్తికి మూర్తిమత్వము కల్పించి అగ్ని యను పేరిడి ప్రశంసించియున్నారు.

## 3:3 వాయువు

వాయువు గూడ ఋగ్వేదము ననుసరించి దైవిక శక్తియే. ఒక ప్రాణి సజీవముగా నుండి ప్రాణి యనిపించుకొనుటకు మూలము వాయువే. అంతర్యామిగా ప్రతి ప్రాణిలోను ఉన్నది వాయువే. అందులకే వాయువును ప్రత్యక్ష బ్రహ్మస్వరూపముగ మన వారు వర్ణించుచున్నారు.[1]

1. "నమస్తేవాయో। త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి। త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మావదిష్యామి। సత్యంవదిష్యామి। తన్మామవతు। తద్వక్తార మవతు; అవతుమాం1"

తైత్తిరీయోపనిషత్తు, మొదటి పాఠము.

బాహ్యాముగ కనిపించు వాయువు చాల బలమైనది. దాని ఉనికిని మనము గమ నింపగలము గాని కంటితో చూడలేము. ఝంఝూమారుతమెంతయో బలమైనది. ఎం తయో భయంకరమైనది. వాయువును వేదర్షులు ఇట్లు ప్రార్థించినారు:

"వాయవాహి దర్శతేమేసోమా అరంకృతాః తేషాంపాహి శ్రుధీహానం"

—ఋ. 1-2.

(దర్శనీయుడవయిన ఓ వాయువా, ఈ యజ్ఞము దరికి రమ్ము. నీ కొరకీ సోమములు అలంకరింపబడియున్నవి. వానిని పానము చేయుము)

మరుత్తుల రూపమున నున్న వాయువు మహత్తరశక్తిపూర్ణుడుగా వర్ణింపబడు చున్నాడు.

(ఏ వాయువులు పర్వతములను, మేఘములను కదిలింతురో—ఉదకములతో నిండిన సము ద్రము నెవ్వరు తిరస్కరింతురో—అట్టి మరుత్తులతో గూడ ఓ యగ్ని రమ్ము")

"య ఈణ్ఖయంతి పర్వతాంతిరః సముద్రమర్ణవం మరుద్భిరగ్న రాగహి"

— ఋ. 1-2

పై వర్ణన వలన వాయువు మేఘములను చిందరవందర చేయుననియు, సముద్ర జలమును కలచి వైచుననియు తేలుచున్నది. మేఘములను కదిలించు మరుత్తులకు అధి నాథుడు ఇంద్రుడు. అందులకే అమరకోశమున ఇంద్ర పర్యాయ పదములలో 'మరు త్వాన్' అని యున్నది

## 3:4 సూర్యుడు

ద్యుస్థాన దేవతలలో ప్రధానుడు సూర్యుడు. ఇతనిని మహర్షులు పెక్కు రూప ములలో వర్ణించి యున్నారు. పృథివ్యంతరిక్ష ద్యులోకములకు ముఖ్యుడు సూర్యుడు. సూర్యుని తేజము (అగ్నిరూపము) ముల్లోకములలో నిండి యున్నది. స్థావర జంగ మాది సృష్టి కంతటికిని ముఖ్య ప్రాణరూపమైన శక్తిగా నున్నది.

ఋగ్వేదమందు సూర్యుడు ఉషస్సులకు నాథుడుగా, జారుడుగా వర్ణింపబడు చున్నాడు:

"సొగసైన కన్యలగు ఉషస్సులకు జారుడయిన సూర్యుని వడచుచున్న వానినిగానేచూచు చున్నాము. క్షణమైన కూర్చుండుటను చూడము. ఆ సూర్యుడు విడివిడిగా వ్యాపించిన

తేజస్సులను వ్యాపింప జేయుచున్నాడు. జగత్తునకు ప్రియుడు. మిత్రునకును వరుణున కును ప్రీతికరమయిన నివాసస్థానముగా నున్నాడు"[1]

పైన సూర్యుడు ఉషస్సులకు జారుడుగా వర్ణింపబడినాడు. శృంగార రస ప్రధాన మైన ప్రకృతి వర్ణన యిది.

సూర్యోపాసన వలన రోగములు శాంతించునను భావము ఋగ్వేదకాలమునకే గలదు. ఋషియైన ప్రస్కణ్వుడు తన చర్మరోగమును సూర్యోపాసనచే పోగొట్టు కొన్నట్లు వర్ణితమైయున్నది. ఇదియే సూర్యనమస్కారములకు ప్రాతిపదిక మైనది.[2]

సూర్యుని సవితృరూపముగా ఋషులు వర్ణించి యున్నారు. దీనినే సావిత్రి యందురు. గాయత్రీ ఛందములోనుండుట వలన గాయత్రి యన్నారు. సంధ్యోపాసనలో ఈ సావిత్రి జపించబడుచున్నది.

"ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం
భర్గోదేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్"

సూర్యుడు పగటిని, రాత్రిని కల్గించుచున్నాడు. భూమి తిరుగుటవలన రాత్రిం బవళ్లు కలుగుచున్నవని యీనాడు భావించు చున్నాముగాని, నాడు సూర్యుడే భూమి చుట్టు తిరుగుచు అహోరాత్రుల కల్గించుచున్నాడు అని భావించెడివారు. ఈ ప్రకృతి శక్తియైన యీ సూర్యుని వేదములలో చాల ప్రశంసించి యున్నారు.

## 3:5 సోమము

ఋగ్వేదమందును, తర్వాతి వేదములందును ప్రాధాన్యమును పొంది విశేషముగ వర్ణింపబడినది సోమము.

ఇది యొక లత. దీనినుండి సోమరసము తీసెడివారు. ఇది అనాది ఋషులకును-వారు ప్రార్థించెడి ఇంద్రాదిదేవతలకును-అనాటి సామాన్య మానవులకును చాల యిష్ట పదార్థము. దీనికే దేవతాత్వమిచ్చినారు ఋషులు. యజ్ఞశాలలందును, గృహము లందును దీనిని త్రాగెడివారు. గొఱ్ఱె బొచ్చు వస్త్రములో దీనిని నడగట్టి వాడెడివారు.

ఇది ఇంద్రునకు మిక్కిలి యిష్టము. యాగమున కింద్రుని ఆహ్వానించుచు "సోమ పానమునకు రమ్మ" అని ప్రార్థించుట గలదు. ఇంద్రుడు సోమపానేచ్ఛగలవాడనియు, సోమపానము కొరకు ఎంతదూరమైనను పోవువాడనియు వర్ణితము.

1. ఋ 1 మం. అను 11 సూ 152 సంఖ్య 1589.
2. మల్లాది సూర్యనారాయణశాస్త్రి - వేదవాఙ్మయము.

దీనిని ఆవుపాలతో-మేకపాలతో-తేనెతో-ధాన్యపు పిండితో కలిపి వాడెడివారు. దీని రంగు పచ్చన[1]. ఇది పాపములను పోగొట్టును.[2] మరణము లేకుండ చేయును.[3] ఇంద్రియ చైతన్య మిచ్చును,[4]

దీనిని రాళ్లతో నలిపి తీయుదురు. దీని కొరకు మిత్రావరుణుల సాహ్వానించుటను చూడనగును.

"మమ్ము రక్షించు మిత్రావరుణులారా! మీ సంబంధమైన లతారూపమైన సోమమును అధిక క్షీరమును గలిగిన గోవును పోలి పాషాణముచే పితుకు చున్నాను. సోమపానము కొఱకు మాకభిముఖులై యజ్ఞమును గుఱించి రండు. మీ కొఱకై యీ సోమము యజ్ఞ నిర్వాహకులచే పిండబడినది. పూర్తిగ త్రాగదగినంత పిండ బడినది"[5]

సోమలతయును, సోమమును ప్రకృతి వస్తువులే

## 3:6 నదులు

ఋగ్వేదమందు నదుల వర్ణన గూడ గలదు. సింధు సరస్వతీ నదులు బహుళముగా వర్ణితములు. సింధు నదీ ప్రాంతమును "సప్తసింధు" వని యన్నారు. దానినే జండ్ అవెస్థాలో 'హప్తహిందు'గా తూర్పు కాబూలు ప్రాంతమును పేర్కొనుట జరిగినది.

"పూర్వార్యులు ఏడు మాసములు సూర్యరశ్మిగల ప్రదేశమందు నివసించినపుడు అధోలోకమందలి సముద్రమునుండి వెడలి పైకి వచ్చు దివ్యజలపూర్ణములైన ఏడు నదులను - ఏడుగురు సూర్యులను - తమ వెంటగొనివచ్చుచున్నట్లు వర్ణించుచు వానికి సప్త సింధువులని పేరుపెట్టుకొని యుందురు. వారార్యావర్తమునకు వచ్చిన పిదప ఇందలి ప్రధాన నదుల కా పేరు పెట్టుకొనియుందురు. ఇదియే జండ్ అవెస్థాలో 'హప్తహింద్' అను పేర దేశపరముగా ఉపయోగింపబడియుండును;"అని తిలక్ మహాశయుడు భావించుచున్నారు.[6]

1. సామ - ఇంద్రపర్వ - 462
2. సామ - ఉత్తరార్చికము 687
2. సామ - ఇంద్రపర్వము 344
4. సామ - ఉత్తరార్చికము 659
5. ఋ. 1 మం అను. సూక్త - 137 - 1478.
6. ఆర్కిటిక్ హోమ్ - తిలక్ పేజి. 289 - 296

వేదాలలో వర్ణింపబడిన నదులు :-

"ఇయంమే గంగే యమునే సరస్వతి శతుద్రి స్తోమం
సచతా పరుష్ణ్యా అసిక్న్యా మరుద్వృధే వితస్త యార్జకీ
యేశృణు హ్యాసు షోమయా"

— ఋ-10-"-5-5.

గంగ, యమున, సరస్వతి, శతుద్రి, మరుద్వృధ, పరుష్ణి, అర్జకీయ—ఈ యేడును ప్రధాన నదులు, వీనిలో మరుద్వృధకు అసిక్నియు, అర్జకీయకు వితస్తాసుషోమలు ఉపనదులు.

ప్రకృతి వర్ణనల దృష్టితో వారు వర్ణించకపోయినను ఈ వర్ణన ప్రకృతి వర్ణనయే. నదీ వర్ణన ప్రకృతి వర్ణనయేగదా!

## 3;7 పర్వతములు

ఋగ్వేదమందు మేరు పర్వత వర్ణన గలదు, ఇది కేవలము ఉత్తరధ్రువ వర్ణనమే, ఈ ప్రాంతమున నేడు మాసములు దీర్ఘమైన పగలుండును. ఆ తరువాత అరోరా బోరియలిస్ అను బంగారుకాంతుల వెదజల్లు పెద్ద జ్యోతి వలన దేదీప్యమానముగ వెలుగుచుండును. ఈ కాంతులవల్లనే ఆ ప్రాంతమును బంగారుకొండగా వర్ణించి యుండును. మేరు పర్వత వర్ణన మహాభారతమున గొప్పగా చేయబడినది. నాటివారు మేరుపర్వతమును బంగారుకొండగా విశ్వసించుటయేగాక అక్కడ దేవతలుందురనియు గూడ విశ్వసించిరి. మేరువుచుట్టును సూర్య చంద్ర నక్షత్రములు తిరుగుచున్నవని వారు వర్ణించిరి. అచ్చటి అహోరాత్రము మనకొక సంవత్సరము.

"ఉదీచీందీప యన్నేష దిశంతిష్ఠతి వీర్యవాన్
మహామేరుర్మహాభాగ శివో బ్రహ్మాంవిదాంగతిః
ఏవం త్వహర హర్మేరుం సూర్యచంద్రమసౌధ్రువం
ప్రదక్షిణ ముపావృత్య కురుతః కురునందన
జ్యోతీంషి చాప్య శేషేణ సర్వాణ్యనఘ పర్వతః
పరియాంతి మహారాజ గిరిరాజం ప్రదక్షిణం
బభూవ రాత్రిర్దివసశ్చ తేషాం
సంవత్సరేణైన సమానకాలః"

—భార. అరణ్య. 163 వ అధ్యాయము.

(తేజశ్శాలియైన మహామేరువు ఉత్తరదిక్కును ప్రకాశింప జేయుచున్నది. ఈ మేరువునకు ప్రతిదినము సూర్యచంద్రులు ప్రదక్షిణము చేయుచుందురు. నక్షత్రములు దీని చుట్టును తిరుగుచుండును. ఇక్కడనున్న వారియొక్క ఒక పగలును, ఒక రాత్రి యును కలిసి మన సంవత్సరముతో సమానమగును)

వారు మేరు పర్వత వర్ణనను ప్రకృతివర్ణనగా భావింపలేదు. మహత్తర దేవ భూమిగా భావించిరి. కాని ఇది అమోఘమైన ప్రకృతి వర్ణనయే!

ఇతర పర్వతములను ప్రత్యేకముగ వేదాలలో వర్ణించినట్లు కనబడదు గాని సామాన్య పర్వత ప్రశంసలందు గలవు. హిమాలయము, ముంజవంతము, ఋచీకము మొదలగు కొన్ని. గిరులు కొన్ని ఋక్కులందు సూచితములు. కొండలు నదుల జన్మ స్థానము లనియు మహౌషధములకు నిలయము లనియు వర్ణింపబడినవి.

## 3:8 సముద్రము

సముద్రమును గురించి ఋగ్వేదమున ప్రశంస గలదు. ఋగ్వేదములో చాల చోట్ల నదులు సముద్రములో కలియుచున్నవని వర్ణింపబడినది. స్త్రీలు పురుషుని కలి యుటకు పరుగెత్తినట్లుగా నదులు సముద్రుని కొఱకు పరుగెత్తుచున్నవని వర్ణించి యున్నారు.

> "సమస్త జలములకు అధిష్ఠానము సముద్రము. దానికి వరుణుడు రాజు" అని వసిష్ఠుడు వర్ణించినాడు.
>
> — ఋ. 7-49-1, 2, 3,4.

సముద్ర వర్ణన గూడ ప్రకృతి వర్ణనమే.

## 3:9 భూవర్ణన

భూమి ఆద్యము. అనగా మానవుడు కాలూని నిలుచుటకు ఆధారభూతము భూమియేగదా! భూమిపై పడిన తర్వాతనే మిగిలినవన్నియు కనిపించును. అందువలన భూమియే సరస్వమని నాటి జనులు భావించిరి. భూమి 'అదితి' అని వర్ణించినారు. అదితి అనగా దీనురాలు కానిది అని యర్థము. భూమియే తల్లి, భూమియే తండ్రి. అదియే మానవులు, అదియే జన్మము. జన్మించునదిగూడ,

"అదితిర్ద్యౌ రదితిర న్తరిక్ష మతిర్మాతా సపితా సపుత్రః
విశ్వేదేవా అదితి పఞ్చజనా అదితిర్జాతమదితిర్జ నిత్వం

— ఋ. 1-14-89-10 (బంకుమల్లి)

ద్యావా పృథువుల వల్లనే ఆహారము లభించుచున్నదని నాటివారలు స్తుతించిరి.

"తే నోగృణానేమహినీ మహిశ్రవః క్షత్రం ద్యావాపృథివీ ధాసథోబృహత్
యేనాభి కృష్టి స్తతనామ విశ్వహాప నాయ్యమోజో అస్మేసమన్వితం"

ఋ. 1 అను. 22 సూక్త. 160-5 (1635)

(ఈ ద్యావాపృథువులు మాచే స్తుతింపబడుచు అధికమయిన మా యన్నమును ధరించుచున్నవి. మేము పుత్రపౌత్రులతో వెలయునట్టి పౌరుషమును ధరించి యున్నవి. స్తుతింపదగిన శరీర బలమును మాయందు వృద్ధి పొందించుచున్నవి).

## 3;10 చంద్ర నక్షత్ర వర్ణన

చంద్ర వర్ణన నక్షత్ర వర్ణనలు ఋగ్వేదమున గలవు. మేరుపర్వతము చుట్టును సూర్యచంద్ర నక్షత్రములు తిరుగుచున్నవని వర్ణింపబడినట్లు ముందే తెలిసికొంటిమి. ఈ క్రింది వర్ణన పరికించుచునది.

(ఏ నక్షత్రములు రాత్రి భాగాన ఉపరితలమందు స్థాపించబడినవై కనబడుచున్నవో అవి పగటియందెక్కడికి పోవును? వరుణ దేవుని యీ పను లెవరును చెఱుపలేరు. చంద్రుడు రాత్రియందు విశేషకాంతి గలిగి వచ్చుచున్నాడు)

అమీ యఋక్షా నిహితాస ఉచ్చా
నక్తం దదృశ్రే కుహచిద్దివేయుః
అదబ్ధాని వరుణస్య వ్రతాని
విచాక శచ్చంద్ర మానక్త మేతి — ఋ.1.అను. 6 సూక్త 34-263.

పై చంద్రనక్షత్ర వర్ధనలు కేవలము ప్రకృతి వర్ణనలే.

## 3;11 జల వర్ణన, వర్ష వర్ణన

ప్రాణికి అన్నిటికన్న అవసరమైనది వాయువు (ప్రాణము). తర్వాత ముఖ్య స్థానమ్ము వహించునది జలము, ఆ తర్వాతిదే ఆహారము. ఇది పూర్వపూర్వము బలీయము,

పంచభూతములలో నొకటియైన జలమును గూర్చి గూడ పూర్వాచార్యులు గొప్పగ భావించినారు. ప్రకృష్టముగా ప్రశంసించినారు. ఉదకముల మహత్తును వారెట్లు వర్ణించిరో ఈ క్రింది వర్ణన వలన తెలియగలదు.

"అపోదేవీ రుపహ్వయే యత్రగావః పిబంతినః
సింధుభ్యః కర్త్వంహవిః"

— ఋ. 1. అను. 3 సూక్త. 23-247.

(మాగోవులే యుదకమును త్రాగుచున్నవో ఆ యుదక దేవతలను పిలుచుచున్నాను. స్రవించు స్వభావముగల యా యుదకమునుండి హవిస్సు తయారు చేయవలసియున్నది.)

ఉదకములు లభించునది వర్షము ద్వారాగదా! వర్షవర్ణన గూడ మనోహరముగ వర్ణించినారు. ఋగ్వేదములో చాల ఋక్కులు ఉపమా ఉత్ప్రేక్షాద్యలంకార సహితములై రసస్ఫోరకముగా నుండును. ఈ క్రింది వర్ణన మట్టిదే.

"వాశ్రేవ విద్యున్మిమాతివత్సం సమాతా నిషక్తి
యదేషాం వృష్టి రసర్జి"

—ఋ. 1 అను.3, సూక్త.38-464.

(పాలు చేపుచు అఱచునట్టి గోవువలె విద్యుత్తు ధ్వనిచేయుచున్నది.తల్లిదూడను తడిపినట్లు (భూమిని) తడుపుచున్నది. ఆ మరుత్తుల వర్షము గర్జనతో గూడి మెఱుపు మెఱయునపుడే కురియును.)

ఇది మంచి ప్రకృతి వర్ణన. ఉఱుములు, మెరుపులు, వర్షము అన్నియు ఉపమింపబడిన రసవద్రచన!

## 8:12 ఋతువర్ణన

ప్రకృతి వర్ణనలో ఋతువర్ణన చాల ముఖ్యమయినది. వేదములందే దీని ప్రాముఖ్యమును వర్ణించియున్నారు. "ఋతురాజో వసంతః" అన్నట్లు వసంతర్తువర్ణన మొదట ఋగ్వేదములో చూడగలము.

"యత్పురుషేణ హవిషా దేవాయజ్ఞమతన్వత
వసంతో అస్యాసీదాజ్యం గ్రీష్మ ఇధ్మ శ్శరద్ధవిః"

—ఋ.10.మ.సూ.90

(పురుషుడను హవిస్సుతో దేవతలు యజ్ఞము చేసినపుడు దానికి వసంతర్తువు నేయియు గ్రీష్మర్తువు సమిధయు, శరదృతువు హవిస్సును అయ్యెను.)

వసంత గ్రీష్మ వర్ష శరద్ధేమంతములు రమణీయములు (సామ 6-4-2)అని సామ వేదమున చెప్పబడినది.

నారాయణోపనిషత్తు మొదటి ప్రపాఠకమును అరుణ కేతుకమందురు. సూర్యో పాసకులు దీనిని అరుణమందురు. ఇందులో మేరుగత కశ్యపుడు (సూర్యుడు) సప్త సూర్యులు, సూర్యమహాత్త్వము, సంవత్సర స్వరూపము — వర్ణింపబడినవి.

ఇందు సంవత్సరగర్భితములై వసంతాది ఋతువుల స్వభావవర్ణన అతి సహజముగా —రమ్యముగా నున్నది. ఇదియే తర్వాతి కవులు కావించిన ఋతువర్ణనలకు మార్గదర్శ కమని చెప్పవచ్చును.

ఋతుప్రశంస అరుణములో నీక్రింది విధముగ నున్నట్లు మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు వివరించియున్నారు.[1]

ముప్పది ముహూర్తము లొక యహోరాత్రము. అట్టి వఱువది యొక ఋతువు. ఒక ఋతువు మరియొక ఋతువు వెనువెంటనే ప్రవేశించును. ఋతువులకు ప్రభువు సంవత్సరము. సంవత్సర స్వరూపుడగు కాలపురుషుని యాజ్ఞను ఋతువులు నిర్వర్తించు చుండును.

వానిలో ముఖ్యము **వసంతము**. బ్రాహ్మణులు ఉపనయన వివాహ యజ్ఞాదికర్మ లాచరించుచు బంధుమిత్రాదుల రావింతురు. మృష్టాన్న భోజనాదులచే ప్రజలు ఆనం దింతురు.

గ్రీష్మము వసంతము కంటే అసాధారణముగ నుండును. శుక్లవస్త్రధారులై యేకాదశ రుద్రగణము గ్రీష్మమున నుండును. నిరుపమాన జ్యోతిచే భూమిని తపింపజేయుచుండును. తాపాధిక్యము దీని అసాధారణ గుణము.

వర్షర్తువు ప్రాణికోటికి వ్రీహి మొదలైన కృష్యాది ఫలముల సమకూర్చునది. దీనికాదిత్యులు ప్రభువులు. వారి యనుగ్రహమువల్ల మరల వర్షర్తువు వచ్చువరకు ప్రాణి కోటికి సరిపడునట్టి సస్యఫలములు లభించుచుండును. ప్రాణులకీ ఋతువు నేత్రరోగము కలి గించును. వానచేతను, గాలిచేతను, శీతలమైన యీ ఋతువునందు కంబళి మొదలగు వానిని కప్పుకొనుట చేతను అగ్ని సేవ చేతను, శీతల బాధ నివృత్తమగును. ఈ కాల మున రురుమృగములు తృణమును సమృద్ధిగా తిని వృద్ధినందును. కర్షకులు భూమిని నాగళ్లతోదున్ని విత్తనములు చల్లి సస్యమును పోషింతురు. దీని వెంటనే శరదృ తువు వచ్చును.

శరదృతువున వర్షర్తు ఫలముగా సంక్రమించిన నేత్రరోగములు శాంతించును.లోక మంతయు కొంతవరకు నిష్పంకమై ప్రసన్నముగా గనవచ్చును. ఈ ఋతువునకు ప్రభు వులు ఋభువులు. ప్రజలు పుష్కలముగా దీని సుఖింతురు.

---

1. మల్లాది సూర్యనారాయణశాస్త్రి, వేదవాఙ్మయము. పుటలు 257, 258.

హేమంతమునకు ప్రభువులయిన మరుద్గణములు విజృంభించును. చలి తీవ్రత హెచ్చును. వాయులోకమునుండి యుద్ధసన్నద్ధమై వచ్చిన యోధబృందమువలె వాయు గణము తీవ్రముగా కనిపించును. ఆ వాయువులతో పోరాడ సిద్ధపడినట్లుగా ప్రజలు కం బళ్లు, శిరోవేష్టనములు ధరింతురు. హేమంత పురుషుడు క్రుద్ధుడుకాకున్నను, అతని కన్ను లెఱ్ఱబారి యుండును.

శిశిరర్తువున దేవలోకమునందు త్రాగుటకు నీళ్లుదొరకవు. మనుష్యలోకమందు గూడ మార్గమధ్యముల నీరు లభింపదు. బాటసారులు నీరెక్కడ దొరుకునో యని తపిం చుచు వయనింతురు."

పై ఋతువర్ణన స్వాభావికముగా వర్ణింపబడినది. ఆలంకారికముగ వర్ణింపకపోయి నను ఋతు సహజత ఉట్టిపడుచున్నది. ఎంతో పరిశీలన కనబడుచున్నది. ఋతు క్రమ మున మానవ జీవితము చక్కగ వర్ణింపబడివది. కేవలము ప్రకృతి వర్ణన చేయబడినది. ఈ ఋతువర్ణనమే వాల్మీకి, కాళిదాసులకు తమ ఋతువర్ణనలకు మార్గదర్శకమైనది.

## 3:13 ఉషస్సులు

వేదములు మానవ కల్పితములైన మహత్పూర్ణ సాహితీ భాగములని ఉషోవర్ణనల బట్టి చెప్పనగును.

భయాశ్చర్యములతో ఇంద్రాగ్ని వాయు వరుణ సూర్యాదుల వర్ణించిన ఋషులు శృంగార భావావిష్టులై ఉషోవర్ణన చేసియున్నారు. కావ్యసాహిత్యమందు శైత్యోపచారములును, చంద్రాద్యుపాలంభనలును, రత్యాది వర్ణనలును ఎంత శృంగార భూయిష్ఠములో వేదములందు ఉషోవర్ణనలంత శృంగార భూయిష్ఠములు. కావ్యాలలో పాత్రచిత్రణలో భాగమై నాయికా నాయకుల యొక్కయు, విటచేట్యాదుల యొక్కయు చేష్టాదులవల్లను, సంభాషణలవల్లను, శృంగారరసము పరాకాష్ఠనందును. వేదమందలి ఉషోవర్ణనలు ఉపమా ఉత్ప్రేక్షాద్యలంకారముల ద్వారా వ్యక్తములు.

ఆకలితో బాధపడుచున్న వానికి అన్నము లభించినట్లుగ-ఎండలో మండిపోవు వానికి నీడ లభించినట్లుగ-దప్పి బాధతో దహించుకొని పోవువానికి జలము లభించినట్లుగ- దొంగ తరుమగా పారిపోవుచుండిన వానికి వివృత రాజనగర ద్వారము కనిపించినట్లుగ- కేవలము భయదశక్తులను చూచి భయాశ్చర్యములతో ప్రార్థనలు సలుపుచుండిన ఆర్యు ఋషులు ఉషస్సును చూచి-దాని సౌందర్యమును ప్రయోజనమును చూచి ఆనందభావ ప్రేరితులై శృంగారము నొలికించుచు వర్ణించినారు.

పగలంతయు ఆహారార్జనకై పనిచేయుటయు, రాత్రులు తిని విశ్రాంతిగా నిద్రించుటయు ప్రాణికోటికి సహజము. రాత్రులు అధికమయినను చిక్కే; పగళ్లు అధికమయినను చిక్కే. రాత్రులు అధికమగుట గాని-పగళ్లు అధికమగుటగాని, కేవలము ధ్రువ ప్రాంతములందే జరుగును.ఉషోవర్ణనలు కొన్ని చూచినపుడు మన కానాటి ఋషులలో కనీసము కొందరయినను ఉత్తరధ్రువ ప్రాంతమందలి అహోరాత్రముల వర్ణించినారను విషయము తెలియకపోదు. దీనికి నిరూపణ ఉషస్సును బహువచనముగ వర్ణించుటయే:

"ఉదయించిన ఉషస్సులు ఉదయించుచున్న ఉషస్సులు ఉదయింపబోవు ఉషస్సులు"[1] అను మూడు భేదములతో వర్ణింపబడినవి. మూడు రంగులతోను వర్ణింపబడినవి. ఒక్కొక్కటి ముప్పది రోజులుండునవిగా వర్ణింపబడినవి.[2]

ఉషస్సులు స్త్రీ రూపములో కనిపించినవి ఋషులకు. అవి అక్కచెల్లెండ్రవలె వర్ణింపబడినవి.

"అక్కచెల్లెళ్లయిన ముప్పదిమంది ఉషోదేవతలు సమానమైన ప్రకాశమును ధరించి విద్యుత్పురుషులవలె గనవచ్చుచు గిరగిర తిరుగుచు బయలుదేరిన చోటను చేరుచున్నారు. ఈ ఉషస్సులు ఈదినమును సమానములే, రేపును సమానములే. ఇవి సూర్య స్థానమగు మేరువును సేవించు చున్నవి."[3]

ఉషో దేవత ఆనందమునొసగు కన్యగా గూడ వర్ణింపబడియున్నది. శృంగార నాయికగా వర్ణితము. ఋషులు ఉషస్సు యొక్క సౌందర్యమును, చల్లదనమును చూచి శృంగార భావావిష్టులై కన్యకామణిగా భావించి నాట్యమాడించినారు. అలంకారములచే అలంకరించినారు. ఉపమాద్యలంకారములకును, మనోహరి వర్ణనలకును ఋగ్వేదమే మూలస్థానమైయున్నది.

దీర్ఘతమర్షి పుత్రుడు కక్షీవంతుడు ఉషస్సు నిట్లు భావపూర్ణముగ వర్ణించుచున్నాడు. శృంగార భావావిష్టుడై మైమఱచినట్లు వర్ణించుచున్నాడు.

"ఉషోదేవీ! నీవు ముందుగా స్పష్టముగా ఇంటిలో దెసమొలతోసంచరించు చక్కని కన్యవలెనే, సర్వాంగము స్పష్టముగా కనబడునట్లుగా గోచరించు చున్నావు. తర్వాత ప్రగల్భురాలవై ప్రకాశమానుడును ప్రియుడును అగు సూర్యుని సమీపించుచున్నావు. పిదప ప్రౌఢయగు యువతివలె చిఱునవ్వు మొగముతో నీ మనోహరుడైన సూర్యుని యెదుట కులుకుచు కౌగిలినపేక్షించు దానివలె వక్షస్థలమును ఆవిష్కరించుకొనుచున్నావు"

- ఋ. 1-6-123 (బంకుపల్లి)

1. "ఉషసేస్వాహావ్యుష్టిచైస్వాహోద్యతే స్వాహోద్యతే స్వాహోదితాయ స్వాహా"
—తైత్తిరీయ సంహిత: 7-2-20.
2. త్రిస్రి:దానుచిత్రా"
—ఋగ్వే. 5-79-9
3. సదృశీరద్యసదృశీందు శ్వోదీర్ఘం సదంతే వరుణస్యధామ అనంద్యాస్త్రిం శతం యోజనాన్యేకైకా క్రితుం పరియన్తి సద్యః "
—ఋ. 1-513-8.

దీర్ఘ తమస్సుననుభవించినవారికి ఉషస్సులు దేవతలవలె కనిపింపక వేరుగ కని పించునా? ఉత్తరధ్రువ ప్రాంత దీర్ఘ రాత్రులతో విసిగిపోయిన-నిరుత్సాహపడిన మాన వులు ఉషస్సును చూడగనే ఎంత సంబరపడిరో చెప్పవలెనా? అది జీవాత్మగా కుత్స మహర్షి చెప్పుచున్నాడు.

"ఓరి మనుష్యులారా! లెండు. పడక వదలి లెండు. మన జీవాత్మ వచ్చినది. తమస్సు పోయి నది. అదిగో ఉషః కాంతి సూర్యుని మార్గమును విశదపఱచుచున్నది. మన యన్న మెక్కడ దొఱకునో అక్కడికి పోదము రండు."

ఆహార సంపాదన పగలేగదా! సర్వకార్యకలాపములు పగలేగదా జరుగును; అందుకు దీర్ఘతమస్సుతో విసిగిన వారు ఆనందముతో ఉషస్సునకు స్వాగతము పలుకుట సహజము.

వేదములలోని యితర ప్రకృతి వర్ణణలు స్వాభావికముగను, సహజముగను ఉన్నవి. భయాశ్చర్యములతో కూడినవి. కాని ఉషోవర్ణనలు ఆనందరస సంజాతములు. మంజుల మనోజ్ఞ రసపూర్ణములు. శృంగార రసావిష్టములు. మనోహర కళాఖండములు. మన ప్రబంధాలలో ఈనాడు కనిపించుచున్న ప్రకృతి వర్ణన లెంత మనోజ్ఞములో అంత కంటె రసవత్తరములు.

## 3:14 జంతు వర్ణన

జంతువర్ణన ఋగ్వేదమునందును యజుర్వేదమునందును అధికముగ గలదు. గుఱ్ఱ ములు, ఆవులు, మేకలు, ఎద్దులు, గొఱ్ఱెలు, కుక్కలు, గాడిదలు మొదలయినవి నాటి గృహజంతువులు.

## 3:15 వేద పురాణములనాటి అతిమానుషీకరణ

ఇంద్రాగ్ని వరుణ యమ మిత్రాది వ్యక్తులు మూర్తిమత్త్వము పొందింపబడిన ప్రకృతి శక్తులు. వారే పురాణములలో దేవతలుగా, మహాయోధులుగా భూలోకవాసు లకు సహాయకులుగా చిత్రింపబడినారు. వేదపురాణాదులతో సమకాలీనతను పొందిన గ్రీకు లాటిన్ భాషలందలి ఒడెస్స ఇలియడ్ వంటి పురాణాలలోగూడ దాదాపిట్టి దేవ తలే — ఇట్టి వ్యక్తులుగానే చిత్రింపబడినారు. ఈ విషయమువలన ప్రాచీన భారతీయార్య జాతివారును, ఇరాన్ ఐరోపాలలోని అప్పటి ఆర్యజాతివారును ఒకే తెగకు చెందినవారని స్పష్టమగుచున్నది. గ్రీకు లాటిను భాషలలో వేదాలవంటివి లేవుగాని (ఇరాన్‌లో జండ్

అవెస్థామాత్రమున్నది) రామాయణ భారతాది పురాణముల వంటివి ఉన్నవి. రామాయణ భారత ధోరణిలోనే అవిగూడ నడచినవి. వానియందును వీనియందును చాల సమానతలు గలవు.

| సంస్కృత వేద పురాణములు | | గ్రీకు పురాణములు |
|---|---|---|
| ఇంద్రుడు (అధిదేవత) | : | జ్యూపిటర్ |
| నందనవనము (ఇంద్రుని వనము) | : | దివ్యవనము (దేవవనము) |
| అమృతము (దేవ పానము) | : | నెక్టార్ (దేవపానము) |
| చంద్రుడు (మగవాడు, హరిణాంకుడు) | : | డయానా (స్త్రీ) చేతిలో జింక గలది |
| మన్మధుడు (మగవాడు, ప్రేమను కలిగించువాడు) | : | క్యుపిడ్ – ప్రేమను కల్గించువాడు |
| మలయమారుతము (దక్షిణమారుతము) | : | నోటస్ (దక్షిణమారుతము) |
| మానవులు దేవతలు కలిసి యుద్ధాదులు | : | మానవులును, దేవతలును కలిసి యుద్ధాదులు. |
| భారత యుద్ధములో కృష్ణ సహాయము | : | ట్రోజన్ యుద్ధములో నెవ్ప్యూను సహాయము, |
| రామాయణములో సీతాపహరణ | : | హెలెన్ ఆఫ్ ట్రాయ్ అపహరణ |
| రతీదేవి (మన్మధుని భార్య) సుందరి | : | వీనస్, అందాల దేవత |
| వైతరణి (పాపులు దాటవలసినది) | : | లెథె – మృతజీవులు దాటవలసినది. |
| సూర్యుడు | : | అపోలో |
| సూర్యరథము (సారథి అనూరుడు) | : | సూర్యరథము (సారథి హీలియోన్) |
| కవి (ఋషి యనబడును) క్రాంతదర్శి | : | కవి వాటిస్ అనబడును. క్రాంతదర్శి |

### 3.15 సారాంశము

1. వివిధమగు ప్రకృతి వర్ణనలు వేదములందు గలవు. మేఘములు, వర్షము, మేఘగర్జన, దవానలము, తాపము మొదలగు ప్రకృతి శక్తులకు ఇంద్రాగ్న్యాదిగా నామములిడిరి. ప్రకృతి యొక్క భయంకర రూపమును, క్రూరరూపమును, మృత్యు రూపమును ప్రశాంతరూపమును, ఆనందరూపమును, ఆహారరూపమును, ప్రాణ రూపమును చూచిన ఆది మానవుడు, వానిలో తనను చూచుకొని, తన మాదిరే కరచరణాద్యవయవ సహిత రూపములను సృష్టించుకొని వానికి ఇంద్ర, యమ, వరుణ, వాయు, మిత్ర, ఉష – మొదలగు నామములిడి మానవరూప దేవతలుగా నూహించి, వారికి మానవాహారమైన ధాన్యాదులను, మత్స్య మాంసములను అర్పించి ప్రార్థనలు చేసినాడు. వేదాలలోని ఇంద్రాది నామములు ప్రకృతి శక్తులకు మూర్తిమత్త్వము కల్పించి నామకరణ చేయుట తప్ప మరియొకటి గాదు. ఇంద్రుడు, వాయువు, అగ్ని, సూర్యుడు, వరుణుడు, జలములు, పృథివి, సముద్రము, నదులు, పర్వతములు, ఆకాశము, చంద్ర నక్షత్రములు మేఘములు, ఉషస్సులు, ఋతువులు, పశులు – ఒకటా రెండా? ప్రకృతి సంబంధమైన ఎన్ని స్థావర జంగములనో ప్రార్థనరూపమున వర్ణించి యున్నాడు. కాని ప్రార్థింపబడిన వన్నియు ప్రకృతి శక్తులే.

2. ఉషస్సుల అందమును చూచిన తర్వాత, ఋషులు రసభావావిష్టులై ఆనందోద్రేకముతో ఉప్పొంగి సౌందర్య దృష్టితో వర్ణించినారు.

3. వేదములందు ఋతువర్ణన వసంతాది క్రమములో నున్నది. తర్వాత వెలసిన పురాణేతిహాస కావ్యాదులలో గూడ అదే క్రమము పాటించబడినది. సంవత్సరము వసంతర్తువుతో ప్రారంభమగు నేటి పద్ధతి వేదములనుండి సంక్రమించినట్టిదే!

4. కావ్యశోభకు ఉపమా ఉత్ప్రేక్షాద్యలంకారములు ముఖ్యాంగములు. రస పోషణకును, సుబోధకతను, ఈ అలంకారములు అత్యావసరములు. ఈ పద్ధతికి వేదములందెన్నిచోట్లనో ఉపయోగించిన ఉపమా ఉత్ప్రేక్షలే ఉదాహరణములు. ఆలంకారికమైన వర్ణనలకు వేదములు మూల కందములు.

5. లౌకిక సాహిత్యమయిన రామాయణ భారతాది కావ్యములలోని ప్రకృతి వర్ణనలలో వేదప్రకృతి వర్ణనల ప్రభావమతిగా గలదు. అందు ఇంద్రాగ్ని వాయు మిత్రాదులయిన అతిమానుష శక్తుల మానవ చేష్టలు – అజగవాశ్వాదియోగపశ్వాహార రూపమును – నదీ సముద్ర పర్వతాదుల వర్ణనలును, చంద్రవాయువుల రమ్య వర్ణనములును గలవు. ఇంద్రాదుల ద్యులోక ప్రకృతి చేతను, నదీ సముద్ర పర్వత వృక్ష

పుష్పాదుల భూ ప్రకృతి చేతను, మలయమారుతాది అంతరిక్ష శక్తులచేతను ఉద్దీపన విభావమును కల్గించి రసో దంతమైన వర్ణనలను — ఆ కావ్యములలో అతిగా పొందించుట జరిగినది. ఆ కావ్యములందలి ప్రకృతి వర్ణనలకు వేద ప్రకృతి వర్ణనలే ప్రాతిపదికలు. ఆ తరువాత అష్టాదశాది ప్రకృతి వర్ణనలుండవలెనను నియమ మేర్పడుటకును, వాని సాయమున రమ్యాతిరమ్యమైన రసపూర్ణ కావ్యవర్ణనలు వెలయుటకును ఆద్యము లయిన కారణములు వేదప్రకృతి వర్ణనలే.

# చతుర్థ ప్రకరణము

## లౌకిక (సంస్కృత) వాఙ్మయము — ప్రకృతి వర్ణనలు

తెనుగునందలి కావ్యములు చాలవఱకు సంస్కృత కావ్య పద్ధతుల ననుసరించి వ్రాయబడినవి. అందలి రచనా పద్ధతి—అలంకారాది లక్షణానుసరణము— అష్టాదశ వర్ణనా నియమములు — కడకు, కొంతవఱకు ఛందస్సు గూడ సంస్కృత కావ్యానుసరణములే. కావున ఆంధ్ర ప్రబంధములందలి ప్రకృతి వర్ణనల పరిశీలించునపుడు సంస్కృత కావ్య సాహిత్యమందలి ప్రకృతి వర్ణనల స్వరూపమును కొంత తెలిసికొనుట అవసరము.

వేదములందలి ప్రకృతి వర్ణనల గురించి దిఙ్మాత్రముగా పూర్వ ప్రకరణమందు చర్చింపబడినది. అవి స్వతంత్రములు — మౌలికములు — సహజములు — భావనా భరితములు.

ఆ తరువాత వెలసినవి మిత్ర సమ్మితములగు పురాణములు. రామాయణ కావ్యమును, భారతేతిహాసమును, భాగవతాది పురాణములును ఈ కోవలోనివి.

ఆ తరువాత చెప్పుకొన దగినవి సంస్కృత కావ్యములు. కావ్యములు కాంతా సమ్మితములు. ప్రకృతి వర్ణనలను మనోహరముగ చేయవలయునను పట్టుదల కావ్యకాను లం దధికము. ఈ కావ్యయుగముననే అష్టాదశ వర్ణనా నియమము రూపొందినది. కావ్యములన్నియును కొన్ని నియమములకు లోబడిన రచనలు.

రామాయణ మాదికావ్యము. ఇందు ప్రకృతి వర్ణనలు చాల అధికము. కావ్యగతముగా ప్రకృతి వర్ణనలు చేసిన కవులలో ఆద్యుడును ఆదర్శ కవియును వాల్మీకియే.

భారత కావ్యమొక ఇతిహాసము. ఇందనేకములగు ఉపాఖ్యానములు గలవు. ప్రతి ఉపాఖ్యానమును ఒక చిన్న కావ్యమువంటిది. ఈ బృహద్గ్రంథమున ప్రకృతి వర్ణనలు అతి బహుళములు.

పురాణములందలి ప్రకృతి వర్ణన చాలవఱకు వేదముల ననుసరించిన దనవచ్చును. వేదములందు సహజముగను, ఈషణ్మాత్రముగను నుండిన వర్ణనలు పురాణాదులందు బృహదాకారమును పొంది కార్యకారణ సంబంధ విలసితములుగా గూడ నయినవి. వేద ములందలి ప్రకృతి - అనగా - మేరువును, ఇతర పర్వతములను, నదులను, జంతువులను, ఉషస్సును, సూర్యచంద్రాదులను, ఆకాశ నక్షత్రములను, సముద్ర మేఘవర్షములను, విస్తృతాకారములో రసపూర్ణముగ పురాణాదులందు వర్ణించుట జరిగినది.

రామాయణ భారతములు ప్రాచీన (పురాణ) సాహిత్యమునకును, కాళిదాసాదుల కృతులు కావ్యసాహిత్యమునకును ప్రతీకములుగ భావింపనగును.

కావ్య సాహిత్యమును, మరల **అష్టాదశ** వర్ణనా నియమమునకు ముందటిది అనియు, తర్వాతిది అనియు రెండు తెఱగులుగా విభజింపనగును. అనగా అష్టాదశ వర్ణనా నియమమును చెప్పిన దండికి (ఆరవశతాబ్దము)పూర్వులైన కాళిదాసాదుల కావ్యములు మొదటి తెగకు చెందినవిగను, ఆ తర్వాతివారైన బాణభట్టాదుల కావ్యములు రెండవ తెగకు చెందినవిగను భావింపనగును.

పై విభజనకు ప్రతీకముగ - ప్రస్తుత చర్చకు ఈ క్రింది కావ్యములు మాత్రమే స్వీకరింపబడును:

1. వాల్మీకి రామాయణము
2. కాళిదాసకృతులు
   (1) రఘువంశము, (2) కుమార సంభవము, (3) మేఘ సందేశము, (4) ఋతు సంహారము, (5) అభిజ్ఞానశాకుంతలము;
3. కాదంబరి (బాణుడు), శిశుపాలవధ (మాఘుడు), నైషధము (హర్షుడు).

## 4:1 వాల్మీకి రామాయణము

రామాయణము ఆది కావ్యము. ఏకనాయకత్వమును, వస్త్వైక్యమును గలది. సర్వరసాలంకార గుణాదులకు నిలయము. ప్రకృతి వర్ణనలకు మూలము. ప్రకృతిని సజీవముగ వర్ణించిన కవులలో వాల్మీకి ఆద్యుడు. తర్వాతి కవులందఱకును అనుసరణీయుడు. క్రౌంచ మిథునమునకు సంభవించిన విషాదదృశ్యమును చూచి వాల్మీకి -

> "మా నిషాద ప్రతిష్ఠాం త్వ
> మగమశ్శాశ్వతీస్సమాః
> యత్ క్రౌంచ మిథునాదేక
> మవధీః కామ మోహితం"

అనిశోకపూర్ణకంఠముతో నిందించినాడు. ఆ శోకమే శ్లోకమై రామాయణ కావ్యమునకాదియైనది. ఈ విధముగ ప్రకృతి దృశ్యముతోనే కావ్యము మొదలైనది. కావ్యమందధికముగ ప్రకృతి వర్ణనలు చోటు చేసికొన్నవి. రామాయణమందలి ముఖ్యములగు కొన్ని ప్రకృతి వర్ణనలను పరిశీలింతము.

## 4:1:1 పర్వతవర్ణన

రామాయణమున పర్వత వర్ణనలు సుందరముగ కావింపబడినవి. కేవలము చిత్ర కూట, ప్రస్రవణ, మైనాక, చంద్రద్రోణ పర్వత వర్ణనగల శ్లోకములు సుమారు డెబ్బది యైదు గలవు. అంతేగాక వానరులు సీతను వెదకుటకు నలుదిశలకు వెళ్లవలయునని సుగ్రీవుడాజ్ఞాపించుచు పేర్కొన్న పర్వత నామములు రమారమి నలువది గలవు. చిత్ర కూట వర్ణన అయోధ్యాకాండమందును, ప్రస్రవణ పర్వత వర్ణన కిష్కింధాకాండ మందును, మైనాకాలంబన పర్వత వర్ణనలు సుందరకాండ యందును, చంద్రద్రోణ పర్వతముల వర్ణన యుద్ధకాండమందును గలవు.

రామాయణమున ప్రాధాన్యము వహించు పర్వత వర్ణన చిత్రకూట వర్ణన.

రాముడు సీతాలక్ష్మణ సమేతుడై అరణ్యావాసమునకు బయలుదేరి ప్రయాగకు వచ్చినపుడు భరద్వాజుడతనికి ఆతిథ్యమిచ్చి చిత్రకూటపర్వతమునకు దారి చూపి దాని మాహాత్మ్యమును వెల్లడించినాడు.

"అది మహర్షి సేవితము. గోలాంగూలములకును, ఎలుగుబంట్లకును ఆకరము. ఉరగము లకు, మయూరములకును, కిన్నరకింపురుషులకును, గజ యూధములకును, కందమూలా దులకును నిలయము. నీవు వెళ్ళి చూడుము" అని రాముని ఉత్సాహ పఱచినాడు.

అయోధ్యా. 54-59.

భరతుడు వసిష్ఠునితో కలిసి రాముడున్న చిత్రకూటమునకు వచ్చినపుడు వసిష్ఠునికి చూపి వర్ణించినాడు. తరువాత రాముడు సీతను ఉత్సాహపఱచుటకై చిత్రకూటమును చూపి వర్ణించినాడు. (అయోధ్యకాండ 93-8 నుండి 14 వఱకు).

పర్వతములందు గల ధాతువులను, శిఖరములను, పులులను, ఎలుగుబంట్లను, వృక్ష ములను, పక్షులను. కిన్నరులను, విద్యాధరులను, వారు క్రీడించు స్థలములను, ఏనుగు మదజలమువలె స్రవించుచున్న సెలయేళ్లను, ఓషధులను, మూలములను, ఫలములను వర్ణించినాడు.[1]

అంతేగాక అక్కడ గల కాముకశయనాలను, వాడిపోయిన కమల మాలికలను (కాముకులుపయోగించినవి) కూడ చూపినాడు రాముడు.[2]

వానర రాజ్యమునకు సుగ్రీవుని రాజునుచేసిన యనంతరము రాముడు ప్రస్రవణ గిరిని నివాసము చేసికొన్నాడు. పులుల గాండ్రింపులతోను, జింకల అఱపులతోను, సింహగర్జనలతోను నిండినదియు, కోతులు, ఋక్షములు గలదియు; గైరిక ధాతువులును,

1. అయోధ్యకాండ 93-3 నుండి 15 వరకు

2. అయోధ్యకాండ 94-25

సెలయేళ్లను గలదియు, మయూరాది నానా పక్షిధ్వనులతో గూడినదియును జాజులు, మొల్లలు మొదలగు పూలతోగూడినదియును అయిన ప్రస్రవణగిరిని చూపి రాముడు లక్ష్మణునికి వర్ణించిచెప్పినాడు.[3]

హనుమంతుడు సముద్రమును లంఘించు సమయమున మహేంద్ర పర్వత వర్ణన గలదు. ఈ పర్వతము నానా వర్ణములు గలిగి స్వతస్సిద్ధములగుచున మణిశిల మున్నగు గైరిక ధాతువులు గలిగినదిగను, కామరూపులయిన యక్ష కిన్నర గంధర్వుల చేతను, దేవతలబోలు సర్పముల చేతను కూడినదిగ వర్ణింపబడెను.[4]

మైనాకుని వర్ణన మామూలు పర్వతవర్ణనలకు భిన్నము. మైనాకుడు సువర్ణ మయుడు. పాతాళరాక్షసులు పైకిరాకుండ గడియ మ్రానుగా నుండువాడు. అడ్డమును, క్రిందికిని, పైకిని పెరుగువాడు.[5]

పై వర్ణించిన ప్రస్రవణమును, మైనాక పర్వతమును, ప్రకరణ సంబంధము గలవి. చిత్రకూట వర్ణన కొంత వఱకు పద్ధతికోసము చేసిన వర్ణన వలెనే యున్నది. అయినను సీతను ఓదార్చుటకు చేసినట్లున్నది గాన కథాభాగముతో నన్వయము పొందినది.

లంకయందున్న ఆలంబన పర్వతము చాల పెద్దది. అక్కడ గల త్రికూట పర్వత శిఖరమున లంకాపురి యున్నది. ఆ లంకాపురి చుట్టును కొండ గోగులును - కొండ మల్లెలును - ఖర్జూరములును. మొగలులును, కాంచనములును, ఏడాకులయనంట్లు మొదలగునవియును - హంస కారండవాది పక్షులును - కమలకుముదాదుల కాకరమైన నడబావులును - నానావిధ సుందర పౌర జనోద్యానములును - సమస్త ఋతుఫలములు గల వృక్షములును - నానావిధ వృక్షములతో నొప్పుకోనేరులును - మనోహరమగు రాజోద్యానములును గలవు.[6]

ఇక కథతో నన్వయము గలది, చంద్రద్రోణ పర్వతముల వర్ణన. ఇవి క్షీరసము ద్రమందున్నవి. సంజీవకరణీ, విశల్యకరణియను ఔషధములిందు గలవు. లక్ష్మణుడు మూర్ఛపడిపోయినపుడీ ఔషధములను తెచ్చి అతనిని బ్రతికించుట జరిగినది.[7]

రామాయణమందలి పర్వత వర్ణనలు అద్భుతమైనవి. సందర్భమును పురస్కరించు కొని వ్రాయబడినవి. పర్వతములందేయే ప్రకృతియుండునో అదంతయు వర్ణింపబడినది. పర్వతములు నదులకును, ఓషధులకును, గైరికాది ధాతువులకును పుట్టుకస్థానములని

3. కిష్కింధాకాండ 27-1 నుండి 10 వరకు
4. సుందరకాండ 1-5,6
5. సుందరకాండ 1-91 నుండి 94 వరకు
6. సుందరకాండ 2-8 నుండి 13 వరకు
7. యుద్ధకాండ 50-81,32

వేదములందు చెప్పబడినది.అది కేవలము సహజవర్ణన. రామాయణమున ఆ వర్ణనలు ప్రకరణ ప్రయోజనము గలవై - స్వరూప స్వభావ వర్ణనాభరితములై - కావ్యగత వర్ణనలై పోయినవి.

పాత్రలద్వారా వర్ణనలు చేయించుట రామాయణమందే మొదటగ సాక్షాత్కరించు చున్నది.

మొట్టమొదట భరద్వాజముని రామునికి చిత్రకూట మహిమను వినిపించినాడు (అయోధ్య-54-29). తర్వాత సీతారాములు చిత్రకూటమునకు చేరిన యనంతరము రాముడు సీతకు ప్రకృతి దృశ్యములను ప్రత్యక్షముగ చూపించుచు వర్ణించినాడు (54-39 నుండి 41 వఅకు) వానరులను సుగ్రీవుడు నానాదిక్కులకు పంపుచు పేర్కొనిన పర్వతములు (సుందర-మొదటి అధ్యాయము) కథతో సంబంధముగలవి. మిగిలిన వర్ణనలు కవి చేసినవే!

రామాయణమున పర్వత వర్ణనయందు - శిఖరములు, వృక్షములు, ధాతువులు, నానావిధ పక్షులు, వానరములు, ఎలుగుబంట్లు, వ్యాఘ్రాది క్రూరమృగములు, కిన్నర విద్యాధరాదులు - ఓషధులు మొదలగునవన్నియు వర్ణితములు. వేదములందలి పర్వత వర్ణన యందిట్టి వివరములు వర్ణితము కాలేదు.

తర్వాతి కవులందరును పర్వత వర్ణన విషయమున రామాయణమునే అనుసరించి పర్వతవర్ణనలో వృక్ష ధాతు పక్షి మృగాదులవర్ణన కూడ ఒక నియమముగా పాటించిరి.

రామాయణమందలి పర్వత వర్ణనలలో ముఖ్యముగ చెప్పుకొనదగినది క్రీడాపర్వత వర్ణనము. హనుమంతుడు లంకలో తిరుగునపుడీ కృత్రిమ పర్వతము కనిపించినది. (సుందర. 14-28,29).

## 4:1:2 సముద్రవర్ణన

రామాయణమున ఒక్కసారి మాత్రమే సముద్రము దర్శన మిచ్చుచున్నది. మొత్తమూరు శ్లోకములలో వర్ణింపబడినది. సంపాతి వలన సీతజాడ తెలిసికొని ఆనందించు చున్న వానరులు దక్షిణ సముద్రపు టుత్తర తీరమున కూర్చుండి సముద్రభయంకరాకారమును చూచుట వర్ణింపబడినది. సీతాన్వేషణమునకై వానరులను నానాదిశలకు పంపుచు సుగ్రీవుడు పూర్వ పశ్చిమ సముద్రములను నామమాత్రముగ పేర్కొనుట జరిగినది. సముద్ర వర్ణన స్థూలముగ పది శ్లోకముల కంటె మించదు,

సముద్రమున నేయే జంతువులుండునో - దానిని చూడగనే ఏయే దృశ్యములు కనిపించునో అవన్నియును వర్ణితములు.

"నోరు తెఱచుకొని జలములయందు లీలగా విహరించుచున్న భయంకరమైనట్టియు, మహాకాయము గలవైనట్టియు, జలచరములచే (తిమింగలాదులు) నిండినట్టియు, బృహత్తరంగములచే నొప్పినదియు, ఒకవైపున జలజంతువుల చేతను, అలలచేతను క్రీడించు నట్లున్నదిగను - వేరొకవైపున అట్టివి లేక నిదురించు చున్నట్టున్నదిగను- ఒక వైపున కొండలంత నీటి కరుల్లతో కప్పబడినదిగను, పాతాళవాసులైన యసురులచే అధిష్ఠితమయినదిగను కన్పట్టుచు - చూపఱులకు భయంబును గగుర్పాటును కల్గించు నదియునగు మహాసముద్రము చూచి వానరులు దిగులొందిరి."[1]

"ఆకాశమువలె దుష్పారమైన యా సముద్రమును చూడి, దిగులుతో 'ఇక కర్త వ్యమేమి' యని పలికిరి."[2]

సముద్రవర్ణనలో నుండవలసిన జలచరములు, అలలు, అపారత - ఇందు వర్ణితములు. తర్వాతి కవుల సముద్ర వర్ణనకిది మూలము.

వేదములలో సముద్రమును పేర్కొనుట జరిగినది. వర్ణనలు లేవనవచ్చును. రామాయణమున సముద్రవర్ణన వర్ణన కోసము చేసినది గాదు. అది కథలో ప్రాముఖ్యమును వహించి యున్నది.

### 4:1:3 నదీ సరోవర వర్ణనలు

రామాయణమున ప్రముఖముగ కనిపించు నదులు, సరయు, మందాకిని, గోదావరి-మాత్రమే! మిగిలిన నదులు నామమాత్రముగ పేర్కొనబడినవి. గంగావతరణ ఘట్ట వర్ణనను గూడ కలుపుకొన్నను, ప్రముఖముగ నదీవర్ణన డెబ్బది శ్లోకములకుమించదు.

1. "సత్త్వైర్మహద్భి ర్వికృతైః క్రీడద్భి ర్వివిధైర్జలే
వ్యాత్తాస్యైస్సుమహాకాయై రూర్మిభిశ్చ సమాకులం
ప్రసుప్తమివ చాన్యత్ర క్రీడస్తమివ చాన్యతః
క్వచిత్పర్వత మాత్రైశ్చ జలరాశిభిరావృతం
సంకులం దానవేంద్రైశ్చపాతాళతలవాసిభిః
రోమహర్షకరం దృష్ట్వా నిషేదుః కపికుంజరాః" -కిష్కింధా 64-5,6,7.

2. "ఆకాశమివ దుష్పారం సాగరం ప్రేక్ష్య వానరాః
నిషేదు స్సహసా సర్వే 'కథంకార్య'మితి బ్రువన్" -కిష్కింధా 64-8.

అందు హంసలు, సారసములు, ఇసుక తిన్నెలు, పుష్ప, ఫలసహితములైన తీర వృక్షములు, చిలుకల గుంపులు, చక్రవాక పక్షులు, అచ్చటచ్చట హ్రదములు తామరలు ఉన్నట్లు వర్ణింపబడినవి.[1]

తరువాత గోదావరీ వర్ణన రమ్యమైనది. ఇందును హంసకారండవములును, చక్రవాకములును, మయూరములును, తీరమందు గజములును, తమాలాది వృక్షములును, పనసలును, ఆమ్రములు మొదలగునవి వర్ణితములు.

"ఇయంగోదావరీ రమ్యా పుష్పితైస్తరుభిర్వృతా
హంసకారండవాకీర్ణా చక్రవాకోపశోభితా
నాతిదూరేనచాసన్నే మృగయూథని పీడితాః
మయూరనాదితా రమ్యాప్రాంశవో బహుకన్దరాః
సౌవర్ణైరాజతైస్తామ్రైర్దేశే దేశే చ ధాతుభిః
సాలైస్తాలైస్తమాలైశ్చ ఖర్జూరైః పనసామ్రకైః"
— అరణ్య 15-12, 13, 14.

పై వర్ణన రాముని చే చేయబడినది. నదిలో తామరలుండునన్న (కవి సమయము) విషయము రామాయణమందే మొదట కనిపించుచున్నది. (అయోధ్య 16-4 నుండి 26 వఱకు)

## 4:1:4 పంచాప్సరస్సు

రామాయణమున అరణ్యకాండయందు పంచాప్సరస్సు వర్ణింపబడినది. ఇది యోజన ప్రమాణ వైశాల్యము గలది. "ఎఱ్ఱతామరల చేతను, తెల్లతామరల చేతనునిండియుండి నదియు, గజయూథములతో నిండియుండు తీరప్రదేశములు గలదియు, సారసహంసాదులతో నొప్పుచున్నదియునై యున్నది." - అరణ్య. 11-56.

రామలక్ష్మణులు చూచిన యీ తటాకము ఇతర తటాకములవలెనే వర్ణితమయినది. నదీ సరస్సులలో నేయే పక్షి జంతు నివహములుండునని వర్ణింతురో అట్టివన్నియు వర్ణింపబడినవవి. కాని పంచాప్సరస్సువర్ణనలో మరొక విశేషముగూడ ప్రస్తావింపబడినది.

---

1. రామా, అయోధ్యా, 16-4 నుండి 26 వఱకు.

"నిర్మలజలపూర్ణమయిన ఆ సరస్సునుండి గీతావాద్యధ్వని రామలక్ష్మణులు విన్నారు. అందెవ్వరును లేరు." (అరణ్య 11-7).

ధర్మభృత్తను ముని రామలక్ష్మణులతో "మాండకర్ణి తపస్సు చేయుటయు దేవతలా తపస్సును చెఱచుటకు అయిదుగురు అప్సరసలను పంపుటయు, వారు అతనికిభార్యలగుటయు, వారు తటాకాంతర్గత గృహములో హాయిగ నివసించుచు, యౌవనము పొందిన మాండకర్ణితో క్రీడించుచుండుటవలన భూషణ ధ్వనిమిశ్రంబగు గీతవాద్య ధ్వని వినిపించుననియు" నుడివెను[1].

ఈ వర్ణన గూడ పాత్రముఖమున (ధర్మభృత్తు) గావింపబడినది.

## 4:1:5 పంపా సరస్సు

ఇక పంపా సరస్సు. ఇది తుంగభద్ర నదీ సంబంధి. దీని వర్ణన రెండుచోట్ల వచ్చుచున్నది. మొదట కబంధుడు రామునికి పంపాసరస్సు ప్రాశస్త్యమును వివరించు ఘట్టమున అరణ్యాకాండలో వచ్చును. వర్షర్తువు గడచిపోవు వరకు రామలక్ష్మణులు పంపా తీరమున నివసింతురు. ఆ సమయమున పంపాసరస్సును రాముడు వర్ణించును. ఇది కిష్కింధాకాండ లోనిది.

కబంధుడు పంపా సరస్సు ప్రాశస్త్యమును వివరించు తఱి నదీవర్ణనలలో మామూలుగ కనిపించు క్రౌంచములు, కురరవములు, ఇతర పక్షులు. ఇసుక తిన్నెలు, చేపలు మొదలగు నన్నియు వర్ణితములు. ఇది రుచికరములగు చేపలకును, రొయ్యలకును ప్రసిద్ధియని కబంధుడు చెప్పును.

అంతేగాక అక్కడి తీరమున వరాహములును, మాతంగములును వర్ణితములు.[2] నీటియొక్క ప్రాశస్త్యమును ఉగ్గడించుచు ఆ నీరు త్రాగుమని రామునికి కబంధుడు చెప్పెను.[3] దీనివలన తుంగా జల ప్రాశస్త్యము నాటినుండియే గలదని తెలుచున్నది. ఇక రెండవ వర్ణన కిష్కింధా కాండమందు ఆదినుండియే పంపా ప్రాశస్త్యము గలదు. పంపాసరస్సును చూడగనే రాముడుద్దీపన పొందినవాడై సీతను తలచుకొని బాధపడుట ఈ వర్ణన యందలి విశేషము.

---

1. అరణ్య. 11-10 నుండి 19 వఱకు.
2. రామా. అరణ్య. 73-2 నుండి 30 వఱకు.
3. పద్మగంధి శివం వారి సుఖశీత మనామయం
ఉధృత్య సతతా క్లిష్టం రౌప్యస్ఫాటిక సన్నిభం
అసౌ పుష్కర వర్ణేన లక్ష్మణః పాయయిష్యతి. -అరణ్య. 73-17

నదీ సరస్సుల వర్ణనలలో వలె తీర ప్రాంత వృక్షములును, మృగములును ఇందు వర్ణితములు. రామాయణమున దీర్ఘికలు గూడ వర్ణింపబడుట ఒక విశేషము (సుందర.14 -33,34). నదీ సరస్సుల యొక్కయు దీర్ఘికల యొక్కయు వర్ణనలు ప్రకరణశుద్ధి గలిగి యున్నవి. ఈ నదీ సరస్సుల వర్ణనలును పాత్ర ద్వారానే చేయబడినవి. వేదములందు నదుల నామమాత్ర ప్రశంస గలదు. వర్ణనాత్మకముగ ప్రస్తుతింపబడలేదు.

### 4:1:4 ఋతువర్ణనలు

ప్రకృతి వర్ణనలలో ఋతువర్ణనలు అత్యంత ప్రాధాన్యమును వహించుచున్నవి. ఋతువర్ణనలలో కథాభాగముండదు. కేవలము బాహ్యప్రకృతి వర్ణనలే !

రామాయణమున ఇవి కేవలము వర్ణనాత్మకములయినను ఆత్మాశ్రయ పరాశ్రయ కవితా గర్భితములు. ఒక్క హేమంతమును దప్ప మిగిలిన వసంతర్తువును, వర్షర్తువును, శరదృతువును రాముడే విరహపూర్ణ హృదయముతో వర్ణించును. అందుచేతఈవర్ణనలలో ఆత్మాశ్రయత్వము అధికముగా కనిపించు చున్నది.

రామాయణమున వర్ణింపబడిన నాలుగు ఋతువర్ణనలను దిఙ్మాత్రముగ నయినను వివరింపవలసిన యవసరమున్నది. తర్వాతివారగు కాళిదాసాది కవులందఱును ఋతు వర్ణన చేసియున్నారు గాన వారెంతవఱకు వాల్మీకి ననుసరించిరో- ఎంతవఱకు స్వతంత్ర వర్ణనలు చేసిరో - తెలిసికొనుటకు వీలు గలుగును.

ఋతువర్ణనలందలి ప్రకృతి వర్ణనలను రెండు విభాగములుగ విభజింప వచ్చును.

1. స్వాభావిక వర్ణనలు :- ఇందు వర్ణిత వస్తువుల స్వరూప స్వభావములు సహజముగను వాచ్యముగను వర్ణింపబడును,
2. భావాత్మక వర్ణనలు :- ఇందు వర్ణిత వస్తువుల స్వరూప స్వభావములు అలంకారాన్వితము చేసి భావనాయుక్తముగ వర్ణించుట జరుగును. ఆత్మాశ్రయత గలిగియుండును.

#### హేమంతర్తు-వర్ణన

రామాయణమున కనిపించు ఋతువర్ణనలలో హేమంత వర్ణన మొదటిది.

పంచవటిలో నివసించుచుండిన రాముడు సీతతోగూడి స్నానార్థము గోదావరికి పోవునపుడు, వెంటనున్న లక్ష్మణుడు హేమంతర్తువర్ణన చేయును. ఈ వర్ణన మొత్తము

ఇరువదేడు (27) శ్లోకములలో గావింపబడినది.
దీనికి కథతో సంబంధము తక్కువ.

ఈ ఋతువర్ణన యందలి భావాత్మక వర్ణనలు అత్యంత సహజ మనోహరములు.

కిరణములు మంచులో తడిసి యుండుట చేతను, దూరాన నుదయించుటచేతను, సూర్యుడు చంద్రునివలె చల్లగా నున్నాడు.[1] దప్పిగొనియును, ఏనుగు నీటిలో తొండము నుంచి శైత్యమునకు తాళలేక తటాలున ముడిచి వేసినది.[2]

శూరులు కానివారు యుద్ధ సమీపమునకు వెళ్లి గూడ నూరకుండునట్లు జలసమీపమున నిలుచుండిన జలపక్షులు అందు ప్రవేశింపకున్నవి.[3] పుష్పరహితములైన వృక్షపంక్తులు, పైని కురియుచున్న హిమము అను నంధకారముతో కప్పబడినవై కండ్లు మూసికొని నిద్రించు చున్నవా యనునట్లుండినవి.[4]

పైని వివరింపబడిన హేమంతర్తు వర్ణనలు రమ్యముగా నున్నవి. ఇందలి భావములను తర్వాతి కవులు అనువదించుకొని యున్నారు. ఆ విషయము తర్వాత తులనాత్మక పరిశీలనలో చర్చింపబడును.

హేమంతము తర్వాతి శిశిరర్తువును వర్ణింపలేదు.

## వసంతర్తు వర్ణన

వసంతర్తు వర్ణన - కావ్యగత వర్ణనగా - మొట్టమొదట సాక్షాత్కరించునది రామాయణముననే. ఇక్కడ విరహవ్యథచే కుందుచున్న రామునిచేత వసంతర్తు వర్ణన కావింపబడుచున్నది. విప్రలంభ శృంగారమునకును వసంతర్తువునకునుగల మైత్రీశోభ యీ ఘట్టమున గననగును.

ఈ ఋతువు మొత్తము వంద శ్లోకములలో వర్ణింపబడినది. విరహ విమూఢుడయిన రాముడు వసంత శోభను పురస్కరించుకొని దురపిల్లుట ఈ ఘట్టమున చూడనగును. కొన్ని సహజ స్వాభావిక వర్ణనల పరిశీలింతము.

పంపా సరస్సు ప్రకృతి సుందరమయినది. అందు వసంతము ప్రవేశించినట్లు రాముడు చెప్పుచున్నాడు. "సుఖకరమయిన మందమారుతము గలదియు. మన్మదోద్దీప

1. "మయూఖైరుపసర్పద్భి ర్హిమనీహార సంవృతైః
దూరమభ్యుదిత స్సూర్యశ్శశాంక ఇవ లక్ష్యతే" అరణ్య 16-18
2. "స్పృశంస్తు విమలంశీత ముదకం ద్విరదస్సుఖం
అత్యన్త తృషితోవన్యః ప్రతి సంహరతే కరం" అరణ్య 16-21
3. "ఏతేహి సముపాసీనా విహగా జలచారిణః
నావగాహ న్తిసలిల మప్రగల్భా ఇవాహవం" అరణ్య 16-22
4. "అవశ్యాయ తమోనద్ధా నీహార తమసాఽవృతాః
ప్రసుప్తా ఇవ లక్ష్యన్తే విపుష్పా వనరాజయః" అరణ్య. 16-23

కమును, గంధవంతమును, పుష్పఫలప్రదమును అగు వసంతర్తువు వచ్చినది." అని లక్ష్మణునితో చెప్పును.[5]

మేఘములు జలములను వర్షించునట్లు పుష్పములను వర్షించుచున్న యీ వనములు సుందరములు (కిష్కింధా. 1-11) స్పర్శసుఖమై - చందన శీతలమైన యీ వాయువు మందముగ వీచుచు శ్రమను పోగొట్టుచున్నది (కిష్కింధా. 1-1. 7) నానావిధ పక్షులు మధురముగా కూయుచున్నవి (కిష్కింధా 1-22). కోకిల నన్ను జూచి విజయగర్వమున కూతలు వేయుచు ఎగతాళి చేయుచున్నది (కిష్కింధా 1-23). నీరుకోడి యొక్క ధ్వనిని విని నా ప్రియురాలు అప్పుడు సంతోషముతో న్నను బిలిచి నానావిధ క్రీడారసముచే పరమ సంతోషము నొందుచుండెడిది (కిష్కింధా 1-25), నీరుకోళ్ల ధ్వనులచేతను, మగకోయిలల ధ్వనుల చేతను ఈ వృక్షములు ధ్వనించునట్లు చూపట్టుచు నా కెంతయు మన్మథ దీపకములుగా నున్నవి. (కిష్కింధా. 1-28) ఈ వసంతర్తువే నన్ను దహింపగలదు. అశోక స్తబ్దకమే కొఱవి. తుమ్మెదల ధ్వనియే ఘంటధ్వని. చిగుళ్ళే ఎఱ్ఱని జ్వాలలు (కిష్కింధా. 1-29). మయూరములు స్ఫటికపు కిటికీలవలె నుండు రెక్కలు గాలికెగురగా వర్తనము చేయుచున్నవి (కిష్కింధా. 1-36). పర్వత సానువులందు నర్తించుచున్న మగమయూరము కడనున్న ఆడుమయూరముమన్మథ పీడితమయి నర్తనము చేయుచున్నది (కిష్కింధా. 1-38). తుమ్మెద, గాలికి కదలుచున్న యీ బొట్టుగు పూలగుత్తిని మాదకముతో చలించు ప్రియురాలిని వలె పొందుచున్నది (కిష్కింధా 1-57).

అశోక స్తబకములు నన్ను బెదిరించునట్లు చూచుచున్నవి (కిష్కింధా 1-58). పుష్పములచే నిండి యుండు చూత వృక్షములు, దేహమంతయు చందనము నలదుకొని విలాస గర్వితులయి యుండు కాముకుల కైవడి చూపట్టుచున్నవి (కిష్కింధా 1-59). కిన్నరులు గూడ ఈ పంపాతీరమున విహరించుచున్నారు. (కిష్కింధా 1-6). కమలములు బాలసూర్యునివలె ప్రకాశించుచున్నవి (కిష్కింధా 1-61). పంపా సరస్సు హంసకారండవములతో తుమ్మెదలతో కూడిన కమలములతో ప్రకాశించుచున్నది (కిష్కింధా 1-62, 63). పంపాసరస్సు చక్రవాకములతోడను, నీరు ద్రావుటకువచ్చిన కరిమృగములతోడను ప్రకాశించుచున్నది (కిష్కింధా 1-64). కర్ణికారము పుష్పించి సీతాదేవి దేహలతవలె నున్నది (కిష్కింధా 1-72). పలాశ వృక్షములు ఎఱ్ఱని పుష్పములు గలిగి జ్వాలలు గలవి వలె ప్రకాశించుచున్నవి (కిష్కింధా 1-74) పుష్పితములగు జాజులు, మల్లెలు, గన్నేరులు ప్రకాశించుచున్నవి (కిష్కింధా 1-75). పుష్పితములగు మొగిళులు, సిందువారములు, అడవి మొల్లలు, పువ్వులగురివెందలు

5. సుఖానిలోఽయంసౌమిత్రే కాలః ప్రచుర మన్మథః
గంధ వాంత్సురభి ర్మాసోజాత పుష్ప ఫలద్రుమః-కిష్కింధా 1-10.

ఎంతయు నొప్పియున్నవి (కిష్కింధా 1-76) పుష్పించిన కానుగు చెట్లు, ఇప్పచెట్లు, పొగడ చెట్లు, తినాసపు చెట్లు, సంపెంగ చెట్లు, బొట్టుగుచెట్లు, నాగమల్లెలు, కదంబ వృక్షములు, ఉలిమిరి చెట్లు, ఖర్జూరవృక్షములు, నీలాశోకములు, లొద్దుగులు, ఊడుగ చెట్లు, గొజ్జెగ చెట్లు, వేప, మామిడి, కలిగొట్టు, కోవిదార, నారంగ, అర్జున, గేదగి, విరిగి, శిరీష, శింశుపా, చంద్ర, బూరుగు, పలాశ, ఎఱ్ఱగోరింట, నేమి, నక్తమూల, చందన మొదలగు అనేక వృక్షములు ప్రకాశించుచున్నవి (కిష్కింధా 1-72 మొదలు 82 వఱకు).

పై విధముగ వృక్షాదుల వర్ణించిన యనంతరము వృక్షాగ్రమందలి లతలను వర్ణించినాడు.

రాముడీ వర్ణనా ఘట్టమున ప్రముఖ పాత్ర వహించినాడు. సీతను తలచుకొని తన విరహమును వర్ణించినాడు. ఈ ఘట్టము భావనాపూర్ణమయిన సహజ వర్ణనలతో నిండినది.

"ఈ ఆడు నెమలి కామాతిరేకమున తానే ప్రియుని పై కెగిరి రమించుచున్నది. తిర్యగ్జాతులందు గూడ ఎంత రాగము;"[6]

"గాలివలన వృక్షములు కదలుచున్నవి. ప్రియులెటు పోయిన నటే యనువర్తించు ఉత్తమస్త్రీలవలె ఆ వృక్షాలపై లతలు కొమ్మల కదలికలను అనుసరించి యవిగూడ నూగుచున్నవి!"[7]

వసంత సమయమున ఆ వాతావరణమునకు ముగ్ధుడయి పోయి విరహాతురుడై యున్న రాముడు "లక్ష్మణా! పతివ్రతయగు నా సీత నాకులభించి, మనమిచ్చటనే యుండగలిగినచో నేను అయోధ్యను మాత్రమేగాదు, దేవేంద్ర పదవిని గూడ ఆశింపను" అనుచున్నాడు.[8] అప్పటి వసంత శోభ అంత రమణీయమైనది.

ఇందు ముఖ్యముగా పద్మపుష్పాదులు, శుకపికాదులు, వృక్షాదులు, మలయ మారుతము, కామక్రీడలు వర్ణితములు. ఈ ఘట్టమందలి కవిత అమోఘ భావశబలితమై యున్నది.

---

6. "పశ్యలక్ష్మణ సంరాగం తిర్యగ్యోని గతేష్వపి
   యదేషాశిఖినీ కామాద్భర్తారం రమతేఽన్తికే" కిష్కింధా 1-41

7. "వాత విక్షిప్త విటపా న్యథాసన్నాన్ద్రుమానిమాన్
   లతా స్సమనువర్తన్తే మత్తాయివ వరస్త్రియః" కిష్కింధా 1-84

8. "యదిద్రశ్యేత సాసాధ్వీ యది చేహ వసేమహి
   స్పృహ యేయం నశక్రాయ నాయోధ్యాయై రఘూత్తమ"

   కిష్కింధా 1-95

## వర్షర్తు వర్ణన

రామాయణమున వర్షర్తువర్ణన అధికమైన ఉత్ప్రేక్షలతో కూడియున్నది. దాదాపు అరువది శ్లోకముల పర్యంతము సాగినది. ఇందు సహజ వర్ణనలును, భావాత్మక వర్ణనలును గలవు. భావాత్మక వర్ణనలే యెక్కువగ నున్నది.

మేఘములు, వర్షధారలు, చాతకములు, కొక్కెరలు, ఇంద్రగోపములు నెమిళ్లు తుమ్మెదలు, భేకధ్వనులు, పక్షులు, యువతులు ప్రియము నొందుటయు మొదలగునవి వర్ణితములు.

మేఘములను పర్వతములతోడను ఏనుగులతోడను పోల్చు సంప్రదాయము రామాయణమునుండియే మొదలయినదనవచ్చును.

"పర్వతాకారంబులగు మేఘములు ఆకాశమందంతయు వ్యాపించినవి. వర్షాకాలము వచ్చినది.[1] మెరుపులను ధ్వజములచే నలంకృతములయి గంభీరముగా మహాధ్వనితో మేఘములు గర్జించుటవలన, యుద్ధసన్నద్ధములగు మత్తగజముల వలె నున్నవి.[2]

కొన్ని సహజ వర్ణనలును, భావపూర్ణ వర్ణనలును:

"ఎండకు కాలి వర్షజలముచే తడుపబడిన భూమి శోకముచే తపింపజేయబడిన సీతవలె — బాష్పముల విడుచుచున్నది (భూమిపక్షమున ఆవిరి - సీత పక్షమున కన్నీరు)[3] మేఘజ్యోతి రమ్యముగా వర్ణింపబడినది. "నల్లని మేఘమందు చరించుచున్న మెఱుపు రావణుని తొడపైనుండి విడిపించుకొనుటకు పెనుగులాడుచున్న సీతవలె ఉన్నది"

(కిష్కింధా 28-12)

హంసలకిది సమయముగాదు. అందువలన నవి మానస సరోవరమునకు వెళ్ళినవి. చక్రవాకములు ప్రియా సంయోగమును పొందినవి (కిష్కింధా 28-16). మయూరములు నాట్యము చేయుచున్నవి (కిష్కింధా 28-18, 26). గర్భాధానార్థమై మేఘముల నపేక్షించు కొక్కెర పంక్తులు—ఆకాశమునందు వ్రేలాడుచు గాలికి కదలు తెల్లదామర పూల మాలిక వలె నొప్పియున్నవి (కిష్కింధా 28 - 23). కదంబ వృక్షముల ప్రకాశము వర్షాకాలమున హెచ్చుగానుండును (కిష్కింధా 28-26). వర్ష సమయమున వినిపించు నానాధ్వనులు సంగీతమువలె నున్నవి. తుమ్మెదల ఝుంకారమే మనోహర తంత్రీ

---

1. అయంసకాల స్సంప్రాప్త స్సమయో ఉద్యజలాగమః
సంపశ్యత్వం నభోమేఘై స్సంవృతం గిరిసన్నిభైః" కిష్కింధా 28-2

2. తటిత్పతాకాభి రలంకృతానా ముదీర్ణ గంభీర మహార్ణవానాం
విభాన్తి రూపాణి బలాహకానాం రణోద్యతానా మివవారణానాం" కిష్కింధా 28-31

3. "ఏషాఘర్మ పరిక్లిష్టా నవవారి పరిప్లుతా
సీతేవ శోక సంతప్తా మహీబాష్పం విముంచతి" కిష్కింధా 28-7

ధ్వనిగా - కప్పల ధ్వనులు తాళములుగా - మేఘ గర్జనయే మృదంగ నాదముగా అడవులయందు సంగీత సభ జరిగినట్లున్నది (కిష్కింధా 28-36).

వర్షాకాలమున మేఘాచ్ఛన్నమయిన ఆకాశమునుండి సూర్యుడు కనిపింపడు. సాయంకాలమెట్లు తెలిసికొనుట? కవిసమయము ద్వారా సూచించుచున్నాడు కవి. పక్షులు గూళ్ళలో చేరుట వలనను - కమలములు ముడుచుకొనుట వలనను - జాజిపువ్వు వికసించుట వలనను - సూర్యుడస్తమించెనని తెలియుచున్నది (కిష్కింధా 28-52). వర్షాకాలమున నేరేళ్ళు ఫలించును. బొగ్గుతునకలవలె నల్లనై రసపూర్ణములయిన ఫలములు నిండి యుండుట వలన నేరేడు చెట్ల శాఖలు తుమ్మెదలచే కప్పబడియున్నట్లు నల్లని ఫలములచే నిండియుండెను (కిష్కింధా 28-30). ఆర్ద్రపురుగులు (ఇంద్రగోపములు) వర్ష వర్ణనలో ప్రముఖముగా వర్ణింప దగినవి. ఆరుద్ర పురుగులతో నొప్పిన భూమాత ఎంత అందముగా నుండునో వర్ణితము. లేత పచ్చికతోనున్న భూమిపై అక్కడక్కడ ఆరుద్ర పురుగులు కనిపించుట లత్తుకతో చిత్రములు వ్రాసిన ఆకుపచ్చ కంబళి పుట్టము ధరించిన స్త్రీవలె కన్పట్టుచున్నది (కిష్కింధా. 28-24)

పై విధముగ వర్షర్తు వర్ణన రమణీయముగ చేయబడినది. వర్షర్తు వర్ణనలో ముఖ్యముగా ఇంద్రగోపములు, మేఘములు, మెఱుపులు, మయూరములు, చక్రవాకములు, కొక్కెరలు, కదంబవృక్షములు, కప్పలధ్వనులు, నేరేళ్ళును వర్ణితములు.

## శరదృతు వర్ణన

వసంతర్తువు తరువాత అంత శోభాయమాన మయినది శరదృతువు. కామోద్దీపనకు వసంతము వలెనే శరత్తును ముఖ్యమయినది. రామాయణమున ఈ శరత్తు దాదాపు అరువది శ్లోకములలో వర్ణింపబడినది. ఇదంతయు విరహోత్కంఠతో రాముడు వర్ణించినదియే; అందువలన దీనికి కథతో సమన్వయము గలదు.

ఇందు నీరసించిన ప్రవాహములు, బయలుపడిన యిసుకతిన్నెలు, నదీతీరము లందలి వనములు - పడాకుల అనటులు - హంసలు, సారసములు, చక్రవాకములు, క్రౌంచములు, నిర్మలాకాశము, చంద్రప్రకాశము. తెల్ల మేఘాలు, నడబావులు, తామరలు, కలువలు, జెల్లుపూలు, వేగిసపూలు, వరిపైర్లు, కాంచనములు, పంకెనలు, [illegible]కణములు మొగలగునవి వర్ణితములు.

కొన్ని భావ పూర్ణ మనోహర వర్ణనలు పరికించునది.

"వర్షాకాలమున మేఘములకును, మెరుపులకును ప్రాచుర్యమెక్కువ. శరత్తు

దానికి భిన్నము. బెగ్గురు పక్షులు ఆకాశమున ఎగురుచుండుట అధికము. అట్టి ఆకాశమును జూచి రాముడు ఆర్తస్వరమున విలపించినాడు"[1]

విరహులకు శరశ్చంద్రుడు బాధాకారిగదా;

"నిర్మలమయిన ఆకాశమును, స్వచ్ఛమయిన చంద్రమండలమును, చంద్రికా రమణీయమయిన శరద్రాత్రిని చూచి - సీత లేకుండుటయు, సుగ్రీవుడు కామ క్రీడలలో మునిగి యుండుటయు భావించి, సంకేతకాలము అతిక్రమించుటయు చూచి దుఃఖితుడై రాముడు మూర్ఛనొందెను."[2]

ఏడాకుల అరటికి శరత్తున ప్రాశస్త్య మెక్కువ,

"ఏడాకుల అరటి పూల సుగంధము గలిగి, తుమ్మెదల మనోహరనాదముతో గూడి, వనములందు వాయువులు వీచుటచే మదపుటేనుగులకు మఱియు మదమధికమగుచున్నది." (కిష్కింధా 30-31)

"పర్వత సానువులందు వేగిసచెట్లును, ఏడాకులనటులును, కాంచనములును, ప్రేంకణములును చక్కగా పుష్పించినవి" (కిష్కింధా 30-60).

శరత్కాలములో నెమిళ్ళకు గర్వము పోయినట్లు వర్ణించు సంప్రదాయమును పరికించునది. "మేఘములు తగ్గినవి. నెమళ్ళు పింఛము విప్పుట వదలి ప్రియురాండ్రతో గూడక, కాంతిహీనములై, కూతలు వదిలి, ధ్యానము చేయుచున్నవా అన్నట్లున్నవి."[3]

"నెమిళ్లు తమ ఉత్తమాభరణములగు పింఛములు లేక నదీతీరములకు పోగా, శరత్కాల గర్వితములగు హంసలు ఆ నెమిళ్లు బెదురునట్లు కూయగా అవి గర్వముడిగి దీనములై పోవుచున్నవి." (కిష్కింధా 30-41)

ఏనుగుల ప్రేమాధిక్యమును శరత్తులో వర్ణించుట పరిపాటి.

"వనములలో ఆడు ఏనుగులు ప్రియుని యందలి అనురాగముతో మదించి నడచుచున్న మగయేనుగును పరివేష్టించి పోవుచున్నవి." (కిష్కింధా 30-40)

శరన్నదుల వర్ణన చాలా అందముగ వర్ణింపబడినది. ఈ క్రింది వర్ణన మనోజ్ఞము:

---

1. "దృష్ట్వాచ విమలంవ్యోమ గతవిద్యుద్వలాహకం
   సారసారవ సంఘుష్టం విలలాపార్తయాగిరా" —కిష్కింధా 30-6
2. పాండురం గగనం దృష్ట్వా విమలం చంద్రమండలం
   శారదీం రజనీం చైవ దృష్ట్వా జ్యోత్స్నానులేపనాం
   కామవృత్తంచ సుగ్రీవం నష్టాంచ జనకాత్మజాం
   బుధ్వాకాలమతీతంచ ముమోహ పరమాతురః —కిష్కింధా 30-2, 3
3. నభస్సమీక్ష్యాంబుధరైర్విముక్తం విముక్తబర్హాభరణావనేషు
   ప్రియాస్వసక్తా వినివృత్తశోభా గతోత్సవా ధ్యానపరా మయూరాః
   —కిష్కింధా 30-34

"మీనములు మేఖలగా గల నదులు రాత్రియంతయు ప్రియులతో నుపభోగించి అలసి యున్న కామినులు ప్రాతఃకాలమున మెల్లగా నడుచునట్లుగా నడిచిపోవుచున్నవి."[4] "ప్రథమ సంగమమందు యువతులు సిగ్గు భారముచేత నిదానముగ, బలవంతముగ, తప్పని సరియై, తమ జఘనముల వెలిపఱచునట్లు శరదృతువునందు నదులు మెల్లమెల్లగా నిసుక దిన్నెల బయలు పఱచుచున్నవి."[5] పై ది మనోహరమైన రసవద్వర్ణన. శరత్కాలమున కొన్ని కొన్నిటికి ప్రాబల్యము తగ్గినట్లు వర్ణింపబడినది. వానికి వర్షర్తువున ప్రాబల్యా ముండెడిది.

"ఏనుగుల యొక్కయు, మేఘముల యొక్కయు, మయూరముల యొక్కయు, సెలయేళ్ల యొక్కయు ధ్వనులు ఆగినవి"[6] అటులనే నదీ ప్రవాహధ్వనులును, సెలయేళ్ల ధ్వనులును, పెఱగాడ్పుల ధ్వనులను, మయూరముల కేకలును, కప్పల అరుపులును తగ్గినట్లు వర్ణితము.[7]

శరత్సంధ్యను (శారదాకాశమును) రామాయణమున వర్ణించిన యంత యందముగా మఱేకావ్యమందును, ఏ కవియును వర్ణింపలేదనవచ్చును. సర్వవర్ణనలు ఒక యెత్తు, శారదాకాశ వర్ణన ఒక యెత్తు.

> చంచచ్చంద్ర కరస్పర్శ హర్షోన్మీలిత తారకా
> అహో రాగవతీ సంధ్యా జహాతి స్వయమంబరం"
>
> (కిష్కింధా 30-40)

పై శ్లోకమున అమోఘమైన శ్లేషగలదు. నాయకుని కరస్పర్శచేత హర్షపులకిత గాత్రయైన నాయికకు కనులు ఆనందముతో మెఱసినవి. సురతార్థము తనకు తానే అంబరమును వదలివేసినది. అని రెండవ యర్థము. అమోఘమైన యర్థము.

పై విధముగ రామాయణమున ఋతువర్ణనలు సాగినవి. ఒక్క హేమంతవర్ణన మాత్రము లక్ష్మణునిచే చేయబడినది. అది మాత్రము వర్ణన వర్ణనకొఱకే అన్నట్లున్నది. మిగిలిన వసంత వర్షా శరత్తులు రాముఁడు విరహమున వర్ణించుటబట్టి భావాత్మకములై కథాగతిలో భాగమైపోయినవి.

---

4. మీనోపసందర్శిత మేఖలానాం నదీవధూనాం గతయోఽద్యమందాః
   కాంతోపభుక్తాలసగామినీనాం ప్రభాత కాలేష్వివ కామినీనాం" —కిష్కింధా 30-35
5. దర్శయన్తి శరన్నద్యః పులినాని శనైశ్శనైః
   నవసంగమ సంవ్రీడా జఘనానీవ యోషితః" —కిష్కింధా 30-28
6. ఘనానాం వారణానాంచ మయూరాణాంచ లక్ష్మణ
   నాదఃప్రస్రవణానాంచ ప్రశాంత స్సహసాఽనఘ" —కిష్కింధా 30-26
7. నదీఘన ప్రస్రవణోదకానా మతిప్రవృద్ధానిల బర్హిణానాం
   ప్లవంగ మానాంచ గతోత్సవానాం ద్రుతం రవాస్సంప్రతి సంప్రణష్టాః
   —కిష్కింధా 30-44

రామాయణమున ఋతువర్ణన మనోహరముగ సాగినది. అతి సహజత్వమును సంతరించుకొన్నది. ప్రతి ఋతువునందుగల సహజ ప్రకృతి కళాత్మకముగ వర్ణింప బడినది. ఏయే ఋతువులందేయే పుష్పములకు,ఏయే వృక్షలతాదులకు, ఏయే జంతువులకు, ఏయే క్రిమికీటకాదులకు వృద్ధి క్షీణాదులుండునో అవన్నియు పూర్ణముగ వర్ణింపబడినవి. ఆ సహజ ప్రకృతి ఆలంబనముగ, ఉద్దీపన విభావములు అతివేలములుగ వర్ణింపబడినవి. వాల్మీకి యందలి ఋతువర్ణనలే తర్వాతి కవులకు అనుసరణీయములైనవి. లాక్షణికులకు లక్ష్యములైనవి. అష్టాదశవర్ణనా నియమములు చోటు చేసికొన్నవి.

## 4 : 1 : 5 చంద్రవర్ణన

చంద్ర వర్ణన వేదములందును గలదు. అచ్చట దైవాంశ గల ప్రకృతి శక్తిగా వర్ణింపబడినది.రామాయణమున చంద్రవర్ణన దాదాపు అట్టి భావముతోనే చేయబడినను, శృంగార భావమును సంతరించుకొన్నది. ఇందు చంద్రవర్ణన అతివేల మనోహరమైనది. ఆహ్లాదసంభరితమైనది. మనోజ్ఞమగు శైలిని సంతరించుకొన్నది.

చంద్రుని చూచి ఉద్దీపనము పొందుట మొట్టమొదటగా రామాయణమునందే కన్పించుచున్నది. ఆ తర్వాతి కావ్యములలో చంద్రోపాలంభన కిది దారి తీసినది.

## 4 : 1 : 6 ప్రకృతి వర్ణనలు - మానవీకరణము

సంకల్ప వికల్పములును, భూతదయయును, రాగ ద్వేషములును, గలిగియుండుట మానవ లక్షణము.ఈ గుణములనే మానవుడు స్థావరజంగమములలో చూడ ప్రయత్నించుట ప్రకృతిలో మానవత్వమును చూడ ప్రయత్నించుట అగుచున్నది. దీనిని ప్రకృతి మానవీకరణ యనిగాని, ప్రకృతి యందు మానవతారోపణ యని గాని యనవచ్చును.

వేదములనుండియే మనకీ మానవీకరణ కనబడుచున్నది. రామాయణ కావ్యమున ఇది అత్యంత సుందరముగ, మానవత్వాభిన్నముగ కనబడుచున్నది. ఈ కావ్యమున ప్రకృతి మానవీకరణ పొందిన ఘట్టములు విశేషములు.

భయపడిపోయిన సీత జడ రూపప్రకృతియైన ప్రస్రవణ పర్వతముతోడను, గోదావరితోడను మొఱపెట్టుకొనుచున్నది:

"మాల్యవంతం శిఖరిణం వందే ప్రస్రవణంగిరిం
క్షిప్రం రామాయ శంసత్వం సీతాంహరతి రావణః" -అరణ్య 49-31
"హంసకారండవా కీర్ణాం వందే గోదావరీ నదీమ్" -అరణ్య 49-32

ప్రకృతి ద్రవీభూత మనస్కయై సానుభూతితో సీత కభయమిచ్చినట్లు వర్ణితము- "గాలివలన కదిలిన వృక్షములు మధురమైన పక్షి ధ్వనులతో, శాఖాగ్రములు అను చేతులతో, భయపడవద్దని చెప్పినట్లున్నది" -అరణ్య 52-36

"కొలకులు కాంతిహీనములయి కమలములు అను ముఖములతోడను, భయపడిన మీనములు అను నేత్రములతోడను, ఒప్పుచు ఆపన్నయగు చెలిని చూచి దుఃఖపడినట్లున్నది." -అరణ్య 52-37.

అంతకంటె నింకొక మనోహరమైన మానవీకరణ:

"జలప్రపాతాస్రముఖాః శృంగైరుచ్ఛ్రిత బాహవః
సీతాయాం హ్రియమాణాయాం విక్రోశన్తీవ పర్వతాః" -అరణ్య 52-39

పర్వతములే ద్రవీభవించి యేడ్చినవని వర్ణించుట అతివేలమును అమోఘమును. జింక పిల్లలు కన్నీరు గార నేడ్చిన మాట (అరణ్య. 52-42) మానవీకరణకు మరియొక మనోహరోదాహరణము.

అంతేగాక, ప్రకృతియే తగుసూచన లిచ్చుట గూడ రామాయణమందు కన్పట్టుచున్నది. రాముడు సీతకొఱకు బాధపడుచు వెదకునపుడు మృగములు లేచి దక్షిణ దిక్కును చూచి ఆ మార్గాన పరుగెత్తినట్లు (అరణ్య. 64-17) వర్ణింపబడినది. ఈ పద్ధతి వర్ణనలు తర్వాతి సాహిత్యమందు మనకు విశేషముగా కన్పించును. ప్రవరుడు వరూథినిని త్రోసిరాజనిపోయిన ఘట్టమందలి ప్రకృతి సానుభూతికి ప్రబలోదాహరణము:

"తరుణి ననన్య కాంత నతి దారుణపుష్ప శిలీముఖవ్యథా
భర వివశాంగి నంగభవు బారికి నగ్గము సేసి క్రూరుడై
యరిగె మహీసురాధముడహంకృతితో నని రోషభీషణ
స్ఫురణ వహించెనో యన నభోమణి దాల్చె రక్త దీధితిన్"- మను. 3-10

## 4 : 1 : 7 రామాయణము - అష్టాదశవర్ణనలు

దండి కావ్యాదర్శము ననుసరించి 1. నగరము 2. అర్ణవము 3. శైలము 4. ఋతు 5. చంద్రోదయము 6. సూర్యోదయము 7. ఉద్యానము 8. సలిలక్రీడ 9. మధుపానము 10. రతి 11. విప్రలంభము 12. వివాహము 13. కుమారోదయము 14. మంత్రాలోచనము 15. దూత్యము. 16. ప్రయాణము (రణ) 17. యుద్ధము 18. నాయకాభ్యుదయము.

పై వర్ణనలు రామాయణమందు గలవేమో విచారించి అష్టాదశవర్ణనల కదే మూలమేమో విచారింపవలసి యున్నది.

రామాయణమున నగర వర్ణన గలదు. అయోధ్యానగర వర్ణన- అంతకంటె కిష్కింధా నగరవర్ణన- అంతకంటె మించి లంకాపుర వర్ణన - గలవు.

సముద్రవర్ణన గలదు. సముద్రమునకు వారధిగట్టియేగదా రామాదులు లంక చేరినది; సముద్రమున నేమేమి గలవో అన్నియు వర్ణితములు. ఈ వర్ణన కిష్కింధా కాండ 64 వ సర్గలో గలదు.

శైలవర్ణన గలదు. గంధమాదన, వింధ్య, ఋశ్యమూక, మలయాద్రి, ప్రస్రవణ పర్వతాదులును, చంద్ర ద్రోణ పర్వతములును, సర్వదిశల గల పర్వతములును, వర్ణితములు. శైలములందేవేవి గలవో అన్నియును వర్ణితములు.

రామాయణమున ఋతువర్ణన గలదు. వసంత[1] హేమంత[2] వర్ష[3] శరత్తులు[4] అధికముగ వర్ణింపబడినవి. ఋతువులలో నేమేమి సహజముగ వర్ణింపబడవలయునో అన్నియును గలవు.

చంద్రోదయ వర్ణన గలదు. సుందరకాండమందును, మరికొన్ని సమయము లందును చంద్ర చంద్రికా వర్ణనలు అత్యద్భుతములు.

సూర్యోదయ వర్ణనలు గలవు. ప్రాసంగికముగ పేర్కొనబడినదేగాని సూర్యోదయము 'వర్ణన'గా లేదు.

వనవర్ణన అధికముగ నున్నది. వనములలోనుండు పుష్ప, ఫలాదులేగాక, అందుండు పక్షులను, జంతువులను వర్ణించుట జరిగినది. ఉద్యానవన వర్ణన గూడ గలదు. సీతారామాదుల స్నానప్రశంస గలదుగాని ప్రత్యేకముగ సలిలక్రీడ కానరాదు. మధు

1. వసంతర్తువు - కిష్కింధాకాండ 1 వ సర్గ
2. హేమంతర్తువు - అరణ్యకాండ 16 వ సర్గ
3. వర్షర్తువు - కిష్కింధా-28 వ సర్గ
4. శరదృతువు - కిష్కింధా - 30 వ సర్గ.

పానము వర్ణింపబడినది. వానరులు సీతజాడ తెలిసిన మరుక్షణము ఆనందముచే మత్తెక్కిన వారై మధువనమునందు మధువు త్రాగి నానా బీభత్సము చేయుదురు. విప్రలంభము వర్ణితము- రాముని విరహమును, సీతావిరహమును వర్ణితములు.

రామాయణమున వివాహ వర్ణనలు గలవు: రామాదుల వివాహములు వర్ణింపబడినవి.

కుమారోదయము వర్ణింపబడినది: రామాదుల జననములు వర్ణితములు.

మంత్రాలోచనము వర్ణితము: రామసుగ్రీవుల సమాలోచనములును, రావణ కుంభకర్ణాదుల మంత్రాలోచనలును వర్ణితములు.

దూత్యము గూడ రామాయణమున వర్ణితము. అంగద దూత్యము ఉదాహరణము.

రణ ప్రయాణము:- రాముడు వానరులతో బయలుదేరుట వర్ణితము.

రామరావణాదుల యుద్ధము వర్ణితము.

రామజయమును, నాయకాభ్యుదయమును వర్ణితములు.

దండి తన అష్టాదశ వర్ణన నియమమును రామాయణమును చూచియే చెప్పినట్లు చెప్పవచ్చును. ఎందుకు ? తర్వాతివైన భారతాది పురాణ కావ్యములన్నియు రామాయణములో వర్ణించినట్లుగ ప్రకృతి వర్ణనాదులు కావించినారుగాన.

పై చెప్పిన అష్టాదశ వర్ణనలే గాక మరి పదకొండు వర్ణనలు అధికముగనుండవలెనని విశ్వనాథ కవిరాజు తన సాహిత్యదర్పణమందు చెప్పినాడు.

అతడు అధికముగ చెప్పిన 1. సంధ్యా, 2. రజనీ, 3. ప్రదోష, 4. ధ్వాన్త, 5. వాసర, 6. ప్రాతః, 7. మధ్యాహ్న, 8. ముని, 9. స్వర్గ, 10. పుర, 11. అధ్వర— అనునవి గూడ రామాయణ వర్ణనలలో గలవు.

విద్యానాథుడును - విద్యానాథ విశ్వనాథ కవిరాజులకు ముందటి వాడగు భోజుడును (10 శతాబ్దము) దాదాపు ఈ అధిక వర్ణనల పేర్కొని యున్నారు. 16వ శతాబ్ది వాడగు కేశవ మిశ్రుడు మరికొన్ని అధికముగ పేర్కొన్నాడు. అష్టాదశ వర్ణనలు గాక అధికముగా వీరందరును పేర్కొన్న వర్ణనలు రామాయణమందుగలవని వివరింపబడుచున్నవి.

1. ఆశ్రమ - చాల ఆశ్రమముల వర్ణనలు గలవు.

2. దివ - చాలచోట్ల వర్ణింపబడినది (ప్రాసంగికముగ పేర్కొనుట జరిగినది)

3. ప్రాతఃకాల - చాలచోట్ల వర్ణితము.

4. మధ్యాహ్న - పేర్కొనబడినది.
5. సాయంసంధ్య - చాలచోట్ల వర్ణింపబడినది.
6. రాత్రి - పేర్కొనబడినది.
7. స్వర్గ - పేర్కొనబడినది.
8. అధ్వర - చాలచోట్ల వర్ణింపబడినది.
9. రాష్ట్ర - కోసల, లంక మొదలగునవి వర్ణితములు.
10. గ్రామ - పేర్కొనబడినది.
11. రాజకన్య - సీతాదుల వర్ణన.
12. రాజస్త్రీ - కౌసల్యాదుల వర్ణన.
13. మృగయ - రాముడు జింకల వేటాడుట.
14. ధాతు - చాలచోట్ల పర్వత వర్ణనలలో వర్ణింపబడినది.
15. అభిసారిక - ఉపమానముగా పేర్కొనబడినది. లంకలో వర్ణింపబడెను.
16. వృతు - ఎన్ని చోట్లనో వర్ణితములు.
17. సరిత్తు-గంగా గోదావర్యాదులు వర్ణితములు.
18. సరస్సు-పంపా పంచాప్సరోవరములు వర్ణితములు.
19. హస్తి } - యుద్ధసమయములలో లేవుగాని, పురవర్ణన మందును ప్రయాణ
20. వాజి } వర్ణనలందును గలవు.

పై నున్న యిరువదింటిలో చాలభాగము అష్టాదశవర్ణనలలో స్థూలముగ అంతర్లీనమగునవే. రాష్ట్ర,గ్రామ, హస్తి, వాజి, వృక్ష, అభిసారికలు పురవర్ణనమందును - రాజకన్యా, రాజస్త్రీలను వివాహమందును, ధాతు వర్ణనను పర్వత వర్ణనమందును, సరిత్సరస్సుల పురవన వర్ణనల యందును, ప్రాతర్మధ్యాహ్న దినములను సూర్యోదయాది వర్ణనమందును అంతర్లీనము కావింపవచ్చును. అసలివియన్నియు నందుండి పృథక్కరింపబడినవే గదా!

ఇవిగాక స్వతంత్ర ప్రతిపత్తిగల వర్ణనలు 1. ఆశ్రమ 2. అధ్వర 3.స్వర్గ 4.మృగయ

అష్టాదశ వర్ణనా నియమముగాని,ఆ వర్ణనలు పృథక్కరించి అసంఖ్యాక వర్ణనలుండవలెనని చెప్పిన నియమముగానీ రామాయణము ననుసరించియే జరిగినవని చెప్పవచ్చును,

రామాయణ మన్ని విధములగు సహజమైన, భావాత్మకమైన, వర్ణనాత్మకమైన, కళాత్మకమైన, అలంకారపూర్ణమైన వర్ణనలకు ఆలవాలము.

## 4:2 కాళిదాసు - ప్రకృతి వర్ణనలు

వాల్మీకి వ్యాసుల యనంతరము మహాకవిగా పేర్కొనదగినవాడు కాళిదాసు. వాల్మీకి తరువాత ప్రకృతి వర్ణనలను అధికముగ జేసినవాడు ఇతడు. ఇతనియొక్క సర్వ కావ్యములందును ప్రకృతి సజీవముగ ప్రతిబింబించు చుండును. ఇతని ఉపమా ఉత్ప్రేక్షాద్యలంకార ప్రయోగములందంతటను ప్రకృతి సాహచర్యము కనిపించుచుండును. ప్రకృతి వర్ణన పరముగ నితని రచన లన్నియును ప్రధానములు.

### 4:2:1 కుమారసంభవము.

కాళిదాసు కుమార సంభవమున ప్రకృతి వర్ణనలు అధికము. ఈ కావ్యపాత్రలలో అద్యుడును, పర్వతరాజును అయిన హిమవంతుడు కేవలము ప్రకృతి. ఇతడొకపర్వతము. అప్రాణి అయినను దీనికి దేవత్వమిచ్చి అతిమానుష రూపునిగ కాళిదాసు వర్ణించినాడు. హిమద్వవర నతోడనే కావ్యమారంభమగుచున్నది. (కుమార 1-1,2).

ఈ విధముగా ఒక పర్వత వర్ణన (హిమవంతుని)తో కావ్యారంభము కావించినాడు. ఇది వస్తు నిర్దేశము. తర్వాతివాడైన దండ్యాచార్యుడు పేర్కొనిన—

"సర్గబందో మహా కావ్యముచ్యతే తస్యలక్షణమ్

ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశో వాపితన్ముఖమ్" అన్న లక్షణమునకు దీనిని లక్ష్యముగా సమన్వయింపవచ్చును.

ఇందు ప్రకృతి వర్ణనలు విశేషముగ నున్నవి. అన్ని ఋతువులును వర్ణింపబడినవి. ధాధాపుగ నన్ని అష్టాదశ వర్ణన లున్నవి.

### ఋతువర్ణన

ఈ కావ్యమున వసంతర్తువును తచ్ఛోభయును, రమ్యముగా వర్ణితములు. దోహదము లేకయే మ్రాకులు పుష్పించినట్లు వర్ణించినాడు కాళిదాసు. వసంతర్తు వర్ణనలో దోహదక్రియా సంప్రదాయమిందు గోచరించుచున్నది. (కుమార 3-26)

పార్వతిని వర్ణించిన ఘట్టమంతయు గూడ ప్రకృతి వర్ణనయే. స్త్రీల అవయవము లను ప్రకృతి వస్తువులతో పోల్చుట సాధారణముగ సాగుచున్న విషయమే. పార్వతి వర్ణన అతి ప్రాకృతికముగ నున్నది. ప్రకృతి వస్తువులనే ఆమె ఆభరణములుగ (నగల స్థానమున) ధరించి ప్రకృతికన్యవలె మన్మథుని కంటబడినట్లు చేసిన వర్ణన అద్భుతము (కుమార. 3-13).

మన్మథుని భస్మము చేయుట చూచిన పార్వతి తన అందమును నిందించుకొని (బాహ్య సౌందర్యముచే శివసాక్షాత్కారము పొసగ లేదుగాన) అంత స్సౌందర్యముచే శివుని గెలువబూని ఘోరమగు తపస్సునకు కడంగినది. ఈ సందర్భమున ఋతు వర్ణన ద్వారా ప్రకృతి వర్ణన అమోఘముగ గావింపబడినది (కుమార, 5-20 మొదలు 28 వఱకు). ఈ ఘట్టమున అన్ని ఋతువుల వర్ణన ఒకేపరి వరుసగా నున్నను అది సహజత్వమును గలిగియే యున్నది. పార్వతి తపస్సు యొక్క కఠోరతను, క్రమ వికాసమును, చాటుచున్నది.

### 4:2:2 రఘు వంశము

ఒక వంశమును గూర్చిన చరిత్రమయ్యు, రఘువంశము మనోజ్ఞ కావ్యము. ఇట్టి సుదీర్ఘ వంశచరిత్రమయ్యు దీనియందు ప్రకృతి వర్ణనలు చోటు చేసికొన్న వన్నచో కాళిదాసు ప్రకృతి కవి అనుటకు వేరొక యుదాహరణ అనవసరము.

ఇందుమతీమరణ ఘట్టములో అజమహారాజు విలాపమునందు కాళిదాసు కావించిన ప్రకృతి మానవీకరణ అద్భుతము. రామాయణములో సీతాపహరణ ఘట్ట మందు చూచిన ప్రకృతి మానవీకరణను మరల నిక్కడ చూడగలము. ఉదాహరణకు:

"ఉభయోరపి పార్శ్వవర్తినాం తుములేనార్త రవేణ వేజితాః
విహగాః కమలాకరాలయాః సమదుఃఖా ఇవ తత్రచుక్రుశుః"

రఘు. 8-39

"ఇక నీ మాటలు వినవలెనన్న కోకిల కంఠముల ద్వారానే.నీ నడకను చూడవలె నన్న కేవలము హంస గమనములోనే,చూపులను చూడవలెనన్న లేడి చూపులతోనే, నీ

యొయ్యారమును గాంచవలెనన్న మందమారుతపు సంచారమున నూగులతల లోనే అని దుఃఖించును; (రఘు.8-59), ఇది లోక సహజముగ నున్న అవస్థ. చని పోయిన వారి గుఱించి యిట్లేగదా లోకులు వలవింతురు! అస్వాభావిక ధోరణిని అలంకారికముగ ఎంతయో బాగుగ చెప్పినాడు కాళిదాసు!

కాళిదాసు నిశితమైన ప్రకృతి పరిశీలన గలవాడు. అజుని దుఃఖము ఎంత గొప్పదో చెప్పుచున్నాడు. ఆ దుఃఖము శంకువువలె హృదయమును భేదించినది. ఎట్లు? సౌధతలమునకు కలుగు చీలికలో రావిచెట్టు మొలిచి అంతకంతకు పెద్దదై భవనము నే చీల్చి పారవేయునట్లు ఆ దుఃఖము హృదయమును చీల్చివేసినది." (రఘు 8-93)

ఇది ప్రకృతిలో మనకు ప్రతి దినమును కనిపించు సహజ దృశ్యమే! కాని నిశిత పరిశీలన గలవానికేగాని అన్యునకది స్ఫురింపదుగూడ.

కాళిదాసు ప్రకృతి వర్ణనల గూర్చి ఉదాహరణ లిచ్చుచు పోవుచో నెన్ని వందల పుటలైనను చాలవు. కాళిదాసు ఏకైక ప్రకృతి కవి అన్నచో నావంతయు నతిశ యోక్తి యుండదు.

### 4:2:3 మేఘ సందేశము

ఇది కేవలము ప్రకృతి కావ్యము. యక్షుడు మేఘమును బతిమాలి తన ప్రియు రాలికి సందేశమును పంపును. మేఘము పయనించు దారిలోనున్న పర్వతములును, నదులును, వనములును, ప్రాసంగికముగ వర్ణితములు.

ఈ కావ్యమున నాయకుడు యక్షుడు. నాయిక పరోక్షమున నున్న యక్షిణి, వీరిరువురికిని సంబంధించిన విప్రలంభ శృంగారమిందు వర్ణితము.

ప్రకృతి వస్తువైన మేఘము ఇందు ప్రాధాన్యమును వహించుచున్నది. యక్షుని వలె నది సజీవ వ్యక్తివలె భాసించుచున్నది. ఈ కావ్యము పూర్ణముగ ప్రకృతి మానవీ కరణకు ప్రబలోదాహరణము.

ఇది కేవలము ఊహపై నడిచిన కావ్యము. దండితుడును, కాముకుడును, అయిన యక్షుడు విచక్షణను పోగొట్టుకొన్నవాడై మేఘమును అప్రాణిగా భావించక, ప్రాణ సహితవ్యక్తిగా భావించి మాట్లాడుచున్నాడు. మేఘము కనిపించగనే చాతకపక్షులు కనిపించును. చల్లగాలి దానిని వెన్నాడుచుండును, కొక్కెర పక్షులు దానిని సేవించి

యెగురుచుండును. ప్రకృతి సహజ దృశ్యమును శుభశకునముగా యక్షుడు భావించినట్లు కాళిదాసు వర్ణించినాడు.

"ఓ మేఘుడా, నీ కనుకూలముగా గాలి వీచుచున్నది. చాతక పక్షి మధురముగా పలుకుచున్నది. కొక్కెర పక్షులు నిన్ను సేవించుచున్నవి."
అనుచున్నాడు. ఆకాశాన మేఘములున్నపుడు గర్భాధానార్థమై తత్సుఖమును బలాకములు పొందునను ప్రకృతి సూత్రము. అట్టి సుఖాకాంక్షయే ప్రవాసమందున్న యక్షుడు కోరుచున్నట్లు ధ్వని. మంచి శకునముగూడ.[2] ఇట్టి వర్ణన రామాయణ మందుగలదు.

అలకాపురిలో సర్వర్తువులును ఒకేపరి ప్రవర్తిల్లినట్లు కవి వర్ణించుచున్నాడు. ఆపుర స్త్రీలు ఎల్లపుడును చేతిలో పద్మములను ధరింతురు.. ఇది శరత్తు ధర్మము, మొల్లలను ముంగురులందు ధరింతురు. ఇది హేమంత ధర్మము. లొద్దుగ పరాగమును ముఖమున నద్దుకొందురు. ఇది శిశిరర్తు ధర్మము. గోరింటపూలను సిగలందు ధరింతురు. ఇది వసంతర్తు ధర్మము. దిరిసెనపూవును చెవులందు ధరింతురు. ఇది గ్రీష్మధర్మము. కడిమిపూలను పాపట ధరింతురు. ఇది వర్షర్తుధర్మము. ఈ కారణమున అలక స్వరర్తు శోభ గలిగిన పట్టణము.[3] భూలోక ఋతుధర్మములను కవి దేవ భూములకు వర్తింప జేసినాడు.

## 4:2:4 ఋతుసంహారము

ప్రత్యేకముగ ఋతువర్ణన కొఱకే కావ్యము వ్రాయుటకు ఇదియే మొదలు. ఋతువర్ణన కేవలము ప్రకృతి వరన. అందు ప్రకృతి ప్రతిబింబించినంత మఱెందును ప్రతిబింబింపదు.

---

1. మందమందంనుదతి పవన శ్చానుకూలో యథాత్వాం
నామశ్చాయం నదతి మధురం చాతకస్తే నగన్ధ:
గర్భాధానక్షణ పరిచయాన్నూన మాబద్ధమాలాః
సేవిష్యన్తే నయన సుభగం ఖేభవన్తం బలకా:" మేఘ,1-9

2. "అనుకూలవాత చాతకరుత బలాకాదర్శనానాం శుభసూచకత్వం" శకునశాస్త్రం

3. హస్తే లీలా కమల మలకే బాలకుందానువిద్ధం
నీతాలోధ్ర ప్రసవరజసా పాండుతా మానన శ్రీః
చూడా పాశేనవ కురువకం చారుకర్ణే శిరీషం
సీమన్తేచ త్వదుపగమజం యత్ర నీపంవధూనాం,, మేఘ.2-2

ఋతుసంహారమున షడృతువుల వర్ణన యున్నది. గ్రీష్మవర్ష శరద్ధేమంత శిశిర వసంతములు క్రమముగ వర్ణింపబడియున్నవి. ఋతువులలో వసంతర్తువు మొదటిదని సంప్రదాయముండగా కాళిదాసు గ్రీష్మఋతువుతో వర్ణన ప్రారంభించినాడు. కాళిదాసునకు గ్రీష్మర్తువునందు ఇష్టమెక్కువగా బోలును. అభిజ్ఞాన శాకుంతలమునందు గూడ ప్రారంభమునందలి ఋతుగానమున గ్రీష్మర్తు ప్రశంస చేసినాడు (అభిజ్ఞాన 1-3). అభిజ్ఞాన శాకుంతలమందును, ఋతు సంహారమందును గ్రీష్మర్తు ధర్మమొకతీరుగనే చెప్పబడినది. పై రెండు కావ్యములవలెనే, మేఘసందేశము గూడ దాదాపు గ్రీష్మర్తువుతోడనే మొదలయినదని చెప్పవచ్చును. "ఆషాఢస్య ప్రథమదివసే..." అని మొదలుపెట్టబడినది. ఆషాఢమాసము గ్రీష్మర్తువే. (జ్యేష్ఠాషాఢ మాసములు గ్రీష్మర్తువు).

ఋతుసంహారము వంటి కేవల ఋతుకావ్యములు తర్వాతి కవులు చాలచేసినారు. అంధాధునికులు అధిక సంఖ్యలో నున్నారు. ఋతువర్ణన విషయమున కాళిదాసు వాల్మీకిని అనుసరింపగా తర్వాతివారందఱును కాళిదాసు ననుసరించినారు.

ఋతు సహజతను ప్రత్యేకముగ వర్ణింపవలెనను కుతూహలముచే కాళిదాసు ఋతుసంహారమును వ్రాసినను అందు రామాయణమున వర్ణించిన వానికంటె నెక్కువగ పొందుపరుప లేకపోయినాడు. వాల్మీకి వర్షర్తు వర్ణనలో వర్ణించిన మేఘాడంబరవర్షధార చాతక ఇంద్రగోప మయూర, భ్రమర భేక పఙ్క్త్యాదులును మన్మధక్రీడలును కాళిదాసు వర్షర్తు వర్ణన యందు గావించియున్నాడు. వాల్మీకి శరద్వర్ణనలో వర్ణించిన నీర సించిన ప్రవాహములు, నిర్జల మేఘములు, బయలు పడిన యిసుకతిన్నెలు,పడాకుల అనటులు, హంస సారసములు,చక్రవాక క్రౌంచములు, పద్మనీలోత్పలములు, కాంచన మంకెన ప్రేంకణాదులు దాదాపు కాళిదాసు శరద్వర్ణనలో గలవు. అటులనే వసంత హేమంతములలో వర్ణించిన ప్రకృతిని దాదాపు కాళిదాసు గూడ వర్ణించియున్నాడు.

ఋతుధర్మముల ప్రత్యేకించి వర్ణించుటకై కాళిదాసు ఋతుసంహారమును రచించినను అది రామాయణ మందలి ఋతువర్ణనల సాకల్యమును కలిగి యుండలేదనుట సత్యము. అంతరసవత్తరముగ గూడ లేదనిన నతిశయోక్తి గాదు.

కాలధర్మమును గూర్చి తెలిసికొనుటకు ఋతువర్ణనలు సహాయకారులు.

## 4:2:5 అభిజ్ఞాన శాకుంతలము

కాళిదాస రచిత నాటకములందత్యంత గణనీయమయినది శాకుంతలము. "కావ్యేషు నాటకం రమ్యం నాటకేషు శకుంతలా" అని ప్రాచ్య పాశ్చాత్య కవి విమర్శకులచే, నెహ్రూ

భాసనిపించుకొన్న కావ్యరాజము. గొథే వంటి జర్మన్ కవి విమర్శకుని ఆనంద రసమున ముంచి నాట్యమాడించిన రసవత్తర నాటకము. పూర్వకాలమునుండి నేటివఱకును రంగస్థలముపై ప్రయోగింపబడుచున్న దృశ్యకావ్యము.

ఇందుగల పాత్రలయందు మానవత్వము అత్యంత సహజరూపములో ప్రతిబింబించు చున్నది. దానితోపాటు ప్రకృతి గూడ మానవత్వమును సంతరించుకొన్నది.

ఇందుగల కణ్వాశ్రమ సంబంధ నిత్యజీవితమంతయును ప్రకృతి వర్ణనల కుదాహరణముగ తీసికొన వచ్చును. శకుంతల జింక పిల్లలకు మేత పెట్టుట, పూలచెట్లకు నీళ్లు పోయుట మొదలగుచోట్ల ప్రాకృతికమైన మానవ హృదయము బాహ్యప్రకృతితో అనుబంధమును పెంపొందించుకొనుటయును, బాహ్యప్రకృతి గూడ పారస్పరికమును ప్రదర్శించుటయును ప్రతిబింబించినది.

పూర్వ నాటకములన్నియు ఋతుగానము ఆదియందు గలిగి యున్నవి. కాళిదాసు గూడ శాకుంతలమందు గ్రీష్మర్తు గానమును ప్రస్తావనలో చేయించినాడు.(శాకుం. 1-3)

తరువాత గనసగు ఆశ్రమవర్ణన సహజ సుందరతను భజించినది. ఆశ్రమ మెట్టి వాతావరణమును కలిగియుండవలెనో యట్టి వాతావరణము వర్ణింపబడినది. "బోయల భయములేదుగాన విస్రంభముగా చిలుకలు నీవారధాన్యమును చెట్ల కోటరములలో నుంచుకొన్నవి. అవి అందుండి బయటకు జారి క్రిందపడుచున్నవి. తాపసులు గారకాయలను అపుడే కొట్టినందున రాళ్లపై జిడ్డు కనిపించుచున్నది. ఏ శబ్దమును గూడ లెక్కచేయక, బెదరక లేళ్లు విస్రంభముగా తిరుగుచున్నవి. స్నానముచేసి పోయిన వారి తడి బట్టల అంచులనుండి కారిన నీరు చాళ్లుగట్టి దారులందు కనిపించుచున్నది."

పై చెప్పబడిన ప్రకృతి వస్తువులు, అనగా, చిలుకలు, నివ్వరి. ఇందుగులు, విశ్వాసము-ఇవన్నియును ఆశ్రమపరిసర సూచకములు.

ఇంతకు ముందు వేట వర్ణనలో ఒక మహత్తర దృశ్యము వివరింపబడినది.

రథయానమును గుఱించిన వర్ణన అద్భుతమైనది. రథమెంతో వేగముతో పోవు చున్నదని నిరూపించుటకు ఈ వర్ణన గావింపబడినది. భూమిపై వేగముగా పోవుబండిలో పయనించునపుడు ముందువైపున గలట్టియు, పార్శ్వముల గలట్టియు వస్తువులు కొంత వేగముతో బండివైపుగా ముందుగా నడిచి అతిత్వరగా వెనుకబడిపోవు దృశ్యము లీనాడు రైళ్ళలో పోవువారందరును ఎరిగినవే. దుష్యంతుని రథము అతివేగముతో పరుగిడుచున్నది. ఆప్పటి ప్రకృతి దృశ్యమును వర్ణించుటచే రథవేగము వ్యంగ్యముగా సూచితము. దుష్యంతుడనుచున్నాడు:

"దూరమున చిన్నదిగా కనిపించిన వస్తువు క్షణములోనే పెద్దదిగా కనిపించుచున్నది. దూరాన వంకరగా కనిపించినది క్షణములో తిన్ననైనదిగా తోచుచున్నది. దూరాన

రెండుగా కనిపించినయది క్షణములో నొకటిగా కనిపించుచున్నది. నాప్రక్క కని పించిన యది క్షణములో దూరముగా వెనుకకు పరుగిడినట్లున్నది. దూరముగా కని పించిన వృక్షాదులు క్షణములో నా ప్రక్కకు పరుగిడినట్టుగా తోచు చున్నది."
(శాకుం 1-4)

ఇట్టిదే మరియొకచోట మరియొక వర్ణన యున్నది. అదియును రథవేగమునే చెప్పుచున్నది. కాని అది భూతలము పైని రథగమనముగాదు. ఆకాశము నుండి భూమి పైకి అవతరించుచున్న రథవేగము, మాతలి రథము నడుపుచున్నాడు. రథ మతివేగముగా దిగుచున్నది. ఇపుడు భూతలముపైనున్న గిరులు చిన్నవిగా కనిపించి క్షణములో పైకి పెరిగిపోవుచున్నట్లును,కొండలను పట్టియున్నట్లున్న భూమి అంతకంతకు క్రిందికి దిగిపోవు చున్నట్లును, ప్రకాండములు కనిపింపక, పైభాగాన ఆకు పఅవే కనిపించుచుండిన దృశ్యములు క్షణములో ప్రకాండ దర్శనము కలుగుటచేత అవి వృక్షములు గదా అన్న స్ఫురణ కలుగుచున్నట్లును, పైనుండి చూచినపుడు భూమిపై రేఖామాత్రములుగ కనబడి, అంతకంతకు వెడల్పుగానై, నీరుగూడ కనిపించి, క్షణములో పెద్ద నదులుగా, నదులు కనిపించుచున్నట్లును, ఉన్న ఈ దృశ్యమువలన నేను రథముతో క్రిందికి దిగు చున్నట్లు తోచుటలేదుగాని, భూమియే నాకడకు పైకెగిరి వచ్చుచున్నదా అన్నట్లున్నది" అని దుష్యంతుడు మాతలితో చెప్పిన ఈ దృశ్య వర్ణన అతివేల మనోహరము. (శాకుం. 7-8)

చంద్రుడు క్రుంకుటను, సూర్యుడుదయించుటను ఒకేపరి వర్ణించుట మనోహర మైనది. రమ్యమయినది.[1]

మానవుల జీవితములకు అట్టి స్థితిని అంటగట్టి దేవతలకే తప్పనపుడు మానవులొక లెక్కా అని చెప్పు మరియొక్క ఘట్టము గూడ నున్నది రఘువంశములో.[2]

ఈ విధముగ అంతరిక్ష ప్రకృతి యొక్క స్వాభావికతను-భూప్రకృతితో సమర్థించుట కాళిదాసుయొక్క ప్రత్యేకత.

1. "యాత్యేకతోఽస్త శిఖరం పతిరోషధీనా
మావిష్కృతోఽరుణ పురస్సర ఏకతోఽర్కః
తేజో ద్వయస్య యుగ పద్వ్యసనోదయాభ్యాం
లోకోనియమ్యత ఇవాత్మ దశాన్తరేషు" —శాకు 4-1

2. తావు భావపి పరస్పర స్థితౌ వర్ధమాన పరిహీన తేజసౌ
జనవశ్యతిస్మ తాదినాత్యయే పార్వణౌశశి దివా కరావివ" —రఘు, 9-82

## కాళిదాసు - ప్రకృతిమానవీకరణ

ప్రకృతిని మానవీకరణ పొందించుటలో రామాయణ కర్త తర్వాత కాళిదాసే యెన్నదగినవాడు. శకుంతలను అత్తగారింటికి పంపు ఘట్టమున ఈ ప్రకృతి మానవీకరణ కన్పట్టుచున్నది. శకుంతలకు పసుపు, కుంకుమ, బట్టలు, ఇత్యాదులు పెట్టవలెను గదా! ఆశ్రమములో నారచీరలు తప్ప మరేమియు నుండవుగద! పూలు కోయుటకు వనములోనికి వెళ్ళిన మునికుమారుల చేతికి చిగురుటాకులు అను చేతులలో వనదేవతలు చెట్లచేత ఇప్పించినవి. "ఒక చెట్టుచేత తెల్లని పట్టు చీరయును, మరియొక దానిచే లాక్షా రసమును, మరికొన్ని వృక్షములచే నగలను వనదేవతలు చిగురుటాకులవంటి హస్తములతో నిప్పించినవి." (శాకుం.4-4)

శకుంతల అత్తవారింటికి పోవుచున్నది గాన పుట్టింట గల ప్రకృతియే ప్రేమాదరములుట్టి పడగా పెండ్లి కూతును సాగనంపినది.వృక్షములు తమ ప్రేమను ఆ విధముగ చాటినవి.

"శకుంతలకు సెలవొసంగుమని లతలను కణ్వుడు సంబోధించుటయును కోకిలారవమునెపముచే వనవాసకాలపు బంధువులగు వృక్షములు సెలవొసంగుటయు నైన"ఈఘట్టమునను ప్రకృతి మానవీకరణ మారోపింపబడినది[1].

ప్రకృతి మానవీకరణ మరొక దృశ్యమున్నది. ప్రియంవద శకుంతలతో "నీకే గాదు వియోగ బాధ.ఈ తపోవనమునకే ఆ వియోగబాధ కలుగుచున్నది.ఈ లేళ్ళు తినుచున్న దర్భలను సగములోనే వదలి వేయుచున్నవి. ఆట నేర్చకొన్న నెమళ్లు నిన్ను చూచి ఆడుచు, నీవు వెళ్లిపోవుటను గమనించి ఆట మానినవి. పండుటాకులు రాల్చిన లతలు కన్నీరు కార్చుచున్నవివోలె కన్పట్టుచున్నవి" అని అనుచున్నవి.(శాకుం.4-11)

ఇట్టిదే రఘువంశమందును వర్ణించి యున్నాడు.లక్ష్మణుడు సీతను అడవిలో వదలి పెట్టినప్పటి దృశ్యము. "మయూరములు నృత్యమును మానినవి. వృక్షాదులు కుసుమాల వదలినవి. హరిణములు దర్భలను కొఱుకుచు ఆగిపోయినవి. సమదుఃఖ భావముచేత వనము గూడ దుఃఖించుచున్నది" (రఘు 4-59)

ప్రకృతి మానవీకరణకు మరియొక అమోఘమైన ఉదాహరణ.
జింకపిల్ల నూతికి దర్భకుచ్చుకొని పుండయినది. శకుంతల గారనూనె పూసి ఆపుండును మాన్పినది. పుండుగానున్న రోజులలో దానినోటికి గడ్డి అందియక (కుచ్చుకొనునేమో అను భయముచే)చామలను పిడికిళ్ళుపిడికిళ్ళగా దాని నోటిలోపోసి పెంచినది.ఇపుడా జింకపిల్ల(తల్లిని విడనాడలేని దానివలె)దారికడ్డమునిలిచినది."(శాకుం.4-13)

1. అనుమత గమనా శకున్తలా తరుభిరియం వనవాసబంధుభిః
పరభృత విరుతం కలం యథా ప్రతివచనీ కృతమేభిరీదృశం"-శాకు.4-9

తన యితరకావ్యములందు వలెనే కాళిదాసు శాకుంతలమందును (నాటకమైనను) ప్రకృతి వర్ణనలు ప్రకృష్టముగా చేసియున్నాడు. భూతలముపై రథవేగ రూపణమందును, ఆకాశమునుండి భూతలమువైపుగా దిగు రథవేగ నిరూపణమందును. ఇంకను మరి కొన్ని చోట్లను గల ప్రకృతి వర్ణనలు అద్భుతములయినవి. కాని ''తత్రాపి చతుర్థాఙ్క తత్రశ్లోక చతుష్టయం'' అని కీర్తివహించిన చతుర్థాంక మందలి ప్రకృతి మానవీకరణ అనుపమ్యమైన మేధా జనిత వర్ణన.

**చంద్రోపాలంభనము**

చంద్రోపాలంభనమును, మన్మథోపాలంభనమును మనకు మొట్టమొదటగా అభిజ్ఞానశాకుంతలమున దర్శనమిచ్చుచున్నవనవలెను.

ఇక్కడ నివి బీజప్రాయముగ నుండి, కాదంబరియందు అంకురప్రాయమై హర్షనైషధమున పెద్ద వృక్షముగా పెరిగి, పెద్దన భట్టుమూర్తి మొదలగు తెలుగు కవుల ప్రబంధాలలో శాఖోపశాఖాంచితమై సాగినవి.

విరహాతురుడైన దుష్యంతుడు చంద్ర మన్మథులనుద్దేశించి మదన బాధ నభినయించును:

> "తవకుసుమ శరత్వం శీత రశ్మిత్వమిన్దో
> ర్ద్వయమిద మయథార్థం దృశ్యతే మద్విధేషు
> విసృజతి హిమ గర్భై రగ్ని మిందుర్మయూఖై
> స్త్వమపి కుసుమ బాణాన్ వజ్రసారీ కరోషి"
>
> అభి.శా 3-3

(మన్మథా!నీకు పుష్పాలు బాణాలనుట-చంద్రునికి చల్లని కిరణములుండుననుట-అను ఈ రెండును నావంటివారియందు నిజము గాదు. చంద్రుడు హిమగర్భములగు కిరణములతో అగ్నిని వర్షించుచున్నాడు. మరినీవో.పుష్పబాణములను వజ్రకఠినముగా ప్రయోగించుచున్నావు) ఇక్కడ ఉపాలంభన చేయుచున్నది పురుషుడు. ఆ తరువాతి కావ్యాలం దంతటను ఈ ఉపాలంభన స్త్రీలచే (ముగ్ధనాయికలచే) చేయబడినది.

### 4:3 మాఘుడు-శిశుపాలవధ

**అష్టాదశవర్ణనలు**

దండ్యాచార్యుడు చెప్పిన విధముగ అష్టాదశవర్ణనల నన్నిటిని పాటించిన వాడు మాఘుడు. ప్రకృతి వర్ణనలు అతి వేలముగా గలిగి, ఆలంకారిక వర్ణనా బంధురమైనది శిశుపాలవధ.

శిశుపాలవధ భారత కథలోనిది. కావ్యమును అష్టాదశవర్ణనా బంధురమును, శబ్దార్థాలంకారమయమును,పాండితీపూర్ణమునుగావించుటకుగా నేఈకథను వర్ణించినాడుమాఘుడు. అనుకొన్న విధముగనే నెఱవేర్చుకొనగలిగినాడు. 'మాఘేసంతి త్రయోగుణాః" అన్న కీర్తిని పొందగలిగినాడు. సంస్కృత పంచకావ్యములలో నొకటయినట్టి యీ కావ్యమున గలప్రకృతి వర్ణనలు శోభావహములు.

అష్టాదశవర్ణనలలోగల పుర,వారాశి, పర్వత, ఋతు,వనవిహార, జలక్రీడా,సూర్యాస్త సమయ చంద్రోదయ వర్ణనలును, మద్యపాన వర్ణనయును ప్రభాతమంద వాయువుల వర్ణనయును, సేనా ప్రయాణవర్ణనయును, ద్యూత వర్ణనయును,యుద్ధమును, జయమును - మొదలయిన అన్ని వర్ణనలను లక్షణానుసరణముగ వర్ణించినాడు.

అష్టాదశ వర్ణనల వర్ణించుట కసగుణముగ ఇతివృత్తమును మలచుకొన్నాడు. పుర సముద్ర శైలాది వర్ణనలు వరుసగా వర్ణింపబడినవి.

అష్టాదశర్ణవనలకు లక్ష్యకావ్యముగ దీని నెన్నవచ్చును. దండికి కొలదిగ తర్వాతివాడు గాన (7వ శతాబ్దము) ఇతడు దండి ననుసరించి అష్టాదశవర్ణనలు చేసినాడు. రామాయణ కాళిదాసులందలి వర్ణనలు పెక్కులు అనుసరింపబడినవి.

## 4-4 బాణభట్టు కాదంబరి

"బాణోచ్ఛిష్టం జగత్సర్వం" అన్న కీర్తిని పొందిన బాణ మహాకవి ఏడవ శతాబ్ది వాడు. ఇతడు మాఘునికి సమకాలీనుడు. దండ్యాచార్యుని తర్వాతివాడు. ప్రపంచ విఖ్యాతినందిన 'కాదంబరి'ని వచన కావ్యముగా వ్రాసి ఎనలేని కవిత్వ సంపదను ప్రపంచమున్పై వెలయించినాడు.

ఇది యొక మహత్తర కావ్యము. రసవత్తరమైన కవితా సముద్రము. అన్ని వర్ణనలును ఇందుగలవు. అన్ని అలంకారములును ఇందుగలవు.

## 4-4-1 అష్టాదశ వర్ణనలు

బాణకవియును అష్టాదశ వర్ణనా సూత్రమున కనుగుణముగానే యీకావ్యమును వ్రాసినాడు. రాజవర్ణన యనంతరము పురవర్ణన యున్నది. తరువాత వనవర్ణన యున్నది. తరువాత పద్మసరోవర్ణన యున్నది.

ఆయావర్ణనలపట్ల పూర్వకవులనుసరించిన పద్ధతినే అవలంబించినాడు. కాని వర్ణించిన తీరు అలంకార బంధురముగ నున్నది.

"పారావతచరణపాటలరాగః రవిః అంబరతలాదలంబితః...అచిర ప్రోషితేచ సవితరి శోక విధుర కమలముకుళ కమండలధారిణీ, హంస సితదుకూల పరిధానా, మృణాళ ధవళ యజ్ఞోపవీతినీ మధుకరమండలాక్షమాలావలయముద్వహంతీకమలినీ రవిసమాగమ వ్రతమివ అచరత్"

పద్మములు ముకుళితమై, రవి కొఱకు తపస్సు చేయుచున్నవని పైన వర్ణితము, తరువాత తారకలును చీకట్లును అలంకారికముగ వర్ణితములు.

"అపరసాగరాంభసి పతితే దివసకరే పతన వేగోత్థిత మంభశ్శీకరనికరమివ తారాగణ మంబరం అధారయత్" అన్న వర్ణనను మనుచరిత్రకారుడు (3-37) వసుచరిత్ర కారుడును (4-10) అనుసరించి యున్నారు.

చంద్రోదయము వర్ణితము. "రవి అస్తమించెనని తెలిసి వైరాగ్యము పొడమిన వాడువోలె తెల్లని (వెన్నెలవంటి) వస్త్రముల ధరించి, సప్తర్షి మండలముచేత సేవింప బడినవాడై అరుంధతీసంచరణ పవిత్రుడై ఆషాఢధారియై, అమరలోకాశ్రయము గల వాడై చంద్రుడుదయించె"నని సరిక్రొత్తగ వర్ణించినాడు. ఈ వర్ణన ఆశ్రమజీవితో చితమై ప్రకరణ శుద్ధి గలిగి యున్నది.

వెన్నెల శివుని శరీరమువలె తెల్లగా నున్నదనియు, గంగా సాగరములను హంస ధావళ్యముతో నింపుచున్నది యనియు వర్ణించినాడు.

తరువాత మహాశ్వేత వసంత వర్ణన చేయుచున్నది.

"విజృంభమాణ నవనలినవనేషు, అకఠోర చూతకలికా కలాపకృత కాముకోత్కలికేషు...మదకలిత కామినీ గండూష సీధుసేక పులకిత వకుళేషు, అశోకతరుతాడనారణిత రమణీయ మణి నూపుర ఝుంకార సహస్రముఖరేషు...మధు మద విడంబిత మధుకరీ కదంబక సంవాహ్యమాన మత్తకోకిలోల్లాసిత మధుసీకరోద్గమ దుర్దినేషు...దివాపి ప్రవృత్తాంతర్మదన రాంగాంధాభిసారికా సార్థ సంకులేషు, సకల జీవలోక హృదయానందకేషు మధుమాస దివసేషు..."

పైన చూతములును, వకుళములును, అశోక పుష్పములును, మత్తకోకిలలును, అభిసారికలుసు వర్ణితములు. అందులోనే దోహదక్రియలు వర్ణితములు, పాత్రముఖమున ఋతువర్ణనలు గావించుట రామాయణ పద్ధతి.

## 4:4:2 చంద్రోపాలంభన

ఇది కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలమున మొదట కనిపించుచున్నది (శాకుం 3-3) చంద్రోపాలంభనమునకు రెండవ ఉదాహరణము కనిపించుచున్నది కాదంబరి యందే.[1] ఆ తరువాత ప్రబలముగ హర్ష నైషధమందు కనిపించుచున్నది.

సూర్యాస్తమయములను కథతో ముడిపెట్టుట ప్రకృతి మానవీకరణలోనిభాగమే! బాణుడిట్టి వర్ణన కాద్యుడు కాదుగాని ఇక్కడ వర్ణన సమంజసముగ గావింపబడినది.

మహాశ్వేత కథ చంద్రాపీడుడు విన్నాడు. ఆ దుఃఖగాథను సూర్యభగవానుడు విన్నాడేమో! దుఃఖితునివలె దివసవ్యాపారమును విడిచి అధోముఖుడై పోయెనని సూర్యాస్తమయమును కవి ఉత్ప్రేక్షించుచున్నాడు.

''అత్రాంతరే, శ్రుత మహాశ్వేత వృత్తాంతోపజాత శోకఇవ సముత్సృష్ట దివస వ్యాపారః రవి రపి భగవాన్ అధోముఖతామయాసీత్" పై భావమును పూర్ణముగ పెద్దన తన మనుచరిత్రమున అనుకరించెసు. (మను.3-10)

## 4:5 హర్షుడు-నైషధము

"నైషధం విద్వదౌషధం" అని పేరొందిన మహాకావ్యకర్త శ్రీహర్షుడు పన్నెండవ శతాబ్దమువాడు. నైషధము చాలభాగము అష్టాదశవర్ణనలతో కూడియున్నది. హర్షునివర్ణన లందు ఎన్నదగిన కావ్యశిల్పము గలదు· కొన్ని వర్ణనములందలి భావన లపూర్వములు.

---

1. ''అవనీమవచార్య ఉద్గచ్ఛతా శేషఫణామండలేనేవ రజనికరబింబేన అరాజతరజని...ఉదయ లోహితం రజనికరం విలోక్య అంతర్జ్వలిత మదనానలాపి అంధకారితహృదయా తక్షణ మచిం తయత్ ...ఏకత్రఖలు మదన మధుమాస మలయమారుతప్రభృతయః సమస్తాః ఏకత్రచాయం పాపకారీ చంద్రహతకః నశక్యతే సోఢుం... అస్యచ ఉద్గమన మిదం సదాహజ్వరస్య అంగార వర్షః శీతార్తస్య తుషారపాతః విషస్ఫోట మూర్ఛితస్య కృష్ణసర్ప దంశః...."

## 4:5:1 ఉపాలంభన

నైషధమున ముఖ్యముగ గల విషయములు చంద్రమన్మథోపాలంభనములు. శాకుంతల కాదంబరులలో కొలదిగ గల విషయమును విస్తృతపఱచి అతి విపులముగ, నెన్ని విధముల వర్ణింప నగునో అన్ని విధముల—రసవత్తరముగ, ఆలంకారికముగ, వర్ణించినాడు హర్షుడు; ఉపాలంభనమునకు ఆది పురుషుడు కాకపోయినను, ప్రముఖుడయిన వాడు. అతని తరువాతనే ఉపాలంభనము కావ్యములందు అతిగా పాటింపబడినది.

### చంద్రోపాలంభనము

నైషధమున అన్ని వర్ణనలును ఒక యెత్తు, ఉపాలంభన ఒక యెత్తు. ఈ ఉపాలంభన ధోరణియే ఆంధ్ర ప్రబంధములలో ఎక్కువగా అనుసరింపబడినది. ఆంధ్ర ప్రబంధ కర్తలు దీని నెంతవఱ కనుసరించిరో తెలిసికొనుటకు, ఇందలి వర్ణనను చాలవఱకు విశదీకరించుట ప్రస్తుతమే అగుచున్నది. దమయంతి చేసిన ఉపాలంభనను వరుసగా ఇచ్చుచున్నాను.

"దమయంతికి చంద్రుడు చంద్రుడుగా కనిపించలేదు. సూర్యుడుగా నున్నాడు. చంద్రుడే అగుచో సూర్యకాంతమణి రూపమయిన ఆమె హృదయమును మండించునా? మండింపలేదు."[1]

"సఖి నీవు చంద్రునడుగుము. ఓరీ నీ గురువెవరు? సముద్రుడా ? శంకరుడా? బడబానల మున్న సముద్రుడా? గరళకంఠుడయిన శివుడా? ఎవడు? (వారిరువురిలో నెవడైనను సరిపోవును)"[2]

"ఓరీ! క్షీరసాగరమథన సమయమున మందర పర్వతము దెబ్బకు చూర్ణము కాలేదు నీవు. సముద్రపానము చేసిన అగస్త్యునిచే జీర్ణించుకొన బడలేదు. (నీవు చావక పోవుట ఎంత కష్టము),[3]

1. విధురమానిత యాయది భానుమాన్ కథమహో సతు తద్ హృదయంతథా
అపి వియోగ భరాస్ఫుటన స్ఫుటీకృత దృషత్త్వమ జజ్వల దంశుభిః"- నైష.4-20
2. "అయి! విధుంపరిపృచ్ఛ, గురోః కుతః స్ఫుటమశిక్ష్యత దాహవదాన్యతా
గ్లపిత శంభుగళాత్ గరళత్వయా కిముదధౌ జడ వాబడబానలాత్"-నైష,4-48
3. "నిపత తాపి మందర భూభృతా త్వము దధౌ శశలాంఛన చూర్ణితః
అపిమునేర్జఠ రార్చిషి జీర్ణతాంబత గతోసినపీత పయోనిధేః" నైష. 4-51

"రాత్రులందు సూర్యుడు లేడుగాన నీవు సూర్యరూపములో విరహిణుల బాధించు చున్నావు. సూర్యోదయము కాగానే నిష్ప్రభుడవగు నిన్ను సంతోషముతో చూడ గలను."4

"సఖీ, చెవిలోనున్న తమాల దళమును చంద్రునిలోని జింక కందించుము. దానిని తిని అది బలిసి చంద్రునంతయు నాక్రమించును. ఇక చంద్రదర్శనముండదు."5

"చకోర పక్షి (చంద్రకిరణ భక్షకము) సముద్ర జలమును పీల్చిన అగస్త్యుని శిష్యత్వమును చేసిన బాగుండును. అది చంద్రకిరణముల నన్నిటిని పీల్చివేయును"6

"శత్రువగు విష్ణు చక్ర భ్రమచేత రాహువు వీనిని వదలుచున్నాడు గాబోలు-లేనిచో మ్రింగబడ్డ చంద్రుడెట్లు మరలి వచ్చును?"7

చంద్రోపాలంభనము మొత్తము ముప్పదిమూడు శ్లోకములలో నడచినది. ఈ ఉపాలంభన ధోరణిని ఆంధ్ర ప్రబంధకారులు గైకొని అతివేలముగ వర్ణించిరి. ఇందుండి యెంత దీసికొనిరో, వారి సొంత మెంతయో తరువాత చర్చింపబడును.

ఆ తరువాత మన్మథోపాలంభన సాగినది. ఇది గూడ చాల రమ్యమగు భాగము. ఇది బాహ్యప్రకృతికి సంబంధించినది గాదు. కేవలము అంతర ప్రకృతికి సంబంధించినది. అతని పూలబాణములు, చెఱకు విల్లు, వాహనము, చంద్ర వసంతులతో బాంధవ్యమైత్రి భావములు బాహ్య ప్రకృతికి చెందియున్న వగుటచేతను అంతరంగముగూడ ప్రకృతియే యగుటచేతను మన్మథ వర్ణనగాని,మన్మథోపాలంభన వర్ణన గాని ప్రకరణ విరుద్ధముగాదు. తర్వాతి కవులు ఈ మన్మథోపాలంభనము చేయునపుడిందలి భావముల గైకొనిరో లేదో తేల్చుటకై ఈ వర్ణన పూర్ణముగా వివరింపబడుచున్నది.

ఇతని మన్మదోపాలంభనయే తర్వాతి కవులకు ఆరాధ్యమయినది.

ఉద్దీపనకారుడైన చంద్రునివలన మన్మథ బాధ హెచ్చగా దమయంతి తాళ లేనిదై మన్మథుని ఉపాలంభింప సాగినది.

---

4. "నిశిశశిని భజస్వ కైతవ. భానుతామసతి భాస్వతి తాపయ పాపమాం
అహామిహన్యవలోకయ తాస్మితే పునరహర్పతి నిర్ధుత దర్పతాం" -నైష. 4-54

5. "శ్రవణపూరత మాలదళాంకురం శశికురంగముఖే సఖినిక్షిప
కిమపితు దిలతః స్థగయన్వముం సపదితేన తదుచ్ఛ్వసి నితుణం" -నైష. 4-56

6. "అయి, మమైషచకోర శిశుర్మనేర్ వ్రజతి సింధు పిబస్య నశిష్యతాం
అశితు మద్ది మధీతవతో స్వపాశశికరాః పిబసః కతిశీకరాః" -నైష. 4-58

7. "స్వరిపుతీక్ష్ణ సుదర్శన విభ్రమాత్ కిమువిధుం గ్రసతేన విధుంతుదః
విపతితం వదనే కథ మన్యథా బకరంథ నిభం నిజముజ్ఝతి" -నైష. 4-64

దమయంతి యిట్లనుచున్నది.

"ఓ మన్మథా నీవు మనసిజుడవు గదా! నీ వాశ్రయించిన హృదయమునే యిట్లు దహించుచున్నావు. హుతాశనునిచే క్షణములో కాల్చివేయబడు ఇంధనమువలె హృదయ మయినపుడు మరల నీ వెక్కడుందువు;"[8]

"పతివ్రతయయిన రతీదేవి నీతో సహగమనము పొందలేదు. ఎందుకు? నీవు అనాథ స్త్రీలను వధించు పాతకివి గాబట్టి. ఆమెచేతగూడ వదలబడితివా యేమి"[9]

"సుగతుడు నీ కీర్తి శరీరమును హరించెను. ఈశ్వరుడు పాంచభౌతిక శరీరమును భస్మముచేసెను." (నై ష. 4-80)

"నీ వమృతమును త్రాగలేదు. అధరామృతమును మాత్రమే త్రాగినావు. అందులకే చని పోయినావు." (నై ష. 4-82)

"భువనాలనన్నిటిని మోహనముగావించు గుణమే నిన్ను భూతపుగునట్లు చేసినది. ప్రాణాలతో నున్న వారిని పిశాచములు పట్టుకొని తిరుగునట్లు నన్ను పట్టుకొని తిరుగు చున్నావు." (నై ష. 4-83)

"ఈశ్వరుడు త్రినేత్రుడు. నిన్ను దహించి రూపరహితుని చేసినాడు. ఎందుకు? తన త్రినేత్రత్వమును నిలుపుకొనుటకు. ఎవరికంట బడినను నీవు వధింపదగిన వాడవే. అందులకు తానే చంపినచో ఆ గొప్పతనము తనకే సిద్ధించును గదా!"[10]

"నీ శత్రువగు ఈశ్వరుడు మూడు పురములను దహించినట్లు నీవుగూడ ముల్లోకములను దహించగలవన్న భావముతో బ్రహ్మ నీ బాణములను పూలబాణములుగా సృష్టించినాడు. అందులో మధువునుగూడ నింపినాడు."[11]

"ఆరు ఋతువులు ఆరు పూల నిచ్చినవి. అందొకదానిని ధనుస్సు చేసికొన్నావు. మిగిలిన వానిని బాణములుగ జేసికొన్నావు" (నై ష. 4-92)

---

8. "హృదయమాశ్రయసే బతమామకం జ్వలయ సీత్థమనంగతం దేవకిం
స్వయమపి దగ్ధ నిజేంధనః క్వభవితాసి హుతాశహుతాశవత్" —నై ష. 4-75.

9. "అనుమమార న, మార, కథంనుసారతిరితి ప్రథితాఽపి పతివ్రతా
ఇసమనాథవధూ వధ పాతకీ దయితయాపి తయాసి కిముజ్ఝితః" —నై ష 4-79.

10. "పురభిదాగమితస్త్వమదృశ్యతాం త్రినయన త్వపరిప్లుతి శంకయా
స్మరనిరైక్ష్యత కస్యచ నాపినత్వయి కిమక్షిగతే నయనైస్త్రిభిః" —నై ష. 4-86

11. "స్మరరిపోరిన రోష శిఖి పురాందహతుతే జగతామపి మాత్రయం
ఇతినిధిః త్వది షూన్ కుసుమాని కిం మధు భరస్త రసించదనిర్వృతః" —నై ష. 4-87

"నీవు ఈశ్వరునిపై ఒక బాణమును ప్రయోగించితివి. అపుడు దానితోగూడి భస్మమైతివి. ఇపుడు మిగిలిన బాణములు నాలుగు. పికస్వరమును అయిదవ బాణముగా నిపుడు స్వీకరించితివి" (నై ష. 4-94) (పికః కూజతి పంచమం—అమరము)
"నీతో చేరి దక్షిణానిలము గూడ అదక్షిణ మయినది" (నై ష. 4-96)
"నీవు ఈశ్వరుని వలన కాలిపోవుచు ఆ మంటలతోడనే అందఱను దహించి వేయు చున్నావు" (నై ష 4—98)

"నీ మిత్రుడైన మధువును విష్ణువు చంపి యుండవలసినది. మధు రాక్షసుని చంపి చేసిన మేలేమి?" (నై ష. 4-99)

పై విధముగ దమయంతి నిందించినది. ఇక్కడ ఒకచోట "మలయానిల మదక్షిణ మైనది" అన్నచోట తప్ప మలయమారుత నింద చేయలేదు.

ఉపాలంభనమున సాధించిన దేమి?

నాయిక మనసునకు కొంత ఊఱట కల్గించుచున్నాడు కవి. తన భావనా శక్తి యంతయు ప్రదర్శితమగును. హర్షుడు గొప్ప భావనాపటిమ గలవాడు. భాషానాథత్వము గలవాడు. ఈ ఉపాలంభనమున భావరమ్యతతోపాటు అక్షర రమ్యతను సాధించినాడు. ప్రతి శ్లోకమందును యమకము కనిపించును. ఈ సందర్భమున మాఘుడు శిశుపాలవధలో ఋతువర్ణన సందర్భమున వాడిన ద్రుత విలంబిత ఛందస్సును, యమకమును పాటించి నాడు హర్షుడు.

ఈ ఉపాలంభన ధోరణిని శ్రీనాథ కవియును, తర్వాతి ప్రబంధకవులయిన పెద్దన, రామరాజభూషణులును స్వీకరించి తమ యమేయ భావనా భాషా వైదుష్యములను ప్రదర్శించిరి.

**సారాంశము**

1. రామాయణమున ప్రకృతి వర్ణనలు రసానంద ప్రదములుగ వర్ణింపబడినవి. వేదములలో ప్రకృతి మూర్తిమత్వమును పొందినట్లుగ రామాయణమున మానవీకరణ పొందినది. ప్రకృతి మానవీకరణ రామాయణమున అధికముగ కన్పట్టును.

2. వాల్మీకి వ్యాసుల యనంతరము ఎన్నదగిన కవిరాజు కాళిదాసు. వాల్మీకివలె నితడు గూడ రసవత్తర వర్ణనలు చేసియున్నాడు. ప్రకృతిని ఎన్ని దృక్కోణముల నుండియో నిశితపరిశీలన గావించినాడు. ప్రకృతి యన్నచో మాతృప్రేమను ప్రదర్శించినాడు.

3. వాల్మీకి కాళిదాసుల తరువాతనే, అష్టాదశ వర్ణనా నియమము ఏర్పడినది. అష్టాదశ వర్ణనలలో అత్యధిక భాగము ప్రకృతి వర్ణనలకు సంబంధించినదే.

4. రామాయణ భారతములలో దండి చెప్పిన అష్టాదశవర్ణనలే గాక (అష్టాదశ శబ్దమును వాడలేదు దండి) సాహిత్య దర్పణకారుడు విశ్వనాథకవిరాజు చెప్పిన యిరువదియయిదు మాత్రమేగాక అలంకారశేఖరకర్త కేశవమిశ్రుడు చెప్పిన ముప్పదినాల్గు మాత్రమే గాక యింకను అనేకములగు ప్రకృతివర్ణనలున్నవి. అష్టాదశవర్ణనా నియమమునకు ఆధారస్థానము నాక్రమించినవి రామాయణ భారతములు. రామాయణ భారతముల ననుసరించియే కాళిదాసు వర్ణనలు చేసియున్నాడు.

5. ఋతువర్ణనలకు అధిక ప్రాధాన్యమిచ్చినవారు వాల్మీకి కాళిదాసులు.

6. అష్టాదశ వర్ణనా నియమము ననుసరించి మొట్టమొదటగా వ్రాయబడిన కావ్యము మాఘుని 'శిశుపాలవధ'.

7. కాదంబరియు నష్టాదశ వర్ణనల ననుసరించి వ్రాయబడినది.

8. నైషధకావ్యము ప్రజ్ఞాపాండిత్యముల ప్రదర్శించు కావ్యము. అష్టాదశ వర్ణనా నియమమును పాటించిన కావ్యము.

9. ఉపాలంభనము రామాయణమున బీజప్రాయముగ నుండి, కాళిదాసుయొక్క శాకుంతలమున అంకురముగా కనుపించి-కాదంబరిలో మారాకు దొడిగి నైషధమున వృక్షమై ఆంధ్ర ప్రబంధములలో శాఖోపశాఖాంచితముగా పరిణమించినది.

———

# పంచమ ప్రకరణము

## తమిళ, కర్ణాట వాఙ్మయములు-ప్రకృతి వర్ణనలు

### 5:1 తమిళము-ప్రకృతి వర్ణనలు

ఆంధ్ర ప్రబంధములలో ప్రకృతి వర్ణనల వివరించు సందర్భమున తమిళ సాహిత్యములోని ప్రకృతి వర్ణనలను గూర్చి గూడ స్థాలీపులాకన్యాయమున నైనను పరిశీలింపవలసియున్నది. సంస్కృతము తర్వాత ప్రాచీనమైన సాహిత్యముగల భాష తమిళ భాష. తెనుగునకు సోదర భాషయు, పొరుగు భాషయు అయిన యీ తమిళ భాషా సంప్రదాయముల ననుసరించి దానియందలి ప్రకృతి వర్ణనా విధానము తెనుగులోనికి ప్రసరించినదేమో చూడవలసియున్నది.

తమిళసాహిత్యము చాల పురాతనమయినది. జాతిలోననే ప్రత్యేకత గలదుగాన వారిభాషయందును, సాహిత్యమందును, వర్ణన పద్ధతులయందునుగూడ ప్రత్యేకత గలదు. ఇది మూడు సంగములకును, మూడు ప్రాంతములకును, మూడు సాహితీ విభాగములకును సంబంధించినది.

### 5:1:1 తమిళమున ప్రబంధ శబ్దము

సంస్కృతముయొక్క ప్రభావము కలిగియు, పైకి సంస్కృత ప్రభావము యొక్క వాసనయే లేనట్లు భాసించుచున్న ఈ తమిళము యొక్క ప్రత్యేకత ప్రశంసింపదగినది. ఈ వైశిష్ట్యము నాటినుండి నేటివఱకాజాతిలో నిహితమై యున్నది. తమిళములో ప్రబంధ కావ్యాది శబ్దములు ఉన్నవి. కాని ఆ రూపములో గాదు. తద్భవ రూపములో నున్నవి. అవిగూడ కనుగొనరానంత మారురూపములో నున్నవి.

'కావ్యమ్' కాప్పియం శబ్దముగా మారి కావ్యసామాన్య నామముగానే వ్యవహృతమగుచున్నది. తమిళమున పిఱుకాప్పియం, పెరుంగాప్పియం, పదుకోక్కై మొదలగు 96 కావ్యభేదముల చెప్పుచు, ఆ కావ్యభేదముల కన్నిటికిని సమాహారనామముగా పిరిపందం (ప్రిబంధం) అను శబ్దము వాడబడినది,

## 5:2 తమిళమున ప్రకృతి వర్ణనలు

ఇతర సాహితీ స్రష్టలయందువలెనే తమిళ కవులయందు గూడ ప్రకృతిప్రభావము విశేషముగ కనబడుచున్నది. ప్రకృతిని దర్శించుటలో సంస్కృతాదిభాషా కవులకును తమిళ కవులకును కొంతభేదమున్నది. తమిళ కవులు సంస్కృతమును చదివి వానిని కొంత అనుకరించియు తమ ప్రాంతీయతను వ్యక్తిత్వమును విడనాడకుండ కాపాడు కొనుచు వర్ణనలుచేసిరి.

సంస్కృత ప్రభావ సంబంధి వర్ణనలున్నను తమ వ్యక్తిత్వ ప్రాతినిధ్యమువహించు వర్ణనలును, వర్ణనా పద్ధతియును అరవమున అధికము,

ప్రకృతిని వీరు విభజించిన పద్ధతి ఒక ప్రత్యేకతను చాటుచున్నది. ఈ సంప్రదాయము పురాతనమైనది. తొల్కాప్పియం పురాతనమైనదయినను అందు తమిళ సంప్రదాయము ననుసరించి సాహితీ విభాగములును ఉన్నవి. సంస్కృత ప్రభావము లేశ మాత్రమే గాని అధికముగాదు. తొల్కాప్పియంలో తొమ్మిదవ ప్రకరణములోని మరపియల్‌లో గల ప్రాణుల విభజన (ఆరు విధములు) కేవలము జాతి నిష్ఠమయినది.

ప్రకృతి వర్ణనలలో ప్రాముఖ్యమును వహించునవి పోలిక వస్తువులు. అందులో ఉపమానములును,ఉపమావాచకములును ప్రాముఖ్యమునువహించును.తమిళమున ఉపమా లంకారములు అధికముగ నున్నవి. మానవ జీవితమున ప్రకృతియొక్క ప్రభావము అధికముగాన ప్రతిమాటయందును, ప్రతి చేష్టయందును, ప్రతి వర్ణనయందును ప్రకృతి యొక్క స్వరూపస్వభావములు ప్రతిబింబించుచుండును.

ఉపమానముయొక్కయు, ఉపమావాచకముల యొక్కయు విశ్లేషణము తమిళ మందువలె మరెక్కడను కానము.

తొల్‌కాప్పియమున గల ఏడవ ప్రకరణమగు "ఉవమెయ్యియల్"లో ఉపమా ధర్మములు నాలుగని చెప్పినాడు. అవి (1) ఉపమేయసుందరి ఆధిక్యమును (2) అంద మును, (3) ప్రేమానుబంధములను (4) శౌర్యాదికములను గూర్చి చెప్పునవి.

ఉపమా వాచకములు మొత్తము ముప్పదిరెండుగా విభజింపబడినవి.[1] ఆ ముప్పది

1. 1.అణ్ణ 2. ఐష్ప 3. ఉఅళ 4. ఒప్ప 5. యెణ్ణ 6. మాణ 7, ఒన్ఱ 8. ఓతుంక 9. ఒత్త 10. ఆంక 11. యెన్ఱ 12 వియప్ప 13.యెల్ల 14. విలయ్య 15. విరప్ప 16.నికర్ప 17.కళ్ళ 18. కటుప్ప 19. కైప్ప 20 మతిప్ప 21 తకైయ 22. మరుళ 23. మాఱ్ఱ 24. మర్ప 25 తకియ 26. ఫొర్షువ 27. పొర్వ 28. పోల 29. వెల్ల 30. వీళ 31. నాంత 32. నళియ.

రెండు ఉపమా వాచకములును మరి నాలుగు శీర్షికల క్రింద విభజింపబడినవి.[2]

సంస్కృతమున అట్టి విభజన లేదు. వ్యాకరణాలంకారాది శాస్త్రముల రచించునపుడు తెనుగువారు సంస్కృత శాస్త్రకారులనే అనుసరించుట వలన తెనుగున గూడ అట్టి విభజనకు తావు లేకపోయినది. జాతి ద్రవిడమయ్యు ద్రవిడ(తమిళ)వ్యాకరణాలంకారాది శాస్త్రములను మనవారు అనుసరించుట లేదు. ఆయినను మన భాషలో నలిగిన ఉపమావాచకములు కొన్ని, ద్రవిడ భాషలోని ఉపమావాచకములకు దగ్గరగా నున్నవి.[3] సంస్కృత సంబంధులయిన భాతి, లీలన్ మొదలగునవి కొలదియే.

తమిళమున పై సంప్రదాయము అర్థము కానిదే ఉపమానము యొక్క ప్రత్యేకత అవగతము గాదు. ఈ భావనకు లక్ష్యముగా తొల్‌కాప్పియములోనే చెప్పబడినది.

"ఉపమా పొఱుళై యునరుణ్ కాలెయ్

మరవియ మరపిన్ పలక్కొట్టు వరుమె" —తొల్‌కాప్పియం సూ. 7-292
(సంప్రదాయము నర్థము చేసికొననిదే ఉపమాన ప్రయోగము యొక్క ప్రత్యేకత బోధపడదు).

ప్రకృతి వర్ణనలో ప్రత్యేకత వహించినది తమిళ సాహిత్యము. శిలప్పదిగారం, మణిమేఖలై మొదలగు పురాతన గ్రంథములలో ఆర్యనాగరికతా సంబంధి విషయములు కొన్ని కనిపించినను, కథగాని, కథా కథనముగాని వృత్తప్రయోగముగాని (ఛందస్సు) ప్రకృతి వర్ణనలు గాని సంస్కృతముతో సంబంధము లేనివిగనే కనిపించును.

---

2. పోలిక చలనములో (యాక్షన్) నున్నపుడు ఉపయోగింపబడు ఉపమావాచకములు.
అ. అణ్ణ, అంక, మాణ, విరప్ప యెణ్ణ, ఉఆళ, తకైయ, నోక్క
—తొల్ కాప్పియం 7-సూ. 284

ఆ. పోలిక, ఫలరూపములో (ఎఫెక్ట్) నున్నపుడు ఉపయోగింపబడు ఉపమావాచకములు-
యెల్ల, విలైయ, పుల్ల, పొరువ, కళ్ళ, ముతిప్ప, వెళ్ళ, వీళ
— తొల్ కాప్పియం,7,సూ.285

ఇ. పోలిక గుణమును చెప్పునపుడు (క్వాలిటీ)
కటుప్ప, మైప్ప, మరుళ, ఒత్త, ఓతు క, ఒత, నికర్వ...
—తొల్ కాప్పియం 7 సూ. 286.

ఈ. పోలిక రంగును చెప్పునపుడు (కలర్) - పోల, మర్పు, ఒవ్వ, కాయత్త, నేర, వియప్ప, నలియ, నాంత.
—తొల్‌కాప్పియం 8 - సూ. 287.

3. అను (అణ్ణ) మాదిరి (మతిప్ప) వలె (విలైయ) మాదిరి (మాఱ) ఒప్పు (ఒప్ప) మాడ్కి (మాణ) వడుపు (విలైయ) తెఱగు (తకియ) బలె (వెల్ల) ఎన (ఎణ్ణ) కరణి (కళ్ళ) తెఱగు (తకియ) పోలె (పోల) ఉద్ది (ఒత్త)

నట్టిణై, కలిత్తొగై, పరిపాడల్, నెడునల్ వాడై, పట్టినప్పాలై; మత్తైపొడు కడాం, అగనానూరు, కురుందాహై, ఐంగురునూరు, శిలప్పదిగారం, మణిమేఖలై మొదలగునన్ని కావ్యములందును ప్రకృతి వర్ణన అధికముగా నున్నది. నెడునల్ వాడై, మలై పొడుకడాం కేవలము ప్రకృతి కావ్యములు.

తమిళములోని ప్రకృతి వర్ణనలకు సంబంధించి ఆయా వర్ణనలను ఆయా చోట్లనే ఆయా సన్నివేశములందే వర్ణింపవలెనను నియమము ప్రాచీన కాలమునుండి యున్నది.

ప్రకృతి వర్ణనలు కావించునపుడు అవి అయిదు ప్రదేశములందు మాత్రమే వర్ణింపవలెనను నియమమును తొల్‌కాప్పియంలోనే (పొరుళ్ అతికారం 5 వ సూత్రము) ఉల్లేఖింపబడినది.

(1) కురుంజి (పర్వతప్రాంతము), (2) ముల్లై (వనప్రాంతము), (3) మరుదం (మాగాణిప్రాంతము), (4) నెయ్‌దల్ (సముద్ర ప్రాంతము), (5) పాలై (ఎడారి ప్రాంతము).[4]

---

4\. కురుంజి : పర్వతప్రాంతమందు జరుగు విశేషము లిందు వర్ణితములు నాయికా నాయకుల ప్రేమను (పూర్వభాగమును) కురుంజిలో వర్ణించవలెను. అర్ధరాత్రిలో చలికాలములో జరిగినట్లు వర్ణింపవలెను నాయికానాయకులకు ఉద్దీపన గలిగించు ప్రకృతి వర్ణనలిందు వర్ణితములు.

ముల్లై : వ ప్రాంతము. తెల్లవారుఝాము. నాయికను నాయకుడు ఇప్పటికిని కలిసికొనలేక ఉద్విఘ్నుటట వర్ణింపవలెను. లేళ్ళ ప్రేమ, మధుపముల ప్రేమ వర్ణింపవలెను. ప్రేమ తీవ్రతను వర్ణింపవలెను.

మరుదం : అన్యకాంతామనస్కుడైన నాయకుని నాయిక ఎత్తిపొడుచుట వర్ణింపవలెను. ప్రకృతి సర్వవిధ శోభలు వర్ణింపవలెను. తెల్లవారుఝామున జరిగినట్లు వర్ణింపవలెను. దీనికి కాలనియమము లేదు వేశ్యాశృంగారమును వర్ణింపవలెను. నాయికా నాయకుల క్షమా పశ్చాత్తాపాలు వర్ణింపవలెను.

నెయ్‌దల్ : విరహ తీవ్రతను సముద్రతీరాలలో జరిగినట్లు వర్ణింపవలెను. అన్ని ఋతువులను వర్ణింపవచ్చును. సమయము మధ్యాహ్నము దాటినట్లు వర్ణింపవలెను. (సాయంకాలము) నాయకుని దీర్ఘప్రవాసముపై నాయిక యేడ్పు వర్ణింపవలెను. విరహమును తీవ్రముగ వర్ణింపవలెను. ఉద్దీపన దృశ్యములను వర్ణింపవలెను.

పాలై : మరుభూములలో జరిగినట్లు వర్ణింపవలెను. నాయికానాయకుల సంబంధమైన విరహ తీవ్రతను వర్ణింపవలెను. గ్రీష్మఋతువులో జరిగినట్లును, మధ్యాహ్న సమయమును, అన్ని జంతువులయొక్క పీడానుభవమును వర్ణింపవలెను. సఖి నాయికను ఓదార్చుటను వర్ణింపవలెను.

పై లక్షణమునకు లక్ష్యములు చూపించుట కష్టమని తమిళ సాహితీ చరిత్ర కర్త టి. పి. మీనాక్షి సుందరం అభిప్రాయము.

పై విభజన సహజమైనదిగనే తోచుచున్నది. చాలమంది పండితులీ విభజన సహజమైనదని యొప్పుకొన్నారు. ఈ అయిదు విధములయిన విభజనను- "ఇది కళాత్మకమైన విభజన. మానవమనస్తత్వముపై ఆధారపడిన విషయము. ఆత్మాశ్రయభావప్రభావాల వలన పరాశ్రయ ప్రకృతి ప్రభావితమగుచున్నది" అని గ్రిగ్ పండితుడు మెచ్చుకొన్నాడు.[5]

తమిళమున 'అష్టాదశ వర్ణనలు' అన్న నియమ మేమియు గానరాదు గాని సంఖ్యను మించి యెన్నియో వర్ణనలు గలవు. సూర్యోదయ చంద్రోదయ వర్ణనలు, పుర వన పర్వత నదీ నీర్నిధ్యాది వర్ణనలును జలకేళి మధుపానాది వర్ణనలును మాత్రమే గాక ఇంకెన్నియో గలవు. వియోగ శృంగారము తమిళ సాహిత్యమున ఇనుమిక్కిలిగా వర్ణింపబడినది. ప్రకృతి వర్ణనల పట్ల విధించిన కురుంజీత్యాది ప్రదేశములందెల్ల విప్రలంభ శృంగారము అతిగా వర్ణితము. సంభోగ శృంగారము కంటెను విప్రలంభ శృంగారమే తమిళమున అధికము. దీనిని బట్టి వారెంత శృంగారప్రియులో ఎంత భావుకులో, ఎంత ఉద్రేక శీలురో అవగతమగుచున్నది.

తమిళమున గల మనోజ్ఞ వర్ణనలను ఉటంకించుటకంటె, ఆ వర్ణనలకును, మన వర్ణనలకును గల సారూప్య విభేదముల చర్చించినచో మంచిది.

తమిళుల ప్రత్యేకత వారి వర్ణనలలోనే తెలియుచున్నది. మన కవుల వలెనే వారును స్త్రీల ముఖములను పద్మములకును, వారినేత్రములను పద్మములకును కుముదములకును పోల్చి చెప్పిన ఘట్టములు ఇనుమిక్కిలిగా నుండగా సంస్కృతాంధ్రములందు వర్ణింపని పద్ధతిలో కొన్ని సహజ వర్ణనలు గలవు.

ఆంధ్రమందలి ప్రకృతి వర్ణనలు సంస్కృత మందలి వానిని అనుసరించి చేయబడినవి. అంతేగాని అరవము వైపు మనవారు అంతగా చూడలేదు.

## 5:3 సంస్కృత సంపర్కము గల కొన్ని తమిళ వర్ణనలు :

అష్టాదశవర్ణనా నియమము తమిళములో లేదుగాని ప్రకృతి వర్ణనలు చాల బహుళముగా నున్నవి. సంగం సాహిత్యమందును, ఆ తర్వాతి సాహిత్యమందును సంస్కృత ప్రభావము పరోక్షముగ లేకపోలేదు. తమిళజాతియందుగల వ్యక్తిత్వమును

---

5. Pastoral Poetry and Pastoral Drama – by Waltair Greg p. 91.

భాషాభిమానమును, సంస్కృత భాషాదాస్యమునకు ఒప్పుకొనవు. సంస్కృతము నుండి తీసికొన్న కొన్నిటిని గూడను బాగుగా మార్చినారు. అయినను సంస్కృత వర్ణనల యొక్క ఛాయలు కనిపించకపోవు.

ఉదాహరణకు, కలిత్తొగైలో గల ఒక వర్ణనను పరికించునది :

"సముద్రము రాజుయొక్క దండయాత్రవలెనున్నది. పడవలు ఏనుగులవలెను, అలల ఘోష భేరీ ఝాంకరణములవలెను, ఇసుక తిన్నెలపై గల తెల్ల కొంగలు తెల్ల దుస్తులలో నున్న సైనికులవలెను ప్రకాశించినవి." —కలిత్తొగై.149.

మరియొక ఉదాహరణ :

"అపుడే యుదయించుచున్న చంద్రుని యొక్క పాలవంటి తెల్లకిరణములు ప్రసరించి యువకుల హృదయములను రెచ్చగొట్టుచున్నవి." —నట్రిణై. 196

పై వర్ణనలవంటివి రామాయణమునను తర్వాత కావ్యములందును కోకొల్లలు.

## 5:4 సంస్కృత సంపర్కము లేని కొన్ని తమిళ వర్ణనలు :

స్త్రీల చేతులను మనవారు తామరతూండ్లతో పోల్చినారు. కాని తమిళులు వెదురు కఱ్ఱలతో పోల్చినారు. వ్రేళ్లను గూడ కీచకాంకురములతో పోల్చినారు. ఈ వర్ణన నిజముగ సహజమైనది. భుజపుకీలు ఒక కణుపును, మోచేతి కీలు మరొక కణుపును, మణికట్టు మరొక కణుపునుగా మనము ఊహించుచో నున్నగా సాగిన వెదురువలె రమణీయముగా హస్తములు కన్పట్టును.

"ఆమె భుజములు కణుపులతోనున్న వెదురువలె పొడవైనవియును నున్ననైనవియును."[1]

"వెదురువంటి భుజములు గల నాయిక"[2] అని మరొకచోట నున్నది.

మరొక వర్ణన :

కంటిలోని నల్లగ్రుడ్డు (కనీనిక) ఇనుపకత్తితో వచ్చి మామిడికాయను నఱికినపుడు చక్కగా తెగిన లోపలి తెల్లపప్పు నీలిరంగుగా మారిన దానివలె నున్నట్లు వర్ణింప

1. కాంబిన్
కణ్ణిడై పురయం నెడుమెన్ పణైత్తోళ్ -అగనానూరు. 152.
2. వెరుత్తవేర్ వేయ్పుగై పణైత్తోళ్
నిరుప్పనిల్లా నెంజెముడు నిన్మాట్టు" — అగనానూరు, కళిట్రియానైనిరై.

పాట.2

బడి యున్నది.[3] ఇది ఇంకను సహజముగను పరిశీలనా సంజాతమైన భావము అయి యున్నది.

"నాగలి ఏనుగు తొండము వలె నున్నది" అని వర్ణించిన వర్ణన మన వర్ణనలకు భిన్నమైనది.[4]

మరియొక భిన్న వర్ణన :

"చీకటి రాత్రిలో ఆమె మెడలోని ముత్యాల హారము కామపీడితమైన పొగరు పిల్లి కనులవలె ప్రకాశించినది."[5] ఈ వర్ణన ఎంతయో పరిశీలనాఫలముగ సిద్ధించిన దనవచ్చును.

మరియొకచోట :

"గట్టున కూర్చుండియున్న తెల్లకొంగలు తెల్లదుస్తులలో నున్న సైనిక పంక్తివలె నున్న"[6]వని వర్ణితము.

"నాయిక కండ్లు సెయ్‌దల్ పుష్పమువలె నున్నది"[7]

నాయికను మనవారు ఎన్ని విధాలుగానో వర్ణించిరి గాని తమిళములోవలె ఒక రమ్యమైన పట్టణముతో—ఇంకను—ఓడరేవుతో పోల్చలేదు. ఇది సహజమును, ఆలంకారికమును, ప్రత్యేకమును అయిన వర్ణన.

ప్రకృతి వర్ణనలలో 'మరుదం' అను విభజనకు లక్ష్యమును చూపుచు అగనానూరులో ఇట్లు చెప్పబడినది:

---

3. ఎహ్కుట్టు ఇరువేరాగియే తెరితగు వణప్పిన్
మావిన్ వటువడి పోళ కాణ్ తులుం
మేవల్ తండామహిణొక్కవుణ్ కణ్"——అగనానూరు. 29.

4. పిడివాయ్ అణ్ణ మడివాయ్ ఞాంజిల్——వెరుంపార్. 199

5. వెరుగి రుళ్ నోక్కి అణ్ణ కదిర్ విడు
నొరుకాళ్ ముత్తం ఇడైములై విళంగ-అగనానూరు. 73

6. నీర్ వెయర్ద్ మారియ
వెరిసేట్రు అళ్నల్
నెయ్‌తలై కొటుమీన్ అరుంరెయినక్కురుగు
కుప్పైబెణ్ మణల్ యేరి అరైసర్
ఒణ్ పడై తొగుదీన్ ఇలంగి తోన్రుం?" -నట్రిణై-291.

7. వైకరై మలరుం సెయ్‌దల్‌పోల
తగై పెరిదు ఉడయ కాదలి కణ్ణే" -ఐంగురునూరు-188.

"గజయూథము కలిగి శత్రువుల జయించిన 'శెడియన్' అను రాజు పాలించు 'ఆళ్యూర్' అను సుందర పట్టణమువలె రమ్యమైన ఈ నాయకికి కంకణాలు (చిక్కిపోయి) క్రిందికి జారిపోయినచో పోనిమ్ము"[8] అని చేటి తన సఖియొక్క అవస్థను నాయకునితో చెప్పుచున్నది. ఇది తమిళమునకు ప్రత్యేకతను గూర్చుచున్నది. ఈ ధోరణే మనకు లేదు. ఇటువంటి వర్ణన చేయవచ్చునని గూడ మనవారు అనుకోజాలరు.

ఋజుప్రవర్తన గల వారిని వర్ణించుచు "వంకరగానుండు నాగేటికి గల చక్కని వాడియైన కఱ్ఱు వలె ఆపురమందలి జనులు న్యాయశీలురై, ఋజుప్రవర్తన గలవారై యున్నారు" భీతిరహితత్వ చిత్తౌన్నత్యము గలవారని అర్థము, ఇట్టి ఉపమానములు సంస్కృతపద్ధతికి పూర్తిగ దూరములు.

స్త్రీల నడుమును డక్కీతో పోల్చుట చాల రమ్యమైన వర్ణన: "డక్కీవంటి నడుముగల ఆడువారు (స్నానము చేసి) తడిజుట్టు వడియపిండుకొనుచు గట్టెక్కుచున్నారు.[9]" అని తిరుప్పళ్ళి యెఱుచ్చిలో చెప్ప బడినది. నిరంతర ప్రకృతి పరిశీలనా ఫలరూపమైన ఒక వర్ణన - అద్భుత వర్ణన - గలదు. "దూరముగానున్న చిన్న మేఘమునుండి జారుచున్న వర్షధారలు బాగుగా నూనె పూసి విరియబోసికొన్న కురులవలె కన్పడినవి." ఇది అమోఘ వర్ణన.

— నత్తత్తూర్ రచించిన నిరుపాణాట్టుపడై 13, 14 పాదాలు

స్త్రీ నడుమును 'రోలు'తో సాటి చెప్పుట శిప్పదిగారము మొదలు చాల గ్రంథములందు గలదు. ఢక్కీతోను రోలుతోను, పోల్చుట ఎంతయో అందమైన విషయము ఎంతయో సహజము! వెనుకమండి స్త్రీని చూచినచో ఈ వర్ణన లెంత సహజమో -. ఎంత స్వతంత్రములో - ఎంత జాతీయతను ప్రదర్శించునవో - యెల్లఅకును తెలియును. ఇటువంటివే అరవ సాహిత్యమునకు ఎనలేని ప్రత్యేకతను గూర్చునవి.

---

8. కళిరుపుడై అరుంసమం తడయామారుం
వళిరువాళ్ తానై కొట్రచ్చెరియన్
పిండనెల్లిం అళ్యూర్ అణ్ణయిన్
ఒంతొడి నెగిళ్ ఇనుంనెగిళ్ గ" (మరుదం)-అగనానూరు పాట.46
ఆళ్యూర్ నన్ ముల్లయార్

9. "కడిమలర్క్క మలంగళ్ మలర్ న్దన వితైయో
కదిరవనె కనై కడల్ ముళైత్తన నివనో
తిడియిడైయార్ శురికు తెల్ పిటిన్దదటి
తుకిలుడుత్తే ఏనర్ శూట్ పునలరంగా" — తిరుప్పళ్లియెఱుచ్చి 10 వ పాశరం.
తొండరప్పొడి యాళ్వార్ కవి.

రంగనాథుని మేల్కొలుపు ఘట్టము.

సంగం సాహిత్యమందలి ప్రకృతివర్ణనలు కేవలము స్వతంత్రములనియు, ఇతర భాషాప్రభావము వానిపై లేదనియు "సంగం సాహిత్యములో ప్రకృతి వర్ణనలు" అనుదానిపై పరిశోధనచేసిన డాక్టర్ యం. వరదరాజన్ అనుచున్నారు.[10]

వేరే భాషాకవుల ప్రాబల్యము సంగం కవులపై లేదు. సంగం కవులు ప్రకృతిని నేరుగా అనువాదము చేసికొన్నారు.[11]

ఎడ్వర్డు యంగ్ అను విమర్శకారుడు చెప్పిన దానినిట్లు వరదరాజన్ ఉల్లేఖించినారు. "అనువాదము కవికి తక్కువతనము నాపాదించునది. పురాతన కవులు ఇట్టి తప్పును చేయలేదు. ప్రకృతి అనునది అందరి కొఱకును తెరిచియుంచిన పుస్తకము వంటిది. ప్రతి కవియును ఆ పుటలనుండి చదువుకొనవచ్చును. ఏదేని ఇరువురు కవుల రచనలలో సారూప్యము కనిపించినచో ఆ యిద్దఱకును ఆ దృశ్యము ఒకే విధముగ భాసించియుండును. ఆ యిద్దరొకే విధముగ భావించి యుండవచ్చును. అంతేకాని ఒకరినొకరు అనుకరించి రనరాదు."[12]

(Imitation is inferiority confessed and the ancient poets are not culpable in this respect. Nature is an open book and every poet can read from its pages, when any parallelism is found in the works of any two poets, however close it may be, it is probable that they have independently seen and imagined and pointed the scene or the picture in the same manner)

ప్రకృతి కవి వర్డ్స్వర్తు కవిని గూర్చి ఆర్నాల్డ్ అను విమర్శనకారు డిట్లనెను:

"Nature herself seems to take the pen out of Wordsworth's hands and to write for him with its own, bare, sheer penetrating power and accounts for this as arising from the profoundly sincere and natural character of his subject itself." This will apply to many of the poets of Tamil and other languages also.

---

10. "There is scarcely anything in these descriptions which is conventional, the brightness and animation of the scenes are real and are out come of the poet's own appreciation of such scenes. They are therefore treated with truth and simplicity without superficiality and abnormality." —M. Varadarajan in his Treatment of Nature in Sangam Literature-P. 402.

11. Treatment of Nature in Sangam Literature-by Dr. M. Varadarajan, Page. 403.

12. Treatment of Nature in Sangam Literature-By Dr. M. Varadarajan. P. 412.

## [illegible] తమిళమున ఋతువర్ణన

[illegible] కావ్యములయందే ఋతువర్ణనల గుఱించి చర్చింపబడినది. సంస్కృత [illegible] పేర్లననుసరించి వారి మాసముల పేర్లు కలిగినను - వారివలెనే [illegible] యున్నను - వారిపద్ధతులును నియమములును - వర్ణనాధోరణియును [illegible] వైచిత్ర్యదాయకములును అయియున్నవి. ఏయేచోట్ల నేయే ఋతు [illegible] అనియమముగూడ ఉల్లేఖింపబడినది. (తొల్ కాప్పియం, పొరుల్ [illegible] సూత్రములు 6, 7, 8, 9, 10, 11, 12).

| | | | |
|---|---|---|---|
| [illegible] | [illegible] | ఇళవేణిల్ కాలం (వసంతర్తువు) | ముసదం, నైదల్ లలో వర్ణింప వచ్చును.[1] |
| [illegible] | [illegible] | ముదువేణిర్ కాలం (గ్రీష్మర్తువు) | పాలై లో వర్ణింపవలెను.[2] |
| [illegible] | [illegible] | కార్ కాలం (వర్షర్తువు) | ముసరదంలో వర్ణింపవచ్చును.[3] |
| [illegible] | [illegible] | కూదిర్ కాలం (శరదృతువు) | ముసదం, కురుంజీలలో వర్ణింపవచ్చును.[4] |
| [illegible] | [illegible] | మున్పనిక్కాలం (హేమంతర్తువు) | శెయ్దల్, మరుదం, కురంజీలలో వర్ణింపవచ్చును.[5] |
| [illegible] | [illegible] | పిన్ పనిక్కాలం (శిశిరర్తువు) | సెయ్దల్, మరుదంలలో వర్ణింపవచ్చును.[6] |

[illegible] [illegible] వాయిల్ కిరత్తనార్) పాట. 60
[illegible] [illegible] (పోమూలనార్) పాట 31
[illegible] [illegible] (ఒక్కూర్ మాసాత్తనార్) పాట 14
4. అ[illegible] నానూరు (అళ్ళూర్ నన్ముల్లయార్) పాట 46 అ. అగనానూరు పాట2 (కలిత్రియానైనిరై)
[illegible] అ. [illegible] (అళ్ళూర్ నన్ముల్లయార్) పాట 46 డిటో డిటో పాట-60 కుడువాయిల్ కీరతనార్
6. 'అ' అగనానూరు (అళ్ళూర్ నన్ముల్లయార్) పాట 46 'అ' అగనానూరు పాట 60 [illegible] వాయిల్ కిరత్తనార్).

తమిళమున ఋతువర్ణనలు ప్రకరణగతముగ అవసరము ననుసరించి సహజముగ వర్ణింపబడునేగాని పనిగట్టుగొని వర్ణించు పద్ధతిలో నుండవు.ఋతు సహజత లేనిచో వానిని వర్ణించు పద్ధతి లేదు.

## సా రాం శ ము

7. దక్షిణదేశ భాషలలోకెల్ల తమిళమత్యంత ప్రాచీనమయినది. తమిళజాతి ఒక ప్రత్యేకతగల జాతి. ఇతర భాషలనుండి కొన్ని త్తవి దీసికొన్నను, యథాతథముగ గాని - తత్సమరూపమున గాని - ప్రయోగించుకొనకుండ, వానిని మార్చియో - లేక అర్థము ననుసరించి తమిళ పదముల సృష్టించియో - వాడుకొనిరిగాని ఆంధ్ర కర్ణాట మల యాళుల వలె తత్సమ పదముల ప్రయోగింపలేదు. తద్భవరూపములు అక్కడక్కడ (తొల్కాప్పియం, అగత్తియం, పిరిపందం) కనిపించుచున్నను అవి అత్యల్పములు.

2. సంస్కృతప్రభావము కొంత ఎక్కువగానే యున్నను లోతులు వెదికిన వారికిగాని అది కనిపించదు. సంస్కృత సమాస రచన గాని, సంస్కృత పదాలుగాని యిందు గానరావు. ఈ విధముగ అరవజాతి తన ప్రత్యేకతను నిలుపుకొన్నది.

3. ఆంధ్ర కర్ణాటులవలె వీరు సంస్కృత వృత్తముల జోలికిపోలేదు. కేవలము దేశీయమగు ఛందస్సే వాడిరి.

4. వర్ణనలలో తమిళమున స్వతంత్రత ప్రదర్శింపబడినది. సంస్కృత వ్యాకరణాలంకార శాస్త్రప్రభావము తొల్కాప్పియమున కనిపించినను అందు తమిళముయొక్క స్వతంత్రత, ప్రాచీనత - ప్రతిబింబించినది.

5. ప్రకృతి వర్ణనలు ఒక పద్ధతిని - ఒక నియమమును - అనుసరించి చేయ వలయునని యున్నది. ఆ నియమము అర్థముకానిదే, వర్ణనా సందర్భములు అర్థము కావు.

6. వీరి ప్రకృతి వర్ణనలలో స్వతంత్రత, జాతీయత, ప్రాంతీయత ప్రతిబింబించును. వీరి ఉపమానములును అట్టివే. ప్రకృతి వర్ణనలలో అతి లౌకిక వర్ణనలకంటె - జాతి జీవన ప్రకృతి బాగుగ ప్రతిబింబించును.

7. చాలభాగము ప్రకృతి చిత్రములు అసాధారణ కళాఖండములు.

8. ఆంధ్ర కవులు సంస్కృత ఛాయలనే అనుసరించిరిగాని, తమిళమువైపు అంతగా దృష్టి మరల్పలేదు.

9. తమిళమందు ప్రకృతి వర్ణనలు చేయు తఱి, ఆయా వర్ణనలను ఆయా చోట్లనే, ఆయా సన్నివేశములలోనే వర్ణింపవలెనను నియమము ప్రాచీన కాలము నుండియు నున్నది. ఇది చాల ప్రముఖమైన ప్రత్యేకత.

10. తమిళమునందు ఉపమానములకు ప్రత్యేకత గలదు. సంస్కృత పద్ధతికి అది కొంత భిన్నత్వమును భజించుచున్నది. ఉదాహరణకు, స్త్రీల నడుమును, డక్కీతోను, రోలు తోడను పోల్చుట - స్త్రీల చేతులను వెదుళ్లతో పోల్చుట మొద లగునవి తమిళుల ప్రత్యేకతను, స్వతంత్రతను, జాతీయతను ప్రాదేశికతను చాటు చున్నవి.

## కన్నడము - ప్రకృతి వర్ణనలు

మూల ద్రావిడ భాషా సంజాతములయిన తమిళ కర్ణాటాంధ్ర మలయాళము లలో కర్ణాటాంధ్ర భాషలకు సాన్నిహిత్య మెక్కువ. వేషభాషల తీరునందు తమిళ మలయాళులును, కర్ణాటాంధ్రులును చాలవఱకు పోలి యుందురు.

నృపతుంగుని నిర్వచనము ననుసరించి కర్ణాటమనగా నల్ల నేలలు గల ప్రాంత మనియు, అది కావేరినుండి గోదావరి వఱకును, తూర్పుసముద్రము నుండి పడమటి సముద్రమువఱకును వ్యాపించిన ప్రాంతమనియు అర్థము. క్రీ. శ. ఏడవ శతాబ్ది నుండి దాదాపు పదకొండవ శతాబ్దము వరకును కర్ణాటాంధ్ర ప్రాంతములు రెండును చాళుక్యుల పాలనలోనే యుండినవి. ఆ తర్వాత కొంతకాలము వఱకు గూడ ఈ రెండు భాషలకును లిపి ఒక్కటిగనే యుండినది. వేంగి ప్రాంతపువారయిన రన్న, పొన్న, పంప అను రత్నత్రయము జన్మనుబట్టి తెలుగు వారై కన్నడ భాషలో ఆదికవులయినారు. నారాయణభట్టు (11 వ శతాబ్ది) కన్నడ జాతివాడయినను తెనుగు రచనలో నన్నయకు ఎనలేని సాయము చేసియున్నాడు. ఆ శతాబ్దములలో రాజకీయముగా పరస్పరము వైరుధ్యమున్నను, సాంస్కృతికముగ ఇచ్చిపుచ్చుకొనుటలు విశేషముగ నుండెనని ఇందు మూలమున విదితము.

విజయనగర రాజ్యకాలమున నీ రెండు ప్రాంతములును, మరింత సన్నిహితము లయినవి. కావున కర్ణాటాంధ్ర ప్రబంధ రచనలును, అందలి ప్రకృతి వర్ణనలును పరస్ప రము ప్రభావితములయిన వేమో స్థూలముగ పరిశీలింపవలసి యున్నది.

పరస్పర సంబంధముగల ఈ భాషాద్వయములో మొదటగా సంస్కృతము వైపు అతిగా మొగ్గినది కన్నడ భాషయే. అందువలననే దానిననుసరించి తెనుగువారు గూడ సంస్కృతముపై అతిగా ఆధారపడ జొచ్చిరి. కన్నడ ప్రబంధములలోని ప్రకృతి వర్ణనల స్థూలముగ పరిశీలింతము.

## ప్రబంధ శబ్దము

ప్రబంధ శబ్దమును కన్నడిగులు సంస్కృతము నుండి తత్సమ రూపములోనే ఆ యర్థములోనే స్వీకరించిరి. కాని, నేడు మాత్రము 'ప్రబంధం' అనగా వ్యాస రచనకు సమానార్థకముగా వాడబడుచున్నది. "ఇదన్ను కుఱితు ఒందు ప్రబంధవన్ను బరెయిరి" (దీనిని గూర్చి ఒక వ్యాసము వ్రాయుడు). ఇది నేటి ప్రయోగము. కాని ఆదినుండి ఇంతవఱకును కావ్యసామాన్య నామముగనే వ్యవహరింపబడుచున్నదనుటకు ఈ క్రింది ప్రయోగములు తిలకించునది.

"సత్కవివరరాజహంసనెనె పేరోరర్చిదె నీ ప్రబంధమం"

—నాగవర్మ ఛందస్సు, పీఠికె.16 (9వ శతాబ్దం)

"ఇదు సమస్త సుర కదంబ...సోమరాజేంద్ర విరచితమప్ప శృంగారసార మహా ప్రబంధదోళ్"

—(13వ శతాబ్ది) ఉద్భటకావ్య (సోమరాజ) ఆశ్వాసాంత గద్య,

పై ప్రయోగములబట్టి సంస్కృతాంధ్రములందు వలె ప్రబంధ శబ్దము సర్వవిధ కావ్యములకును ప్రతినామముగా వాడబడినదని తేలుచున్నది.

## అష్టాదశ వర్ణన

కన్నడమున అష్టాదశ వర్ణనా పద్ధతి గలదు. అష్టాదశ వర్ణన గల కావ్యమును మహాకావ్యమనియు వర్ణకమనియు గూడ నందురు.

పదమూడవ శతాబ్దివాడగు మల్లికార్జున కవి తన "సూక్తి సుధార్ణవము"న ఇట్లు వివరించినాడు.

"వారిధి పర్వతం పుర మధీశ్వర నుద్వహనం కుమార నం
భోరుహవైరి మిత్రిరుదయం ఋతునందన మంబు సీధుకాం
తారతి చింతె మంత్ర చరయాన విరోధిజయం గళెంబి వం
నూరిగళంగమెందు కృతియోళ్ పదినెంటు మనెర్దు బణ్ణిపర్"

పైని పదునెనిమిది వర్ణనలున్నవి. అవి వారిధి, పర్వతము, పురము, రాజు, వివాహము, కుమార జననము, సూర్యోదయము, చంద్రోదయము, ఋతు, జలక్రీడ, మధుపానము, రతి, విప్రలంభము, మంత్రాలోచనము, ద్యూతము, ప్రయాణము, యుద్ధము, నాయకాభ్యుదయము, ఇవన్నియును పదునెనిమిది. పదునెనిమిది యను శబ్దమును గూడ వాడినాడు. ఇతడు చాలవరకు ప్రతాపరుద్రీయకర్త ననుసరించినట్లున్నది.

అంతకు ముందటివాడయిన నాగవర్మ (12 వ శతాబ్ది) తన కావ్యాలోకనమున ఇట్లు వివరించినాడు.

> "నగరార్ణవ సరిదటవీ
> నగ చంద్రార్కోదయర్తు సలిల క్రీడా
> దిగశాదియాగె సరసో
> క్తిగళిం వర్ణిసుగె "వర్ణకం'' గళనదఱొళ్"
>
> — నాగవర్మ 'కావ్యాలోక' సూత్ర. 245.

అదే యుగమునకు చెందిన వాడనియు, అంతకు ముందు వాడనియు గూడ చెప్పబడుచున్న తెలుగు కవియు అయిన నన్నెచోడుడు గూడ "వన జల కేళీ రవి శశి" అని కుమారసంభవములోనే అష్టాదశవర్ణన పద్యమును వ్రాసినాడు. కాని పదునెనిమిది వర్ణనలను వ్రాసినాడు. అష్టాదశనామమును గూడ అందులోనే వ్రాసినాడు. నన్నెచోడునిలో తెలుగు కన్నడ భాషా సంప్రదాయముల ప్రాబల్యమున్నదని చెప్పబడుచున్నను, అతని యొక్క ప్రభావము వారిపైనే పడినదో లేక వారి ప్రభావము ఇతని పైనే పడినదో చెప్పుట కష్టము. ఎందుకనగా నన్నెచోడుడు 940 ప్రాంతము వాడనియు 840 ప్రాంతము వాడనియు గూడ భావింపబడుచున్నది.

ఏదెట్లయినను ఆంధ్ర కర్ణాటులు ఆది నుండియు సంస్కృత ప్రభావ ప్రాబల్యము నుండి తప్పించుకొనలేకపోయిరన్నది విదితము. ఈ సంస్కృతానుసరణమున వీరుభయులును తమ జాతి ప్రత్యేకతను, జాతి వ్యక్తిత్వమును, ప్రాదేశిక సహజతను, స్వాతంత్ర్యమును కొంత వరకు విస్మరించినారన్నది సత్యము.

పై వాక్యమున కర్థము వారు సంస్కృత పద్ధతుల ననుసరించినారని చెప్పుటయే గాని భావనా ధోరణిలోను, వర్ణనా ధోరణిలోను, దాస్యము చేయలేదని చెప్పుటయే!

## ప్రకృతి వర్ణనలు

తమిళమున వలె కన్నడమున ప్రకృతి వర్ణనల విషయమున ప్రత్యేకత లేదు. ఆంధ్రములో వలెనే అందుగూడ సంస్కృత పద్ధతి ననుసరించుటయు సంస్కృత కవుల

అమేయ భావనాగరిమను, పాండితీ ప్రతిభలను, అనుసరించుటయు జరిగినది. కన్నడులీ పద్ధతిని ముందే అనుసరించినారు గావుననే జాతి సాన్నిహిత్యము వలన ఆంధ్రులు గూడ ఆ పద్ధతినే అనుసరించిరి.

రామాయణ భారత భాగవతాది గ్రంథాల అనువదించుటయు, సంస్కృత కావ్యాలను, వ్యాకరణాలంకార ఛందో గ్రంథములను అనువదించుటయు తెలుగుల వలెనే కన్నడులు అంతకు ముందే గావించియుండుటయు చూడగా, ఆంధ్రములో వలెనే ప్రకృతి వర్ణనల విషయమున - తమిళమందు వలె - ప్రత్యేకముగ చెప్పుట కంతగాలేదు. తమిళమందు ప్రత్యేకత పూర్ణముగ గలదు గావుననే కొంత సూక్ష్మముగ పరిశీలించి వివరించుట జరిగినది. ఇంత మాత్రము చాలునన్న భావముతో కన్నడ విషయమున విశేష పరిశీలన చేయుట లేదు. దీని సారాంశమేమనగా వర్ణనా విశేషములలో ప్రత్యేకత యున్నను, వర్ణనాధోరణిలో ఆంధ్రకర్ణాటులు సంస్కృత సంప్రదాయము ననుసరించినా రనునదియే.

---

# ప్రథమ ప్రకరణము

## 1.1 ప్రబంధము-నిర్వచనము

సంస్కృతమున కావ్యములని యేవి వ్యవహరింపబడుచున్నవో-అవి-తెనుగున గూడ కావ్యము లనియే యనబడుచున్నవి. వానిలో కొన్నిటినే ప్రత్యేకించి ప్రబంధము లనుచున్నాము.

కవి చేసిన దంతయు కావ్యమే గదా! కాబట్టి ప్రబంధము గూడ కావ్యమే అగుచున్నది. కావ్యములకు లక్షణములను మన పూర్వలాక్షణికులు చాలమంది వ్రాసి యున్నారు. తనకంటె పూర్వులయిన లాక్షణికుల యభిప్రాయములను క్రోడీకరించి-బాగుగా నవగాహనము చేసికొని- ఆనందవర్ధనుడు తన ధ్వన్యాలోకమున ఇట్లను చున్నాడు.

"యతః కావ్యస్య ప్రభేదాః—ముక్తకమ్(సంస్కృత ప్రాకృతాపభ్రంశనిబద్ధం)సందానితక, విశేషక, కాలాపక, పర్యాయబంధ, పరికథా, ఖండకథా, సర్గబంధోభినేయార్థ, మాఖ్యాయికా కథే త్యేవమాదయః" (ధ్వన్యా. 3-7)

పై చెప్పబడిన కావ్యభేదములలో ప్రబంధ శబ్దము ప్రత్యేకముగ కానరాదు. కాని, పై వానిని నిర్వచించినపుడు, ప్రబంధ శబ్దము కనిపించుచున్నది.

**నిర్వచనములు :**

1. పర్యాయబంధః :- వసంతాద్యేకతమ వర్ణనీయవస్తు వర్ణనాత్మకః ప్రబంధః (వసంతాది ప్రకృతి వర్ణనలు గల ప్రబంధము పర్యాయ బంధమని యర్థము)
2. ఆఖ్యాయికాః :- ఆఖ్యాయికా క్వాచిత్కవక్త్రాపరవక్త్రాదిచ్ఛందస్క-ఉచ్ఛ్వాసాశ్వాభిద విభాగభాగే గద్యప్రచురః ప్రబంధః (వక్త్ర, పరవక్త్రాది ఛందస్సులు గలిగి ఆశ్వాస విభాగములు గల గద్య ప్రబంధము).
3. కథా :- కథా సజ్జన దుర్జన వృత్తాంత వర్ణన పరః... ఆశ్వాసాది శూన్యో గద్యమయః ప్రబంధః (ఆశ్వాస విభజన లేని గద్య కావ్యము)

పై నిర్వచనములందు కనిపించుచున్న ప్రబంధశబ్దము—పర్యాయబంధ, ఆఖ్యాయిక, కథ—అను వానికెల్లను సమానముగ—పర్యాయముగ—వాడబడినది. అనగా, ఆఖ్యాయిక, కథ వంటి గద్యకావ్యములు గూడ ప్రబంధము లనియే పేర్కొనబడినవి. కావ్యశబ్దమునకు పర్యాయనామముగా వాడబడినది ప్రబంధశబ్దము.

## విశ్వనాథుని సాహిత్య దర్పణమున

"ననుతర్హి ప్రబంధాంతర్వర్తినాం కేషాంచిన్నీరసానాం పద్యానాం కావ్యత్వం నస్యాత్ ఇతిచేన్న.రసవత్పద్యాంతర్గత నీరస పదానామివ పద్యరసేన ప్రబంధరసేనైవతేషాం రసవత్తాంగీకారాత్" సాహి. ద .1-20.

(ప్రబంధమందలి కొన్ని నీరస పద్యములకు కావ్యత్వము లేదనుట సరిగాదు. రసవత్పద్యాంతర నీరస పదములకు, పద్యరసము వలెనే—ప్రబంధరసమువలెనే—వాని రసవత్త అంగీకరింపబడినది)

పైన కావ్యప్రబంధ శబ్దములు పర్యాయ పదములు. ఈ విశ్వనాథుడే భారత రామాయణాదులను ప్రబంధము లన్నాడు. నాటకాదులను గూడ ప్రబంధము లన్నాడు.

1. కరుణ రసస్య దుఃఖహేతుత్వే—కరుణరస ప్రధాన రామాయణాది ప్రబంధానామపి దుఃఖహేతుత్వ ప్రసంగ స్స్యాత్.

ఉదాహరిష్యతే :-

ప్రబంధేయథాః—మహాభారతే శాంతః రామాయ కరుణః మాలతీ మాధవ
రత్నాదౌ శృంగారః ఏవమన్యత్ర...

పైన భారత రామాయణాది కావ్యములును—మాలతీ మాధవాది నాటకములును ప్రబంధములుగానే చెప్పబడినవి.

2. అభిజ్ఞాన శాకుంతల వ్యాఖ్యలో (శ్రీనివాసాచార్యులు పుట. 238) "కాళిదాస నామామహాకవిః నాటకాంతం కవిత్వమితిధియా నాటకరూప ప్రబంధం నిర్మిత్సుః" ఇట నాటకము ప్రబంధమన్న మాట.

3. జయదేవుడు, ప్రసన్న రాఘవములో:-
"నాట్య ప్రబంధమితి మంజుల సంవిధానం" అన్నాడు.
నాటకము గూడ ప్రబంధమని అర్థము.

4. విశ్వనాథ కవిరాజు (తన సాహిత్యదర్పణావతారికలో)
"శ్రీ చంద్రశేఖర మహాకవి చంద్రసూను, శ్రీ విశ్వనాథ కవిరాజకృతం ప్రబంధః సాహిత్యదర్పణం"
సాహిత్యదర్పణమను లక్షణకావ్యము గూడ ప్రబంధమైనది.

5. విద్యానాథుడు :-
"ప్రతాపరుద్ర దేవస్య కీర్తిమాశ్రిత్య నిర్మితః
అలంకార ప్రబంధోఽయం సంతః కర్ణోత్సవోఽస్తువః"
లక్షణగ్రంథమైన ప్రతాపరుద్రీయము గూడ ప్రబంధమన్న మాట.

## కావ్యభేదములు

రాజశేఖరుడు తన కావ్యమీమాంసలో (9 వ అధ్యాయము) కావ్యమనగా ముక్తకమనియు, ప్రబంధమనియు, రెండు తెఱగులని చెప్పినాడు.

1. ముక్తకము :- అనిబద్ధ కావ్యము. అమరుకములోని శ్లోకముల వంటివి. తెలుగు సందలి చాటువుల వంటివి.
2. ప్రబంధము :- పద్యపద్యమునకును కథతో - రసముతో సూత్రబద్ధమైన సంబంధము గలది. రసబంధుర కావ్యములన్నియు దీనికి ఉదాహరణలే!

పైవివరణల బట్టి సంస్కృత కవి లాక్షణికులు కావ్య నాటక లక్షణ గ్రంథముల నన్నిటిని ప్రబంధములన్నారని విదితమైనది.

ఇక తెనుగు కవి లాక్షణికుల మతమును పరిశీలింతము.

### తెలుగు లాక్షణికులు :

**1. అప్పకవి** :- అప్పకవి, ప్రబంధ భేదములను వివరించుచు 'ఉచ్చారణ క్రియవలన వర్ణమేర్పడుననియు, వర్ణసంచయము వలన పదము లేర్పడుననియు-పదముల వలన వాక్యమును. వాక్య భేదమువలన భావమమరుననియు, భావమున గన్పట్టు రసప్రశస్తిచేత పద్యము లేర్పడుననియు—అట్టి పద్యరాశిచే కావ్యము కూర్పబడుననియు తెల్పి—

"అట్టి కావ్యంబు ద్వివిధమై యతిశయిల్లు
నిరువడి ప్రబంధ చాటు ప్రబంధములన
సర్గముల సంస్కృతమున, నాశ్వాసములను
దెనుగున, ప్రబంధమనునది తనరు గృష్ణ" అప్ప. 1-27.

ప్రబంధములు రెండు తెఱగులనియు నందొకటి ప్రబంధమును, రెండవది చాటు ప్రబంధమనియు అప్పకవి భావము.

**2. విన్నకోట పెద్దన:** పెద్దన గూడ కావ్య శబ్దమును వివరించుచు—

"సర్గబంధఁబు గావ్యంబు సంస్కృతమున
ప్రాకృతమ్మున నాశ్వాస భాసురఁబు
నాటకములెల్ల నంక సనాథకములు
గద్యముచ్ఛ్వాస లంబకాంకంబ యండ్రు"

—కావ్యాలం. చూ. ఉచ్ఛ్వా. 4-7,

పై విషయమును చెప్పిన వెనుక—

"ఇటువలెనె ముక్తకాది
స్ఫుటతర చాటు ప్రబంధముల లక్షణముల్
పటుమతి నెఱుగుట సుయశో
ఘటనంబుల కెల్లగుదురు కవినృపతులకున్"

—కావ్యా. చూ. ఉచ్ఛ్వా. 4-8.

అని చెప్పినాడు. ఇతని మతము ననుసరించి గూడ ప్రబంధము వేరనియు, ముక్త మనగా చాటు ప్రబంధమనియు తెలిసినది.

**తెనుగు కవులు-ప్రబంధ శబ్దము**

**1. నన్నయ :** "సత్యవాక్ప్రబంధ శతసహస్రశ్లోక"
ఇట ప్రబంధమనగా ప్రకృష్టబంధముతో గూడిన పదములని యర్థము.

ఇది శ్లోకమునకు గాని, పద్యమునకు గాని—చేరగుచున్నది. పద్య సముదాయ గ్రంథమునకును చేరగుచున్నది.

**2. నన్నెచోడ దేవుడు :** "భంగిగ విస్తరించెదఁ బ్రబంధము సద్రసబంధురంబుగాన్"

—కుమార. అవతారిక

ఇట ప్రబంధ శబ్దము కావ్య, కృతి, శబ్దములకు సమానార్థకముగ వాడబడినది.

**3. తిక్కన మహాకవి**

"అని రచనా కౌతుకమున
మనమలరగ నీ ప్రబంధమండలి కధినా
థునిగానే పురుషుని జే
కొనువాడనో యనుతలంపు గూరినమదిలోన్"

-భార. విరా. 1-31

ఇక్కడ ప్రబంధ శబ్దము, 'పద్యములకూడలి' అయిన భాగమునకు పేరు. పర్వమనియు నర్థము.

**4. ఎఱ్ఱాప్రెగడ :-** "జగదర్చితంబగు ప్రబంధంబు నిర్మింప నుపక్రమించితి"
—(హరివం... అవతారిక)

ఇక్కడ ప్రబంధ శబ్దము పూర్వ హరివంశ పురాణమునకు వాడబడినది.

**5. శ్రీనాథుడు :-** "నవరసభావానుబంధ బంధురముగా నొక్క ప్రబంధంబు నిర్మింప"
—శృంగార. నై. అవతారిక.

"నాకు కృపసేయు మొక ప్రబంధంబు నీవు"
—భీమ. ఖం. అవతారిక.

ఇక్కడ సూత్రానుబద్ధ పద్య గద్య సమూహమే ప్రబంధమని చెప్పబడినది.

సంస్కృత కవులును లాక్షణికులును-తెనుగు - కవులును లాక్షణికులును-ప్రబంధ శబ్దమును కావ్య (రచన) సామాన్యమునకు పర్యాయముగానే వాడిరని స్పష్టమగుచున్నది. పూర్ణకావ్యమునకే గాక పద్యములకు గూడ ప్రబంధ శబ్దమును వాడినాడు తిక్కన. ద్విపదకావ్యమును గూడ ప్రబంధమే అని క్రీడాభిరామకర్త యన్నాడు. శతకములు గూడ ప్రబంధములే అని శతక కర్తలు అన్నారు.

కాని కృష్ణదేవరాయలకాలము నుండి బయలు దేరిన కొన్ని కావ్యములకు ప్రబంధములను ప్రత్యేక నామమును పూర్వులీయలేదు గాని, ఆధునికులు ఆ విధముగ వాకొనుట జరిగినది. రాయల కాలమునుండి జరిగిన రచనలలోగల వైలక్షణ్యమే అట్టి ప్రత్యేక నామ సృష్టికి దారి తీసినది. ఆ వైలక్షణ్యమునుపలక్షించి విశ్లేషించి డాక్టర్ కాకర్ల వెంకట రామనరసింహం ప్రబంధ శబ్దము నీ క్రింది విధమున నిర్వచించిరి.

"కథైక్యమును, నష్టాదశవర్ణనలును గలిగి - శృంగార రసప్రధానమై - అర్థాతిశాయి యయిన శబ్దగ్రహణము గలిగి - యాలంకారిక సాంకేతికములకు విధేయమై అనతి విస్తృతి గల యితివృత్తముతో - భాషాంతరీకరణము గాక స్వతంత్ర రచనయే యైన తెనుగు కావ్యము ప్రబంధము."[1]

పై నిర్వచనము ననుసరించి అల్లసాని కృతమగు మనుచరిత్ర మొదలుగా గల రసవత్తరమైన స్వతంత్ర కావ్యము లన్నియు ప్రబంధము లగుచున్నవి. ప్రబంధములు వర్ణనా ప్రధానములు. అట్లగుట జేసి నన్నెచోడుని కుమారసంభవము ఆది ప్రబంధముగా పరిగణింపబడుచున్నది.

---

1 'ఆంధ్ర ప్రబంధము - అవతరణ వికాసములు' — పుట 13.(డాక్టర్ కె.వి.ఆర్. నరసింహం)

నన్నె చోడుడు రాయలకాలమునాటి వాడుగాడు. అంతకయిదువందల యేండ్ల పూర్వుడు. అయినను అతనిని ప్రబంధ కవిగా, ఈ క్రింది కారణముల వలన స్వీకరింప వచ్చును.

1. అతని కుమార సంభవము వర్ణనాప్రధాన కావ్యము.

2. అష్టాదశ వర్ణనా నియమము చెప్పి, ఆ శబ్దమును వాడి, వానినన్నిటిని తన గ్రంథమందు వర్ణించినాడు.

3. కాళిదాస, ఉద్భటుల నుండి ప్రసిద్ధ వస్తువును తీసికొని స్వతంత్ర ప్రబంధ మును నిర్మించినాడు.

4. కుమార సంభవము శృంగార రస ప్రధానమైనది. ప్రకృతి వర్ణనలకు ప్రాధాన్యము వహించిన కావ్యమది. రాయలును, రాయలనాటి కవులైన పెద్దన, తిమ్మన, సూరన, రామరాజ భూషణుడు మొదలగు ప్రబంధ కవులు, కొంచెముగనో, అధికముగనో కుమారసంభవకారుని అనుకరించినారు.

## 1:2 అష్టాదశ వర్ణనలు

కావ్యమందు వర్ణనలుండవలెనని సంస్కృతాలంకారికులు చెప్పిరి. ఆరవ శతాబ్ది వాడగు భామహుడు సర్గబంధమును మహాకావ్యమని చెప్పి, అందులో ఆయిదు వర్ణన లుండవలెనన్నాడు.

> "సర్గబంధో మహాకావ్యం మహతాంచ మహచ్చయత్
> అగ్రామ్య శబ్దమర్థ్యంచ సాలంకారం సదాశ్రయం
> మంత్రదూత ప్రయాణాజి నాయకాభ్యుదయైశ్చయత్
> పంచభిస్సంధి భిర్యుక్తం నాతివ్యాఖ్యేయమృద్ధిమత్" —కావ్యాలంకారము 1-19

మహాకావ్యమందు నాయకుడు ధీరోదాత్తుడు. పైని పేర్కొన్న మంత్ర, దూత, ప్రయాణ, ఆజి, నాయకాభ్యుదయములు కేవలము నాయకునికి సంబంధించినవే.

దండి తన కావ్యాలంకార సంగ్రహమందు 18 వర్ణన లుండవలెనన్నాడు. ఆ పదునెనిమిదిలో భామహుడు చెప్పిన మంత్ర, దూత, ప్రయాణ, ఆజి, నాయకాభ్యుదయములు గూడ నున్నవి.

> "నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనైః
> ఉద్యాన సలిలక్రీడా మధుపానరతోత్సవైః
> విప్రలంభై ర్వివాహైశ్చ కుమారోదయ వర్ణనైః
> మంత్రదూత్య ప్రయాణాజి నాయకాభ్యుదయైరపి"
>
> —దండి. కావ్యాదర్శ. 1-16,17

ధండి తన కావ్యాదర్శమున కావ్యభేదముల గురించి చెప్పుచు సర్గబంధమును నది మహాకావ్యమన్నాడు. "ఆశీస్సుతోగాని, నమస్కారముతోగాని, వస్తు నిర్దేశముతో గాని, మహాకావ్యము ప్రారంభింపబడవలెను. ఇతిహాసములోని కథగాని, మరేదేని గాని, తీసికొని ధర్మార్థ మోక్షదాయినిగా - చతురోదాత్త నాయకాన్వితముగా చేయవల యును" అన్నాడు. కావ్యవస్తువును గురించి భామహుని వలెనే చెప్పినాడు.

అట్లు చెప్పిన యనంతరము :-

నగరము, సముద్రము, శైలము, ఋతు, చంద్రోదయను, సూర్యోద యము, ఉద్యాన క్రీడా, సలిల క్రీడా, మధుపాన, రతి, విప్రలంభ. వివాహ, కుమారో దయ, మంత్ర, దూత్య, ప్రయాణ, ఆజి, నాయకాభ్యుదయములను (పదునెనిమిది) వర్ణనలు కావ్యమున నుండవలెనన్నాడు. వేదాదులను చూచియు, తర్వాత వెలసిన రామాయణాది కావ్యములను చూచియు,అందు వర్ణితమైన బాహ్యాంతర ప్రకృతి వర్ణనలు చూచియు, ఈవర్ణన లుండవలెనని నిర్ణయించినాడు. దండి తరువాతి కావ్యాలలో నీ లక్ష ణము తప్పక పాటించుట జరిగినది.

ఈ పదునెనిమిది వర్ణనలు ఇదేక్రమమున నుండవలెనని గాని, ఇంతకు తక్కువ ఎక్కువలు ఉండరాదని గాని - దండి చెప్పలేదు,

సరస్వతీ కంఠాభరణమున భోజుడు వర్ణనల విషయమున నిట్లు చెప్పినాడు. (10 వ శతాబ్దివాడు)

> "పురోపవన రాష్ట్రాది సముద్రాశ్రయ వర్ణనైః
> దేశ సంపత్ ప్రబంధస్య రసోత్కర్షాయ కల్పతే
> ఋతు రాత్రిం దివార్కేందూదయాస్తమయ కీర్తనైః
> కాలః కావ్యేషు సంపన్నో రసపుష్టిం నియచ్ఛతి
> రాజకన్యా కుమారస్త్రీ సేనా సేనాంగ భంగిభిః
> పాత్రాణాం వర్ణనం కావ్యే రససోత్కర్షోఽధి తిష్ఠతి
> ఉద్యాన సలిల క్రీడా మధుపాన రతోత్సవాః
> విప్రలంభ వివాహోశ్చ చేష్టాః కావ్యే రసావహాః

మంత్ర ద్యూత ప్రయాణాజి నాయకాభ్యుదయాదిభిః
పుష్టిః పురుషకార్యస్య రసం కావ్యేషు వర్షతి
నావర్ణనం నగర్యాదేః దోషాయ విదుషాంమతం
యదిశైలర్తు రాత్ర్యాదేః వర్ణనే నైవ తుష్యతి
గుణతః ప్రాగుపన్యస్య నాయకం తేన విద్విషాం
నిరాకరణ మిత్యేష మార్గః ప్రకృతి సుందరః
వంశవీర్యశ్రుతాదీని వర్ణయిత్వాఽపోరపి
తజ్జయాత్ నాయకోత్కర్ష కథనంచ ధినోతినః"

— సరస్వతీ కంఠా. పుట. 169,70.
నిర్ణయసాగర్ ప్రెస్. 2 వ ముద్రణ 1934.

పైన పుర, ఉపవన, రాష్ట్ర, సముద్ర, ఆశ్రమ, ఋతు, రాత్రి, దిన, అర్క, ఇందు, రాజకన్యా, కుమార, స్త్రీ, సేన, సేనాంగ, ఉద్యాన, సలిల క్రీడ, మధుపాన, రతి, విప్రలంభ, వివాహ, మంత్ర, ద్యూత, ప్రయాణ, ఆజి, నాయకాభ్యుదయము అను వర్ణనలు మొత్తము 26 పేర్కొన్నాడు.

వర్ణనలను, ప్రయోజనములను చెప్పినాడు.

1. పుర, ఉపవన, సముద్ర, ఆశ్రమ, రాష్ట్ర — వీని వర్ణన వలన దేశ సంపద వ్యక్తమగును. ప్రబంధము రసవత్తర మగును.

2. ఋతువు, రాత్రి, పగలు, సూర్యచంద్రోదయాస్తమయములు - వీని వర్ణన వలన కాలము తెలియును. కావ్యమునకు రసపుష్టియు చేకూరును.

3. రాజకన్య, రాజకుమార, రాజస్త్రీ, సేన, సేనాంగము - వీని వర్ణన వలన పాత్ర వర్ణన సిద్ధించును. కావ్యము రసవంతమగును.

4. ఉద్యాన, సలిలక్రీడ, మధుపాన, రతోత్సవ, విప్రలంభ, వివాహ :- వీని వలన పాత్రల చేష్టలు వ్యక్తమగును. కావ్యమున కివి రసావహములగును.

5. మంత్ర, ద్యూత, ప్రయాణ, నాయకాభ్యుదయ — వీని వర్ణన వలన పురుషకార మునకు పుష్టి జరుగును. కావ్యమున రసాభివృద్ధి యగును.

6. నగర్యాది వర్ణన లేనిచో దోషమని పండితులు భావింతురు.

7. శైలర్తు రాత్ర్యాది వర్ణన మాత్రమే చేసి కేవలము నాయకుని గుణగణాలు మాత్రమే వర్ణించి యూరకున్నను, కావ్యము సుందరముగనే యుండును. ప్రతి

పక్షులను బాగుగ వర్ణించి అనగా వారిని గొప్పగా వర్ణించి, నాయకుడు వారిని జయించునట్లు చేసినచో, నాయకుని గొప్పతనము ఇంకను బాగుగ వ్యక్తమయి కావ్యము రసవత్తరముగా నుండును.

ఇతడు భామహుని వలెను దండివలెను దూత్య మనక, ద్యూత మనుచున్నాడు.

ఆ తర్వాతి వాడగు విద్యానాథుడు (14 వ శతాబ్ది) తన ప్రతాపరుద్రీయమున పదునెనిమిది వర్ణన లుండవలెనని చెప్పినాడు. దండి చెప్పిన వరుసలో అట్లే చెప్పినాడు. కాని దూత్యమునకు మారు ద్యూత మన్నాడు.[1] ఈవిషయమున నితడు భోజుని అనుకరించినాడు.

భామహుడు, దండి, 'అష్టాదశ' శబ్దమును వాడలేదు. కాని విద్యానాథుడు పేర్కొన్నాడు.[2]

ఆ తరువాతి వాడయిన అనగా దాదాపు అదే కాలమునకు సంబంధించిన, విశ్వనాథకవిరాజు తన సాహిత్య దర్పణమందు వర్ణనలగూర్చి చెప్పుచు అష్టాదశ సంఖ్యను మించినాడు.

భామహుడును, దండియును, విద్యానాథుడును చెప్పిన 18 వర్ణనలకు బదులు విశ్వనాథుడు 25 వర్ణనలకు పెంచినాడు. అందు 1. సంధ్య, 2. రజనీ 3. ప్రదోష, 4. ధ్వాన్త, 5. వాసర, 6. ప్రాతః 7. మధ్యాహ్న, 8. మృగయ, 9. ముని, 10. స్వర్గ 11. అధ్వర అనునవి అష్టాదశలో చేరలేదు. మిగిలిన 14 ను అష్టాదశ

1. నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనం
ఉద్యాన సలిల క్రీడా మధుపాన రతోత్సవాః
విప్రలంభో వివాహశ్చ కుమారోదయ వర్ణనం
మంత్రద్యూత ప్రయాణాజి నాయకాభ్యుదయాఅపి

— విద్యానాథప్రతాపరుద్రీయము, మహాకావ్యాది
ప్రబంధనిరూపణం - (కావ్యప్రకరణం) శ్లో. 69, 70

2. ఏతానియత్ర వర్ణ్యంతే తన్మహాకావ్యముచ్యతే
ఏషామష్టాదశానాం యైః కైశ్చిదూనమపీష్యతే"

— ప్రతాప. కావ్యప్రకరణం. 71,

(దండి) లో చేరియున్నవి. పై విధముగ నిరువది యైదు వర్ణనలను పేర్కొన్న యనంతరము 'ఆదయః' అన్నాడు, అనగా సంఖ్యా నిర్ణయము లేదని యర్థము.

పూర్వకవుల రచనలలో ఎన్నియో వర్ణనలుండగా సంఖ్యా నిబద్ధముచేయుట మంచిది గాదను తలంపుతో అతడట్లు చేసియుండును.

తర్వాతి వాడగు కేశవ మిశ్రుడు పై దండ్యాదులు చెప్పిన 18 వర్ణనలతో గాని, 25 వర్ణనలతో గాని ఆగక 34 వర్ణనలుండవలెనని తన అలంకార శేఖరమున వ్రాసినాడు.[2]

అవి 1. రాజా. 2. దేవి 3. దేశ 4. గ్రామ 5. పురి 6. సరిత్తు 7. సరస్సు 8. అబ్ధి 9. అరణ్య 10. ఉద్యాన 11. అద్రి 12. ప్రయాణ 13. రణ 14. వాజి 15. హస్త 16. అర్క 17. చంద్ర 18. ఋతు 19. వివాహ 20. స్వయంవర 21. సుర 22. పుష్ప 23. అంబుకేళి 24. సంభోగ 25. విశ్లేష 26. మృగయ 27. ఆశ్రమ 28. ప్రాతః 29. మధ్యాహ్న 30. సంధ్య 31. వయస్సంధి. 32. ధాతు. 33. వృక్ష 34. అభిసారిక. ఇతడు గూడ సంఖ్యా నియమమునుగాని, సంఖ్యాక్రమమును గాని పాటించవలెనని చెప్పలేదు. ఇతడు చెప్పిన వర్ణనలలో 14 దండి చెప్పినవే. మిగిలిన 19 వర్ణనలు అధికముగా చెప్పినాడు.

కేశవమిశ్రుడు తన అలంకార శేఖరమందే పై ముప్పదినాలుగు వర్ణనలు వర్ణించుతటి ఏమేమి వర్ణింపవలెనో ఆ వివరములను విశదీకరించి యున్నాడు. ఎట్లు వర్ణింపవలెనో, ఆ ప్రక్రియను వివరించిన మొదటి లాక్షణికుడితడే.

---

1. సంధ్యా సూర్యేందురజనీ ప్రదోషధ్వాన్త వాసరాః
   ప్రాతర్మధ్యాహ్న మృగయా శైలర్తు వనసాగరాః.
   సంభోగ విప్రలంభౌచ మునిస్వర్గ పురాధ్వరాః
   రణ ప్రయాణోప యమ మంత్ర పుత్రోదయాదయః
   వర్ణనీయా యథా యోగం సాంగోపాంగా అమీఇహ.

   —విశ్వనాధ సాహిత్యదర్పణము - 6వ పరిచ్ఛేదము.
   కారికా సంఖ్య. 322, 23.

2. వర్ణ్యశ్చ రాజాదేవీచ దేశోగ్రామ పురీసరిత్
   సరోబ్ధ్యరణ్యోద్యానాద్రి ప్రియాణ రణ వాజినః
   హస్త్యర్క చంద్రావృతవో వివాహోథ స్వయంవరః
   సురా పుష్పాంబు సంభోగ విశ్లేష మృగయాశ్రమాః
   కాలాంతరం వయస్సంధి ధాతువృక్షాభిసారికాః

   —కేశవమిశ్రుని అలంకారశేఖరము 16వ మరీచి. శ్లో. 1
   కావ్యమాల సీరిస్ 50 -నిర్ణయసాగర్ ప్రెస్, బొంబాయి. 1926

అష్టాదశ వర్ణనలు - సంస్కృత లాక్షణికుల మతము

| వర్ణన | దండి కావ్యాదర్శ | భోజు సరస్వతీ కంఠాభరణ | విశ్వనాథ కవిరాజ సాహిత్యదర్పణము | కేశవ మిశ్రి అలంకార శేఖరము |
|---|---|---|---|---|
| 1. నగర | ,, | ,, | ,, | ,, |
| 2. అర్ణవ | ,, | ,, | ,, | ,, |
| 3. శైల | ,, | ,, | ,, | ,, |
| 4. ఋతు | ,, | ,, | ,, | ,, |
| 5. చంద్రోదయ | ,, | ,, | ,, | ,, |
| 6. సూర్యోదయ | ,, | ,, | ,, | ,, |
| 7. ఉద్యాన | ,, | ,, | ,, | ,, |
| 8. సలిలక్రీడ | ,, | ,, | ,, | ,, |
| 9. రతి | ,, | ,, | ,, | ,, |
| 10. మధుపాన | ,, | ,, | ,, | ,, |
| 11. విప్రలంభ | ,, | ,, | ,, | ,, |
| 12. వివాహ | ,, | ,, | ,, | ,, |
| 13. కుమారోదయ | ,, | ,, | ,, | ,, |
| 14. మంత్ర | ,, | ,, | ,, | ,, |
| 15. దూత్య | ,, | ద్యూత | ద్యూత | ద్యూత |
| 16. ప్రయాణ | ,, | ,, | ,, | ,, |
| 17. ఆజి | ,, | ,, | ,, | ,, |
| 18. నాయకాభ్యుదయ | ,, | ,, | ,, | ,, |

అయిన పాల్కురికి సోమనాథుడు గూడ అష్టాదశ వర్ణన లుండవలెనని చెప్పినాడు :[1]

నన్నయభట్టుగాని - తర్వాతివారగు తిక్కనాదులుగాని చెప్పలేదు. వారు లాక్షణికులు కారు కావున చెప్పలేదేమోయని సమాధానము చెప్పుకొనజూచుచో నన్నెచోడుడు గూడ వారి వలె కవియే. వారనువాదకవులు కాబట్టి చెప్పలేదేమోయని సమాధానము చెప్పుకొనవలెను. నన్నెచోడుడు ప్రబంధధోరణి కలవాడు. కావుననే తాను రచింపబోవు కావ్యమున అష్టాదశ వర్ణన లుండవలెనన్న భావముతో ఆనియమము నుల్లేఖించినాడు.

నన్నెచోడుడు కేవలము దండ్యాచార్యుడు చెప్పినన్నిటినే-వానినే- చెప్పినాడు.

> వన, జలకేళీ, రవి, శశి,
> తనయోదయ, మంత్ర, రతి, క్షితిప, రణాం,
> బునిధి, మధు, ఋతు, పురో, ద్వా
> హ, నగ, విరహ, దూత్య, వర్ణనాష్టాదశమున్" - కుమార-అవతారిక.

దండ్యాచార్యుడు పై వర్ణనలుండవలెనన్నాడు. పదునెనిమిదింటినే పేర్కొన్నాడు. కాని అష్టాదశ శబ్దమును వాడలేదు. పదమూడవ శతాబ్దివాడగు విద్యానాథుడు మాత్రము 'అష్టాదశ' అను శబ్దమును వాడినాడు.

అష్టాదశ శబ్దమును మొదటగా వాడిన తెలుగువాడు నన్నెచోడుడు. ఇతడు విద్యానాథునికి చాలా పూర్వుడు. అట్లగుటచేసి 'అష్టాదశ' శబ్దమును తొట్టతొలుతగా ప్రయోగించిన వాడు తెలుగువాడైన నన్నెచోడుడేయగుచున్నాడు. ఆతర్వాతి తెలుగు కవి పాల్కురికి సోమనాథుడు పదునెనిమిది వర్ణన లుండవలెనన్నాడు గాని వాని నామములను చెప్పలేదు.

ప్రబంధకవులకుపూర్వ లాక్షణికుడైన విన్నకోటపెద్దన అష్టాదశశబ్దమును వాడినాడు.[2] నన్నెచోడుని వలెనే 'దూత్య' శబ్దమును వాడినాడు.

---

1. "సత్కృతి యన నూత్న సంగతి దనర దొమ్మిదిరసములు తొలుకాడుదాని
యిమ్మడి వర్ణన లెసగంగ ద్విగుణ మగునలంకారముల నలరారుదాని
ద్విగుణార్థభావముల్ దీటుకొనంగ తేట తెనుంగున ద్విపద రచింతు"

-పండితారాధ్య చరిత్ర - అవతారిక.

2. "పురవారాశి మహీ ధరర్తు శశభృత్సూర్యోదయోద్యానపు
ష్కరకేళీ మధుపాన మోహన వియోగ క్షేమ యాన స్వయం
వర పుత్రోత్సవ మంత్ర దూత్య రణ దోర్వైక్రాంతి సంకీర్తనా
కర మష్టాదశ వర్ణనాన్వితము తత్కావ్యంబు భవ్యంబిలన్''-కావ్యా. తృతీ.92

ఆ తరువాత పదునాఅవ శతాబ్దివాడగు భట్టుమూర్తి తన కావ్యాలంకార సంగ్రహమున 'అష్టాదశ' శబ్దమును ప్రయోగించి వివరించినాడు.[2] దండ్యాదుల ననుసరించియే చెప్పినాడు. ప్రతాపరుద్రీయ కర్త ననుసరింపలేదు. నన్నెచోడునివలె, కన్నడ మందలి (12వ శతాబ్ది) నాగవర్మ వలె కందపద్యము నేవాడుట ఒక విశేషము.

పదునేడవ శతాబ్దివాడగు అప్పకవి, పై వారి ననుసరింపక అప్పకవీయమున అష్టాదశ వర్ణన లుండవలెనన్నాడు.[3] ఇతడు

కొంతవఱకు సాహిత్య దర్పణము ననుసరించెనేమో. కాని ఇతడు దండివలె "ధూత్య" మనక విద్యానాథునివలె 'ద్యూత' మన్నాడు.

అప్పకవి చెప్పిన వర్ణనలలో గూడ కొంత జీవిత క్రమము లేకపోలేదు. ఇతడు తనకు పూర్వముండిన ఆంధ్రకవిలాక్షణికుల మతము ననుసరించి 'దూత్య' మనక 'ద్యూత' మనియే యన్నాడు. రాజు లెల్లరును ద్యూత ప్రియులే కావునను (కృష్ణదేవ రాయలు మొదలుగ) ముఖ్యముగ రాయల కొలువున జూదమందు గొప్పనేర్పరి యగు చినతిమ్మన కవి యుండెను కావునను, అప్పకవి ద్యూత శబ్దమునే తీసికొని

---

2. "ఇంక కావ్య ప్రభేదంబు నేర్పరింతు
వరుస నష్టాదశ విశిష్ట వర్ణనములు
గలుగవలయు మహాకావ్య తిలకమునకు
నెలమి తన్నామధేయంబు లెట్టివనిన"
పుర సింధు నగర్త్విన శశి
సరసీ వన మధు రత ప్రసంగ విరహమున్
పరిణయ తనయోదయ నయ
విరచన యాత్రాజి దౌత్య విభు వర్ణనమున్" –కావ్యా. సంగ్ర. భట్టుమూర్తి.

3. "పురమును ఋతు షట్కమును ప్రయాణంబును
శైలంబు వేటయు సాగరంబు
మౌనీంద్ర పుణ్యాశ్రమంబును మంత్రంబు
ద్యూతంబు పిదప నద్భుత రణంబు
"విషయంబు మద్యపానజ వికారంబును
వనవిహారంబును వారి కేళి
కన్యాంగ సౌందర్య కథనంబు హిమకరా
భ్యుదయంబు విప్రలంభోచితంబు
పద్మమిత్రోదయంబును పరిణయంబు
సురతమును దౌహృదంబును సుతజననము
ననగ నిరువది రెండు వర్ణనల గూర్చి
చెప్ప వలయు ప్రబంధంబు శ్రీనివాస" –అప్పకవీయము-1-28.

యుండవచ్చును. దండి తర్వాతి సంస్కృత లాక్షణికులు గూడ 'ద్యూత' శబ్దమునే వాడి యుండుటయు కారణము కావచ్చును.

తెనుగు కవిలాక్షణికులు పదునెనిమిది యనిగాని యిరువది రెండనిగాని, సంఖ్యా నిబద్ధము చేసినారు. విద్యానాథుడుతప్ప సంస్కృతములోగూడ ఎవరును సంఖ్యానిబద్ధము చేయ లేదు.

వర్ణనలు పదునెనిమిది యుండవలెనని కన్నడములో చెప్పినారు. తమిళమున చెప్ప లేదు. ఈ విషయము తమిళ కర్ణాటములందలి వర్ణనలతో తులన చేయునపుడు చర్చింపబడును.

## అష్టాదశ వర్ణనలు-సంస్కృతాంధ్ర కవి లాక్షణికులు

| | దండి | విద్యానాథుడు | విశ్వనాథ కవిరాజు | భోజరాజు | కేశవ మిశ్రుడు | నన్నిచోడుడు | విన్నకోట పెద్దన | భట్టుమూర్తి | అప్పకవి |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1. | 2. | 3. | 4. | 5, | 6. | 7. | 8. | 9. |
| 1. నగరము | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| 2. సముద్రము | ,, | ,, | ,, | ,, | పుష్ప అంబు | ,, | ,, | ,, | ,, |
| 3. ఋతు | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| 4. శైలము | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| 5. సూర్యోదయ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| 6. చంద్రోదయ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| 7. ఉద్యాన | ,, | ,, | ,, | ,, | అరణ్య ఉద్యాన | ,, | ,, | ,, | ,, |
| 8. సలిలక్రీడ | ,, | ,, | x | ,, | x | ,, | ,, | ,, | ,, |
| 9. మధుపాన | ,, | ,, | x | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| 10. రతి | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | సురతము దౌహృదము |
| 11. విప్రలంభ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, |

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 35. ధాతు | x | x | x | x | x | x | x | x | x |
| 36. వృత | x | x | x | x | ,, | x | x | x | x |
| 37. అభిసారిక | x | x | x | x | ,, | ,, | x | x | x |

కలా, సంధి, హస్తి, వాజ, రాణి, గ్రామ—ఇవి కేశవమిశ్రుని అలంకార శేఖరమున అధికము.

## ప్రబంధ కవులు - అష్టాదశ వర్ణనలు

| వర్ణన | నన్నెచోడ కుమార సంభవము | పెద్దన మనుచరిత్ర | తిమ్మన పారిజాతాపహరణము | రాయల ఆముక్తమాల్యద | సూరన ప్రభావతీప్రద్యుమ్నము | కళాపూర్ణోదయము | భట్టుమూర్తి వసుచరిత్ర | చేమకూర వారి విజయవిలాసము |
|---|---|---|---|---|---|---|---|---|
| పుర | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| వారాశి | ,, | కాసార వర్ణన | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| శైల | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| ఋతు | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| సూర్యోదయ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| ఉద్యాన | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| సలిలక్రీడ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| మధుపాన | ,, | x | x | x | x | x | x | x |
| రతి | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| విప్రలంభ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| వివాహ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| కుమారోదయము | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| మంత్ర | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| దూత్య | " | X | X | X | ,, | ,, | ,, | ,, |
| ప్రయాణ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | X |
| ఆజి | ,, | ,, | ,, | ,, | ,, | ,, | " | ,, |
| నాయకాభ్యుదయము | ,, | ,, | ,, | " | ,, | ,, | ,, | ,, |

## ప్రబంధ కవులు — కేవలప్రకృతి వర్ణనలు

| | కుమార. | మను. | పారి. | ఆముక్త | వసు. | కళా | ప్రభావతి | శృ. విలాసము |
|---|---|---|---|---|---|---|---|---|
| పుర | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| సముద్ర | ,, | కాసారవర్ణన | ,, | X | | ,, | ,, | ,, |
| పర్వత | ,, | ,, | ,, | X | ,, | ,, | X | ,, |
| వన | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| ఋతు | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| చంద్రోదయ | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| సూర్యోదయ | ,, | ,, | ,, | X | ,, | ,, | ,, | ,, |
| సలిలక్రీడ | ,, | ,, | ,, | X | ,, | ,, | ,, | ,, |
| సంధ్యావర్ణన | ,, | ,, | ,, | X | ,, | ,, | ,, | ,, |
| అంధకారవర్ణన | ,, | ,, | ,, | X | ,, | ,, | ,, | X |
| నక్షత్రవర్ణన | ,, | ,, | ,, | X | ,, | ,, | ,, | X |
| వేగుజుక్క | ,, | ,, | ,, | X | ,, | | ,, | X |
| కోడికూత | ,, | ,, | ,, | X | ,, | ,, | ,, | X |
| నది | ,, | ,, | ,, | X | ,, | ,, | X | ,, |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| సరస్సు | శరవణ సరసి | ,, | ,, | తీర్థకుండములు | శతతాళదఘ్న హ్రదము | | x | ,, |
| చంద్రోపాలంభన | ,, | ,, | ,, | | ,, | ,, | ,, | ,, |
| మన్మథోపాలంభన | x | ,, | x | x | ,, | కీరోపాలంభన | ,, | ,, |
| మలయమారుతోపాలంభన | x | ,, | x | x | ,, | కోకిలోపాలంభన | ,, | ,, |
| శైత్యోపచార | ,, | ,, | x | x | ,, | ,, | x | ,, |
| దోహదక్రియ | ,, | ,, | ,, | ,, | ,, | x | x | x |
| సర్వర్తువర్ణన | | | ,, | ,, | ,, | | x | x |
| దాదాపు | 400 పద్యములు | 181 పద్యములు | 93 పద్యములు | 225 పద్యములు | 180 పద్యములు | 117 పద్యములు | 26 పద్యములు | 69 పద్యములు |

## ప్రబంధములలోని మొత్తము పద్యములు - కేవల ప్రకృతి వర్ణన శాతము

| కావ్యములు | మొత్తము పద్యములు | ప్రకృతి వర్ణనలు గల పద్యసంఖ్య | శాతము |
|---|---|---|---|
| 1. కుమారసంభవము | 2005 | దాదాపు 400 | 20% |
| 2. మనుచరిత్ర | 669 | 131 | 19% |
| 3. పారిజాతాపహరణము | 517 | 93 | 18% |
| 4. ఆముక్తమాల్యద | 876 | 225 | 26% |
| 5. కళాపూర్ణోదయము | 1798 | 117 | 7% |
| 6. ప్రభావతీప్రద్యుమ్నము | 806 | 26 | 3% |
| 7. వసుచరిత్ర | 887 | 180 | 20% |
| 8. విజయవిలాసము | 770 | 60 | 7½% |

అన్నిటికంటెను ఎక్కువ శాతము ప్రకృతి వర్ణనా పద్యములుగలది ఆముక్తమాల్యద. అన్నిటికంటెను తక్కువశాతము ప్రకృతి వర్ణనాపద్యములుకలది ప్రభావతీప్రద్యుమ్నము.

## 1.3 వర్ణన పద్ధతి

ప్రబంధ నిర్వచనమును తల్లక్షణములను, అష్టాదశ వర్ణనలను, అందలి ప్రకృతి వర్ణనలను వివరించిన వెనుక వర్ణనాపద్ధతులగూర్చి కొంతచర్చింప వలసియున్నది. సంస్కృతమున ఇట్టి పద్ధతి గలదు. దానినే మనవారును అనుసరించిరి.

వర్ణించు తఱి అనుసరింపదగు అంశముల గుఱించి మొదటగా భరతుని నాట్యశాస్త్రమునుండి సూచన లభించుచున్నది. ఆయా ఋతువులను అభినయము ద్వారా ఎట్లు సూచింపవలెనో అతడు తన నాట్యశాస్త్రమున 15వ అధ్యాయములో వివరించినాడు. ఋతుధర్మము గలిగిన సహజ ప్రకృతి వస్తువులను రంగస్థలమున ప్రదర్శించుట ద్వారాగాని, ఆంగిక సంచలనముద్వారా గాని, ఋతువులు సూచింపబడును. పై వివరణ కేవలము నటనకును, రంగస్థలమునకును మాత్రమే పరిమితమైనను, ఆ ప్రదర్శిత వస్తువులు ఋతుధర్మముల సూచించునవియును ఆయా ఋతు జన్యములును, అగుటచేత కావ్యవర్ణన విషయమందుగూడ వానినే స్వీకరింపవచ్చును.

### వసంతర్తువు

"ప్రమోద జననారంభై రుపభోగైర్పృథక్ విధిః
వసంతస్త్వభినేతవ్యః నానాపుష్ప ప్రదర్శనాత్'' నాట్య. 15-33

(వేర్వేరు ప్రకారములుగా ఆనందము కల్గించు ఉపభోగ వస్తువుల చేతను, నానా పుష్ప ప్రదర్శనము చేతను వసంతర్తువును అభినయింపవలెను).

### గ్రీష్మ

"స్వేద ప్రమార్జనై శ్చైవ భూమితాపైస్సవీజనైః
ఉష్ణస్యవాయో స్పర్శేన గ్రీష్మంత్వభినయేత్ బుధః'' నాట్య. 25-34

(చెమటను తుడుచుకొనుట చేతను, విసనకఱ్ఱతో విసరుకొనుట చేతను, తాపానుభవ ప్రదర్శన చేతను గ్రీష్మమును ప్రదర్శింపవలెను.)

### వర్ష

"కాదంబ నీప కుటజైః శాద్వలై స్సేంద్ర గోపకైః
మేఘవాతై స్సుఖ స్పర్శై ప్రావృట్కాలం ప్రదర్శయేత్" నాట్య. 25-35

మేఘాఘనాదైర్ గంభీరైః ధారా ప్రపతనై స్తదా
విద్యున్నిర్ఘాత ఘోషైశ్చ వర్షా రాత్రం ప్రదర్శయేత్" నాట్య. 25-36

(కాదంబనీప కుటప పుష్పములచేతను, ఇంద్ర గోపములు గలిగిన పచ్చిక బయళ్ళతోడను, సుఖస్పర్శగలిగిన మేఘవాయువుల తోడను, వర్షాకాలమును సూచింపవలెను.

గంభీరములైన మేఘ సమూహముల గర్జనలతోడను, నిరంతర ధారా ప్రపాతము చేతను, విద్యున్నిర్ఘాత ఘోషల చేతను, వర్షారాత్రిని ప్రదర్శింపవలెను).

**శరత్**

"సర్వేంద్రియ స్వస్తతయా ప్రసన్న వదన స్తథా
విచిత్ర భూతలాలోకైః శరదంతు వినిర్దిశేత్" —నాట్య. 25-37

(సర్వేంద్రియముల ప్రసన్నత్వమును ప్రదర్శించుట చేతను, ప్రసన్న ముఖముల దాల్చుట చేతను, విచిత్ర భూభాగములను కనబడునట్లు చేయుటచేతను, శరత్కాలమును ప్రదర్శింప వలెను.)

**హేమంత**

"గాత్ర సంకోచ నాచ్చాపి సూర్యాగ్ని పటు సేవనాత్
హేమంత స్త్వభినేతవ్యః పురుషైర్మధ్యమాధమైః" నాట్య. 25-29

"శిరోదంతోష్ఠ కంపేన గాత్ర సంకోచ నేనచ
కూజితైశ్చ సశీత్కారై రధమాశ్శీత మాదిశేత్" నాట్య. 25-30

"అవస్థాంతర మాసాద్య కదాచిత్తుత్తమై రపి
శీతాభినయనం కుర్యాత్ దేవద్వ్యసన సంభవం" నాట్య. 25-31

(శరీరమును సంకోచింప జేయుటవలనను, అధికముగా సూర్యాతపసేవనమును, అగ్ని సేవనమును ప్రదర్శించుట వలనను, అధమ మధ్యమ పాత్రల ద్వారా హేమంతమును ప్రదర్శింపవలెను.

శిరమును, దంతములను, పెదవులను కంపించుట చేతను, గాత్ర సంకోచము వల నను ఉహూహూ అని ధ్వనులు చేయుట చేతను అధముల ద్వారా చలిని ప్రదర్శింపవలెను.

అననుకూల పరిస్థితులను బట్టియు, అవస్థాంతరమును బట్టియు ఉత్తములు గూడ శీతమునభినయింప వచ్చును.)

**శిశిర**

"ఋతు జానాంతు పుష్పాణాం గంధాఘ్రాణై స్తథైవచ
రూక్షస్యవాయో స్పర్శాచ్చ శిశిరం రూపయేత్ బుధః" —నాట్య. 25-32

(ఆ ఋతు సంభవ పుష్ప ప్రదర్శన చేతను, వాని గంధాఘ్రాణము చేయుట చేతను రూక్ష వాయుస్పర్శ నభినయించుటచేతను శిశిరమును ప్రదర్శింపవలెను.)

అది నాటక రంగమే యయినను, ప్రదర్శింపబడు వస్తువులన్నియు ప్రకృతి వస్తువులే గాన, ఇది ప్రకృతి వస్తు వర్ణనయే యగుచున్నది.

విన్నకోట పెద్దన రచించిన కావ్యాలంకార చూడామణి యందలి తృతీయాశ్వాసమున అష్టాదశ వర్ణనల నెట్లు చేయవలెనో వివరింపబడినది.

## 1. నగర వర్ణన

దుర్గమ పరిఖా వరణ నిసర్గ బలానీక చతుర చాతుర్వర్ణ్యా
నర్గళ సంపన్నవ జలవర్గ స్తుతి వలయు నగర వర్ణనమునకున్ – కావ్యాలం. 3.93.

## 2. సముద్ర వర్ణన

సిరి నెలవు గురుసుధా స్థియు
నరుదారగ నజుని తండ్రి యల్లుడు రత్నా
కరము దన పేరు జలధికి
సరిగలరే యరయ ననుచుజను వర్ణింపన్ —కావ్యాలం. 3–95

## 3. పర్వత వర్ణన

అచలతయును నున్నతియును
ఖచర వినోదౌచితియును గనకాద్రి ఖనీ
రుచితయును మొదలుగా గల
ప్రచురతలు నుతింప వలయు బర్వతమునకున్ –కావ్యాలం. 3–97

## 4. ఋతు వర్ణన

### వసంతర్తువు

అంకుర పల్లవ పత్త్రి సమాంకిత ముకుళ ప్రసూన హారి ఫలములన్
బొంకములగు వనములు నిశ్శంకముగ నుతింపబడు వసంతమునందున్
–కావ్యాలం. 3–99

### గ్రీష్మర్తువు

ధారాగృహముల నవ ఘనసారాదుల గంధ సార సరస పటీరో
శీరవ్యజనాదుల నింపారగ వర్ణింప దగు నిదాఘాగమమున్
కావ్యాలం. 3–101

**వర్షర్తువు**

తటిదటన మేఘపటలీ పటిశాంబర శక్రచాప కరకాప్రాత
స్ఫుట ధారాసారాది వికటత నుతింపంగవలయు ఘనకాలమునన్

—కావ్యాలం. 3-103

**శరదృతువు**

వెన్నెల సొంపును జుక్కలచెన్నును దెలుపారు దెసల చెలువంబులు వి
చ్ఛిన్నములగు జలదంబుల సన్నుతి సేయంగ వలయు శారదవేళన్

కావ్యాలం, 3-105

**హేమంతర్తువు**

బలవత్కాలీయక కంబళ ఘన కౌశేయపట్టి పటిమాంజిష్ఠం
బుల జనదు సీతు యువతుల వలిచన్నుల దక్కననుచు వలయు బొగడన్

—కావ్యాలం. 3-107

**శిశిరర్తువు**

శృశవిచ్ఛిన్నంబగు దిగ్దళకంబును గమలరుహ వితానము ప్రాతః
ప్రశిథిల రవికతమునుగా శిశిరము బొగడంగ దగు విశేషక్రియలన్

—కావ్యాలం. 3-109

## 5. చంద్రోదయము

మండలశోభయు గైరవషండవిలాసంబు జలధి సంజృంభణమున్
గొండొక వెన్నెల గ్రోలెడు నండజముల విధుని పొడుపు నందగు బొగడన్

—కావ్యాలం. 3-111

## 6. సూర్యోదయము

ఎచ్చట జూచిన జగముల నచ్చటన వెలుంగు ననియునజహరిహర తా
నచ్చుతుర డనియు మరియును నిచ్చకు దగ బొగడవలయు నిను నుదయంబున్

—కావ్యాలం. 3-113

## 7. వనవిహారము

బాలతర చైత్ర సంపత్పూరిత విభవముల వేడ్క పొంగుడు పడగా

నారీజన సహచరుడై యారామ విహారమొప్ప నధిపతి చేయున్ -కావ్యాలం.3-115

**8. జలవిహారము**

నీరజములు జెంగలువలు శైరవములు వీచికలును గరయంత్ర పయో
ధారలు నావర్తంబులు వారి విహారంబులందు వర్ణ్యములరయన్

-కావ్యాలం .3-117

**9. మద్యపానము**

సంబోధకరము మదనాలంబనము నశేషరస విలసితము నంత
రింపబిత వదనమునగు కాదంబరి నాపానమునకు దగునొడ గూర్పన్

-కావ్యాలం .3-119

**10. సురతము**

తనరు నెనుబదినాల్గుబంధముల యందు
నమరు బ్రచ్ఛన్నమును బ్రకటము ననంగ
సురతములు రెండు వానికి స్ఫురణ సొంపు
వలయు వర్ణింప నిఖిల కావ్యముల యందు -కావ్యాలం .3-121

**11. విప్రలంభము**

అచ్చపు వెన్నెలచే గడు నెచ్చుటలును మానమెడలి వెడవిల్తునిచే
నొచ్చుటలును బ్రియుడబ్బని ముచ్చటలును విప్రలంభమున జెప్పదగున్

-కావ్యాలం .3-123

**12. ప్రయాణము**

గజరథ హయనూచితమగు విజయమ్మన నుబ్బినడచు విశ్రుత వివిధ
ధ్వజని వినుతించు జెప్పుడు భజనీయము సుకవి సత్ప్రబంధములందున్

-కావ్యాలం .3-125

**13. వివాహము**

ప్రచుర స్వయంవరోచిత రచనలు గన్యాపరాభి రమ్యక్రియలున్
విచిత శుభాత్మక విధులును రుచిర వివాహంబులందు రూపింప దగున్

-కావ్యాలం .3-127

**14. పుత్రోదయము**

మిత్రానందోదయము నమిత్రత్రసనంబు శుభ నిమిత్తంబును స
త్పాత్రకృత వితరణంబును బుత్రోదయమందు దద్దపొగడగ వలయున్

-కావ్యాలం .3-129

**15. మంత్రము**

అవాషము వస్త్రంభము నగు గూఢాభ్యంతరములు హర్మ్యాగ్ర మహా
సా[illegible]బుల మంత్రము దగు నొనరింపంగ ననుచు దగు వర్ధింపన్

-కావ్యాలం .3-131

**16. దూత్యము**

ప్రతిభయు బహుమంత్ర విశేషితయును బతిరక్తియును దితిక్షయు నిర్మా
ల్జతయును సవ్యసనీతియు జతురతయును దూత్యమునను జనునుతియింపన్

-కావ్యాలం .3-133

**17. రణము**

పటురథకరిహరి భట సంఘటిత వ్యూహాదికములు ఘనఫలకాసి
స్ఫుట రుచులు విజయకారణ పటహాడంబరము బొగడబడు బోరాటన్

-కావ్యాలం .3-135

**18. నాయకాభ్యుదయము**

అహిత జనకోటి యార్తుల
నరుదారంగాచి హతుల యడియాలములన్
బిరుదాంబుం గైకొను న
న్నరపతి విజయంబు కీర్తనము సేయ దగున్

-కావ్యాలం .3-137

పైవివరమంతటి చాల వర్ణనలు ప్రకృతికి సంబంధించినవి.

16వ శతాబ్ది వాడగు కేశవ మిశ్రుడు తన 'అలంకారశేఖర' మందు వర్ణనా పద్ధతిలో మరికొన్ని వివరములను తెలిపినాడు;[1]

1. రాజవర్ణన : కీర్తి, ప్రతాపము, ఆజ్ఞ, దుష్టదండన, వివేకిత, శస్త్రాభ్యాసము, రాజనీతి, ఔదార్యము, ధైర్యము మొదలగునవి.
2. రాణివర్ణన: సౌభాగ లావణ్యాదులు, శీలము, మన్మథావస్థ, త్రప, చాతుర్య, దాక్షిణ్యము మొదలగునవి.
3. దేశము : పెక్కుగనులు, ద్రవ్యము, పశుసమృద్ధి, ధాన్యసమృద్ధి, నదీమాతృకత, దుర్గ, గ్రామ, జనాధిక్యాదులు.

---

1. వర్ణ్యాశ్చ రాజా దేవీచ దేశో గ్రామ పురీ సరిత్
సమో౽ద్రిరణో మంత్ర ద్యానాద్రి ప్రయాణరణవాజినః
హస్త్యర్క చంద్రా ఋతవో వివాహో౽థ స్వయంవరః
సురా పుష్పాంబు సంభోగః విశ్లేష మృగయాశ్రమాః
కలా ఋతు వయస్సంధీ ధాతు వృక్షాభిసారికా"

-అలంకార శేఖర.

4. గ్రామము : ధాన్యము, లతా వృక్షాదులు, సరస్సు, క్షేత్రము, హట్ట (అంగడి) మొదలగునవి.

5. పురము : అట్ట, పరిఖ, వప్రము, తోరణము, ధ్వజము, ప్రాసాదములు, ఆరామము, వాపీ నదీ సరస్సులు, వేశ్యలు మొదలగునవి.

6. సరిత్తు : జలప్రవాహము, గజములు, పద్మములు, హంసలు, షట్పదములు, వక్రత, తీరోద్యానము, స్త్రీ, పాంథ, కేళి మొదలగునవి,

7. అబ్ధి : ద్వీపము, అద్రి, రత్న, ఊర్మి, పోత, జలచర, నదీ ప్రవేశము, చంద్రుని వలని వృద్ధి, బడబాగ్ని, మేఘములు త్రావుట మొదలగునవి.

8. సరస్సు : లహరి, గజ, అంబుజ, షట్పద, హంస, నక్ర, జలకేళి మొదలగునవి.

9. అరణ్యము : హరి, వరాహ, ఇభ, ద్రుమ, కాక, ఉలూక, కపోతాదులు.

10. ఉద్యానము: మార్గము, ఫలములు, పుష్పములు,లతలు, శుకపిక కేళీ హంసలు, వనకేళి, పాంథులు మొదలగునవి.

11. శైలము : ఓషధులు, ధాతువులు, వంశములు, కిన్నరులు, ఋషులు, శృంగములు, తటములు, గుహలు, రత్నములు, ఉపత్యకలు, వనజంతువులు మొదలగునవి.

12. ప్రయాణము: భేరీభాంకరణము, భూకంపము, బలధూళి, ఉక్ష, గజ, ఛత్ర, శకటాదులు.

13. యుద్ధము : సైన్యధూళి, తూర్యధ్వని, సింహనాదము, శరమండపము, రక్తనదులు, రథచామర కేతు యోధ సురనారీవృత భటులు, పుష్పవృష్టి మొదలగునవి.

14. అశ్వము : వేగిత్వము, ఔన్నత్యము, తేజము, ఖురోత్ఖాతరజము. గతిచిత్రము మొదలగునవి.

15. గజము : కర్ణచాపలము, శత్రువ్యూహభేదకళ, కుంభములుండుట, దానజలము, తుమ్మెదలు మూగుట మొదలగునవి.

16. సూర్యుడు : అరుణత్వము, సూర్యకాంత,చక్రవాక, అంబుజ, పథిక లోచనములకు ప్రీతి గలిగించుట, నక్షత్రములకు, చంద్రునికి, ఓషధులకు, చీకటికి, చోరులకు, కులటలకు, పీడ కలిగించుట.

17. చంద్రుడు : కులటలకు, చక్రవాకములకు, అంబుజములకు, పీడ. చకోరములకు, చంద్రకాంతములకు, దంపతులకు ప్రీతి కలిగించుట.

18. ఋతు : అవసరము ననుసరించి ఋతు సహజత ననుసరించి వర్ణింపవలెను.

19. వివాహ : స్నానము, భూషణము, తూర్య, వేదఘోష, సంగీత, హోమ, లాజ మొదలగునవి,

20. సురాపాన: వికలత్వము మాటలలో నడకలో స్ఖలనము, లజ్జావమానముల వదలుట, కనులెఱ్ఱబడుట, కామాధిక్యము మొదలగునవి.

21. పుష్పాపచయము: పూలుగోయుట, ప్రియుడు పూలందిచ్చుట,కోపము,వక్రోక్తులు.

22. జలకేళి : సరస్సును క్షోభపరచుట, చక్రవాకములు, హంసలు తొలగిపోవుట, నీళ్లు చల్లుకొనుట, భూషణద్యుతి మొదలగునవి.

23. సురతము : సాత్త్విక భావము, సీత్కారము, కనులు ముడుచుకొనుట, కాంచీ కంకణ మంజీర రవములు, నఖాధర క్షతములు.

24. విరహ : తాపము, నిశ్వాసము, చింత, మౌన జాగర, కృశాంగత, క్షణము సంవత్సరముగా, రాత్రులు దీర్ఘములుగా, శిశిరము ఉష్ణముగా ఉండుట మొదలగునవి.

25. మృగయ : మృగ సంచారము, వలలు, మృగత్రాసము, మృగాధిక్యము, హింస, గతిత్వర మొదలగునవి.

26. ఆశ్రమము : అతిథిపూజ, క్రూర జంతువులు శాంతముగా ఉండుట, హోమ ధూమములు, మునికుమారికలు, వల్కలములు, ద్రుమములు, ఏణములు.

27. ప్రాతఃకాలము: పద్మములు వికసించుట, కోకదంపతులు ప్రీతి వొందుట, మొదలగునవి.

28. మధ్యాహ్నము : తాప బాహుళ్యత మొదలగునవి.

29. సాయంకాలము : సూర్యుని ఎరుపు, చక్రవాక పద్మములకు విప్లవము, సంధ్యారాగము మొదలగునవి.

30. అంధకారము: అతికాఠిన్యము, సమస్తలోకములను లోపింపజేయు సామర్థ్యము, అభిసారికా సంచారము మొదలగునవి.

31. సంధి : ఋతు సంధి, వయస్సు యొక్క సంధి వర్ణించుట.

32. వృక్షము : బహుశాఖాత్వము, ఆకుల దట్టతచే సూర్యుడగుపడకుండుట, ఉచ్చ్రత, పుష్ప ఫల సమృద్ధి, పథిక సేవ్యత్వము మొదలగునవి.

33. అభిసారిక : భయభ్రంశము మంజీరాదుల తిరస్కారము, సాహసము, అతి మోహము, కాలానుగుణ వస్త్రధారణ.

———

# ద్వితీయ ప్రకరణము

## తులనాత్మక పరిశీలనకై ఎన్నుకొన్న ప్రబంధములు - తులనాత్మక పరిశీలన

[illegible] ప్రకరణములందు ప్రకృతి వర్ణనల గురించిన చర్చ విపులముగ సాగినది. [illegible] బుద్ధియొక్కయు క్రీడయే ప్రకృతి వర్ణనలకు మూలమని చెప్పబడి [illegible] ప్రబంధములందు గల ప్రకృతి వర్ణనలు అతిమాత్రములును అతివేల [illegible]. అన్ని ప్రబంధములందలి ప్రకృతి వర్ణనలను పరిశీలించి చర్చించుట [illegible] కాబట్టి ప్రబంధ సాహిత్యమున ప్రశంసనీయమయిన కొన్ని ప్రబంధ [illegible] కొని అందలి ప్రకృతి వర్ణనలను తులనాత్మక పరిశీలన చేయుట [illegible].

[illegible] వ్యాసమునందు ప్రకృతి వర్ణనల తులనాత్మక పరిశీలనార్థము ఎనిమిది [illegible]. అవి 1. నన్నెచోడుని కుమారసంభవము, 2. పెద్దన [illegible], 3. [illegible] పారిజాతాపహరణము, 4. రాయల ఆముక్తమాల్యద, 5. [illegible], 6. సూరన ప్రభావతీప్రద్యుమ్నము, 7. భట్టుమూర్తి [illegible], 8. చేమకూర వెంకటకవి విజయవిలాసము.

### 1. కుమారసంభవము

[illegible] ప్రశస్తిని పొందినవి కేవలము రాయలనాటి కావ్యములును, ఆ [illegible] కాని రాయలకు దాదాపు అయిదువందల సంవత్సరములకు పూర్వు [illegible]డుడు రచించిన కుమారసంభవమును ప్రబంధమే.

[illegible]నాటి ప్రబంధముల వలెనే యిదియును స్వతంత్రమయిన దగుటయు వర్ణనా [illegible] యుండుటయు, శృంగారరస ప్రధానమగుటయు, ఆలంకారిక శైలి [illegible] కైక్యము గలిగి యుండుటయు, మొదలగు కారణములచేత నిది [illegible] పొందుచున్నది. ఇందు 20 శాతము ప్రకృతి వర్ణనలే.

[illegible] ప్రబంధమని పండిత విమర్శకుల అభిప్రాయము గూడ.

"ఈ కవిరాజ శిఖామణి యాంధ్రవాఙ్మయ మందలి యతి ప్రాచీనులయిన ప్రౌఢ కవులలో నొకడగుటయేగాక యీ వాఙ్మయమందలి ప్రధాన శాఖలలో నొకటగు ప్రబంధ శాఖకు మూలపురుషుడనదగి యుండుటయే యితని ప్రాముఖ్యమునకు స్వతస్సిద్ధమైన కారణములలో నొకటై యున్నది".

-కుమార. పీఠిక – పుట. 1. కోరాడరామకృష్ణయ్య.

'ఇతడు ప్రబంధ కవితా మార్గమునకు మార్గదర్శకుడైనాడు"

-కుమార. పీఠిక. పుట. 15. కోరాడరామకృష్ణయ్య.

## 2. మనుచరిత్ర

తెలుగున ప్రబంధ మనగానే మొదటగా స్ఫురించునది మనుచరిత్రయే. కుమార సంభవము ఆది ప్రబంధ మయినను దాని తరువాత దాదాపయిదువందల యేండ్లవఱకు ఆ ప్రబంధ ధోరణి మరుగున బడినది. నన్నయ మొదలు శ్రీనాథుని వఱకు గల కవులు సంస్కృత పురాణ కావ్యాదుల ననువాదము చేసిరేగాని స్వతంత్ర కావ్య సృష్టి చేయలేదు. క్రొత్త మార్గమును త్రొక్కి స్వతంత్రమును, వర్ణనాత్మకమును అయిన ప్రబంధ సృష్టికి మొదట పూనుకొన్నవాడు పెద్దనే. అష్టాదశ వర్ణనలు చాలవఱకు ప్రకృతి వర్ణనలు. ప్రకృతి వర్ణనలు కనీసము 19 శాతము గల కావ్యము కావుననే మనుచరిత్రను స్వీకరించుట జరిగినది.

## 3. పారిజాతాపహరణము

'ముక్కుతిమ్మనార్యు ముద్దుపల్కు' అన్న పలుకులకు సాఫల్యము పొందించిన కావ్యము పారిజాతాపహరణము. ప్రకృతి వర్ణనలను—అందునను చంద్రోదయాది వర్ణనలను—ప్రకృష్టముగ, విస్తారముగ గల్గిన కావ్యము. దాదాపు అష్టాదశ వర్ణనలన్నియు నిందు గలవు. ప్రబంధ యుగమునకు చెందిన పంచకావ్యములలో నిది యొకటి. ఇందు 18 శాతము ప్రకృతి వర్ణన లున్నవి.

'ఆంధ్ర ప్రబంధములలో పరిమాణమున చిన్నదయ్యును, రసపరిమళముచే నాంధ్ర రసికుల మైమఱపించు కావ్యమందారము పారిజాతాపహరణము.'

—డాక్టర్ దివాకర్ల—కావ్యలహరి. పుట 81

## 4. ఆముక్తమాల్యద

సాహితీ సమరాంగణ సార్వభౌముడయిన కృష్ణదేవరాయ కృతము ఆముక్తమాల్యద. కేవలము వర్ణనల కొఱకును, వైష్ణవమత ప్రచారమునకును కావింపబడిన ప్రబంధము. వర్ణనా బాహుళ్యమును వర్ణనా వైవిధ్యమును ఈ గ్రంథమందున్నంత మరెందును గానము. ఇందలి ప్రకృతి వర్ణనలలో రాయలవారి సూక్ష్మపరిశీలనాపటిమ ప్రతిబింబించుచుండును. లోకజ్ఞత ప్రతిఫలించుచుండును. ఇందన్ని ప్రబంధములకంటె ప్రకృతి వర్ణనలు అధికము (26 శాతము).

ఇది ఋతువర్ణనా ప్రధానమగు ప్రబంధము, ఇంత సాకల్యముగ కాళిదాసు కూడ ఋతు వర్ణనలు చేయలేదు.

ఆముక్తమాల్యదను గురించి పండిత విమర్శకులయిన వేదం వెంకట్రాయశాస్త్రి గారి పలుకులు గమనించునవి:

"తెలుగున ఇంత ప్రౌఢమయిన ప్రబంధము వేరొక్కటి లేదు,"

-ఆము. పీఠిక, పుట. 1

"ఋతువర్ణనలకీ ప్రబంధము ప్రథమగణ్యము"

-ఆము. పీఠిక, పుట.2

## 5. కళాపూర్ణోదయము

కళాపూర్ణోదయకర్త పింగళి సూరన నూత్నాతినూత్న భావనా సంపన్నుడు. చిత్రాతిచిత్ర కథాకథన పాటవముగలవాడు. ఈ ప్రబంధమందష్టాదశ వర్ణనలు దాదాపు పూర్ణముగ అనుసరించబడినవి. ప్రకృతి వర్ణనలు 7 శాతము గలవు. అందులో చాల భాగము సరికొత్త పద్ధతిలో నడిచినవి. సముద్రవర్ణన ఇందుకు ప్రబలోదాహరణము.

"ప్రబంధ కవులెవ్వరిలోను కనబడని ప్రతిభ, భావనా శక్తి, సందర్భశుద్ధి, పాత్రోచిత [illegible]- ఇతని సుప్రసిద్ధము"

-డాక్టర్ సి. ఆర్. రెడ్డి, - కవిత్వతత్త్వవిచారము, 3 భా. పు. 65

## 6. ప్రభావతీప్రద్యుమ్నము

ఇది గూడ పింగళి సూరన కావ్యమే. ఒకే కవివి రెండు కావ్యములను తీసి కొనుట, అవి రెండును ప్రబంధ యుగ ప్రసిద్ధ కావ్యములగుట చేత. సమకాలీనుడగు మహాకవి భట్టుమూర్తితో పోటీ పడుటచేత. ప్రకృతి వర్ణనలను కలిగి యుండుటచేత. ఇందన్ని ప్రబంధముల కంటె ప్రకృతి వర్ణనలు కనీస శాతములోనున్నవి (3 శాతము).

ఇది మధురమైన- శృంగారరస ప్రధానమైన- నాటకీయమైన- ప్రబంధరాజము. "అష్టాదశ వర్ణనలు దాదాపు అన్నియు చేసియున్నాడు"

-సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి, పీఠిక -పు. 8

## 7. వసుచరిత్ర

ఏతత్కర్త రామరాజభూషణుడు అమేయ మేధాసంపన్నుడు, అతిలోక భావుక చక్రవర్తి.

ఆంధ్రప్రబంధములలో నెల్ల అగ్రగణ్యమగు ప్రబంధము వసుచరిత్ర. దీనిని ప్రకృతి కావ్యమన వచ్చును. ఇందలి శుక్తిమతి, కోలాహలుడు కేవలము జడ ప్రకృతి వస్తువులు. అయినను వారిరువురును, నాయకీ నాయకులుగా, ప్రేమైక మూర్తులుగ, సరస మనోహర వ్యక్తులుగ, గిరికా వసుపదులకు తలిదండ్రులుగ వర్ణింపబడుచున్నారు. ప్రకృతిని ఇంతగా మానవీకరణ పొందించిన ప్రబంధము ఏ భాషయందును నభూతో నభవిష్యతి. ఈ మహాప్రబంధమును గూర్చి పలువురు మహాపండితులు ప్రవచించిన విశేష ముల నీ క్రింద పొందుపఱచుచున్నాను.

"కారణజన్ముడై కవినికాయము మెచ్చగ గావ్యకర్తయై
భూరికశాకలావుడయి పొల్పువహించిన బట్టుమూర్తిచే
నీరితమై సుఖార్థ సదహీన పదాస్పదమైన యా వసు
ర్మా రమణ ప్రవృత్తము సుసాధ్యము గాదు తలంచి చూడగన్"

—సోమకవి, వసుచరిత్ర పీఠిక. పుట. 1

### శేషాద్రిరమణకవులు

"శబ్దాలంకార రచనా కౌశలము, రామరాజ భూషణుని యెడల సహజమగుటచే నలంకారాభిరామములగు పద్యములలో మచ్చున కేని వ్యర్థవాక్యముగాని, భావలోపము గాని గానరావు"

"దక్షిణాంధ్ర సారస్వతోద్యానమున ప్రతి పద్య పుష్పమునుండి శబ్దార్థ చమత్కృతి సౌరభ్యమును వెదజల్లి విద్వజ్జనమనోబంభరముల కాప్యాయన మొదవించు మనోహర ప్రబంధము విజయవిలాసము. -ఆచార్య దివాకర్ల — కావ్యలహరి పుట. 172

వసుచరిత్రను ప్రక్కనిడికొనియే విజయవిలాస రచన చేసినాడనవచ్చును. కవి అమేయ మేధాసంపన్నుడును, అతిలోక భావుకతా ప్రగల్భుడును, అనన్య సామాన్య కల్పనా ధురీణుడును అగుటచేత వసుచరిత్ర ప్రక్క తన విజయ విలాసమునకు స్థానము కల్పించుకొన గలిగినాడు.

———

# తృతీయ ప్రకరణము

## పురవర్ణన - తులనాత్మక పరిశీలన

ఆంధ్రప్రబంధములందలి ప్రకృతి వర్ణనలు రసధునులు. తత్కావు లమేయ భావనా సంపన్నులు. పాండితీ ప్రపూర్ణులు.

వర్ణిత వస్తువు ఒకటే అయినను ఆ వస్తువు ఒక్కొక్క కవికి ఒక్కొక్క తీరుతో దర్శన మిచ్చును. శైలి కేవలము వ్యక్తిగత మయినట్లే భావనాధోరణి గూడ వ్యక్తిగత మైనట్టిదియును స్వతంత్రమైనట్టిదియును. ఒకే వస్తువును వర్ణించు తటి భిన్నభిన్న కవులేయే దృష్టికోణములతో పరిశీలించిరో, ఆ విషయమున భేదసాదృశ్యములను సాకల్యముగ వివరించునదే తులనాత్మక పరిశీలన.

ప్రస్తుతము ప్రబంధములలోని ప్రకృతి వర్ణనలలో నొక్కొక్కదానిని తీసికొని తులనాత్మకపరిశీలనకై యెన్నుకొన్న కుమార సంభవాద్యష్టప్రబంధములలో దానినెట్లు వర్ణించిరో వివరించుచు ఆయా కవుల నేర్పులందలి తరతమ భావాలను పరస్పరము పోల్చుటే గాక సంస్కృత తమిళ కర్ణాటక భాషాకవులు వర్ణించిన వానితోగూడ పోల్చుట జరుగును.

## పుర వర్ణన

సర్గబంధ మహా కావ్యములో పురవర్ణన యుండవలెనని దండి తన కావ్యాదర్శమున (1-16) చెప్పినాడు.

విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణి యందు అష్టాదశ వర్ణనలను ఉల్లేఖించుచు పురవర్ణన చేయు సమయమున "దుర్గము, పరిఖ, బలానీకము, చాతుర్వర్ణ్యము, సంపద, వనము, జలము" మొదలగు నంశముల వర్ణింప వలెనన్నాడు. (కావ్యాలం. 3-93)

కేశవమిశ్రుడు "అట్ట, పరిఖ, వప్రము, తోరణము, ధ్వజము, ప్రాసాదములు, ఆరామము, వాపి, నదీ సరస్సులు, వేశ్యలు" మొదలగు వానిని పుర వర్ణనము చేయుతటి వర్ణింపవలెనన్నాడు. (అలం. 16-1).

లక్ష్యములబట్టి లక్షణములు తయారగుచుండును. లక్ష్యములు ముందటివి. లక్షణములు తర్వాతివి. కావున పూర్వకవులు అనుసరించిన వర్ణనా పద్ధతుల విమర్శించునపుడు (ఆ కవులనే చూచి క్రోడీకరించి వ్రాసిన) తరువాతి లాక్షణికుల లక్షణ సూత్రములను ఉల్లేఖించినచో దొసగు లేదు. కేశవ మిశ్రుడు రామరాజ భూషణుని సమకాలికుడయి నను అతని అలంకారశేఖర లక్షణ సూత్రముల నుదాహరించుకొనుచో అక్రమము గాదు.

## పుర వర్ణన - కుమారసంభవము

కుమార సంభవము నందలి ఏడవ ఆశ్వాసమున హిమవంతుని పట్టణమైన ఓషధీప్రస్థ పురము 40 పద్యాలలో వర్ణింపబడినది. అది తన గొప్పతనమున, పద్మాసనునకును, అమరావతికిని, అంభోధికిని, అలకా పట్టణమునకును సాటి చెప్పబడినది.

> "వేదాదులగు మహావిద్యలకెల్లను
> వనజాసనుడుఁ దానునునికి పట్టు
> శృంగారవతులగు నంగనావళికెల్ల
> నమరావతియుఁ దాను నాలయంబు
> లను పమానర్ఘ్య రత్నానీకములకెల్ల
> నంభోనిధియుఁ దాను నాకరంబు
> క్షయంబగు నసంఖ్యార్థరాసులకెల్ల
> నలకయుఁదానును నిలయములన
> వఱలు పేర్మితో భారత వర్షమునకు
> భూషణంబన నధిక విభూతిఁ దనరి
> పరగు హిమ నగాధీశ్వరు పురవరంబు
> ప్రస్తుతంబగు నోషధీప్రస్థ పురము" —కుమార. 7-89.

పైన ఓషధీప్రస్థ పురము విద్యలకును, రూపవతులకును, రత్నములకును, ధన రాసులకును, ఉనికిపట్టుగా వర్ణితము.

హాలికనితంబినులు, కమల వనములు కాచుచు, అందు ప్రవేశించిన చక్రవాకములను తరుముట, అను సహజ కార్యమును వర్ణించుచున్నాడు కవి. ఆ విధముగ తరుమబడు చక్రవాకములు పారిపోక వారి స్తన చక్రవాకముల చూచుచు అల్లే ఆగిపోయిన వని ఈ క్రింది పద్యమున ఉత్ప్రేక్షించుచున్నాడు.

"హాలిక నితంబినీతతి ప్రయత్నము నం దమ కాచియున్న య
క్కలమ వనాళి జక్ర విహగంబులు సొచ్చినం జోపి పుచ్చం జే
తులు చలువంగ నెత్తుటయుం దుంగ కుచంబులు వానిసాగు న
ప్పులుగుల యొప్పు దమ్ము వెఽం బోలినం బఱము సేయునట్టివై" - కుమార. 7-91

తరువాత పురమందలి వనములన్నియు నానాఫలభరితములై యొప్పియుండుటను వర్ణించుచున్నాడు. ఇది సహజ ప్రకృతి వర్ణన.

"నిమ్మలు మాదీఫలమ్ములు నతిరమ్యా
మ్ముగ బండి నేలపై మోచియుండు
బనసలు నీడలుం బండి గుత్తులు గట్టి
వారక వానిపై ప్రాలియుండు
దేరు మామిండ్లును నేరేళ్ళు గడు జెల్వా
మై పండి వానిపై నదికియుండు
గ్రముకంబులును వర ఖర్జూర నికరంబు
నొగి బండి వాపిపై నొఱగియుండు

నాలికేరములును దాల సమూహంబు
బండి వానిం గప్పియుండు నొప్పి
వరుసదర తరంబ వనములు సత్ఫల
రాసులై సభమున రాయుచుండు"

-కుమార. 7-93.

వనములందును పొలములందును గల నానాపక్షి రుతములును కృతనగ తటమందలి కేకీరవములును, కలమ వనరక్షాపరులగు కాంతల మంజుధ్వానములును సంకులముగ వరుసగా నెగసినవని కోలాహల ధ్వనులను వర్ణించుచున్నాడు.

"ఫల భారానమ్రచూడ ప్రకర విహర దుత్పన్న కీరాళిపుంస్కో
కిల రావంబుల్ సెలంగం గృతక నగ తటాకీర్ణ కేకీరవంబున్
గలయందద్ఘోషమోలింగలమవన సురక్షా పరానంత కాంతా
కుల మంజుధ్వానమున్ సంకులముగ వరుసంగూడి చెల్వంది మ్రోయన్"

-కుమార. 7-98

పై వర్ణన యొక్క ఛాయ — తరువాత నయిదువందల యేండ్లకు వ్రాసిన రామరాజ భూషణుని వసుచరిత్రమందలి కోలాహలుని వర్ణనలో కనిపించుచున్నది. (వసు. 2-7) పుర వర్ణనలో కోటను, పరిఖను వర్ణించుట పరిపాటి. సముద్రమునందలి సర్వ రత్నములను గెల్చుకొన్నట్లుగ ఆ పురియందు రత్న వప్ర నికరములున్నవనియు, ఆ సముద్రమే, మరల తన రత్నములను బలిమితో గొనుటకు వచ్చి చుట్టుముట్టినదనియు

కోట పరిఖలను రమ్యముగ, కార్యకారణ యుక్తముగ నుత్ప్రేక్షించినాడు. (శరధి సమస్త వస్తువులు — కుమార. 7-103).

పుర వర్ణనలో నదిని వర్ణించుట కూడ పద్ధతి. ఈ ఓషధీప్రస్థపురమున గూడ నది యున్నది. అది కోమట్లు బ్రాహ్మణులకు దానము చేసిన గోవుల గిట్టల దెబ్బల వలన అవిసిన భూమి ఊటరేగి, నదిగా ప్రవహించుచున్నదని ఉత్ప్రేక్షింపబడినది. అనగా అందలి జనులయొక్క దానాతిశయము వర్ణితమయిన దన్న మాట.

> "అనిశము గోసహస్ర విధి నందులకోమటులిచ్చు ధేనువుల్
> గొని చను భూసురోత్తముల గోవుల పాదహతిన్ మహీతలం,
> బనయముఁ గ్రుంగి మట్టవిసి యప్పురిచుట్టున నూటరేగి బో
> రన నట జాలువాఱి నదులై చను నంబుధిఁ గూడఁ బెల్లునన్"

—కుమార. 7-119

పురమందు గజబృంహితములును, హయ హేషలును, గీతావాద్య ధ్వనులును, వేదఘోషయును, భటుల ఉద్దండోక్తులును వినబడుచుండుట- రాజ నిలయమునకు నిదర్శనము. పై శబ్దములన్నియు గలిగి సంక్షోభితాంభోనిధి శబ్దము వలె నేకముగా భీకరముగా, వినిపించుచున్నది ఓషధీప్రస్థపురమున.

> "సమదానేకప బృహితంబు హయ హేషా ఘోషమున్ గీతవా
> ద్య మృదు ధ్వానము వేదరావము భటోద్దండోక్తులున్ భూరి పం
> చ మహా శబ్దరవంబుఁ గూడి సుమహత్సంక్షోభితాంబోధి నా
> దమొనా దిగ్బధిరీకృతంబగుచు నిత్యంబున్ జెలంగుం బురిన్"

—కుమార. 7-126.

నన్నెచోడుడు వర్ణనా ప్రియుడు. ప్రతివర్ణన చేయునపుడును, ఏయే యంశము లుండవలెనో- అన్నిటిని కూలంకషముగ వర్ణించును.

హిమవద్రాజధాని ఓషధీప్రస్థపురము కథకు మూలభూతమయినది. ఇది పార్వతీ పరమేశ్వరుల వివాహస్థానము. అందువలన నిది కథతో ముఖ్య సంబంధము గలది యగుచున్నది.

ప్రకృతి వర్ణనల చేయుటలో నన్నెచోడుడు స్వతంత్రుడగు ప్రథమాంధ్ర కవి యనవచ్చును. సంస్కృత ద్రావిడ కర్ణాట భాషా సాహిత్యములను మథించిన వాడైన యీ కవి వర్ణనల సందర్భముల స్వాతంత్ర్యమును ప్రదర్శించినాడు.

ఇక్కడ పురమునందు, గజతురగములును, హాలిక నితంబినులును, కలమ వనములును, చక్రవాకములును, నిమ్మ, పనస, చూతాది వృక్షములును, శుకకీర కోకిలాదులును, కోట, పరిఖ మొదలగునవియును, ధనాగారములును ఉన్నట్లు వర్ణింపబడినవి.

కుమార సంభవ మందలి పురవర్ణనలో రెండు ఫలములు సిద్ధించినవి. ఒకటి లక్షణము ననుసరించి వర్ణించుట, రెండు- రసోత్కటముగ చెప్పుట.

## పురవ న - మనుచరిత్ర

మనుచరిత్రమందు పురవర్ణన గల పద్యాలు రెండు మాత్రమే. మొదటిది ఉన్నత సౌధాల గురించి యతిశయించి చెప్పును. రెండవది చాతుర్వర్ణ్యమును గూర్చి చెప్పును. అంతే; ఇందు ప్రకృతి వర్ణన క్రిందికి వచ్చునది ఒక్క పద్యమే.

"వరణా ద్వీపవతీ తటాంచలమునన్ వప్రస్థలీ చుంబితాం
బరమై సౌధ సుధా ప్రభాధవళిత ప్రాలేయ రుఙ్మండలీ
హరిణంబై యరుణాస్పదంబనగ నార్యావర్త దేశంబునన్
బురమొప్పున్ మహి కంఠహార తరళ స్ఫూర్తిన్ విడంబించుచున్"

—మను. 1-49.

పై వర్ణనలో ఇతివృత్తమునకు మెరుగుపెట్టు విశేషములున్నవి. భావ్యర్థమును సూచించు విశేషములున్నవి. "సౌధ సుధా ప్రభా ధవళిత ప్రాలేయ రుఙ్మండలీ హరిణంబై" అన్న సమాసమును పరికింతము. ప్రాలేయమనగా మంచు. మంచు కిరణములు గలవాడు చంద్రుడు. చంద్రునియందు హరిణమున్నది. అది నలుపు రంగు గలది. అదియే చంద్రుని యందలి కందు. ఆ యూరి సౌధములు సుధతో ధవళితమై యున్నవి. ఎత్తుగా ఆకాశములోనికి చొచ్చుకొని పోయిన ఆ సౌధములయొక్క సుధాప్రకాశము వలన చంద్రునిలోని కందు గూడ ధవళితమై పోయినది. అనగా చంద్రునిలోని కందును గూడ తుడిచివేయగల స్వచ్ఛ ప్రకాశముతో అరుణాస్పద పురమున్నదని యర్థము.

తరువాత ప్రవరుని వర్ణించుచు "ఆ పురి బాయకుండు మకరాంక శశాంక మనోజ్ఞ మూర్తి" అని పెద్దన వ్రాసినాడు. మరియొకచోట "ఎక్కడివాడొ యక్షతనయేందు జయంత వసంతకంతులన్ చక్కదనంబునన్ గెలువజాలెడివాడు" అని వ్రాసినాడు. ప్రవరుడు ఒకచోట చంద్రునికి ఉద్దిగాను, మరొకచోట అధికుడుగాను వర్ణింపబడు చున్నాడు. చంద్రుని కంటె మించిన స్వచ్ఛుడా పట్టణమందున్నాడని సూచించుటకే పురవర్ణనములోని పద్యమందలి "సౌధ సుధా ప్రభాధవళిత ప్రాలేయరుఙ్మండలీహరిణంబై" అన్న సమాసము వాడబడినది. ఇంత గొప్పగా వర్ణించిన యనంతర మందలి యితర విశేషముల వర్ణింపవలసిన యవసరము లేదు.

ఇంతకంటె నెక్కువ పురవర్ణన కవకాశము గూడలేదు. ఇక్కడ నాయకుడు రాజు గాదు. ఒక బ్రాహ్మణుడు. కర్మిష్ఠి. రాజు నాయకుడై యుండిన యెడల భోగభాగ్య వైభవముల సూచించు కోట, పరిఖ, హట్ట, ఆరామాది వర్ణనలు చేయబడి యుండెడివి. ఉచితజ్ఞుడు కావున పెద్దన ఆ వర్ణనల తొలగించినాడు. మరొక మామూలు కవియగుచో పురవర్ణన అనగానే అందేయే విశేషముల వర్ణింపవలెనని సంప్రదాయమున్నదో, దాని ననుసరించి వరుసగా వర్ణించి యుండెడివాడు.

ఈ కర్మిష్ఠియైన బ్రాహ్మణుడు నాయకుడుగాగల పురము నందు నదీవర్ణన మాత్రము గలదు. అదియును నామమాత్రమే. "వరణాద్వీపవతి" అని మాత్రము చెప్పుట జరిగినది.

నదియందలి దరవికస్వరకమలములును, వానిపై నుండి నూత్న కమల కషాయ గంధము వహించి వీచు పవనాంకురములును వర్ణితములు.

> "వరణాతరంగిణీ దరవిక స్వరనూత్న
> కమలకషాయ గంధము వహించి
> ప్రత్యూష పవనాంకురములు పైకొను వేళ
> అఘమర్షణ స్నానమాచరించి
> ...............". -మను. 1-51

అవసర మనుకొన్న వర్ణనలనే చేసినాడు పెద్దన. సంస్కృత కవుల యొక్కయు, శ్రీనాథాది కవుల యొక్కయు, కన్నడ కవుల యొక్కయు ప్రభావము పెద్దనపై నధికముగ నున్నను, ప్రకృతి వర్ణన చేయుటలో స్వాతంత్ర్యమును, వ్యక్తిత్వమును ప్రదర్శించినాడు.

## పురవర్ణన - పారిజాతాపహరణము

ఇందు పురవర్ణనము లేదని చెప్పవచ్చును. కాని వైజయంత వర్ణన మున్నది. వైజయంతము పురము గాదు. కేవలము ఇంద్రుని సౌధము. ఇందు వర్ణితమగు కొన్ని వర్ణనలు పురవర్ణనను పోలి యున్నవి. కోట ఖటగజహాయ పరిఖాదుల వర్ణింపకున్నను, ఆరామద్రుమ పక్ష్యాదుల వర్ణించినాడు. ఆకాశనదీప్రస్తావన గూడ తెచ్చినాడు.

"నిరంతర సంతానోకహ దుకూలమయ పతాకాశతా కారితాకాశ గంగాచటులతర తరంగావతరణంబును, సమంత తత్స్వ్యం తన్యమాన తోయ కర్మాంతిక నిర్ముక్త మందార విటపి మకరంద గంధ సలిల సేకాతిరేక శీతలమణి వేదికా ప్రదేశంబును..."

-పారి. 3-41

"చందన హరిచందన మక
రంద సరిద్బిందు శీకర ప్రమద వనేం
దిందిర వక్షస్పందన
కందళిత మరుత్కిశోరకంబులు వొలయన్" — పారి. 3-43

పై విధముగ గంగానదీ వర్ణనయును, తత్ ప్రాంత తరులతాదుల వర్ణనయును గావించినాడు.

ఇది ఇంద్ర వైభవమును చాటునే గాని కథతో తప్పని సరియగు సంబంధము గలది గాదు. లక్షణము కొఱకు చేసినట్లే యున్నను అందముగ నున్నది. వర్ణనా వైపుల్యము కొఱకు ఇతర కవులు వాడినట్లే తిమ్మన ఇట వచనమును ప్రయోగించినాడు.

## పురవర్ణన - ఆముక్తమాల్యద

ఆముక్తమాల్యద యందు ప్రథమ ద్వితీయాశ్వాసములలో చాలభాగము పుర వర్ణన గలదు. మొదటిది ప్రథమాశ్వాసములోని విలుబత్తూరువర్ణన. ఇది యిరువది యైదు పద్యములలో సాగినది. ఇందు వప్రాదులు వర్ణితములు. స్నాన కుండములు, తోటలు, నారికేళాది వృక్షములు, వరిపొలములు, పనసాది ఫలములు వర్ణితములు. గజహయ భటాది వర్ణనలు లేవు. మధురాపుర వర్ణన యందు గజహయ భటాదికములయిన వర్ణనలు గలవు. అక్కడను, ఇక్కడను గూడ పుష్పలావికలును, వేశ్యలును, ఎక్కువగా వర్ణింపబడినారు. మొత్తము ముప్పదియేడు పద్యములలో మధురాపుర వర్ణన సాగినది. వలభి యొక్క ఔన్నత్యమును వర్ణించుచున్నాడు కవి. వలభి సమీపమున లలితోద్యానము లున్నవి. అందలి శుకకపిములు గోలగా అఱచుచున్నవి. వలభియందు గూడ శుకపిక

ముల బొమ్మలు చెక్కబడి యున్నవి. తోటలోని పక్షుల గలగలలను ఈ వలభియందలి పక్షుల రుతములా యను భ్రమను పొందించునట్లు ఎత్తుగా నిర్మితమై యున్నవి వలభులు,

> 'లలితోద్యాన పరంపరా పికశుకాలాప ప్రతిధ్వానముల్
> వలభినీలహరిన్మణీ పికశుక స్వాన భ్రమంబూన్ప మి
> న్నులతో రాయు సువర్ణ సౌధముల నెందుంజూడఁ జెన్నొందె శ్రీ
> విలుబుత్తూరు సెలంగుఁ బాండ్యనగరోర్వీ రత్న సీమంతమై"
>
> -ఆము. 1-51

తర్వాత సరస్సునందలి మరాళములు పసుపంటిన రెక్కలు గలవై వియద్గంగా మరాళములా అన్న భ్రమను కల్గించుచున్నవని వర్ణించినాడు.

(ద్రవిడకుటుంబినుల్ పసపు – ఆము. 1-64).

వరిమళ్ళను, కాలువలను, అందు తిరుగుచుండు బాతులను, పుర రక్షకులను ఒకచో చేర్చి, భ్రాంతి మదలంకారములో చేసిన వర్ణన హాస్యరస పూర్ణమయినది. వరిమళ్ళ కాలువలలో బాతులు ముద్దగా ముడిగి నిద్రించుచున్నవి. ద్విజులు స్నానము చేసి, పిండిన బట్టలను, మరచిపోయిరేమో అన్న భ్రమతో ఆ రెకులు సమీపింపగనే అవి లేచి పరుగెత్తి పోవుచున్నవి. వారికాశ్చర్యమును నవ్వును కలుగును కదా! అది చూచి శాలి గోపులు నవ్వుచున్నారు.

> "తలపక్షచ్ఛట గ్రుక్కి బాతువులు కేదారంపు కుల్యాంతర
> స్థలి నిద్రింపగఁ జూచి యారెకు లుపస్నాత ప్రయాతద్విజా
> వలి పిండీకృత శాటులన్నవిఁ దదావాసంబుఁ జేర్పంగ రే
> పులడిగ్గ న్వెసబారువానిగని నవ్వున్ శాలిగోప్యోఘముల్" – ఆము. 1-65

వర్ణనలు అతిశయోక్తులతో కూడుకొన్నవిగాక సామాన్య ప్రజాజీవిత ప్రతిబింబనములై యుండుట ఆముక్తమాల్యద యందలి విశేషము. అట్టి విశేషము పై పద్యమున కాననగును.

వరి ఎన్ని రకములో ఈ క్రింది పద్యమున తెలియును. అన్ని రకములుగల పువ్వు తోటలను కమలవనములు పరిహసించుచున్నవి.

> "సారిదించేర్చిన తీగమల్లియలు ఖర్జూరంబులున్ పుష్పమం
> జరులు న్మామిడి గుత్తులు న్గుసుమముల్ సంపెంగలున్ బచ్చగ
> న్నెరులున్ బాళలు గల్గి రాజనముగాంతిన్ దారుసుల్నాపి చే
> లరుదారన్నగుఁ బువ్వుదోటల బలాకానీక దంభంబునన్" -ఆము. 1-66

పువ్వులలో రకముల రాజనము లేదు. అది వడ్లజాతిలో అధికముగనున్నది. అది గొప్పగదా! అందులకే వరిచేలు పూలతోటలను, ఎగురుచున్న తెల్లకొంగలను మిషచే నవ్వుచు పరిహసించినవి. "తెల్లకొంగలను మిషచే హసించుట" అనునది కవి సమయ మగుచున్నది. హాసమును తెలుపుతో పోల్చుట కవి సమయము.

పురవర్ణనమున నానావృక్షవర్ణనచేయుట సంప్రదాయము. ఇక్కడ వేరుపనసనువర్ణించుచున్నాడు కవి. వేరుపనస చాల తీపయినది. అరుదుగ లభించునది. అది పండినపుడు పగిలి అందలి మధురసము భూమిపై ప్రవహించును. అది దానజలముగాను, పగిలిన పగుళ్లు దానజల ధారలుగను, తొడిమను ఇనుపగొలుసుగాను వర్ణించిమదించిన యేనుగున కభేదముగ చెప్పుచున్నాడు కవి (అడుగున పండి ప్రీలియనట్లై ... ఆము. 1-68) ద్రవిడ ప్రాంతమున వేరుపనస యధికమని పైవర్ణన చాటుచున్నది.

తమలపాకు తీగకును పోకచెట్టునకును దాంపత్యానురాగమును, మనోహరముగ వర్ణించినాడు రాయలు. అనురాగము కొఱకు ప్రయత్నముగూడ వర్ణించినాడు. "మన యనురాగము శాశ్వతముగ నుండవలె" నని ఫణిరాజవల్లి యన్నది. అపుడు పోకచెట్లు తమ మట్టలను రాల్చి చెఱకుపై పడవేసి అందలి ముత్తెములను చిటిలించి చెఱకు రసము కాగుచున్న ప్రొయ్యిలో పడవేసి సున్నమగునట్లు చేయుచున్నవి. పోకలును, తమల పాకులును, సున్నమును కలిసినపుడేగదా ఎరుపురంగు (రాగము) కనిపించును. ఈ భావమును రసోదంచితముగ "మన కనురక్తి హెచ్చనిదె మందని ... ఆము. 1-70" పద్యములో వర్ణించినాడు.

సహజమైన ప్రకృతి కార్యములకు కారణమును కల్పించి హేతూత్ప్రేక్షల ప్రయోగించి ప్రకృతిని మానవీకరణ పొందించుటలో రాయలుద్దండుడు.

పోకమ్రానునకును, ఫణిరాజవల్లికిని దాంపత్యము చెప్పుట ఒక అందమైన విషయము. విజయవిలాసమునగూడ (విజయ 1-82) తాంబూలమునుగూర్చి చెప్పుసందర్భమున నిట్టి భావమునే వర్ణించి యున్నాడు తత్కర్త.

ఈ పురవర్ణనమందు వర్ణితమయిన పురాతన తీర్థకుండములు ప్రకృతి వర్ణనకు రమ్యోదాహరణలు.

తీర్థకుండములు చాలచోట్ల నుండునవే! వానిని కవియగువాడే సునిశితముగ పరీక్షించును.

ఆ ప్రాంతకుండములలోని కలువలు, అంతర దామర, ప్రాచి, వానియొక్క కప్రపువాసనలు, వాని అడుగున వాలుగల కదలికలు, నీరుకోళ్లయొక్క గ్రుంకులు, కొళకొళధ్వనులు, అవి క్రుంకునపుడును, లేచునపుడును చూడనగు మెడలవంపుల సొగ

సులు- చుట్టుపట్టులగల మామిడిచెట్లయొక్క పుప్పొడులు రాలి నీటియందు దట్టముగా తెట్టువలు కట్టియుండుటలు -మనోహరముగ వర్ణితములు. ఇంత వర్ణనయును ఒక్క పద్యములో నిమిడియున్నది. సహజమైన యీప్రకృతి వర్ణన మనోజ్ఞముగ నున్నది. ఒక చిత్రకారుడు చిత్రమును, చిత్రించి, ఆచిత్ర ప్రకృతికి ప్రాణము పోసినంత సజీవముగ నున్నది-

"అలరు బురంబునం దొగల నంతర దామరఁ బ్రాచిఁ గప్రపున్
వలపులు మీఱ లోవలుదవాలుగ మెత్తముపోర నీరుకోళ్
కొలకొలమంచుఁ గ్రుంకు మెడ గుంపుల వంపులు దోప మావితో
పుల విరులన్ బయిన్నదువఁ బోల్చు పురాతన తీర్థకుండముల్" —ఆము. 1-71

ఉద్యానవనములలో బాటలను వర్ణించుట సంప్రదాయము. విలుబుత్తూరునందలి ఉద్యానవనములోని బాటలు వర్ణితములు. ద్రవిడాంగనలు విష్ణుదేవుని స్నానార్థము బిందెలలో నీరు మోసికొనుచు ద్రవిడప్రబంధములోని పాటలనుపాడుచు ఒయ్యారముగ ఉద్యానంపు త్రోవలందు నడుచు చున్నారని వర్ణించుచున్నాడు (ఆము. 1-56).

విలుబుత్తూరు వర్ణనయును, మధురాపురి వర్ణనయును భోగభాగ్య విలసితముగా వర్ణితములు. విలుబుత్తూర నున్నది విష్ణుచిత్తుడు. అతడు రాజు గాడు. అందువలన రాజోచిత సామగ్రిని అక్కడ వర్ణించలేదు. మధురాపట్టణమున రాజున్నాడు. అక్కడ పరిఖ గజహయములు మాత్ర మెక్కుడుగా వర్ణితములు. ఈ కావ్యమంతయు ప్రకృతి వర్ణనలకును, అందు ముఖ్యముగ ఋతువర్ణనలకును, మతవాదములకును, గోదా శ్రీరంగేశ్వరుల దివ్య ప్రణయమునకును తావలమగుట వలన పురవర్ణనమందు గూడ, కేవల విలాస భోగవస్తువులును, దేవాలయ పూజావిషయములు మొదలగునవియే అధికముగ వర్ణితములు.

మధురాపుర పరిఖ చాలలోతుగా నున్నది. మధురాపుర కామినీజనములు స్నానము చేయునపుడు వారి వక్షోజలిప్తములగు సంకుమద కస్తూరి చందనములు ఆ నీటిలో కడుగబడును. ఆ సౌరభములు పాతాళ వాహినియగు భోగవతి కంటుకొనును. ఇట్టి భోగవస్తువుల వాసనకల్గియుండుట చేతనే ఆ పాతాళగంగకు భోగవతియను పేరు కల్గినదట. చక్కని తర్కము. (పరిఖం దత్పుర కామినీ జనము లంభఃకేళి సల్పంగ -ఆము. 2-6).

ఈ పురవర్ణనలో పరిఖాదులు, గజహయాదులు, గృహములు, స్నానఘట్టములు, నదులు, వరిపొలములు, పూలవనములు, పనసాది ఫలములు, పోకమ్రాకులు, తమలపాకు తీవలు, చెఱకుతోటలు, బాటలు - వర్ణితములు. వర్ణనా సాకల్యమును సాఫల్యమును చూడవలెనన్న రాయలవారి వర్ణనలందే చూడవలయును,

## పురవర్ణన - కళాపూర్ణోదయము

ప్రబంధము లన్నిటికంటె కళాపూర్ణోదయము కథాకథన వైచిత్రిలో మొదటిది. ఇందలి కథాక్రమము పురవర్ణనతో ప్రారంభమగును. వర్ణన మొత్తము 22 పద్యాలలో సాగినది. కావ్య సంఘటనల కంతటికిని ఈ ద్వారకా పురము ప్రధాన రంగము. శ్రీకృష్ణనారదులును, కలభాషిణీ మణికంధరులును కలిసికొనున దీరంగమునసే. రంభామాయారంభల పోరునకు అంకురార్పణ మీ నగరమునసే. ఈ పోరును సూచించుటకు - అనగా భూలోక స్త్రీ యయిన కలభాషిణికిని,పినాకలోక వాసిని యయిన రంభకును జరుగబోవు పోరును సూచించుటకు ఈ క్రింది వర్ణన సహాయకారిగా నున్నది.

> "సురుచిర వస్తుసంపదల సొంపునఁ బెంపు వహించుచున్న య
> వ్వరపురి యాత్మసామ్యపు వివాదముఁ దీర్పఁగొనంగఁ బిల్చుని
> ర్జరనగరిన్ సువర్ణమయ సౌధకర ప్రసరంబు చేతనం
> బరము గ్రహించి భూరిశర పౌరజనారవ గౌరవంబుచేన్" —కళా. 1-3

నాతో నెంత పోలుదువో రమ్ము; తగవు తీర్చుకొనుటకు రమ్ము అని సౌధరూప కరములచే బట్ట విసరుచు, పౌరజనారవరూప కంఠధ్వనితో కేకలు వేయుచు, ద్వారకాపురి స్వర్గమునుఁ జీరుచున్నదని వర్ణితము. అనగా అందలి మేడలు ఆకాశ మంటుచున్న వని తాత్పర్యము. తర్వాత జరుగబోవు రంభామాయారంభల వివాదమిందు సూచనగా కన్పట్టుచున్నది గూడ.

కళాపూర్ణోదయ కథ నంతటిని గుర్తుకు తెచ్చువర్ణన యొకటి యున్నది. అది కలభాషిణి యొక్క వేశ్యాజన్మకు కారణమైన మణితమును తలపించు వర్ణన.

> "అమరగ వింత యింపొసగునందు విటాళికి వేశ్యవాటిహ
> ర్మ్యములు ?మాన మానహర హారి శిరోగృహ భాగభోగ భా
> గమర భుజంగ సంగహృదయంగమరంగ దనంగ సంగర
> క్రమ రమణీ మణీ మణిత కల్పన నేర్చిన పారువాలచేన్" -కళా. 1-19

రతిసమయమున తమకాతిశయముతో స్త్రీ తన కంఠమునుండి వెలువరించు ధ్వని పేరు మణితము. ఆకాశము నంటియున్న సౌధాలపై అమరభుజంగులతోరతి సల్పుచున్న రమణీమణుల మణితమును ఆ సౌధవిటంకములందున్న పావురాలు నేర్చుకొని అట్లే పల్కుచున్నవట. ఆ ధ్వనులకు విటాళి యింపు ననుభవించుచున్నారట.

సరస్వతీ బ్రహ్మల యొక్క ఏకాంతమందు సరస్వతి కావించిన మణితమును విని ఆమె పెంపుడు చిలుక అట్లే చేయగా సరస్వతి కోపించి "నీవు భూలోకమున వేశ్యగా

జన్మింపుము" అని శాపమిచ్చినది. ఆ చిలుకయే ద్వారకా పురమందున్న కలభాషిణి. ఆ కలభాషిణి యీ పురమందున్నదన్న సూచనే యీ మణిత వర్ణనగా భావింపనగును.

పురవర్ణనమందు పూదోటలను, తేనెలు, మిళిందములు, ఫలములు, అన్నియును వర్ణింపబడినవి.

"కొలదికి మించుకెంజిగురు గుత్తుల మొగ్గలఁ బుష్పగుచ్ఛకం
బులఁ బువుఁ దేనెఁ బుప్పొడులఁ బూపలఁ బిందెలఁ గాయలన్ ఫలం
బుల నెపుడున్ సమగ్రి పరిపూర్తి వహింపుచుఁ దద్వనశ్రీజం
బెలమి రహించు నందన సమృద్ధికిఁ గోటి గుణాధికంబుగన్" –కళా. 1-12.

ఇంతేగాక ఇతర వర్ణనలందును (పురవర్ణనలందే) భూలోక స్వర్గలోకములకు పందె మున్నట్లే వర్ణించుచున్నాడు.

ద్వారకను నారదుడు వర్ణించిన ఘట్టమున పరిఖలు, వప్రములు,ప్రాసాదములును, రాజమార్గములును వర్ణితములు.

"ఇవ్విధంబున సకల ... వీచీహస్త ... పరిఖావలయ ... ప్రాకార
...ప్రాసాద ... రాజ మార్గంబులును ... గోపురంబులును ... ద్వారకా
నగరంబు" –కళా 2 – 9.

కాసార పురవర్ణన గూడ సార్థకముగ నున్నది. మొత్తము 5 పద్యాలలోసాగినది. దాదాపు ద్వారకానగర వర్ణన వలెనే యున్నది. (కళా. 5-108 మొదలు 12 వఱకు).

## పురవర్ణన – ప్రభావతీ ప్రద్యుమ్నము

కళాపూర్ణోదయమందు వలెనే ఇక్కడ గూడ ద్వారకాపుర వర్ణనయే గలదు. ఇంద్రుడు కార్యార్థియై కృష్ణుని కొఱకు వచ్చునపుడు ఆకసము నుండి అతడు చూచిన దృశ్యమిది.

"ధాత్రీమహాదేవి తాల్చిన మున్నీటి
మొలనూలి రత్నంపు మొగపనంగ
జలధి పేరెటి పాప తలచుట్టుఁగల ధరి
త్రీ మూర్తి శిపుచిత్ర తిలకమనగ
నపరదిక్సతి కట్టినట్టి సాగరమను
పుట్టంబు తుదిత్రాత మొగడ యనగ
వరుణగోపుర బద్ధ వార్ధితోరణ మధ్య
గుంభిత నవపుష్ప గుచ్ఛమనగ

[illegible] మణిమయ గృహదీప్తి విసర విసర
[illegible]తమగు ద్వారకా పురంబు
[illegible] దనుజారి దైవ విభుడు
[illegible]ల జాలక వెలుగు పదగ" — ప్రభా. 1-54.

[illegible] పట్టణము యొక్క సొంపునకు శిరఃకంపము చేసినాడు స్వర్గనాధుడు. అపుడు మాతలి [illegible]న్నాడు.

"[illegible]యను తెరమలు గటు
[illegible] నిలిచినట్టి యాటవెలదియ పోలెన్
[illegible] గులుకచు దన
[illegible] యవధరించితె యధిపా" ప్రభా. 1-57

[illegible] తెర మఱుగుననున్న నర్తకివలె నున్నదట ద్వారక. దేవపురవాసి [illegible] మాతలి నోటనే యీ భూలోక పట్టణము యొక్క గొప్పతనమును వర్ణించునట్లు చేయుట ద్వారకానగరము యొక్క ఉత్కృష్టతను మామూలు మాటలతో చెప్పినట్లు కాకుండ [illegible]ట్లయినది.

కోటలును మేడలును చాల సుందరముగ ఉత్ప్రేక్షింపబడినవి. భూమిపై కృష్ణు [illegible] విష్ణువును విడువలేక శేషాహి వచ్చి తన శరీరమునే కోటలుగా చుట్టి [illegible]లను మేడలుగా చేసెనా యన్నట్లు కోటలును, మేడలును చెన్నొందినవి. [illegible]ట్లు కోటలుగ భూరి కిరీట ... ప్రభా. 1-60)

[illegible] మునకును, శివునికిని అభేదమును మాతలి నోటిమాటలుగా ఉత్ప్రేక్షించు [illegible]. ఇది అత్యంత రమణీయమగు వర్ణన. అందలి క్రీడా పర్వతములును, [illegible], సరస్సులును, వర్ణితములయినవి. భంగ్యంతరముగా శివుని వర్ణమును, [illegible]లను వర్ణించినట్లయినది.

"కలధౌత కేళినగంబు గాబోలును
దనరుచున్నది శంభుతనువు లీల
[illegible]చాం వేయ వనరాజి గాబోలు
నేలుచున్నది పులితోలు సిరుల
[illegible]సీల సోపాన సరణి గాబోలును
[illegible]టుచున్నది నల్ల పాప పేరు
[illegible]ఫటలవ సౌభాగ్యంబు గాబోలు
జాటుచున్నది జటాజూట రుచిని

సరసి గాబోలఁ గ్రాలెడు సురనది గతి
నోడ గాబోలఁ బోలెడి నుడుపతి కళ
ననిమిషాధిప, చూచితే యల్ల పసిడి
కోట నడిమి శృంగారపు దోఁటలోన" -ప్రభా. 1-53

శ్రీకృష్ణ నివాసభూమి యైన ద్వారకా పట్టణము ఈశ్వర స్వరూపముగా మాతలికి తోచుట శివకేశవాభేదప్రబోధముగా తెలియ నగును. కవి తన భావమును పాత్ర ద్వారా పలికించినాడు.

మాఘుని శిశుపాలవధలో గూడ మొదటనే పురవర్ణన (ద్వారకా వర్ణన) యున్నది. పింగళి సూరన కళాపూర్ణోదయమందును ప్రభావతీ ప్రద్యుమ్నమునందును గూడ ద్వారకా పురవర్ణనతోనే మొదలు పెట్టినాడు. ఈ పురవర్ణన శిశుపాలవధ యందలి ద్వారకా పురవర్ణనను తలపించును.

పరిఖకును, సముద్రమునకును అభేదమును చెప్పుచున్నాడు.

"పడమటియది సాగరమని
యెడు తజ్జ్ఞుల మాటఁ దక్క నేతత్పురిఁ
గ్గడలందఁ బరిఖలెవ్వియొ
జలనిధి యెయ్యదియొ తెలియ శక్యమె ప్రజకున్" -ప్రభా. 1-65

ఈ పుర వర్ణనలో గజతురగ భటాదులును, చాతుర్వర్ణ్యమును వర్ణింపలేదు. శృంగార రసమునకే అత్యధిక ప్రాధాన్యముగల కావ్యమగుటచే పురవర్ణన గూడ లలిత శృంగార భూయిష్ఠముగనే యున్నది.

ఈ పుర వర్ణన కథాపాత్ర ముఖమున (మాతలి) సాగి యుండుట ఔచిత్య భరితము.

## పురవర్ణన – వసుచరిత్ర

తొలుత "అష్టాదశ" శబ్దమును వాడి అష్టాదశ వర్ణనల నన్నిటిని పాటించినవాడు నన్నెచోడుడు. అతడు కవియేగాని లాక్షణికుడు గాడు. రామరాజ భూషణుడు కవియే గాదు, లాక్షణికుడు గూడ. పురవర్ణన మందేవి యుండవలెనో అన్నియును సలక్షణముగ వర్ణించినాడు.

ఇందలి పురము అధిష్ఠానపురము. ఈ యధిష్ఠానపుర వర్ణనమాదిగా, వసు వృత్తాంతమంతయును వాగ్వైచిత్రితోవర్ణింతునని సూతుడు మునులకు చెప్పినాడు(1-93).

అనగా వసుచరిత్ర సర్వస్వమును వాగ్వైచిత్రితో మండితమగుచున్నదని తాత్పర్యము. శ్రేష్ఠులకును, పూలతోనిండిన తరులకును — కళలకును-భూషణములకును — ముత్తెములకును—వడ్లకును - రత్నములకును, స్త్రీ రత్నములకును-బ్రాహ్మణులకును, పశులకును—సరసులకును - సరస్సులకును—ఆకరముగా నున్నట్లు, అర్థద్వయము చేత వర్ణింపబడినది. అధిష్ఠాన పురము పరిఖయొక్క అడుగు భాగము, పార్శ్వములు పైకి పొంగియున్న నీరు, కోట, అన్నియును ఒక్క పద్యములో వర్ణితములు.

"వరసుమనో భవ్యతరుల కావాల మ
తల్యఘు కలాపాలికలరు భరణి
సరిలేని తెలిముత్తెసరుల కొటారుక
ల్యాణ పరంపరల తొలుదివి
సురచిరమణుల కాకర సీమ శ్రుతి హిత
భాషిత ద్విజకోటి పట్టుగొమ్మ
సరసులకారామ సరణి శ్రీరంగ గే
హ క్రోడ వాసిని కాటపట్టు

వెలయు నావరణాంబు సంవీత హాట
కాండమోపాద పరిఖా వృతాంఘ్రి వజ్ర
దంతుర ప్రాంత గంగానిరంతరాగ్ర
భూరి వరణంబధిష్ఠాన పురవరంబు"

- వసు. 1-94.

పై సీసపద్య పాదములు నాలుగును ప్రాసఘటితములగు ఒక సొంపు. తర్వాతిదగు పరిఖా వర్ణన చాల ఉదాత్తముగను, గంభీరముగను ఉన్నది. పరిఖ వర్ణించుతఱి దాని లోతునువర్ణించుట పరిపాటి. ఈ అధిష్ఠానపురముయొక్క పరిఖ పాతాళమువఱకు ఉన్నది. దాని జలము పాతాళమునిండి అందలి పాములు నడచుటకు తలములేకుండ (అతలము) చేసినది. పాపము పాములను బ్రహ్మ ఉరగులను (ఉరముతో నడచునవి) చేసి, నీటిపై ప్రాకునట్లు చేసిన వర్ణన సతార్కికముగ నున్నది. (పురిపరిఖా మహాంబునిధి... వసు. 1-96).

అధిష్ఠానపురమందలి ఉద్యాన వర్ణన అతివేలమనోహరము. ఈ తోటయందలి "పురిపూఁదోటల తావి మిన్నలమగా, వేల్పులుమెచ్చి తద్భూజ భాస్వర సంతానములను, దివిం బెనుపగా, నా సంతానములు దివ్య నిర్ఝరిణీ నిర్మల వారి పూర పరితోషంబంది గూడ తన్మహా తరులక్ష్మి పరిపూర్తిగానక కేవలము కల్పశాఖ ప్రథను పొందిన" వని చెప్పిన వర్ణన దానికదేసాటి (వసు. 1—108).

ఈ పురియందలి వృక్షసంతానములే అయినను, దివ్యగంగా పయస్సుతో పోషింప బడినవయినను, ఈ వృక్షములయొక్క తావిగాని, తదితరగుణములుగానిపూర్తిగారాలేదట

వానికి. సంతానములన్నను, కల్పవృక్షములన్నను సమానార్థకములే.[1] సంతాన శబ్దమును చాలచమత్కారముగ ప్రయోగించినాడు.

ఎంతయో చమత్కారము. సతార్కికముగ కల్పవృక్షములు ఈ తోటలోని వృక్షములకంటె తక్కువగా చెప్పబడినది.

ఈ పట్టణమునకు రాజు వసురాజు. ఇతడు ఇంద్రునితో సమానుడు. చాలచోట్ల ఇతనిని ధరామరేంద్ర యనియు వసురాజేంద్ర యనియు పేర్కొనుట జరుగుచున్నది. అనగా ఇంద్ర శబ్దము అనుబంధింపబడుచు వచ్చుచున్నది.అందులకే ఇతని పురము ఇంద్రపుర మునకు సాటిగా — కొన్నిసార్లు మిన్నగా — వర్ణింపబడినది. ఇందలి నదిగూడ స్వర్నదీ తుల్యముగా వర్ణితము. ఇందుగూడ అమరావతీ నదికంటె అధిష్ఠానపుర నదియే గుణము లలో మిన్నగానున్నట్లు వర్ణింప బడినది. (వసు. 1-110).

ఇదే పురవర్ణన మరియొక చోటగూడ కలదు. మంజువాణి గిరికా విరహమును వసురాజు కెఱిగించుటకు ఆకసమున కెగిరిపోయి, అధిష్ఠానపురముఖముగా దిగునపుడా పట్టణము పూర్ణముగ అన్ని వివరములతో కన్పడినట్లు ఆమె నోటనే వర్ణితము.

"ప్రోవఁ బోవగదోచెఁ బురసమామకుట మా
 ల్యంబులై ధర్మ హర్మ్యధ్వజంబు
లేగ నేగ నెదిర్చె గృహదేవతామౌళి
 కలితాబ్జ కర్ణికలై కలశతతులు
చేరఁ జేరఁ దలిర్చె వీర లక్ష్మీ వాస
 వనజాత దళములైన వప్రశిఖలు
చనఁ జనఁ దులకించె జగతీసతీ కాంచి
 హీరపర్వంబులై తోరణంబు

లరుగ నరుగంగఁ జూపట్టె సిరియనంత
తనువులై మల్ల ఖురళికాభినయవాటి
కాకరి తురంగ శాలికా గంధవిపణి
కాముకార్పిత మణి పుత్రికాచయంబు" —వసు. 4-61

హర్మ్యములు, ధ్వజములు, కలశములు, వప్రశిఖలు, తోరణములు, మల్లఖురళికలు (సాముగరిడీలు),అభినయనాటికలు, కరితురగశాలలు, గంధ విపణులు, మణివిగ్రహములు అన్నియు వర్ణితములు. మంజువాణి ఆకాశమునుండి దిగుచు చూచినది గావున మున్ముం దుగా ఎత్తయిన ధ్వజాదులును, రానురాను మిగిలిన వన్నియు స్పష్టముగా గన్పట్టినట్లు వర్ణితము. ఇందు క్రమముగూడ గలదు. అభిజ్ఞాన శాకుంతలమున దుష్యంతుడు రథా

1. "పంచైతే దేవ తరవో మందారః పారిజాతకః
 సంతానః కల్పవృక్షశ్చ పుంసివా హరిచందనం" —అమరము - దేవవర్గు.

రూఢుడై స్వర్గమునుండి దిగుచు క్రిందికిచూచి మాతలికి వర్ణించి, చెప్పిన వర్ణనకు దీటుగా నున్నదిది (శాకుం. 7-8).

అన్ని పురవర్ణనలకంటె ఈ పురవర్ణనయందు ఒక మహత్తరమైన వర్ణన గలదు. పురమందలి ప్రజలందఱును నిద్రపోయిన సమయమున నిశ్శబ్దముగా నుండునుగదా! అట్టి సమయముననే మంజువాణి, పైనుండి దిగి యీపురమును చూచినది. అప్పుడది పూర్ణ సమాధిలోనున్న సిద్ధుడా అన్నట్లుగా ఉత్ప్రేక్షింపబడినది.

"సాలము యంత్రపీఠము, విశాల కవాటిక ఘట్టనంబు దృ
క్కీలనమైంద వామృత సమేత పతాకిక జిహ్వా, చంద్రికా
జాలము భూతిపూత, నవచంద్ర శిలాంబువు లశ్రుధారగాఁ
బ్రోలు ప్రశాంత ఘోషమయి పూర్ణ సమాధిఁ జెలంగె నయ్యెడన్"

— వసు. 4-64.

ఇది అమోఘమైన భావవివరణ. యోగనిద్రలోనున్న ఋషితో పట్టణమును సర్వాంగ సుందరముగా పోల్చినాడు. ఇట్టి భావము హర్షనైషధములో నున్నది. కాని ఇంత విపులముగా, భావస్ఫోరకముగా లేదు.

"క్షణ నీరవయా యయాశ్రిత వప్రావళి యోగపట్టయా
మణి వేశ్మమయం సనిర్మలం కిమపిజ్యోతి రబాహ్యమిజ్యతే" — నైష. 2-79

పూర్వకవికృత కావ్యములను చదివి భావముల బడయవచ్చు. అట్టి భావములకు నూత్న రూపమిచ్చు నేర్పు ఎంతమందికి గలదు!

ఈ ఘట్టముననే మంజువాణి వర్ణించిన ఒక గొప్ప వర్ణన గలదు. ఇక్కడ భావమే గాక, భాష గూడ సాగి సాగి ప్రవహించుచున్నది.

"ఒకవంకనిర్మలోదక శంక సంకుచత్
పరిధానరైరిత్త బాలఁ దలతు
నొకచోట విఘటితోరు కవాట గృహవాట
మని మిన్నకయ తూలి చనఁదలంతు
నొక యిక్క యిది వితర్దిక నిక్కమని పదా
గ్రము నిక్క రహి నెక్కఁగాఁ దలంతు
నొక చాయఁ జిత్ర భిత్తిక గాయనుచు సోయ
గమునఁ బాయక డాయగాఁ దలంతు

నిట్లు గృహరాజ కీలితానేకరత్న
వివిధ రుచివైభవంబులు వెగడు పఱుప
నిదియ కాబోలు నృపుకేళి సదనమనుచు
నచట మాయా బలతి రోహితాంగి నగుచు" — వసు. 4-73

ఇట్టి వర్ణన భారతమందు వచన రూపమున కొంత కనిపించుచున్నది.నన్నయ సభా పర్వములో మయసభ యందు దుర్యోధనుడిట్టి యనుభవమును పొందినట్లున్నది. "అట దుర్యోధనుడు, వివృతంబైన ద్వారదేశంబు సంవృతంబుగా వగచి పోవనొల్లక సంవృత ద్వారంబు వివృతంబని చొరబోయి తత్కవాటస్ఫటిక శిలాఘట్టిత లలాటుండయి, సమ ప్రదేశంబున్నతంబుగా వగచి యెక్క సమకట్టి నీలాశ్మస్థగితంబైన విమలమణిస్థలంబు జలాశయంబుగ వగచి పరిధానం బెగద్రోచికొని ..." (భార. సభా. 2 ఆశ్వా).

అనువాదము కాకపోయినను పూర్వకవుల ప్రభావము తర్వాతి కవులపై పడు ననుటకిది నిదర్శనము.

## పురవర్ణన - విజయవిలాసము

పురవర్ణన చేయు సందర్భమున ప్రబంధకవులందఱును నేదో విధమున నాకపుర మునకు సాటియో పోటియో చెప్పియున్నారు. అందును వసుచరిత్రకారుడును, పింగళి సూరనయును మిన్నలు. వారికే విధమునను తీసిపోని విధమున విజయవిలాసకారుడు పురవర్ణన చేసియున్నాడు.

విజయ విలాసమందలి పురవర్ణనలో చంద్రప్రశంస అధికముగ నున్నది. చంద్ర వంశరాజయిన అర్జునుని స్ఫురింపజేయుట కయినట్లుగ తోచుచున్నది. "చంద్రప్రస్తర సౌధఖేలనపర..." (విజయ. 1-66.) "రేలమృతాంశులో శశము" (విజయ. 1-71) "ప్రొద్దుపోయిన వేళ రోహిణీ ప్రాణేశు" (విజయ 1-76). "లాగులు వైచుచో: జంద్ర కళలనంగ" (విజయ. 1-80) మొదలగు చోట్ల నెన్నిటనో చంద్ర శబ్దము ప్రయోగింపబడినది.

> "చంద్రప్రస్తర సౌధ ఖేలన పరశ్యామాకుచద్వంద్వని
> స్తంద్రప్రశ్యహాలిప్త గంధకలనా సంతోషిత ద్యోధు నీ
> సాంద్రప్రస్ఫుట హాటకాంబురుహ చంచచ్చంచరీకోత్కరం
> బింద్ర ప్రస్థపురంబు భాసిలు రమా హేలాకళావాసమై" — విజయ. 1-66

పై పద్యమున నాయికా నాయకులు సూచింపబడి భావ్యార్థము గూడ స్ఫురించు చున్నది.

ఆ పురమునందలి గృహములాకాశపుటెత్తును మించినవని చెప్పుటకు చంద్రుని వంటయింటి కుందేలుగ చెప్పుట గొప్ప సమర్థన.

"రేలమృతాంశులో శశము రెమ్మకమంచుఁ దలంచి జాళువా
మేలి పసిండి సోయగవు మేడలగుజ్జెనగూళ్ళ సందడిన్
బాలిక లుండి యావలఁ జనంగని చింతిల వంటయింటిపైఁ
దేలిది యెందులో గలదు నేటికి నేమని యందు రందులన్" —విజయ 1-71

చంద్రుడు వంటయింది కుందేలుగా నుండుట యనగా చంద్రుడా ప్రదేశమును వదలి పోడని యర్థము. సూర్యచంద్రులు మేరువును వదలక దానిచుట్టే తిరుగుచుందురని ప్రాచీనుల భావము. ఇపుడీపుర సౌధములు మేరువుకంటె నెత్తున్నవన్న ధ్వనియందు గలదు. కైలాస మేరునగములా పురగృహములలో ఉగ్రాణములై యున్న వనిగూడ (విజయ. 1-68) చెప్పుటచే ఆగృహములు మేరుకైలాసముల కంటె ఉన్నతమైనవని తెలియుచున్నది.

పురవర్ణనలో గజాశ్వాదుల వర్ణించుట పరిపాటి. ఇక్కడ అశ్వముల వేగమును వర్ణించుట జరిగినది. వాయువును జింకలును వేగము గలవన్నది ప్రాకృతిక సత్యము. వేగముగా పోవు నే జంతువునైనను వాయువుతో (వాయు వేగముతో) పోల్చుట సాంప్రదాయిక సత్యము. వాయువునకు జింక వాహనమన్నది సంప్రదాయభావము. ఆ పుర మందలి హరుల వేగమును చూచి జింకలు సరదాగా మనలో నెవరు వానితోబాటు పరు గెత్తగలమో చూతమని వాయువుతో పందెము వేసికొన్నవి. పరుగెత్తినవి. కాని ఓడి పోయి పందెము ఫలముగా వాయువును మోయుటకు ఒప్పుకొన్నవి. ఆ విధముగా అవి వాయు దేవునకువాహనమైనవి. ఇందు మూలముగా ఆ పురమునందలి హరులను, వాయువును ఒకే వేగముగలవని అందముగా సమర్థించినాడు కవి. (విజయ. 1-73).

పురవర్ణనమున వసంతమును, ఉద్యానమును వర్ణించు సంప్రదాయమును విజయ విలాసకారుడు సొంపుగా పాటించినాడు.

ప్రాకృతికమైన శృంగారశక్తుల క్రీడలను - అనగా వసంతుని, మన్మధుని, చంద్రుని, మలయానిలుని - అత్యంత చమత్కారముగా, ఇది వఱకెవరును గూడ వర్ణింపని వ్యంగ్య పద్ధతిని వర్ణించినాడు. స్త్రీల సొగసును వర్ణించుచు భంగ్యంతరముగా కావించిన ప్రకృతి వర్ణన :-

"ఆరామ సీమల యందు నుండి పవళ్ళు
 ముస మెసంగ వసంతు డెదురు సూచు
మునిమాపుకడం గ్రొన్నన వింటి నెఱజోదు
 కేళి మందిరముల కెలనఁ జూచుఁ
బ్రొద్దు పోయిన వేళ రోహిణి ప్రాణేశుఁ
 డుదిరి మేడల మీద వెదకి చూచుఁ
దెలతెల వాఱంగ మలయ గంధవహుండు
 సోరణగండ్లలోఁ జొచ్చి చూచు

నా పురి విలాసవతుల యొయ్యారములకుఁ
గడు సొగసి వారి శాకలు కాచి కాచి
విరహులఁగలంచు వాతెయివ్విధముగానఁ
నున్న వారలనిక వేఱ యెన్ననేల" —విజయ. 1-76

విరహుల వేధించు ప్రాకృతిక శక్తులయిన ఈవసంత మన్మథ సుధాకర. మలయ మారుతములను గూడ విరహులుగా జేయు సౌందర్య మా పుర మదవతులకు గలదని చెప్పిన పై వర్ణన ఇతఃపూర్వ మనితర సాధితమైన దనుటలో నతిశయోక్తిలేదు. ఇట్టిదే కాకున్నను కుమార సంభవమున దాదాపట్టి వర్ణన మొకటి యున్నది. పార్వతిపై శివునికి కామభావమును కల్పించుటకై అకాలవసంతమును సృష్టించిన మన్మథుడు అప్పటి రమ్య ప్రకృతిని చూచి ఉద్దీపన పొంది రతీదేవినిచూచి తానే మనోవికారము నొందిన వాడాయె నన్నవర్ణన (కుమా.4-114) ప్రభావము పై వర్ణనపై (విజయ 1-76) కొంత గలదనుట సమంజసము.

పోకమ్రాకులు, కప్పురపుటనటి, ఆకు దోటలు, మౌక్తిక సౌధసంపదలు, వర్ణితము లయినవి (విజయ. 1-82).ఇవి పురవర్ణనలో సాధారణముగనుండునవే! కాని యిందులో పోకలు, కర్పూరము, ఆకు, సున్నము కలిసిన వీటి (తాంబూలము) స్ఫురించుచున్నది. మనుచరిత్రమందలి "మృగమదసౌరభ విభవ ద్విగుణితఘనసార సాంద్రవీటీగంధ స్థగితేతర పరిమళమై" అన్న వర్ణనలోని వీటియును (మను. 2-24) ఆముక్తమాల్యదలోని "మన కనురక్తి హెచ్చునిదెనుందని" (ఆము. 1-70) యన్నవర్ణనలోని వీటీ రాగమును చమత్కారముగ పోటీ చేయబడినట్లున్నది.

## సారాంశము

1. కుమారసంభవమందలి పురవర్ణన (7-93) యందు కననగు ధోరణి (శబ్దము లన్నియు కోలాహలముగ రేగుట) వసుచరిత్రమందును (2-7) చూడనగును.
2. భూలోక పట్టణములందలి పరిఖ వప్ర గజతురగాదులును, నిమ్మ, పనసాది వృక్షములును, దేవభూములందుగల ఓషధీప్రస్థ పురమునను, వైజయంతాదు లందును గూడ గలవని వర్ణించుట కేవలము కవి సంప్రదాయము.
3. ప్రతి వర్ణనమందును వర్ణనీయ విశేషాంశములను తప్పనిసరిగ వర్ణించు స్వభావము గల నన్నెచోడుడు పురవర్ణన మందలి అన్ని అంశములను వర్ణించినాడు.
4. మనుచరిత్రమున పురవర్ణన లేశమాత్రముగ గలదు. అరుణాస్పద పురవర్ణనలో బ్రాహ్మణయోగ్యమయిన వర్ణనలేగలవు.

5. పారిజాతాపహరణమున పురవర్ణన లేదు. ఇంద్ర ప్రాసాదమగు వైజయంతము వర్ణితము.

6. రాయలవారి పురవర్ణన సాభిప్రాయముగ నున్నది. మొటిదదగు విలుబుత్తూరు వర్ణనలో గజభటహయాది వర్ణనలు లేవు. ఎందుకనగా అందున్నది విప్రముఖ్యుడు విష్ణుచిత్తుడు. మధురాపురవర్ణనలో నన్ని విశేషాంశములును వర్ణితములు. అందు రాజున్నాడు.

7. కళాపూర్ణోదయమందలి ద్వారకా పురవర్ణన సాభిప్రాయ విశేషణములతో చిత్రింపబడినది. నాకలోకముతోడను, అందలి వ్యక్తులతోడను పోటీగలదన్నట్లుగా సూచింపబడినది.

8. మాఘుని శిశుపాలవధను కొన్ని విషయములో తెలుగు కవులు అనుకరించినారు. శిశుపాలవధలో రైవతకాద్రికి శ్రీకృష్ణుడు వెళ్లినపుడు ఒకేపరి అన్ని ఋతువులును భగవత్సేవకు ప్రవర్తిలినట్లు వర్ణింపబడినది. శిశుపాలవధలో నారదుని రాకయును, ద్వారకావర్ణనమును గ్రంథాదిని జరుగగా, పింగళి సూరన రచించిన కళాపూర్ణోదయమందును ప్రథమమున ద్వారకావర్ణనయును, నారదాగమమును వర్ణింపబడినది.

ప్రభావతీ ప్రద్యుమ్నమున ఇంద్రుని చేతను, మాతలి చేతను ద్వారకా నగరమును వర్ణింపజేయుట ఒక విశేషము. దేవలోకముకంటె గొప్పగా నున్నదని దేవతలె ఒప్పుకొనుట గొప్పగదా:

9. వసుచరిత్రయందలి పురవర్ణన గూడ ప్రత్యేకత గలది. ప్రభావతీ ప్రద్యుమ్నమందు పైనుండి క్రిందికి దిగి వచ్చుచున్న మాతలి ద్వారకను వర్ణించినట్లుగా, ఇందు మంజువాణి ఆకసమునుండి క్రిందికి దిగుచు వసురాజపురము ఎట్లు కనబడినదో తరువాత వర్ణించినది. ఆ సమయమున సమాధిలో నున్న సిద్ధుని వలె ప్రశాంత సుందరమై నీరవతను భజించినట్లు వర్ణించిన వర్ణన అన్నిటి కంటె ప్రత్యేకతను సంతరించుకొన్నది (4-64).

10. విజయవిలాసమందలి పురవర్ణన మనుచరిత్రమందలి దానివలె సాభిప్రాయ విశేషణా సంభరితమయి యున్నది.

---

# చతుర్థ ప్రకరణము

## సముద్ర వర్ణన

సముద్రవర్ణన అష్టాదశ వర్ణనలోని ప్రకృతి వర్ణన. ప్రబంధకవులు చాలవఱకు సముద్రవర్ణన చేసియున్నారు. అందులో "సిరినెలవు, రత్నాకరత్వము, చంద్రదర్శనోత్సు క్యము," మొదలగునవి యుండవలెనని విన్నకోట పెద్దన తన కావ్యాలంకార చూడామణి యందు (3-95) చెప్పినాడు.

"ద్వీపము, అద్రి రత్న, ఊర్మి, పోత, జలచర, నదీప్రవేశము, చంద్రునివలన వృద్ధి, బడ బాగ్ని, మేఘములు త్రావుట" మొదలగునవి వర్ణింపవలెనని అలంకారశేఖర కర్త కేశవ మిశ్రుడు చెప్పినాడు.

పై చెప్పినవన్నియు నుండవలెనను కట్టుబాటు లేదు.

## సముద్రవర్ణన — కుమార సంభవము

దక్షప్రజాపతి యమధర్మరాజును చూచుటకై బయలుదేరిన సందర్భములో సముద్ర వర్ణన తటస్థమగుచున్నది. ఇందు సముద్రమందు అద్రులును, రత్నములును, భయంకర జలచరములును, ఊర్మికలును, ఫేనమును, బడబాగ్నియును, మేఘములును, వర్ణితములు. మొత్తము ఎనిమిదిపద్యములలో నీ వర్ణనములు అన్నియు సాగినవి. వర్ణన ఉత్ప్రేక్షా మయము.

> "ఘన బృందానేక దేశాగత పథిక జనౌఘ ప్రపాపాంగునుగ్రా
> శనిభీతార్తోరు శైలాశ్రయు నిఖిల నదీస్వామి చంద్రాస్పదశ్రీ
> జనకుం గల్లోల మాలా చలిత నిజతటక్ష్మాజ రాజీవిలాసున్
> గనియెన్ దక్షుండు రత్నాకరు నిఖిలమహీకామినీ మేఖలాభున్"
>
> —కుమా. 1-115

పైన చంద్రునకును అప్సరసలకును స్థానమైన వాడుగా గూడ వర్ణితము. సముద్రము భయంకర జలజంతువుల కాకరమైనదని ఈ క్రింద చెప్పుచున్నాడు.

"కని యమ్మహా ఋషి మహాపరుష వజ్రి వజ్రపాత భీతాయాత
క్షోణీధరపక్ష క్షుభితానేక నక్రచక్ర తిమితిమింగిలతద్గిల కుంభీర
కుంభీనసాద్యనేక జలచర కులాకలిత లులితాలోలకల్లోలానూన
ఫేనాయమాన శుక్తిముక్తా ఫలాభిరామంబైనయది యని మెచ్చి"

-కుమా. 1-116

వనధిలో దాగియుండిన నగము లన్నియు నింద్రునిపై దాడి వెడలినవా అన్నట్లు ఊర్మికలు ఆకాశమునంటుచున్నవని యుత్ప్రేక్షింపబడినవి (కుమా. 1-118). మొగిళ్ల వర్ణన ఇంకను చమత్కారముగ నడచినది. వనధి నీటినంతయు మేఘములు పీల్చివేసినవి. అందులకు వానిని పట్టి వేయగా, పోలేక వసగా, దొంతులు దొంతులుగా పడి యున్నట్లు ఉత్ప్రేక్షింపబడినవి (కుమా. 1-120).

పై రెండు వర్ణనలందు వర్ణింపబడిన దండయాత్రలు, శిక్షగా కట్టి వేయుటలు, రాజోచిత వర్ణనలనిపించు కొనుచున్నవి.

సముద్ర సంబంధమైన సర్వమును ఈ సముద్ర వర్ణనలో వర్ణితము లయినవి. ఈ వర్ణనకు కథతో సంబంధము లేదు. అష్టాదశ వర్ణనలలో నిది యొకటి గాన, కేవలము వర్ణన కొఱకే చేయబడినది.

సముద్ర వర్ణన - ఆముక్తమాల్యద, మనుచరిత్ర, పారిజాతాపహరణము, ప్రభావతీ ప్రద్యుమ్నము, వసుచరిత్ర, విజయవిలాసములందు లేదు.

## సముద్రవర్ణన - కళా పూర్ణోదయము

కళా పూర్ణోదయమున సముద్ర వర్ణన సంపూర్ణముగ గావింపబడినది. సూరనార్యు డష్టాదశ వర్ణనలన్నిటిని తు, చ, తప్పక వర్ణించి యున్నాడు. మణిస్తంభుడు భార్యతో గలిసి దేశాటన చేయునప్పుడీ సముద్ర వర్ణన జరుగుచున్నది.

మకర, తిమింగిలములును, ఘుమఘుమారావములును వర్ణింపబడుచున్నవి. మణిస్తంభుడు తన భార్యతో ఆకాశమున సింహవాహనుడై సంచారము చేయుచున్నప్పుడు జరిగినదిది —

"అరుగుచుఁ గనుగొనియెను భీ
కరమకర తిమింగిలాది ఘనజల జంతూ
త్కర విహరణ భృశ రౌద్రున్
నిరుపమ ఘుమ ఘుమ రవాప నిద్రు సముద్రున్" - కళా. 4-196

తరువాత మణిస్తంభుడే సముద్ర దృశ్యమును భార్యకు చూపించుచు వర్ణించుట జరుగు చున్నది. తిమింగలములు నీటిని పైకి చిమ్ముట చక్కగా వర్ణింపబడినది. ఇది రమ్యమైన ప్రకృతి చేష్టయును, తద్వర్ణనమును అయియున్నది.

> "ఓ లలితాంగి చూడు కడునొప్పెడు నీరము నోరునిండగా
> గ్రోలి తిమిప్రకాండము శిరోవివరంబున వెల్వరించు ను
> ద్వేలపు టూర్ధ్వధార యలవేలుపు టేటిపయిన్ గుతూహల
> శ్రీలమరన్ నదీ విభుడు చిమ్మెడు చిమ్మన గ్రోవి నీరనన్" —కళా. 4-199

పై వర్ణన శృంగార రసపూర్ణమైనది. సముద్రుడు ప్రేమోత్సాహముచే ఆకాశ గంగపైకి (భార్య) చిమ్మన గ్రోవితో నీటిని చిమ్మెనా యన్నట్లున్నది. ఇట శృంగార రస ముత్పాదితమైనది. భర్త భార్యతో ఏకాంతమున నుండి కామావేశుడై నర్మగర్భ ముగ చేసిన వర్ణన పైది.

నీరు చక్కగా పైకెగిరి మరల సముద్రము లోనికి దూకుట శోభాయమానముగ నున్నది. నాగుబాము థిస్సుమని పడగ ఎత్తినదా అన్నట్లు ఉత్ప్రేక్షింపబడినది. చాల గొప్ప ఊహ! స్వరూపమేగాదు శబ్దము గూడ వినిపించుచున్నది.

> "ఉగ్రతిమి శిరో రంధ్ర నిష్ఠ్యూతమగుచు
> నెగయు సలిలౌఘ మది యొడ్డు మిగుల నొప్పె
> నబ్ధి పేరిటి కుండలితాంగభోగి
> థిస్సునందన పడగ యెత్తెనో యనంగ" —కళా. 4-200.

ఈ క్రింది పద్యమున వియోగశృంగారము రసవంతముగ ప్రతిపాదితమైనది. ఎత్తుగా ఆకసమున తన ప్రియురాలు గంగ యున్నది. క్రింద సముద్రుడున్నాడు. ఇద్దరికిని ఎడము చాలనున్నది. అందులకు సముద్రుడు విరాళిగొన్నాడు. పైనున్న ప్రియురాలిని అందుకొనుట కోసమై చేతులు పారజాపుచు అందుకొన జాలక ఉస్సురను చున్నట్లు చమత్కారముగ వర్ణింపబడినది.

> "ఔర్వము పేర ఘోర విరహానల మెంతయు నంతరంబునం
> బర్వ దరంగ బాహువులు బారలు చాచుచు నీ పయోనిధి యో
> పర్వసుధాంశుబింబముఖి భాసిల్లెడుంగడు నుల్లసద్రసా
> ఖర్వ సుపర్వ సింధువును గౌగిట జేర్పగడంగు కైవడిన్" —కళా. 4-201

సముద్రముపై మేఘములు వ్రాలుట వర్ణింపవలెనని సంప్రదాయము. మేఘ ములు వ్రాలినట్లు ఈ దిగువ వర్ణించుచున్నాడు. ఆ మేఘములు రమాదేవి కబరీభర ముగా సముద్రుడు విష్ణువుగా - ఉత్ప్రేక్షింప బడుచున్నారు.

"ఉదకముఁగ్రోల వ్రేలెడు పయోదము పొలుపు కేళి సంభ్రమా
భ్యుదయ గళద్రమా కబరి పోలిక నొప్పఁగటి ద్విలాసముల్
తదభివృతాంగకస్ఫురణలం దలపింపగ నీ పయోధియొ
ప్పిదము శయించినట్టి మురభేది తెఱంగు వహించె జూచితే" -కళా. 4-203

ఉదక పానమునకై నల్లని మేఘములు అంతకంతకు సముద్రముఖముగా దిగుచుండుటయు ఆ మేఘముల నుండి యిరమ్మదములు జారుచు సముద్రమును తాకుచుండుటయు శృంగార పూర్ణముగ వర్ణింపబడినది. సముద్రము, శయనించినట్టి విష్ణువువలెను, క్రిందికి జారుచున్న మేనుములు ఉపరతి యందునున్న రమాదేవి కబరీభరము వలెను, మెఱవులు ఉపరతిలో కదలుచున్న ఆమె శరీరమువలెను, ఉత్ప్రేక్షించిన పై వర్ణన అమోఘశృంగార భావశబలితమైనది.

కళాపూర్ణోదయమున సముద్రవర్ణన యెనిమిది పద్యాలలో సాగినది. శృంగార సముద్రుడు ఘనరసముతో నిండినవాడుకదా! వర్ణనగూడ రసోదంచితముగ నున్నది. శృంగార రసపూర్ణమైన యీ సముద్ర వర్ణన వినుచున్న మణిస్తంభుని భార్య—

"....ముసిముసి నగవుతోడ గోమలి లజ్జావనత ముఖి" యైనదట. (కళా. 4-204)

ఈ వర్ణనకు కథతో నన్వయమంతగా లేదనవచ్చును. ఈ విధముగ రసోదంచితముగ వర్ణించిన మణిస్తంభుడు కుసుమశరవశంవదుడై వెంటనే భార్యతో క్రీడించినట్లుండుట వలన కథతో నన్వయింపబడియున్న భ్రమ గలుగునుగాని, ఆ మన్మథ క్రీడకు మాత్రము కథతో సంబంధము లేదుగదా! కావున ఇది వర్ణనకోసరమై చేసిన వర్ణనగానే భావింప నగును.

## సారాంశము

1. సముద్ర వర్ణన అష్టాదశ వర్ణనలలో నొకటి యయినను కథాసంబంధము లేదన్న ధోరణిలో కొందఱు కవులు వర్ణింపలేదు. కుమారసంభవమందును, కళాపూర్ణోదయమందును మాత్రమే వర్ణించుట జరిగినది.

2. కుమారసంభవమందలి సముద్రవర్ణన కేవలము వర్ణన కొఱకే చేసినట్లున్నది. అయినను భావపూర్ణమైన ఉత్ప్రేక్షలతో, సర్వవివరముగా చేయబడినది. కళాపూర్ణోదయ

వర్ణన కథతో సంబంధము లేనిదయినను పద్ధతికొఅకు కావింపబడినది. సముద్ర ప్రకృతి చక్కగా వివరింపబడినది. కుమార సంభవముకంటె మించి అలంకార సుందరముగా రసోదంచితముగా గావింపబడినది. వర్ణన మంతయు నాయికా నాయకుల మధ్యగల సంభోగశృంగారముతో కూడుకొని యున్నది. ఉపరతి స్ఫోరక వర్ణన అత్యద్భుతము.

——

# పంచమ ప్రకరణము

## పర్వతవర్ణన

ప్రకృతి వర్ణనలోనెల్ల ప్రముఖ స్థానము నలంకరించినది పర్వత వర్ణన. వేద యుగము నుండియు పర్వత వర్ణనలు ప్రముఖస్థానమును వహించి యున్నవి. రామాయణ భారతాదులందు ఈ వర్ణనలు రసోపేతములైనవి. తర్వాత అష్టాదశ వర్ణనలలో నొకటిగ పరిగణింపబడినది. ఆ తర్వాతి కావ్యములలోనెల్ల చోటుచేసికొని యీ వర్ణనలు సంప్రదాయ రూపమును, ఆలంకారిక రూపమును వహించినవి.

పర్వతవర్ణనలో అచలత, ఉన్నతత, ఖచరవినోదిత, కనకాదిధాతు యుక్తత, మొదలగునవి యుండవలెనని కావ్యాలంకార చూడామణిలో విన్నకోటపెద్దన చెప్పినాడు. (కావ్యా. ౨-97).

తర్వాతివాడగు కేశవమిశ్రుడు తన అలంకార శేఖరమున - పర్వత వర్ణనలో ఓషధులు, ధాతువులు, వంశములు, కిన్నరులు, ఝురులు, శృంగములు, తటములు, గుహాలు, రత్నములు, ఉపత్యకలు, వనజంతువులు మొదలగునవి యుండవలెనని చెప్పినాడు.

మనకవులందఱును పర్వత వర్ణనను భౌతికోపయోగ దృష్టితోడను, రసదృష్టితోడను గావించి యున్నారు.

## పర్వత వర్ణన - కుమారసంభవము

కుమారసంభవమున హిమవద్వర్ణన మొత్తము 19 పద్యములలో నున్నది. ఓషధీప్రస్థ వర్ణనతో కలిపినచో 60 పద్యము లగును.

హిమవద్వర్ణనము ఇతివృత్తముతో పెనవైచుకొన్నట్టిది. హిమవంతుడిందొక పాత్ర యగుచున్నాడు. హైమవతి తండ్రి యితడు. ఈశ్వరునకు పార్వతిని కన్యాదానము గావించినవాడు.

అన్ని పర్వతములకంటె ఉన్నతుడైనవాడు. సర్వమును కలిగి యున్నవాడు.

"రోహణాచలమును రూఢిగా కలదింత
    మహనీయ రత్న సామగ్రి గలదె
వింధ్యాద్రితో సురల్ విరసమెత్తిరి గాక
    గ్రహచక్రమది యింత గడచియున్నె
హాటక రుచియకా కమరేంద్రు గిరికింత
    పరమౌషధీప్రభా భాతియెత్తె
హరుడర్థపతి చెలిమి కందుండె గాకింత
    రమ్యమే వసియింప రజతశైల

మఱుడు దన విద్య మెఱయఁ గులాద్రులొండ్లు
వడసె గా కర్వి దాల్పంగ భరమె దీని
కనకనగ చక్రవర్తి మహాత్మ్య వైభ
వాలయంబగు పేర్మి హిమాచలంబు" - కుమా. 3-3

రత్న సామగ్రికిని, ఔన్నత్యమునకును, ఓషధీయుక్తతకును, స్థానమని పైని వర్ణింప బడినది. పేరుకెక్కిన యితర అన్ని పర్వతములకంటె సార్థకాధిక్యము గలదిగ చెప్ప బడినది.

సుర వాహినీ ధరత్వమందును శుభ్రశరీరపు కల్మియందును, నీలకంధరము కల్గి యుండుటయందును, ఉమను కలిగి యుండుటయందును, అపార విభూతిత్వమందును, మహేశ్వరుని పోలియున్నట్లుగా వర్ణింపబడుచున్నాడు హిమవంతుడు.

"సురవర వాహినీధరుడు శుభ్రశరీర విభాసి నీలకం
ధర పరిశోభితుండు గుణధాముడు దుంగతనుండు భూధరా
చరణుడు మా సమన్వితుడపార విభూతిసమేతుడై మహే
శ్వరుడును బోలెనొప్పు హిమవంతుడనంత మహత్వ సంపదన్" కుమా. - 3-4.

కయ్యమునకును, వియ్యమునకును సమానత యుండవలెననుట లోకసిద్ధము. హరు నితో వియ్యమందు వాడు గాన హిమవంతుడీశ్వరునితో సాటిచెప్పబడుట సమంజసము.

మదకరులను, వాని బృంహితములను, అవి మేఘధ్వనులతో పోలుటయును, నెమళ్లు నాట్యమాడుటలను, ఈ క్రింద వర్ణించుచున్నాడు.

"శీతగిరి మీద మదకరుల్ సీవరించు
నెలుగు నవఘనారవమని యెసగియాడు
నమ్మి పదువులు గడునొప్పు నగ విభునకు
బలసిపట్టిన పింఛాత పత్రభాతి" -కుమా, 3-7

పై వర్ణన యందుగూడ రాజస్ఫురణ కనిపించుట కుమార సంభవకారుడు రాజకవి యనుటను చాటుచున్నది.

శశికాంత శిలలు కరిగిపోగా ఆ జ్యోత్స్నా ప్రవాహమందు చంద్రుడోడ వోలె పోవుచుండుట రమ్యముగా-ఆలంకారికముగా-సరసముగా వర్ణింపబడినది.

"విలసితోత్తుంగ శశికాంత శిలలఁగదిసి
యరుగు శశి గని శిలలెల్లఁ గరగి పెరిగి
తెలుపి పఱతెంచు వఱ్ఱోడిఁ దేలిపాఱు
నుడు గణేశుండు వెండి పేరోడవోలె" -కుమా. 3-10

ఉరగ, దేవ, ఖచర, సిద్ధచారణాదుల విహార భూమిగా హిమవత్పర్వతము ఈ క్రింద వర్ణింపబడుచున్నది.

"సవిలాసగతిఁ గ్రాలు జంగమ లతలతో
నడపాడు నురగ కన్యకల చెలువు
వెలుగొందు మణి పుత్రికలగెడ విహరించు
వరనిధానాధి దేవతల చెన్ను
సాను సంగత మేఘ సౌదామనులగూడి
పొలపాడు ఖచరాంగనల బెడఁగు
మందార చందన నందన సంగతి
నెలసిన వన దేవతల నయంబు

మనసు లురులు కొల్ప మండనాంగానేక
హములఁ బొంది చూచు నమర సిద్ధ
చారణాది వరకుమారాంగ భూషణ
ద్యుతుల హిమనగేంద్ర మతిశయిల్లు" -కుమా. 3-14

కిన్నర గీతులతోగూడి పాడు మధుపగానములును, కింపురుషాంగనల కంఠ ధ్వనులతో సాటిగా పలుకు కోయిలలును, దేవేంద్రాంగనా మంజు భాషలతో సాటిగా పలుకు చిలకల పల్కులును వర్ణితములు. దేవతలతోడను, దేవయోనిజాతులతోడను నివసించు మధుపములును, కోకిలలును, కీరములును, వారి ననుకరించుట సహజమేగదా!

"కలయం గిన్నర గీతిఁ గూడ మృదురేఖంబాడు మత్తాళి సం
కులముల్ గింపురుషాంగనా తతి యెలుంగుల్ వించు భావించి మా
ఱులుగుల్ నింపుగనిచ్చు గోవిలలు దేవేంద్రాంగనా మంజు భా
షలతోడం దగు మాఱుమాట లెలమిన్ సంధించు జిల్కల్ మొగిన్" -కుమా. 3-17

హిమవంతుడు సర్వ పర్వతములను వాత్సల్యముతో చూచిన వాడుగను, భూ భారమంతయు దాల్చువాడుగను, లోకమాతయైన పార్వతికి తండ్రి యయినవాడు గను, ఈశ్వరునికి మామయయిన వాడుగను ఓషధీప్రభాస్థానమయినవాడుగను వర్ణింప బడుచున్నాడు.

"మును మహీధేనువు చనువత్సమై కుడిచి
వస్తు సంపూర్ణమై వఱలు వాడు
కమఠోరగేంద్ర దిగ్గజరాజి దాల్చు భూ
భార మొక్కటఁదాల్చి పరగువాడు
త్రైలోక్య జననియై తనరు శర్వాణికి
జనకుండు నాఁబడి సన్నవాడు
విశ్వైక గురుడగు నీశ్వరునకు నర్థి
మామగా నెగడిన మహిమవాడు

తుహినకరతీవ్రకరవహుత వహులు పరుసఁ
జాచు తమ మోషధీ ప్రభా భాతి దాన
పాచి విలసిల్లు వాడు దిగ్భరిత కీర్తి
మంతుడచ లుండు పతి హిమవంతుడతడు" -కుమా. 7-129

"మును మహీధేనువు చనువత్సమై కుడిచి" అన్న పాదము కాళిదాసు కుమార సంభవమందలి-

"యం సర్వశైలాః పరికల్ప్య వత్సం (1-2) అన్న శ్లోకమునకు అనువాద ముగా నున్నది. కాళిదాసుని కుమారసంభవమును, ఉద్భటుని కుమారసంభవమును చూచి, అనువాదము కాని అనుసరణతో వ్రాసినాడుగాని వారుచెప్పిన వానినే-వారు చెప్పినట్లు గానే-అనుకరింపలేదు. చాలచోట్ల అనుసరణ మాత్రము లేకపోలేదు.

ఈశ్వర వాసమగు కైలాసమును హిమవద్వర్ణన కంటె కొంచెము భిన్నమగు ధోరణిలో వర్ణించుచున్నాడు. మరికొంత ఆధిక్యమును సంతరించుకొన్న వర్ణనమిది. కేవలము అధిభౌమ వస్తు వర్ణనమిది.

"రస రసాయన సుధారస నిర్ఝరంబులై
క్రమ్మంగ నెలరారు కల్పతరుల
బరుసవేదులఁ బొంది హారికాంత శిఖ గ్రాగి
కనకంబులగు నయస్కాంత శిలల
సురు చిరౌషధి తృణ జ్యోతిః ప్రభాలీల
మాయించి వెలిగెడు మణిగణముల
బహుళ చింతామణి ప్రాసాద వృత భూష
ణాంబర స్నాన పానాంగరాగ

మాలికాంగ లతా నంద మందిరముల
ప్రమానఁబండులు సతులకామరిగియాడు
సిద్ధ విద్యాధరామర స్త్రీసమూహ
భాసితంబగు కైలాస పర్వతంబు" -కుమా.7-144

కుమారసంభవమందలి పర్వతవర్ణన—కేవలము అష్టాదశ వర్ణనా నియమము కోసరము మాత్రమే చేసినట్టిదిగాదు. కావ్యమందీ పర్వతమునకు అత్యంత ప్రాధాన్యము గలదు. కావ్యరంగమున కంతయు ఆటపట్టు ఈ పర్వతము.

సంస్కృత కుమార సంభవమున హిమవద్వర్ణన కొలదిగానే గలదు. నన్నిచోడుడు విస్తృతముగా చేసినాడు. మూలమందు కంటె విపులముగను, స్వతంత్రముగను వర్ణింపవలెనన్న కుతూహలముతో గొప్పగ వర్ణించినాడు.

ఈ పర్వత వర్ణనలో మామూలు పర్వతములలోవలె ఔన్నత్యము, రత్నగర్భత, మేఘములు, కర్యాది జంతువులు, మయూరాదులు, దేవదేవయోని జాతులు, వర్ణితములు. కాని అడుగడుగున దివ్యతా స్ఫురణ ద్యోతక మగుచున్నది గూడ.

## పర్వతవర్ణన—మనుచరిత్ర

మనుచరిత్రలోని నానా పర్వత వర్ణనలు ఇతివృత్తముతో సంబంధము గలవి. ప్రవరుడు సిద్ధుని జూచినపుడే ఉత్తేజితుడైనాడు, నానాతీర్థ వర్ణన విన్నపుడు మరింత ఉత్తేజితుడైనాడు. ఆ సిద్ధుడింకను పూర్వ దక్షిణ పశ్చిమోత్తర పర్వతముల వర్ణించుచు- "వినుము గృహస్థ రత్నంబ! లంబమాన రవి రథతురంగ శృంగార చారుచామరచ్ఛటా ప్రేక్షణోద్దీవ చమర సముదయంబగు సుదయంబునంగల విశేషంబులు శేషఫణికినైన లెక్కింప శక్యంబె...యకటకట, వికట కూట కోటి విటంక శృంగాట కాఢౌకమాన జరదిందు బింబగళ దమృత బిందు దుర్దినార్ద్రీకృత సల్లకీ పల్లవ ప్రభంజన పరాంజన హస్తిహస్తంబగు నస్తంబునంగల మణి ప్రస్తరంబుల విశ్రాంతిం జింతించిన మేనంబులక లిప్పుడుం బొడమెడు...నేనిట్టి మహాద్భుతంబు లీశ్వరానుగ్రహంబున నల్పకాలంబునం గనుగొంటి ననుటయు" అని దీర్ఘసమాస భరితమైన వాక్యాలతో, ననల్పమైన వాగ్ధాటితో, ఆవేశపూర్ణ కంఠధ్వనితో, ఆయా పర్వతాల మహిమాతిరేకమును గూర్చి, బ్రహ్మాండముగ ఉపన్యసించినాడు. (మను.1-72). అది విని ముందే యువ్విళ్లూరుచుండిన ప్రవరుడు మరింత ప్రభావితుడై—ఉద్దీపితుడై హిమాచలమును చూచు నవకాశము కొఱకై సిద్ధుని ప్రార్థించినాడు. (వెఱవక మీకొనర్తు నొక విన్నప...మను.1-73)

ప్రవరుడు హిమాలయమునకు బయలుదేరుటకు కారణభూతమైనది నానా పర్వత వర్ణన. లేనిచో, ప్రవరుడు హిమాలయమునకు వెళ్ళడు. వెళ్ళనిచో కథలేదు. అందువలన ఈ పర్వత వర్ణన ఇతివృత్తముతో ముడివడియున్నది. కథలో ప్రముఖస్థానమును గలిగి యున్నది. అన్ని అంగములను కూడియున్నది.

ఈ వర్ణన ఓజఃపూర్ణ కవితను సంతరించుకొన్నది. అద్భుత రసపూర్ణమై యున్నది. ఈ పర్వత వర్ణనకు సంబంధించిన భాషా భావములు రెండును, కన్నడమున పంపభారతము నందలి పర్వత వర్ణనను పోలియున్నవి.

"...ఇందు బింబ విగళ దమృతబిందు దుర్దినార్ద్ర చందనాన్వితముం, అశిశిరకర రథతురగ ఖురశిఖరనిఖండిత లవంగపల్లవముం, ఐరావత కరలూన సల్లకీశబలముం అప్పుదయ గిరియం..." —పంపభారతము, ఆశ్వా. 4-13వ గద్యము.

రన్న, పంప, పొన్నలను నన్నయ మొదలు చాలమంది కవులు బాగుగ అనుకరించి నారనుటకిది ప్రబల నిదర్శనము.

"నిరుప హతి స్థలంబు రమణీప్రియ దూతిక తెచ్చి యిచ్చు కప్పురవిడె మాత్మ కింపయిన భోజన..."

అను పెద్దన పద్యము, కన్నడమందలి (క్రీ.శ. 1240) సూక్తి సుధార్ణవము అను గ్రంథములోనిది.

"కరేణు కరకంపిత సాలము శీతశైలమున్ (మను. 2-2) అన్నది "కరి కలభ కరమృదిత తమాలమయోదినీం" అన్న కాదంబరీ వాక్యమును కొంత పోలియున్నది. వరూధినిని స్ఫురింపజేయుటకై 'కరేణు' శబ్దమును (కరి శబ్దమును వదలి) వాడినాడు పెద్దన.

మనుచరిత్ర మందలి పర్వత వర్ణనలలో ముఖ్యమయినది శీతశైలవర్ణన. ప్రవరుడు ఎంతో మక్కువతో ఎగిరిపోయి హిమవత్పర్వతమును చూచినాడు.

"అటఁజని కాంచె భూమి సురుడంబర చుంబి శిరస్సరర్ఝరీ
పటః ముహుర్ముహుర్లుఠదభంగ తరంగ మృదంగ నిస్వన
స్ఫుట నటనానుకూల పరిఫుల్లకలాప కలాపి జాలమున్
కటక చరత్కరేణు కరకంపిత సాలము శీతశైలమున్" — మను. 2-2

భావికథ ఇందు సూచితము. అంబర చుంబి శిరస్సరత్ ఝరీపటల ముహుర్ముహుర్లుఠదభంగ తరంగ మృదంగ నిస్వనమునకు కలాపిజాలము నాట్యముచేయు చున్నది. జలద గంభీర కంఠధ్వనియుక్తుడైన ప్రవరుని చూచి - అతని పలుకులువిని, వరూధిని యను కలాపి నాట్యముచేసినది. "కటక చత్కరేణు కరకంపిత సాలము" అను విశేషమున స్వారస్యము గలదు. కరేణువనగా ఆడుఏనుగు, ఆ ఆడఏనుగే వరూధిని.

కరేణువు తన కరముచేత సాలమును కంపింపజేయుచున్నది. ఆ సాలమే ప్రవరుడు. ఊచి, ఊచి విసిగి ఆ కరేణువు వెడలిపోవునుగదా! ఇక్కడ ఈ పద్యవర్ణన ద్వారా ప్రసన్న కలితార్థయుక్తతను పొందించినాడు.

ఈ వర్ణన చాల ఉదాత్తమయి, ఓజఃపూర్ణకవితాధారను సంతరించుకొన్నది. వర్ణిత వస్తువుయొక్క బృహద్రూపము, ఔన్నత్యము, దానియొక్క గుణము - అన్నిటిని - శబ్దములయందు ప్రతిబింబింపచేసినాడు కవి. మనుచరిత్రపై ఇంచుక శ్రద్ధగల వారలకెల్ల రకును ఈ పద్యము కంఠపాఠము.

ప్రవరుడు "నరనారాయణ చరణాంబురుహద్వయ భద్రచిహ్నముద్రిత బదరీ తరుచండమండలాంతర సరణిన్" (మను. 2-5) చనుచుండగా వాతావరణము హృదయ రంజకముగా నుండినది. "ఉల్లల దలకాజలకణ పల్లవిత కదంబముకుళపరిమళలహరీ హల్లోహల మదబంభరమల్లధ్వనులు ఎసగగా మరుదంకురములు విసరినవి (మను. 2-6) అంతే కాదు. ఆ అరణ్యమున భయంకర జంతువులు గూడ ప్రత్యక్షమైనవి. అందుగు చిగుళ్ళను తొండములు చాచి అందుకొను కరులును, తిని మత్తెక్కి పొదరిండ్లలో గుఱ కలుపెట్టు క్రోల్పులులును, ముస్తెల త్రవ్వి ఎత్తుచున్న వరాహములును, డొంకలనుండి క్రేళ్లుదాటు మనుబిళ్లును, భల్లూక నఖభల్లములచేత విదారితమైన మధుకోశవిసరమును చూచుచు ప్రవరుడు నడక సాగించినాడు. (మను. 2-7)

ఔషధహీనుడై, దారి దొరకక బాధపడుచున్న ప్రవరునకు ఇంచుక ఆశ కన్పట్ట జేయుచున్నాడు కవి. ఒక అద్భుతమైన ప్రదేశమును సృష్టించుచున్నాడు. ఇందు గంగా నిర్ఝరము, ఏటికెలకులు, క్రముక పున్నాగాది వృక్షములు, పికశారికాది పక్షులు, చంద్రకాంతదరుల ప్రతిశబ్దములు, వర్ణితములు.

"కులిశధారాహతి పొలుపునఁ బైనుండి
యడుగు మోవగ జేగురైన తటుల
గనుపట్టులోయ గంగా నిర్ఝరము వాఱ
జలువయౌ నయ్యేటి కెలకులందు
నినుక వెట్టిన నేలనేచి యర్కాంశుల
జొరనీక దట్టమై యిరులు గవియు
క్రముక పున్నాగ నారంగ రంభా నాళి
కేరాది విటపి కాంతారవీధి

గెరలు పికశారికా కీర కేకి భృంగ
సారసధ్వని దనలోని చంద్రకాంత
దరులు ప్రతి శబ్దమీన గంధర్వ యక్ష
గాన ఘూర్ణితమగు నొక్క కోన గనియె"

—మను. 2-19

ప్రవరునిలో ఆశ రేకెత్తించుటకు - వరూధిని యున్న చోటికి అతనిని లాగికొని పోవుటకు - వాతావరణ సృష్టి చేసినాడు కవి. యక్షగంధర్వగాన ఘూర్ణితమైన కోన

గని యది మునియాశ్రమ ప్రాంతమని ప్రవరుడు భ్రమపడినాడు. ఆ కోన - ఆ సెల - ఎంత అందముగ - ఎంత దట్టముగ - ఉన్నదో వర్ణితము. ఇక్కడ ప్రకృతి దృశ్యపర మగు ఆకర్షణపు సృష్టించినాడు కవి. ప్రవరుని ఎంతో పైకి గొనిపోయి క్రమముగ క్రిందికి దిగునట్లు చేయుచున్నాడు. అక్కడినుండి సశరీర స్వర్గమును త్రోసిరాజని భూమికి దిగిపోవుచున్నాడు ప్రవరుడు.

"నికట మహీధరాగ్ర తట నిర్గత నిర్ఝర ధార జాని లో
యకుఁ దలక్రిందుగా మలకలై దిగు కాలువ వెంట బూచు మ
ల్లిక లవలంబన బుగ నళిప్రకరధ్వని చిమ్మిరేగ లో
నికి మణిపట్టభంగ సరణిన్ ధరణీసురుఁడేగి చెంగటన్" —మను. 2-21

పై పద్యములోని "గంధర్వ యక్షగాన ఘూర్ణితమగు కోన" - "నిర్ఝరధారజాని లోయకు దలక్రిందుగా మలకలై దిగు కాలువవెంట బూచు మల్లిక లవలంబనంబుగ నళి ప్రకరధ్వని చిమ్మిరేగ లోనికి మణి పట్టభంగ సరణిన్ ధరణీసురుడేగి" - అను వానిని పరిశీలింపవలెను.

ఈ ప్రకృతి మునివాటిక ప్రకృతి గాదు. ఈ మల్లియలు - ఈ మణిపట్టము, మునివాటికవి గావు. ఒకదాని కొకటిగా భ్రమపడినాడు ప్రవరుడు. అక్కడతడు చూచినదేమి ?

"తావుల్ క్రేవఁ జల్లు చెంగలువ కేదారమ్ము తీరమ్మునన్
మావుల్ క్రేవులు నల్లిబిల్లిగొను కాంతారంబునం దైందవ
గ్రావాకల్పిత కాయమాన జటిల ద్రాక్షాగుళుచ్ఛంబులన్
బూవుం దీవల నొప్పు నొక్క భవనంబున్ గారుడోత్కీర్ణమున్" —మను. 2-22.

ఆ కాయమాన సహిత భవనరాజము భోగముల కెంతయో ఆటపట్టగుచోటు.

ఇపుడు భ్రాంతినుండి ఆశ్చర్యములోనికి లాగబడుచున్నాడు ప్రవరుడు. వాతావరణ మంతకంతకు మనోజ్ఞతర మగుచున్నది. అంతకంతకు స్పష్టతలోనికి పరిణమించు చున్నది.

"మృగ మద సౌరభ విభవ
ద్విగుణిత ఘనసార సాంద్ర వీటీగ ధ
స్థగితేతర పరిమళమై
మగువ పొలుపు దెలుపు నొక్క మారుత మొలసెన్" —మను. 2-24.

ఇది అద్భుతమైన శిల్పముగల వాతావరణ సృష్టి. వరూధినిని అతనివైపు లాగికొని తెచ్చుచున్నదా వాతావరణము. వీటీ గంధమును బట్టి అక్కడే స్త్రీ యున్నదని తెలిసి కొన్నాడు ప్రవరుడు.

తాంబూలములో కస్తూరిని, కర్పూరమును గూడ కలుపుకొందురు. ఆ కలుపునట్టి కర్పూరము పాళ్లు రెట్టింపయినచో ఆ తాంబూలము ఆడువారిది. మగవారిది సమపాళ్లు.

ఇంతటి సూక్ష్మ పరిశీలనలో ఈ వీటీగంధ పూర్ణ మారుతమును ప్రసరింపించినాడు సరస కవి పెద్దన. ఈ పర్వత సంబంధి మారుతము యొక్క ప్రయోజనమిది.

వెనువెంటనే ఒక మంజుల, మనోజ్ఞ, రమ్యాతిరమ్యస్త్రీమూర్తిని ప్రవరుని ముందుకు నెట్టుచున్నాడు కవి. హిమాలయమున దేవతాస్త్రీలుందురుగదా! ఆ వర్ణన గూడ చేయుచున్నాడు.

"అత డావాత పరంపరా పరిమళ వ్యాపార లీలన్ జనా
న్వితమిచ్చోటని జేరబోయి కనియెన్ విద్యుల్లతా విగ్రహన్
శతపత్రేక్షణఁ జంచరీక చికురన్ జంద్రాస్య చక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొక మరున్నారీ శిరోరత్నమున్" -మను. 2-25

పై నారీ వర్ణనలో ఉపమానములుగా వాడిన వాతపరంపరా పరిమళము, విద్యుల్లత, శతపత్రము, చంచరీకము, చంద్రుడు చక్రము – అన్నియును ప్రకృతి వస్తువులు. హిమాపంత శైలీమాధురితో కూడుకున్నటువంటి—

"మదనారాతి సమానుఁ గాశ్యప మహామౌనీంద్రు సేవింప స
మ్మద మారంజని యాశ్రమంబు వనసీమన్ గంటి వాల్గంటిఁ దో
యద నీలాలకఁ గంబుకంఠిఁ గరణీయానంబ యోజాననన్
సదసత్సంశయ గోచరోదరి సుధాసంబాధబింబాధరిన్"

అన్న పినవీరభద్రుని శృంగార శాకుంతలము (2-173) నందలి పద్యమునకు ప్రతికృతిగా నున్నది.

హిమవత్పర్వత వైభవ సంపద వరూథినీ పాత్ర ముఖమున వర్ణించుచున్నాడు. వరూథిని ప్రవరునితో అనుచున్నది :-

"బహురత్నద్యుతి మేదురోదర దరీ భాగంబులన్ బొల్చు ని
మ్మిహికా హార్యమునన్ జరింతు మెపుడున్ ప్రేమన్ నభోవాహినీ
లహరీ శీతల గంధవాహ పరిఖేల న్మంజరీ సౌరభ
గ్రహ సంరంభిర తుందిలంబు లివి మత్కాంతార సంతానముల్" -మను. 2-45

వరూథిని గృహ ప్రాంత ప్రకృతి రమణీయమేగాదు, భాగ్యవంతమును భోగాతీతమును గూడ. ఇంత గొప్ప ప్రకృతి దేవభూములందే సాధ్యము గాని మానవ భూములందుండుట వీలుబడదు. అక్కడి ప్రకృతి ఇంకను సొగసుగ నున్నట్లు వరూథిని పలుకులను బట్టి తెలియుచున్నది.

"ఎక్కడి యూరు కాల్నిలువ కింటికి పోయెదనంచుఁ బల్కెదీ
వక్కట మీ కుటీర నిలయంబులకున్ సరిరాక పోయెనే
యిక్కడి రత్న కందరము లిక్కడి నందన చందనోత్కరం
బిక్కడి గాంగ సైకతము లిక్కడి యీ లవలీ నికుంజముల్" మను. 2 50

అక్కడ దొఱకు భోగవస్తువులు వరూధిని పలుకులలో :-

"సద్యోవినిర్భిన్న సారంగనాభికా
హృతమై పిసాళించు మృగమదంబు
కసటువో బీరెండ కరగి కఱ్ఱల నంటి
గమగమవలచు చొక్కపు జవాజి
పొరలెత్తి ఘనసార తరువులం దను దాన
తొరగిన పచ్చ కప్పురము సిరము
గొజ్జంగి పూపొదల్ గురియంగ పటికంపు
దొనల నిండినయట్టి తుహిన జలము

వివిధ కుసుమ కదంబంబు దివిజ తరుజ
మృదుల పనస ఫలాసవామేయ రత్న
భూషణంబులు గల విందు భోగపరుడ
వయి రమింపుము ననుగూడియనుదినంబు" -మను. 2-55

హిమాలయమున ఈ భోగ పదార్థములు తాజాగా దొరుకుచుండునని వర్ణితము. శృంగార రసపోషణకును, ఉద్దీపన విభావాభివృద్ధికిని, ఈ వర్ణన దోహదకారణము. అందువలననే ప్రకృతివస్తు సహాయమున మనోహర వాతావరణ సృష్టి జరిగినిది.

మనుచరిత్రలో హిమవత్పర్వత వర్ణన ప్రముఖ స్థానమును వహించుచున్నది. రస వత్తరమైన కావ్య భాగమునకు హిమవత్పర్వతమే ముఖ్యరంగము. పర్వతవర్ణనలో నుండవలసిన యంశములను పట్టి యిచ్చినట్లుగా వర్ణింపక రసపూర్ణ కథనము ద్వారానే వర్ణించినాడు పెద్దన.

కుమార సంభవమున నన్నిచోడుడు చేసిన హిమవద్వర్ణనకును మనుచరిత్రలో చేసిన హిమవద్వర్ణనకును చాలభేదమున్నది. కుమారసంభవమందలి వర్ణన దివ్యప్రకృతికి సంబంధించినది. మనుచరిత్రమందలిది రసప్రకృతికి సంబంధించినది.

పూర్వకవుల నక్కడక్కడ అనుసరించినాడు పెద్దన. అంతేగాని అనువాదము చేయ లేదు. భావమును చూచి, తాను క్రొత్తగా ఊహించి వ్రాసినాడు గాని అన్యథాగాదు. "అట జనికాంచె ......" అన్న పద్యములో నెమళ్ళు తరంగధ్వని విని లయానుకూల ముగా తాళము వేయుచున్నట్లు నాట్యమాడినవి అని యున్నది కాళిదాసుగూడ మేఘ సందేశమున—

"తాళైశ్శింజావలయ సుభగైర్నర్తితః కాన్తయామే
యామ్యాస్తే దివసవిగమే నీలకంఠః సుహృద్వః" —మేఘదూతము.

ఎట్టి లయాన్విత శబ్దమును విన్నను నెమిళ్లు లయబద్ధముగా నాట్యము చేయు నని యర్థము.

నన్నెచోడుని కుమారసంభవమునను, రామరాజభూషణుని వసుచరిత్రమందును వర్ణితమగు పర్వతములు, కావ్యములలోని అన్ని కదలికలకును కేంద్రస్థానములై యున్నవి. వసుచరిత్ర మందలి పర్వతములు పై కావ్యములలోవలె పాత్రలు గావు. కాని కథలో అత్యంత ప్రముఖస్థానమును వహించి యున్నవి.

## పర్వతవర్ణన - పారిజాతాపహరణము

ఇందు మేరుపర్వత వర్ణన మాత్రము గలదు. మొత్తము తొమ్మిది పద్యాలలో వర్ణింపబడినది. శ్రీకృష్ణుడు స్వర్గమునకు పోవునపుడు సత్యభామకు ఆ పర్వతమును చూపించి అందుగల విశేషముల వివరించినాడు. మేరుపర్వతము చుట్టును సూర్యచంద్రులు తిరుగుచుందురని వేదకాలము నుండియు సంప్రదాయముగ వచ్చుచున్న భావము.

ఇక్కడ సూర్యచంద్రులు మేరువు చుట్టు తిరుగుచున్నారనియు, ఈ పర్వతము రెండవ గరుత్మంతుని వలెనున్నదనియు — "కువలయనేత్ర దీని కనుగొంటివె ......... (పారి 2-85)" అన్న పద్యమున వర్ణితము.

అందుగల పికములను సైరిభములను (అడవి దున్నలు) భల్లూకములను, సింహములను, జింకలను. భ్రాంతిగొన్నవన్నట్లుగా వర్ణించుచున్నాడు —

> "జీర్ణ పర్ణద్రు సంకీర్ణాహి మణి విభా
> మాయా కి ల వ చ్యమాన పికము
> శశికాంత రుచిమృషాసలిల సంస్ఫాలన
> శ్లథ విషాణోద్వేగ్న సైరిభంబు
> గోమేధిక ప్రభాంకూర మిథ్యామధు
> ద్రవ లిలిక్షా మిళత్ భల్లుకంబు
> నీలగండ ప్రస్తరాళీక గజభేద
> శీర్యన్న ఖడుబ్ధ సింహకులము
>
> గారుడాశ్మచ్ఛ విచ్ఛటా కపట యవస
> పూలికా చర్వణవ్యగ్ర బాలమృగ వి
> లంఘ్య మానాబ్జరాగ శిలావితాన
> కూటదావాగ్ని యా మరుత్కుధర మబల"
>
> —పారి. 2–86

క్రమపూర్వకమైన నేమి, పైన అహులమణులు, కిసలయములు, శశికాంతశిలలు, మధు పేటికలు, ఏనుగులు, తృణము, దవాగ్ని - అన్నియును వర్ణితములు. పర్వతమెంత

ఉన్నతమును, భయంకరమును, అయినదో - దానికి సరితూగు సీసమును ఓజఃపూర్ణమైన సమాసధారతో ప్రయోగించినాడు తిమ్మన.

పొంచి పొంచి చంద్రునిలో జింకను నిజమగు జింకనుగా భావించి, దానిని బాణముతో కొట్టి, అది అమృత నిషేచన వలన బ్రదుకగా,గుఱి తప్పినదే యని చిన్నబోయిన వదనము గలవారై విల్లమ్ములు (అవమానముచే) పారవైచి వెళ్లిపోవుచుండు చెంచెతలు వర్ణింపబడినారు (పారి. 2-87). తరువాత —

"వెండియు నప్పసిండికొండ గండశిలామండలంబుల సుద్దండ *వేదండంబు* లొండొండ ...... వలన - అత్యంత నిర్మల ...... *బాలశిఖావళంబులం* గని తమ వరు లకుం జూపి ............... *గరుడ తరుణీ* నివహంబుల వలన - సెలయేటి ...... *యక్ష పక్ష్మ్ర లాక్షల* వలన - *కేసరి కిశోర*నఖముఖ విదారిత కుంభంబైన *వనగజంబును* ...... *వరాహంబుచు* ... *కీచకనిచయంబును* ... *పర్జన్యంబును శంఖ శుక్తి సంఘంబును* ...... మౌక్తికముల ... *సాధ్యమిధ్యామధ్యా*ల వలనను అభిరామంబై, మఱియు నొక్కొక్కచోట సురపతి ... *అజగర నివహంబును* ... *శార్దూలంబులును* ... *భల్లూకంబులును* ... *నిషాదభరితంబును* ......" మెఱయునది" (పారి. 2-88) అని వర్ణింపబడినది.

పైన జంతావాదు లన్నియును వర్ణితములు. మేరుపర్వతముపై నవి యన్నియు నుండుటకు వీలు లేదు. కాని పర్వతవర్ణనలో నవి యన్నియు నుండవలెనను నియమము ఉన్నది గదా! అందులకు ఉచితానుచితములు పరిశీలింపక తిమ్మకవి వర్ణించినాడు. ఇట్టి సర్వవస్తు, సర్వజంతు సంకీర్ణంబయిన వర్ణనలు చేయు సమయమున ఉద్దండ సమాసపూర్ణ రచనతోవచనము సాగించుట ప్రబంధకవులు పాటించిన మార్గముగ కనబడుచున్నది.

మనుచరిత్రయందు గూడ సిద్ధుడు ప్రవరుని ఉత్సాహపఱచు ఘట్టమున వచనమే ప్రయోగింపబడినది. మనసున జనించిన భావోత్కృష్టతననురించి భాషోత్కృష్టతను ప్రదర్శించవలెనన్న, అడుగడుగునను అడ్డు తగులు యతిప్రాసల బాధలేని వచనమే వరణీయమైనది.

తర్వాత తిమ్మన కిన్నరలమీటుచు పాడుచుండు కిన్నర సమూహములను (2-89) సిద్ధపాంథులను (2-90) విద్యాధరులను (2-91) గంధర్వులను (2-92) యక్షులను (2-93) గుహ్యకులను (2-93) గరుడులను (2-93) చారణులను (2-93) వర్ణించినాడు. పై అందరును దేవయోని జాతులు; మేరువు నివాసముగా గలుగు యోగ్యత కలవారు.

ఈ పర్వత వర్ణన ప్రకృతిశోభను ప్రదర్శించుటకును,అష్టాదశ వర్ణనానియమమును పాటించుటకును, వర్ణనా నైపుణ్యమును, సమాస ఘటనాచాతుర్యమును చాటుకొను

టకును చేసినట్టిది. అంతేగాని ఈ పర్వత వర్ణన ప్రయోజనము కథకు లేదు. అయినను ఈ వర్ణన అసంగతముగాదు.

పర్వత వర్ణన — ఆముక్తమాల్యద యందును, కళాపూర్ణోదయ మందును, ప్రభావతీ ప్రద్యుమ్నమందును విజయవిలాసమందును లేదు.

## పర్వతవర్ణన - వసుచరిత్ర

వసుచరిత్రమందు పర్వత వర్ణన ప్రకరణ ప్రయోజనమును గలిగి యున్నది. దాదాపు ఇరువదియైదు పద్యములలో వర్ణింపబడినది. కోలాహల పర్వతము నందున్న వనాదుల వర్ణననుగూడ లెక్కించినచో పై లెక్కకు మించిన పద్యములలో పర్వత వర్ణన సాగించినట్లు కనిపించును.

ఇక్కడ పర్వతవర్ణన కేవల భౌతిక వర్ణనగాదు. రసవత్తరమైన పాత్రవర్ణన. వసు చరిత్ర వివిధ ప్రకృతి వర్ణనలకు ఉనికి పట్టు. జడములు సజీవములుగ భాసించిన అమృత భాండము.

ప్రకృతి వర్ణనలకు వసుచరిత్ర మంతయు నుదాహరణమే. కోలాహలుడు పర్వతము. కాని గిరికకు తండ్రి అగుచున్నాడు. శుక్తిమతికి భర్తయగుచున్నాడు. ఒక మనోహర నాయకుడుగ, ప్రేమగల తండ్రిగా వర్ణింపబడినాడు.

కుమారసంభవమున హిమవంతుడు పార్వతికి తండ్రి. ఈశ్వరునికి మామ. అక్కడ గూడ కాళిదాసుగాని, నన్నెచోడుడుగాని హిమవంతుని భౌతికవర్ణన చేయుచునే — మానవత్వముగల (దేవత్వమును) పాత్రగా సృష్టించినారు. కావ్యములలో పాత్రయై పోయినాడు.

వసుచరిత్రలో హిమవత్పర్వతము కథకంతటికీ గూడ కేంద్రము. వసుచరిత్రమందలి కోలాహల పర్వతవర్ణన పై వానికి భిన్నము. కుమార సంభవములోవలె నిది యిట పాత్ర అగుచున్నది. అక్కడ హిమవత్పర్వతము ఒక కొంత జడముగ తోచుచున్నది. ఇక్కడ కోలాహలుడు సజీవపాత్ర. నాటకమందు వలె చైతన్య పాత్ర. అక్కడ హిమాచలము దేవతాస్థానము. దేవాంశముగలవాడు. ఇక్కడ కోలాహలుడు హిమవంతుని పుత్రుడుగా వర్ణింపబడినను ఒక విలాస పురుషుడు. ఈ ప్రకృతి వస్తువైన కోలాహలుడు, పర్వత మన్న ధ్యాస మనకు కలుగదు. పర్వతవర్ణన యిరువదియైదు పద్యములలో సాగినదన వచ్చును. అంతేగాదు, కోలాహలుని పాత్ర వర్ణన మంతయు పర్వతవర్ణనయే.

వసురాజు తన నర్మసఖునికి కోలాహల పర్వతమును చూపి వర్ణించిన వర్ణన ఆలంకారికముగ నున్నది. శ్లేష ధ్వనించుచున్నది. ఈ కోలాహలమందలి వృక్షములు నాక వృక్షముల కంటె మిన్నయైనవి. అందుచేత ఈ భూలోకనగము చాల ఐశ్వర్యవంత మయినది.

"అచటి సానులు రత్న రుచిరంబు లనవేల
వాని వంశములెల్ల నీను మణులు
ద్రుమములెల్లను సురాగమము తౌటరుదె ని
త్యసురాగములు తదీయాంకురములు
లతలు సంజీవనుల్గావె యచ్చట వాని
తావులు నతను సంజీవనములు
రసములెల్లను సిద్ధ రసములౌ టెంత తత్
ప్రసవంబులును సిద్ధరసము లచట

అచటి మణిచిత్ర భూములు నచట నమరు
నమర తరువుల గుమురులు నచటి తీవ
లచటి పొందమ్మి కొలకులు నభవునింట
నైన నాదంట బలువింటనైన గలవె" -వసు. 2-5

కుమారసంభవములోని హిమవంతుని వలె, మనుచరిత్రలోని హిమవత్పర్వతము వలె ఇక్కడ పర్వతవర్ణన గూడ సాధారణ పర్వత వర్ణనవలె నున్నది. పర్వతవర్ణనలో నేయే యంశములుండవలెనో అవన్నియు నిట గూడ వర్ణితములు.

కాని యిందులో నొక చమత్కారమున్నది. అచటగల సానులు, ద్రుమములు, లతలు, రసములు, మణి చిత్రభూములు, అమరతరువులు, తీవలు, పొందమ్మి కొలకులు, అభవునింటగాని (హిమవత్పర్వతము కైలాసము) అతని వింటగాని (మేరు పర్వతము) లేవట, అనగా నన్నెచోడుడు వర్ణించిన హిమవంతుని యందుగాని (కైలాసముగాని) పెద్దన తిమ్మనలు వర్ణించిన మేరువునందుగాని (హిమవంతునియందు) లేవని పోటీభావముతో భట్టుమూర్తి చెప్పినట్లున్నది.

వర్ణిత వస్తువుయొక్క స్వరూప స్వభావములు అక్షరములలో ప్రతిబింబింప జేయు చాకచక్యము వసుచరిత్ర గ్రంథకర్త యందతిశయించి యున్నది. కోలాహలమనగా అస్పష్టములయిన అనేక ధ్వనులతో కూడికొన్నదనిభావము. కోలాహల పర్వతమును సార్థకనామ పర్వతముగా - సొంపుగా - వర్ణించుచున్నాడు భట్టుమూర్తి.

"ఒకచాయ ననపాయ పికగేయ సముదాయ
మొకసీమ నానా మయూర నినద
మొకవంక నకలంక మకరాంక హయహేష
లొక క్రేవ వనదేవ యువతి గీత
మొకచెంత సుర కాంతలకరాంత తతనాద
మొకదారి నవశారి కోదితంబు
లొకయోరఁ బటుచారణ కుమార ఫణితఁబు
లొకదండ నళిమండలి కలగాన

మొక్కమొగి మ్రోయ కదళీ గృహోపపన్న
కిన్నరీబృంద బృంద సంగీత రీతి
నమరు నతివేల కోలాహలముల కలిమి
నధిప యీయద్రి కోలాహలాఖ్య మొక్కొ" - వసు. 2-7.

ఇందు పికగేయములు, మయూర నినదములు, చిలుకల పలుకులు, వనదేవయువతి గీతములు, సురకాంతల వీణావాద్యములు, శారికల గానములు, చారణుల స్తుతి పాఠములు, మధుపముల సంగీతములు, కిన్నరీబృంద బృందసంగీతములు - వీనన్నిటితో నా పర్వతము కోలాహలముగ నుండినది. అందువలన ఆ పర్వతము కోలాహలము. ఇట్టి కోలాహలవర్ణన కుమారసంభవమందు కన్పట్టు చున్నది (కుమా. 7-98). కేవల ప్రకృతియేగాక, ఆ ప్రకృతియొక్క సరస ప్రవర్తన గూడ నిట వర్ణితము.

ఈ పద్యము నడక పొంపు - ఆ పర్వత సానువుల వంపు సొంపులను - సాగదీసి నట్లున్న దైర్ఘ్యమును-అటుజూచినను, ఇటు జూచినను, ఎటు జూచినసుసుందర మనోజ్ఞ వాతావరణ విలసితమును, మన కన్నుల యెదుట సాక్షాత్కరింప జేయుచున్నది. సర్వ విధమనోజ్ఞ వాద్యములు, మంద్ర ధ్వనులతోను, తారధ్వనులతోను, కలధ్వనులతోను, మిళితములై ఒక్కపెట్టున ఎగిసి, అస్పష్టమై, కోలాహలముగ వినులబడిన యట్లు ఎత్తు గీతి ప్రతిబింబింప జేయుచున్నది. అందు ప్రయోగింపబడిన పదముల దైర్ఘ్యమును - ఔన్నత్యమును - ఆ పర్వతముయొక్క దైర్ఘ్యౌన్నత్యములకు సాటిగానున్నది.

ఏపుగా దట్టముగా పెరిగిన తరుగుల్మాదులు గల పచ్చని కోనలు సాక్షాత్తుగ నిశ్లే యుండును. ఈ లోక సామాన్య దృశ్యమును, అతిలోక సామాన్యమైన - సుందరమైన - ప్రసాద మధురమైన దృశ్యమును వర్ణించుట రామరాజ భూషణుని ప్రత్యేకత,

కోలాహల పర్వతమును పర్వతముగ భావించలేము. అట్లు భావింపకుండ జేసి నాడు కవి. కోలాహలుడొక యౌవనవంతుడైన ప్రౌఢ రాజకుమారుడుగ ప్రత్యక్షమగు చున్నాడు. సరసమనోజ్ఞ వ్యక్తిగ గోచరించు చున్నాడు. సర్వాలంకార భూషితుడైన విలాస పురుషుడుగా ప్రత్యక్షమగుచున్నాడు. ఈ అర్థద్వయమును శ్లేషతో సాధించు చున్నాడు కవి.

"సునోమధి వాస భాసుర శిఖోన్నతి వాడు
ఘనసార తిలక వాసనల వాడు
ఘన సంకుమదసాంద్ర గండభాగము వాడు
నవపద్మరాగ దంతముల వాడు
కలితోపకంఠ నతుతశ్రీమాలిక వాడు
హరిచందనచ్ఛాయ నమరు వాడు
తపనీయమేఖలా ధాళధళ్యము వాడు
మణిపాదపలయ ధామంబు వాడ

నర్ఘ్య రత్నావళీ విచిత్రాంబరాభి
రామ శృంగారములవాడు హైమగర్భ
గేహమున కేగువాడు కోలాహలాఖ్యు
డొక ధరాధీశు డెదురయ్యె నువిద కపుడు" —వసు. 2-107

శృంగార రసభూయిష్ఠత వలనను, అర్థ శ్లేష ప్రయోగము వలనను, ఈ జడమైన పర్వతమును మనము ధరాధీశుడగు రాజుగానే భావింతుముగాని ధరాధరాధీశుడైన అచేతనమయిన వస్తువునుగా భావింపము. ఇందు శ్లేష ప్రయోగమున్నది. కాని జడపదార్థమైన ఒక కొండను సూచించు అర్థమే మనస్సునకు స్ఫురించకుండునంత మానవీకరణ ఇక్కడ జరిగినది.

కోలాహలుడు శుక్తిమతి విషయమై అనుభవించిన మన్మథావస్థలు చదువునపుడు మానవుడన్న దృష్టి తప్ప జడమన్న స్పృహయే చదువరికుండదు.

ప్రకృతిని మానవీకరణ పొందించుటలో రామరాజభూషణుడు సాటిలేనివాడు.

వేదాలలో ప్రకృతి మూర్తిమత్వము పొందింపబడినది. దేవత్వమీయబడినది.

పురాణాలలో ప్రకృతి మానవీకరణ పొందినది. అది సాక్షిమాత్రముగానే ఉండుచు వచ్చినది. ఉదాహరణకు :-

వాల్మీకి రామాయణమునందు రాముడు సీతను పోగొట్టుకొనుట జరిగినది. అతడు విలపించినాడు. చెట్లను, పక్షులను, మృగములను గూడ అడుగ సాగినాడు. అతడు పిచ్చెక్కిన వాడై అట్లన లేదు. సీతయొక్క అంగములకు సాటిచెప్పుచు పేరు పేరున జంతు, పక్షి, ఫలపుష్పాదుల నుద్దేశించి పరిదేవన చేసినాడు. (వాల్మీకి రామా. ఆరణ్య-60, 8, 24,13) సీతగూడను అటులనే ప్రకృతిని సంబోధించి రక్షింపుమనియు, తన జాడ రాముని కెరిగింపు మనియు చెప్పినది. (వాల్మీకి రామా. అరణ్య-49-31, 32). వారి యొక్క దీనస్థితిని చూచి ప్రకృతియే కరుణ భావముతో నిండినట్లుగా, జాలువారుచున్న సెలయేళ్ళు అను కన్నీటి మిషచేత పర్వతములు రోదించినట్లును, గాలికి కదలుచున్న రెమ్మలు అను చేతులచే వృక్షములు సంజ్ఞలు చేసినట్లును వర్ణింపబడినది (అరణ్యా. 52.36)

తరువాత భారతమందును, భాగవతమందును గూడ అట్టి ప్రకృతి మానవీకరణ కోకొల్లలుగా కనిపించును. పోతన భాగవతమందు కృష్ణుని గానక గోపికలు వనమం తయు గ్రుమ్మరుచు అందలి వృక్షములను సంబోధించి కృష్ణుని ఉనికిని తెలుపుమనుటయు నట్టిదే :

"నల్లనివాడు పద్మనయనంబులవాడు కృపారసంబు పై
చల్లెడి వాడు మౌళి పరిసర్పిత పింఛము వాడు నవ్వురా
జిల్లెడి మోము వాడొకడు చెల్వల మానధనంబు తెచ్చె నో
మల్లియలార మీ పొదల మాటున లేడుగదమ్మ చెప్పరే" (భాగ. దశ. 1010)

"పున్నాగ కానవే పున్నాగ వందితుఁ
దిలకంబ కానవే తిలక నిటలు" భాగ. దశ, 1008

అన్నచోట గూడ అంగ సాదృశ్యమువలన ప్రకృతి వస్తువుల సంబోధించుట జరిగినది.

కుమారసంభవాధి కావ్యములలో హిమవంతునకును గంగానదికిని దైవత్వమీయ బడినది. హిమవంతుడు కుమార సంభవములో పాత్ర అయినను మానవుడుగాడు.

కాని వసుచరిత్రలో అట్లుగాదు. ఇందలి మానవీకరణ అతి విచిత్రమైనది. కోలాహలుడు పర్వతము. ఈయనదలచుచో దేవత్వ మీయవచ్చును. కాని ఒకమానవ నాయకుడుగా ఇక్కడ సృష్టింపబడినాడు. శుక్తిమతినది. కోలాహలుడొక మహారాజ పుత్రుడుగా వర్ణింపబడినపుడును, శుక్తిమతి ఒక సచ్ఛీలస్త్రీగా వర్ణింప బడినపుడును. అర్థ ద్వయ మందుండిన నుండుగాక - మనము వారిరువురని ప్రకృతి వస్తువులుగా భావింపము. ఇతర కావ్యము లందలి మానవులగు నాయికా నాయకుల కంటె సజీవపాత్రలుగా వారిని స్వీకరింతుము. వారి రాగమును, తత్ప్రకటనలును, పై కొనుటలును, తప్పించు కొన జూచుటలును, సతార్కికముగ సంభాషించుటలును-అన్నియును ఎంతో మానవతను ప్రదర్శించును.

కోలాహలుని మన్మథ తాపమునందు పూర్ణముగ మానవతారోపణ యున్నది.

"శైలకులేంద్రు డిట్లు మదశాలి శుకాళి పికాళిశారికా
జాలక నీలకంఠ రవ సంగతిఁ దాలిమి నిల్పజాల కు
ద్వేల కరాళకంతు శరవేదన దీర నదీ రసోర్మికం
దేలక యేల కల్గు మహనీయ సుఖంబని నిశ్చితాత్ముడై" వసు 2-117

ఉద్దీపనములు ఎంతగనో బాధించుచున్నవి, కోలాహలుని. శుక శారికా పిక నీల కంఠములు మానవులకెట్లు ఉద్దీపములో ఈ పర్వతరాజునకు గూడ అట్టి ఉద్దీపనములైనవి. ప్రకృతిని ఇంత అభేద ధోరణిలో మానవీకరణ పొందించిన భట్టుమూర్తివంటి మనీషి మర్లొకడునభూతో నభవిష్యతి.

మానవుల కుద్దిష్టమైన ఉద్దీపనము, ప్రకృతి. మరి, ప్రకృతియే ప్రకృతికి ఉద్దీపనముగా తయారయినచో, అట్లుచేసిన కవియెంత దక్షుడు; అతని కతడేసాటి. శుక్తిమతి యొద్దకు కోలాహలుడు వచ్చినపుడును, ఆమె అతనికి పూజలొనరించి వినయముట్టిపడ పలికినపుడును, అందులకతడు లేతనవ్వులతో సరసోక్తులాడినపుడును. ఆమెపైగల తన కోర్కెను కోలాహలుడువ్విళ్ళూరుచు తెలిపినపుడును. శుక్తిమతికిగల ఔన్నత్యమును పొగడినపుడును, ప్రేమోత్కంఠతను వచించినపుడును, తన్నునదీన జేయుమని ప్రార్థించినపుడును, అందుల కామె వినయముతో తానతనికి తగనని చెప్పినపుడును, ఎంతయో మనోజ్ఞముగ సాగినది రచన! (వసు. 2-131, 132)

ఇందులో శ్లేషయున్నదని మనము భావింపలేము. ఇది జడముల మధ్యగల ప్రేమ యనిగూడ భావింపలేము. శబ్దశక్తిని ఇంతగ గలిగియున్న గ్రంథము వసుచరిత్రతప్ప మరొక కావ్యము లేదు! శ్లేషకువాడిన పదములుగూడ లలితములైనవి; సహజమై సులభ గ్రాహ్యములైనవి.

శ్లేషలో ప్రస్తుతార్థమును, అప్రస్తుతార్థమును నుండును. అప్రస్తుతార్థము అంత ప్రధానముగాదు. వసుచరిత్ర లోని శ్లేషలో కోలాహలశుక్తిమతులు ప్రధానార్థమునకు సంబంధించిన పాత్రలు. అనగా పర్వతార్థమునకును, నద్యర్థమునకును సంబంధించిన పాత్రలు. అవి రెండును మానవులుగా భాసించుట అప్రస్తుతార్థము. కాని అప్రస్తుతార్థమే మనకు ప్రధానార్థముగ కన్పట్టి, వానిని మానవ వ్యక్తులుగా తిలకించుచున్నాము. ఇక్కడే యున్నది రామరాజభూషణ మహాకవియొక్క అమేయ ప్రతిభ!

పర్వత వర్ణన మింత మనోజ్ఞముగ ప్రభావపూర్ణముగ పూర్వాపర కవులెవ్వరును భావించలేదు.

## సారాంశము

పై ఆంధ్ర ప్రబంధము లన్నిటి యందును పర్వతవర్ణన అష్టాదశ వర్ణనలలోని భాగముగా వర్ణితము. కుమారసంభవమందును, వసుచరిత్రమందును పర్వతవర్ణన ప్రత్యేకతను సంతరించుకొన్నది. వర్ణనీయ వస్తువుల వర్ణించుటతోపాటు, ఆ పర్వతము లా ప్రబంధములలో ప్రముఖ పాత్రలుగా వర్ణింపబడినవి.

మనుచరిత్రమందు పర్వత వర్ణన ప్రకరణానుబంధముగలిగి యున్నది. హిమవత్పర్వతము లేనిచో నిక కథలేదు. అది ఆ ప్రయోజనమును సాధించుటేగాక మంజులమైన కవితాశైలికి స్థానముగూడ అగుచున్నది.

పారిజాతాపహరణమందలి పర్వతవర్ణన కేవలము అష్టాదశవర్ణనా నియమమును పాటించుటకే జరిగినది. రచన ఉత్కృష్ట శైలిలో నడిచినది.

మనుచరిత్రమందలి పర్వత వర్ణనలకు మనవారి వర్ణనలు అనుసరణములుగావు.

వసుచరిత్రమందలి పర్వతవర్ణనను ప్రకృతి వర్ణనగానే భావించుటకు వీలుగాదు. అది ప్రకృతి మానవీకరణ పొందినట్టియు, మానవ వ్యక్తిత్వ సహజవర్ణనవలె నడచినట్టియు వర్ణనగా మనము భావించును. ఈ కావ్యమునగల కోలాహలుడు ప్రముఖమైన నాటకీయ పాత్ర వహించుచున్నాడు.

మనుచరిత్రమందును, పారిజాతాపహరణమందును, వసుచరిత్రమందును, పర్వత వర్ణనల [illegible] వచనము[illegible] వాడుట జరిగినది. అనేకములగు వస్తువులను, అమోఘ [illegible], కల్పనాత విస్తృతముగా, విశృంఖలముగా వర్ణించుటకనువైనది వచనమే గాబట్టి వాడుట జేసియుండ వచ్చును.

———

# షష్ఠ ప్రకరణము

## వనవర్ణన

> నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనైః
> ఉద్యాన సలిలక్రీడా మధుపాన రతోత్సవైః" (దండి కావ్యాదర్శము 1-16)
> "వన జలకేళీ రవి శశి
> తనయోదయ " ,, ,, " (నన్నెచోడ కుమార. 1-44)

పైఁ జెప్పబడిన యిరువురి మతము ననుసరించి 'వన' యన్నను, 'ఉద్యాన' యన్నను ఒకే యర్థము. కుమారసంభవకారుడు వనవర్ణన చేయునపుడు ఉద్యానవన సదృశమైన దానినిగానే చేసినాడుగాని సింహ శరభ శార్దూలాది దుష్టమృగ సంకులమైన అరణ్యమును సృష్టించ లేదు.

కేశవ మిశ్రుడు తన అలంకార శేఖరమున "కానన" వర్ణనయందు హరి, వరాహ, ఇభ, ద్రుమ కాక, ఉలూక, కపోతాదుల వర్ణింపవలెనన్నాడు.

ఉద్యాన వర్ణన మన్ని కావ్యములందును వసంతర్తువునందే వర్ణింపబడి యుండుట గమనింప దగినది. వసంతోద్యాన వర్ణన సమయమున నాయిక నూత్న యౌవనదశలో నిదిగా నుండి తీరవలెను. శృంగార కావ్యములందంతట నాయికా నాయకులు యౌవనులే! కావున వనవర్ణన యనగా ఉద్యాన వర్ణనే యనియు, అదియుగూడ వసంతసమయోద్యాన వర్ణన మనియు భావించవలెను.

ఈ వర్ణన సమయమున "చైత్ర సంపద, నారీజన సహిత ఆరామ విహారాదులు వర్ణింపబడవలెనని" విన్నకోట పెద్దన తన కావ్యాలంకార చూడామణిలో చెప్పినాడు. (—కావ్యా. 3-115)

కేశవమిశ్రుడు తన అలంకార శేఖరమందు "మార్గము, ఫలములు, పుష్పములు, లతలు, శుకపిక కేళీహంసలు, వనకేళి పాంథులు మొదలగువానిని వర్ణించవలె" నన్నాడు.

కావ్యములందు ఉద్యానవన వర్ణన ఒక మనోహర ప్రక్రియ. వర్ణనా వైవిధ్యమును, వర్ణనా నైపుణ్యమును ప్రదర్శించుటకు అనువైన స్థానము.

ఆంధ్రప్రబంధములందీ వర్ణన చాల సొగసుగ కావింప బడినది. కుమారసంభవము మొదలు వసుచరిత్ర వఱకు గల ప్రబంధములన్నియు నీవర్ణనను పోటీగా సాగించినవా

యన్నంతగా వర్ణనాబలమును కలిగి యున్నవి. ఈ వర్ణన సమయమున నే యీ రసవత్ ప్రబంధములు మరింత రసవత్తరములుగా ఉత్తరోత్తరము బలీయమన్నంత రసవత్తమములుగా సాగినవి. ఉద్యాన వర్ణనలో వనకేళీ జలకేళులు వర్ణింప బడును. వనకేళిలో దోహద క్రియలును, పుష్పాపచయమును వర్ణింపబడును.

## వనవర్ణన-కుమారసంభవము

కుమార సంభవమున వనవర్ణన మూడుమారులు మూడుచోటులలో కానవగును.
1. దాక్షాయణీ మహేశ్వరులు గజాసన జననమునకు ముందు వనవిహారము చేయుట (వారి నివాస ప్రాంతమున) ప్రథమాశ్వాసమున జరుగును.
2. పార్వతి శివుని ఆరాధించు సమయమున నింద్రప్రేరితుడై మన్మథుడు శివుని తపోవనమునకు వచ్చినపుడు (ఆశ్వాసము 4)
3. శివపార్వతుల కల్యాణము జరిగినపుడు ఓషధీప్రస్థమున (ఆశ్వాసము-9 )

మొదటగా వనవర్ణన ప్రథమాశ్వాసమున కననగును. ఆది దంపతులు, సతీపరమేశ్వరులు. ఇరువురు "అన్యోన్యానురాగాతిరేకంబున కామకేళీ లాలసులగుచు" (కుమా. 1-77).

"కలహంస కలరవా కలిత నిర్ఝరముల
సారసారావాబ్జ షండములను
రోలంబరుతిలతాందోలంబులను శుక
మంజులస్వన పుష్పమండలములఁ
గలకంఠ రణిత మాకందవనములఁ బా
రావతధ్వని మందిర స్థలముల
గేకి కలధ్వాన గిరికంధరంబుల
లావుక నినద లీలాతలముల

నప్పటప్పటి కనురాగ మగ్గలింపఁ
గామరస మంతకంతకుఁ గడలుకొనగ
నలిరమించిరి కైలాస నగము మీదఁ
బరమసుఖలీల నాజగత్పతియు సతియు"

(కుమార. 1-78)

వసంతమని చెప్పకపోయినను, పై వర్ణింపబడిన కలహంసలు, నిర్ఝరములు, సారసములు, అబ్జషండములు, రోలంబరుతులు, లతాందోలములు; శుకమంజులస్వనములు, పుష్పమండపములు, కలకంఠులు, మాకందవనములు, పారావతధ్వనులు, కేకి కలధ్వానములు — అన్నియు వసంతర్తువునే సూచించుచున్నవి.

ఈసమయమున గజములు కరేణువులతో కలిసి సల్లకీపల్లవములు మేయుచు విహరించుచున్నవి. అవి తరువాత కొలను ప్రవేశించి కలచి వేయసాగినవి. తర్వాత కామక్రీడలు సలుపసాగినవి. (కుమార. 1-81 నుండి 100 వరకు). అప్పుడు -

> "హృదయాహ్లాదముతోడఁ బాయక సదానేక ప్రకారంబులన్
> మదనాసక్తి బెరంగుచున్న విలసన్మత్తేభవిక్రీడితం
> బది దాక్షాయణిసూచి కౌతుక రతైకాలీన భావావిలా
> పదృగత్యుజ్జ్వల దీధితుల్ వఱపె నీశానానాబ్జం బుపైన్" -కుమార. 1-101

గజరతి ఉద్దీపనము కాగా సతీపరమేశ్వరులు గజదేహధారులై క్రీడించిరి. గజాననుడు జన్మించుట కిది పూర్వరంగము.

ఈ ఘట్టమున నడిచిన ఉద్యానవర్ణన కేవలము ఉద్దీపనకొఱకు, గజాననోత్పత్తి కొఱకు.

ఈవర్ణన ప్రకరణముతో ముడివడి యున్నది. ఈవర్ణన లేనిచో సతీదేవికి ఉద్దీపన కలుగదు. కలుగనిచో గజదేహధారులు కారు. కానిచో గజానన జన్మము లేదు. ఇట వృత్తౌచిత్యము గూడ నున్నది.[1] మత్తేభవిక్రీడితమును, మత్తేభవిక్రీడతములో వర్ణించుట ప్రత్యేకత.

## ఇక రెండవ వర్ణన

పరమేశ్వరుడు తపస్సు చేయుచోట జరిగినది. ఇంద్ర ప్రేరితుడైన మన్మథుడు దేవకార్యమును నెరవేర్ప నెంచి శివుని సమాధిని భగ్నము చేసి పార్వతిపై మోహపరవశుని చేయుటకై తపోవనమునకు వచ్చినాడు. సరిగా అపుడు పార్వతి శివుని పూజార్థము బయలుదేరుచున్నది. అదే సమయమున రతీమన్మథుల రాకతో వనమునకు కొత్త శోభ వచ్చుచున్నది.

---

1. ఉదాత్త ప్రకృతుల స్వస్థవాక్యములందును, గంభీర ద్రవ్యగుణ క్రియావర్ణనము నందును, మత్తేభ విక్రీడతము యొక్క ఔచిత్యము సంభావింపవలసి యున్నది.
—ఛందఃశిల్పము - డాక్టర్ పాటిబండ మాధవశర్మ. పుట. 407.

ప్రకృతి వస్తువులతో నిర్మితమైన మన్మథ రథమును వర్ణించుచున్నాడు కవి :-

"పంకరుహంబులు బండికండ్లు చంప
కంబులు నొగ లుత్పలంబు లిరుసు
గరవీరములు పలు గాడిజాడులు సను
గొయ్య లశోకముల్ గోడిపిట
సిందువారంబులు సీలలు గేతముల్
మెట్టులు మొల్లలు మెట్టుగుదెలు
పొగడలు పలుపులు పున్నాగములు పగ్గ
ములు సహకారముల్ పూనుగాడి

కురవ కానీకమాలంపుగోలకైర
వములు మునుకోలకోకముల్ వాహనములు
గా వసంతుండు సూతుడై పూవుఁ దేర
నెరయ గుసుమాయుధంబులు నినిపితెచ్చె"

-కుమార. 4-83.

ఇరుసు, సీలలు మొదలగునవన్నియు నల్లని పూలతో పోల్చబడినవి. అవి యినుపవి గదా! కోకములు, వాహనములగుటలో శృంగారభావమెంతగనోకన్పట్టు చున్నది. "అంత రతీసమేతుండు పుష్పాయుధుండు పుష్పరథారూఢుండై నిజ సామ్రాజ్య విభవైశ్వర్యంబులతో నతి రయంబున హిమవంతంబున కరిగి పరమేశ్వరుని తపోవనంబు సొత్తెంచె తతుణంబ" (4-84).

"వలరాజామనిఁ బిల్చి వేగమెయి నీవాసంతికానంద దో
హల మీకాననలక్ష్మి కిమ్మనుడు నాహ్లాదంబుతో నెయ్యము
గ్గలమైయుండ వసంతకుండు దమపైఁ గన్నిడ్డఁ గారాకఁ గెం
దలిరాకయ్యెనో నాదలిర్చె వడిఁ గాంతారాంత రోర్బీజముల్"

4-85

మన్మథాజ్ఞ వలన వసంతుడు పండుటాకులతో నిండిన కాననమును ఒక్కపెట్టున చిగుర్చునట్లు చేసెను. మన్మథుడు తలచుకొన్నచో జీర్ణవయోధికులను గూడ తరుణులుగ మార్చగలడు గదా!

అంత మలయసమీరము వీచినది.

"మలయ సమీరణాభిహతి భ్రమాకుల నాకులు డుల్లి డుల్లి క్రొ
మ్మొలకలు సాగి సాగి విరిమోసుల కెందలిరొత్తి యొత్తి కు
ట్మలములు క్రమ్మిక్రమ్మి కుసుమంబులు వాసన కెక్కియెక్కి గు
త్తులు గొని పండి పండి వినుతుల్ దగ నారములొప్పె నామనిన్"

-కుమా. 4-87

నొక్కి నొక్కివర్ణించుట చేత వసంతము ద్విగుణీకృతమై, త్రిగుణీకృతమై, శోభిల్లి నట్లున్నది. సామాన్య కామవాతావరణము చాలక ఈశ్వరుని కోసమై ద్విగుణీకృతము

చేసినట్లున్నది. వాతావరణమంతయు — అందలి ప్రకృతి యంతయు—కామవిజృంభణమునకు—కామోద్దీపనకు—పోటీపడినట్లున్నది.

"పొన్నలు పూచెఁ బొన్నలొగిఁ బూవక ముందఱఁ బూచె గోగులా
పొన్నలుఁ గొండగోగులునుఁ బూవకముందరఁ బూచె బూరువుల్
పొన్నలు కొండగోగులును బూరువులున్నొగి బూవకుండఁగా
మున్న వనంబునం గలయ మోదుగులొప్పగ బూచె నామనిన్" -కుమా. 4-91

"పొలిచె మధు వేళఁ గంకేళి పూచి భృంగ
పరివృతమ్మై మనోజుండు పాంథ తతికి
నాళిచారంబు వేల్పుకుండాంతరమున
దగిలి కామాగ్ని వొగలతో నెగయునట్లు" కుమా. 4-94

"కరియిచ్చె నరమేసి కరిణికి ఁల్లకీ
పల్లవముల్ల బు పల్లవింప
మృగమర్థిఁ గబళించి మృగికిచ్చెనంచు ద
ర్భాంకురంబులు చిత్తమంకురింప
హంస పెక్కువ నిచ్చె హంసికి నోరొన్నర
నెలదూడు మొగముల నెలమి మిగుల
భృంగము ద్రావితో భృంగికి దయనిచ్చె
మధుధారముఖరాగ మదముదలక

గిన్నరుండు గ్రొచ్చె గిన్నరి వీనుల
రాగరసము మేన రాగమెసగ
మధువిడంబనమున మగలును మగువలు
విరతిగొనిరి మదన పరవశముగ" -కుమా. 4-113

ఇచ్చట సంస్కృత కుమారసంభవమును అనుకరించినట్లున్నది. సంస్కృతకుమారసంభవములోదక్షిణ సమీరుడు వీచుటయు,[1] అశోకములు చిగుర్చుటయు[2] కొండ గోగుపువ్వు అతిశయించుటయు,[3] ఎఱుపులై వనస్థలీనాయికలు వహించిన నఖక్షతముల వలెనున్న మోదుగుపూలు వికసించుటయు[4] కోయిలలు కూయుటయు[5] వర్ణించినాడు కాళిదాసు. ఉద్దీపన గొప్పగనే యున్నది. కాని నన్నెచోడుని కుమారసంభవమున—

1. కాళిదాసు కుమార సంభము 3-25 2. కాళిదాసుకుమారసింభవము 3-26

2. కాళిదాసు కుమార సంభవము - 3-28

3. కాళిదాసు కుమార సంభవము - 3-29

4. కాళిదాసు కుమార సంభవము - 3-32

5. కాళిదాసు కుమార సంభవము - 3-36, 37, 38.

"మలయ సమీరణాభిహత మ్రాకులనాకులు డుల్లి డుల్లి క్రొ
మ్మొలకలు సాగి సాగి" అను పద్యమునను,
"పొన్నలు పూచెఁ బొన్నలొగి పూవకముందఱఁ బూచెఁ గోఁగులా
పొన్నలుఁ గొండగోగులును బూవకముందఱ బూచె బూరువుల్......"

అన్న పద్యమునను మనకట్టి ద్విగుణీకృత భావతీవ్రత ప్రత్యక్ష మగుచున్నది. అప్పుడు ప్రకృతి యందలి కిన్నరాదులును, పక్షులు, మృగములు, మొదలగు నవియును, కామభావముతో, అన్యోన్యానురాగమును ప్రదర్శించుటను కాళిదాసును నన్నెచోడుడును సమానముగానే వర్ణించినట్లుకనిపించినను నన్నెచోడునిలోని ఆ ప్రకృతి వర్ణన అత్యంతమగు ఉద్దీపనతో నిండియున్నది. కొత్తగా—అవసరము కొఱకై సృష్టింప బడిన వసంతమగుటయే దీనికి ఔజ్జ్వల్యమును, ఆవేగమును. కాళిదాసు కుమారసంభవమున—

"పర్యాప్తపుష్ప స్తబక స్తనాభ్యః
స్ఫురత్ ప్రవాళోష్ఠ మనోహరాభ్యః
లతావధూభ్యస్తరవోఽప్యవాపు
ర్వినమ్రశాఖా భుజబంధనాని" —కాళిదాసు కుమార 3-39

పూగుత్తులే పాలిండ్లుగా వంగిన కొమ్మలనెడి బాహువులతో చెట్లు కౌగిలింతల ననుభవించినవని చెప్పుటకన్న "కాముడే కామాతురుడై మనోవికారము నొందెనని" వర్ణించిన నన్నెచోడుని వాక్యములే అత్యధికమైన ఉద్దీపనను సూచించుచున్నవి (కుమా. 4-114)

పార్వతి తపస్సు చేయునపుడు వసంత వర్ణన చక్కగా చేయబడినది. శిశిరర్తువు పోగానే—

"జలజల డుల్లు పర్ణముల చప్పుడు లక్కడఁ జూడఁ జూడఁబై
నెలమెడు వల్దమోసులును నేర్పడు కెందలిరాకు జొంపమున్
బొలుపగు మొగ్గలున్ విరియుపూవులు బూపలు మ్రాని మ్రాని క
గ్గలముగఁ దాల్చెఁ జెప్పనిగాదది యెట్టి వసంతవేగమో:" —కుమా. 6-130

"పొలుపుగ నేచి చెల్వడరఁబూచి బెడంగుగగాచి పండ మ్రా
కులు మరుడేయఁగోయిలలు గూయ మదాళులు మ్రోయరాగులన్
ఫలరసమంద (ప్రోషితులు వంద గవల్ ముదమంద వచ్చె న
త్యలఘువసంత మ్ముర్వర ననంత విభూతి నిరంతరంబుగాన్" —కుమా. 6-131.

వసంతసమయోచిత వర్ణనలన్నియు చేయబడినవి. ఈ సమయమందలి ఉద్దీపన ఎంతటిదనగా—

"ఆమనికి నెలమి విపులా
రామంబుల పొల్పుసూచి రాగోత్కటమై
కాముడు రతిగని తానును
కామాతురుడై మనోవికారము నొందెన్''   కుమా. 4-114

కామభావము పరాకాష్ఠనొందినది. భావజుడు తాను వచ్చినపనిమఱచి కామోత్కటమై రతీదేవిని చూచుచు ఊఱకుండెనట; (4-115) తరువాత తెలిసి ఈశ్వరునిపై బాణము వేసి, సమాధివైకల్యము చేయుటకై తన మూలబలముల నవలోకింపగా ఒక్కుమ్మడిగా—

"అలిఝుంకారముఁ గీచకస్వనముఁ గీరాలాపముల్ మత్తకో
కిలనాదంబులు శారికారవములుం గేకినినాదంబులుం
గలయం ఘోరన మంజుగానములతో గంధర్వగీతంబు
లగ్గమై ఘోరన మ్రోసె నీశ్వరు లతాగారంబు ఘూర్ణిల్లగన్"   -కుమా. 5-5.

"ఇట్లు విపరీత మధుజృంభణంబు గని విస్మితుండగుచు"   -కుమా. 5-8
"శంభుసమాధికి విఘ్నా
రంభములై యులియు వనచరములకు జిహ్వా
స్తంభ గతి స్తంభ మనః
స్తంభములుగ నంది హస్తసంజ్ఞ నదల్చెన్

నందీశ్వరునకు ఎంతయో కోపము వచ్చినది. ఆ ధ్వనులు అంతకుముందతని ఆజ్ఞ లేక సాగినవి గదా! అందులకే ఆ పశులకు జిహ్వాస్తంభము, గతిస్తంభము, చేయుటయే గాదు మనస్తంభము గూడ చేసినాడు. అపుడేమయినది?

"మెలగక మృగములు విహగము
లులియక లేఁ బొలఁ జిగురులొత్తక మలయా
నిలుడు సలింపక నెలవుల
నలవడి వనమమరెఁ జిత్రితాటవి వోలెన్"   కుమా. 5-9

పై ఘట్టమున కాళిదాసు రచన క్లుప్తముగ నున్నది, ప్రకృతియంతయు కామోన్ముఖమై యున్నట్లు సాధారణముగనే వర్ణించినాడు. అట్టి వసంతావతార సమయములో అచ్చరల గానమును వినియును హరుడు చలింపడాయె ననియు (కాళిదాసు. కుమా. 3-40) అపుడు నందికేశ్వరుడు నోటిపై వ్రేలిడుకొన్న సన్నచేత ప్రకృతి గణములను అల్లరి చేయకుండునట్లు శాసించెననియు చెప్పినాడు. (కాళిదాసు. కుమా. 3-14)

ఆ విధముగ సంజ్ఞయిడగనే వృక్షములు చలింపక, ద్విరేఫములు కదలక, పక్షులు పలుకక, మృగములు మెదలక, కాననమంతయు చిత్రార్పితమైనదిగా కనిపించినది.

"విష్కంపవృక్షం నిభృతద్విరేఫం
మూకాండజం శాన్తమృగ ప్రచారం
తచ్ఛాసనాత్ కాననమేవ సర్వం
చిత్రార్పితారంభ మివావ తస్థే"

—కాళిదాసు కుమా. 3-42

అంతేగాని నన్నెచోడునివలె ప్రకృతి కోలాహలమును, విజృంభణోద్దీపలమును వర్ణింపలేదు. నన్నెచోడుని "అలిఝుంకారము కీచక స్వనము......" అన్న పద్యములో ఎంతయో కోలాహలమును, ఎంతయో ప్రకృతి విజృంభణమును, ఎంతయో భావ తీవ్రతయును కనిపించుచున్నవి. "మెలగక మృగములు విహగములులియక" అన్న పద్యములో ప్రకృతియొక్క ఉత్సాహము, ఉద్రేకము, అంతకంతకును తగ్గుచు చప్ప బడిపోవుటను చూడగలము. ఈ ఘట్టమున కాళిదాసుకంటె మించినట్లు కనబడుచున్నాడు నన్నెచోడుడు.

ఇక్కడ నన్నెచోడుని రచన అత్యద్భుతము. ఇతనిచేతిలో ప్రకృతి ఎటుచెప్పిన అటు విన్నది. అట్లు విన్నట్లుగ పదవిన్యాసములో కన్పట్టుచున్నది, ఈ ఘట్టమున ఒక మహా ఝుంఝూవాతము విజృంభించి, విలయతాండవము చేసి నిలచిపోయినపుడు ప్రకృతి యంతయు నెంత నీరవముగ. నిర్విశేషముగ నుండునో ఈ ప్రకృతి వర్ణనయును అట్లున్నది. ఇక్కడ ఇది ప్రకృతి వర్ణనే గాని, ప్రకృతి స్వరూపస్వభావములు భాషలో ప్రతిబింబించిన వాతావరణ సృష్టి యిది.

పరమశివుని సన్నిధానమునకు సర్వాలంకార శోభితమైన పార్వతివచ్చుచున్నప్పటి మూర్తి ప్రకృతి మూర్తియనియే భావింపవలెను. ఆమె నగల ధరించు స్థానమున కేవలము ప్రకృతి వస్తువులనే ధరించినదిగాన ఆమెయు ప్రకృతికి ప్రకృతియే అయినది.

"అశోకనిర్భర్త్సిత పద్మరాగ
మాకృష్ట హేమద్యుతి కర్ణికారం
ముక్తాకలాపీకృత సిందువారం
వసంతపుష్పాభరణం వహన్తీ

—కాళిదాసు కుమా. 3-5

"ఆవర్జితా కించిదివ స్తనాభ్యాం
వాసోవసానా తరుణార్కరాగం
పర్యాప్త పుష్పస్తబకావన మ్రా
సంచారిణీ పల్లవినీ లతేవ"

—కాళిదాసు. కుమార. 3-54.

పై శ్లోకార్థమునే గాక మరికొన్ని అలంకారములను చేర్చి వర్ణించినాడు నన్నెచోడుడు తన కుమార సంభవములో___

"కరవీరరుచిర నూపురములు నెలువొందఁ
గాంచన పుష్పమేఖలలుఁ గట్టి
పున్నాగమయ హారములు వెట్టి నవకర్ణి
కారశోభిత కటకములు వెలుగ
కేసరరాజీవ కేయూరములు దొడి
రాజీవకర్ణపూరములమర్చి
తిలకాభినుత హేమతిలకంబు లుప్పొంగ
జంపక మాలికా సమితిఁ దాల్చి

మధులతాంతమయ విమండన మండిత
లైన కన్యకాచయంబు నడుమ
బొలిచె నద్రితనయ పుష్పితజంగమ
లతల నడిమి కల్పలతయుఁబోలె" కుమార. 5-20

పార్వతియే జంగమ లతవలెనున్నదని కాళిదాసు చెప్పగా నన్నెచోడుడు జంగమ లతల మధ్యనున్న కల్పలతవలె నున్నదని వర్ణించినాడు. కాళిదాసుయొక్క పార్వతి జంగమ లతవలెనుండగా నన్నెచోడుని పార్వతి యొక్క చెలికత్తెలే జంగమలతలవలె నున్నారు. ఇట్టి జంగమ లతల మధ్యనున్న కల్పలతయట నన్నెచోడుని పార్వతి. అనగా కాళిదాసు పార్వతి నన్నెచోడుని పార్వతియొక్క సఖీమణులతో సాటి యన్నమాట.

**ఇక మూడవ చోట**

వన కేళియును, వారికేళియును గూడ వనవర్ణనలోనివే! కుమార సంభవమున మొదటగా వారికేళియును, ఆ తర్వాత వనకేళియును (తొమ్మిదవ ఆశ్వాసమున) కన్పించుచున్నవి. తర్వాతి కవుల కావ్యములలో పుష్పాపచయము చేసిన యనంతరము అలిసి జలక్రీడలాడునట్లు వర్ణింపబడినది.

**వ న కే ళి**

మొదట గజానన జన్మ సందర్భమున ఈశ్వరుడును, సతీదేవియు, వనకేళి సల్పి నారు. అప్పుడు గూడ నిక్కడ సంభోగ శృంగారమే వర్ణింపబడినది. పార్వతియును, ఈశ్వరుడును వివాహమాడిన వెనుక వనకేళి వర్ణన కలదు. పుష్పాపచయమున ముఖ్య మయినది దోహదక్రియవర్ణన. దోహదక్రియలన్నవి కేవలము కవిసమయములు. స్త్రీలను

లతాంగులుగా సృష్టించిన కవులు స్త్రీలకును, ప్రకృతిలోని వృక్షలతాదులకును రసమయ సంబంధమును నెలకొల్పినారు. కుమారసంభవమున దోహదక్రియల పరికింతము :-

> "తన్నినఁజూచె నెందఁ గడుదైన్యమశోకము బాహుపీడనం
> బొన్నన జూచె నీకురువకంబును నెంగిలి కల్లు సల్లినన్
> మన్నన దప్పిపూచె దొరమాయగఁ గేసర మేము సూచుడుం
> గన్నుల నెన్నఁబూఁచె దిలకంబని దానికి మెచ్చిరంగనల్" -కుమా. 9-122.

తరువాత మధుపానమును వర్ణించినాడు, నన్నెచోడుడు. మధుపానమును ప్రకృతి వర్ణన లోనికి చేర్పరాక పోయినను, అష్టాదశ వర్ణనలను చేసిన వారిలో నన్నెచోడుడు (తెలుగు కవులలో) ఆద్యుడుగాన, దీనిని, అష్టాదశవర్ణనలలో నొకటిగా ఇక్కడ చేర్కొనుట జరిగిన దంతే!

**జలకేళి**

కుమారసంభవమున వనకేళికి ముందే జలకేళి వర్ణింపబడినది. హరగిరిజల వివాహా నంతరము నవదంపతులతో కలిసి జలకేళి గావించినారు.(కుమా. 9-77 నుండి84 వఱకు) ఈ ఘట్టమున శివపార్వతుల లీలలు రసస్ఫోరకములు.

పై విధముగ వనవర్ణన కుమార సంభవమున అతి ప్రభావోత్పన్నముగ సాగినది. కాళిదాసు వర్ణనల వంటివే అందున్నను, మొత్తమున వర్ణనలన్నియు స్వతంత్రములు.

**ఉద్యానవన వర్ణన - మనుచరిత్ర**

ఈ వర్ణన మనుచరిత్రమున మనోజ్ఞముగ సాగినది. వసంతము వచ్చినట్లు కవి చెప్పక పోయినను ప్రవరుడు హిమవత్పర్వతము ప్రవేశించినది మొదలు వసంతమనియే భావింపవలెను.

"అటజని కాంచె భూమిసురు..." (2-3) అన్న పద్యమందు కలాపిజాలమును వర్ణించుటయును, తరువాత "తొండముల్ సాచి యందుగు జిగుళ్లకు నిక్కు కరులదంత చ్ఛాయ గడలు కొనగ" అన్న చోట అందుగు జిగుళ్లను వర్ణించుటయును (2-7) "జలశీకరధారాహతి పొలుపున బైనుండి యడుగు మోవగ జేగురైన తటుల" అన్న పద్యములోని యెత్తుగీతి యందు -

"గెరలు పికశారికా కీర కేకి భృంగ
సారస ధ్వని దనలోని చంద్రకాంత
దరులు ప్రతి శబ్దమీన గంధర్వ యక్ష
గాన ఘూర్ణితమగు నొక్క కోనగనియె" (2-19)

అని వర్ణించుటయును వసంతాగమ చిహ్నములు.

ఈ వసంత సమయమున హిమవత్పర్వతముపై నడుగు పెట్టిన ప్రవరుడు అందలి కొన్ని దృశ్యముల జూచిన యనంతరము గృహమున కేగ వలయునని తలంచినపుడు కాలికిపూసిన పసరు పోవుట వలన పోలేకపోయి దిగులు పడి వరూధిని గృహము నల్లంత దూరమున చూచి మున్యాశ్రమమని భ్రమపడి—

"నికట మహీధరాగ్రతట నిర్గత నిర్ఝర ధారఁ బాసి లో
యకుఁ దలక్రిందుగా మలకలై దిగు కాలువ వెంటఁబూచు మ
ల్లిక లవలంబనంబుగ నళిప్రకరధ్వని చిమ్మరేగ లో
నికిమణి పట్టభంగసరణిన్ ధరణీసురుడేగి చెంగటన్"— మను. 2-21

"తావుల్ క్రేవలఁ జల్లు కేంగలువ కేదారంబు తీరంబునన్
మావుల్ క్రోవులు నల్లిబిల్లిగొను కాంతారంబునం దైందవ
గ్రావాకల్పిత కాయమాన జటిల ద్రాక్షాగుళుచ్ఛంబులన్
బూవుం దీవెల నొప్పు నొక్కభవనంబున్ గారుడోత్కీర్ణమున్" —మను. 2-22

చూచినాడు. ఇక్కడ వర్ణించిన చెంగలువ కేదారములును, మావులును, క్రోవులును, పూవుందీవలు— అన్నియు వసంత సమయోద్యాన వర్ణనకు ఉదాహరణములే.

అక్కడి మందమారుతముగూడ మలయమారుతమే. అది తన సహజమగు వాసనయే గాక మరొక సువాసనను గూడ మోసికొని అక్కడ బలిసినది. అది "మృగమద సౌరభ విభవద్విగుణిత ఘనసారసాంద్ర వీటీగంధ స్ఫగితేతర పరిమళమై మగువ పొలుపు తెలుపు మారుతము" (మను. 2-24)

మందయాన లున్నారని తెలుపు మనోజ్ఞ వాతావరణ కల్పన జరిగిన దిక్కడ. ఆ హిమవత్పర్వత వనములందును పాదప ప్రాంతములందును దొరకు మృగమదము జవాజి, కప్పురము, గొజ్జంగిజలము—అన్నియును భోగమయ వస్తువులు. రతి కెలయించుచు వరూధిని ప్రవరునితో తన భోగమయ జీవితమును సూచించు "సద్యోవినిర్భిన్న మృగ మదమును, బీరెండ కరగి గమగమ వలచు చొక్కపు జవాజి,తరువుల నుండి తనుదాన తొరగిన పచ్చకప్పురపు సిరము, పటికపు దొనల నిండిన గొజ్జంగి తుహిన జలము, వివిధ కుసుమ కదంబము, దివిజతరు మృదుల వసన ఫలాసవము, అమేయ రత్న భూషణ

ములును. ఎందును లేని భోగవస్తువులన్నియు నిందు గలవు, అనుదినమును నన్ను గూడి రమియింపుము" అన్నది. (మను. 2-55)

ఇది యెంతయో భోగమయ ప్రకృతి వర్ణన. తెలుగు మార్కండేయ పురాణ మందలి "భక్ష్యభోజ్యలేహ్యపానీయములు రత్నమండనములు వస్త్రమాల్యములును" అను పద్యభావము నిది పోలియున్నను, మనుచరిత్రమందు వ్యక్తీకరింపబడిన ప్రకృతివస్తు ప్రదర్శనమును, శైలియును అందమయినవి.

వీనన్నిటికి మూలమని చెప్పదగినది భారతమున నున్నది. అర్జునుడమరావతికి పోయినపుడూర్వశి యతనిని మోహింపగా నితడు నిరాకరించినపుడు "నా మనో రథంబు సఫలంబుగా మందార మంజరీ మకరంద పానమత్తమధుకరగాన మనోహర స్థలం బులను, మేరుశైల కందరంబులను......మందాకినీతీర మణిమయ వేదికలయందును... సికతాతలంబులను, నిర్జర విహార స్థానంబుల ననవరత సురత కేళీ సౌఖ్యాంబుధి నోలలార్చు మని" దేవభూముల సౌభాగ్యమును గూర్చి నోరూర పలికినది. (భార. అరణ్య—1-364)

పెద్దనలోని వర్ణన భారతమందలి వర్ణన కనుకృతి కాదు కాని అనుసరణ అగు చున్నది.

ఈ వర్ణన మంతయును కామవాతావరణ సృష్టికై జరిగినది. ప్రవరుడు చలింప లేదు. ఆమె పై బడినను త్రోసి వేసి పోయినాడు.

ఇంతవఱకు నడిచిన వనవర్ణన వరూధిని యొక్క పూర్వరాగము వ్యక్తమగుటకై చేసినది. వసంతయుక్తమైన ఉద్యానవర్ణన పూర్వ రాగమందును విప్రలంభమందును, సంభోగమందును గూడ వర్ణించుట జరుగును.

ఇక తర్వాతి ఉద్యాన వర్ణన ప్రవరుడు వెళ్ళిపోయిన వెనుక జరుగును. తర్వాత మాయాప్రవరునితోడి సంభోగసమయమునను జరుగును. వరూధినికి ఇక ప్రియా సమాగమము జరుగును, అని సూచించు వర్ణన ఈ క్రిందిది.

> "కొలకొలగూయుఁ బైనొఱగుఁ గుత్తుకఁ గుత్తుకఁజుట్టు వాఱు జి
> ల్వల క్రియఁ గానరాని గతులన్ మెయిమైబెనుచున్ జనించు న
> గ్రు లఱుత నొత్తు సోలు నిలుచున్ విధిచాతురిఁ గూడియున్ రతిన్
> దలపవు కొంకు పాసినవెతల్ దలపించుచుఁ గోక దంపతుల్" 3-62

అంతకు ముందు విడిపోయిన చక్రవాకదంపతులు సూర్యోదయ కారణమున కలిసికొని ఎంత తమకముతో ఒకదానినొకటి పెనుచు కొనుచున్నవో వర్ణితము. అట్టి ప్రియాసమాగమము వరూధినికి లభించునని చెలికత్తెల యభిప్రాయము.

చెలికత్తెల బలవంతమున వరూధిని ఉద్యాన వనమునకు బయలుదేరినది.

"ఉరగ పూత్కార ధూమోగ్ర గంధముం బాసి
 పొలయుబో యీతావి మలయ పవను
డనలాతు పెడబొబ్బ నలమిన తలదిమ్ము
 బాయుబో యీతేంట్ల పాట మరుడు
ఘర్మ సామీప్య సంకలిత దాహస్ఫూర్తి
 సాగుబో యీనీడ నల్ల మధుడు
గరళ సోదర్యాత్త కరసుధా కటుకత్వ
 ముడుపుబో యీ తేనె నోషధీశు

డనగం జంపక కురవక పనస తినిశ
నిచుల వంజుల దాడిమీ విచికి లామ్ర
పాటలీ పూగ కేసర ప్రముఖ తరుల
సొబగు మీఱు నుద్యానంబుం జొచ్చి యచట" -మను. 3-73

పై వర్ణింపబడిన చంపక, కురవక, పనస, తినిశ, నిచుల, వంజుళ, దాడిమి, విచికిల, ఆమ్ర, పాటలీ, పూగ, కేసర, ప్రముఖ తరులతో నిండిన యుద్యానము కారణాంతరము వలన సంక్రమించిన మలయ పవను నందలి విషపు వాసనను, మరుని యందలి తలదిమ్మును, మధుని దాహస్ఫూర్తిని, చంద్రుని విషసోదరత్వ దోషమును బాపగలిగిన సమర్థత గలది. అనగా నిది వఱకు కాని పని మరల వీని వలన జరుగునని అంతరార్థము.

ఇందు మరియొక సుందర దృశ్యమున్నది. అది లేతమామిడిగున్న వర్ణన. పరాగ భరితమైన ఆ యెలమావి బాగుగ పూచియున్నది. అది ఉదారంగుతో నున్నది. కొన గొమ్మలపై నల్లగా ఒక కోకిల కూర్చుండి యున్నది. ఈ ఆకారమంతయు వనేందిర గుబ్బ చన్నువలె నున్నదని ఉత్ప్రేక్షింపబడినది. సరసశృంగార వర్ణనమిది. భావ్యర్థ సూచనగల శృంగార ప్రకృతి వర్ణన.

తరువాత జరిగిన సంపెంగవర్ణన గూడ సార్థకమైనది, "దీపమును చూచి చీకట్లు పారిపోవునట్లుగా సంపెంగను చూచి తుమ్మెదలు పారిపోయినట్లు వర్ణింపబడినది. ఈ వర్ణన వలన వరూధిని చెలికత్తెల మనోభావమును, భావి శుభసూచనమును విదితమగు చున్నవి. (మను. 3-76)

వసంత సమయమున అరటిని (3-77) దాసాని పుష్పమును (3-78) పోక వృక్షమును (3-79) ఇప్ప ప్రమాకులను (3-80) వర్ణించుట జరిగినది.

ఎఱ్ఱని కంకేళి వర్ణన ప్రత్యేకతను సంతరించుకొన్నది. అది విరహిణియైన వరూధినిని రెచ్చగొట్టునట్లు వర్ణింపబడినది.

"పంకజముఖి విరహులపయి
గింకన్ నిజసైన్య కోటికిని సెలవిడుమీ
నాంకుని కరతలమన నల
కంకేళిన్ జిగురు, గాలిఁ గదలెడుఁగంటే" మను. 3-81

పై వర్ణన ప్రకరణ సంబంధము గలిగి యున్నది.

## పుష్పాపచయము

ఉద్యానవన విహారమున ముఖ్యమయినది పుష్పాపచయము. ఇది యొక శృంగార కేళి. అందలి జవరాండ్ర యొక్క ఆనందతుందిల హృదయానుసరణముగా వృత్తములను గూడ మార్చి రగడలో నడిపించుచున్నాఁడు పెద్దన.

''నేర్పుమై నల్లయది నెఱులఁ దొలుపూఁదుటిమె
దర్పకున కర్పింపఁ దలపదెంతటి పెరిమె
యింతి పావురపురొద యేల విని దారజము
వింతయే విరహిణుల వెస. బెట్టు బేరఁము (మను. 384)

ఆది ప్రాసతోడను, అంత్య ప్రాసతోడను నడిచిన యీరగడ నాట్యానుకూల మయిన పాటగ నున్నది. మనోహరమైన ప్రకృతిలో మనోరంజకమైన ఆట సాగి నట్లున్నది. ఇందు రకరకముల పూలును, వాని పరిమళములును, వాని సొగసులును వర్ణితములు.

పుష్పాపచయమున పూలనామములు చాలగా తెలియనగును. వసంతమయమున నేయే పుష్పములు ప్రసిద్ధములో నవియన్నియు మాత్రమే వర్ణింపబడును.

వనకేళికాగనే జలకేళి జరుగును.

అష్టాదశ వర్ణనలలో వనకేళి, జలకేళి గలవు. ఇవి శృంగార ప్రధానమైన వర్ణనలు. వనకేళి జలకేళులున్నచో సంభోగ శృంగార మున్నదన్న మాటే.

జలకేళిసమయమున కొలకులును, మరాళములు మొదలగునవియును వర్ణితములు.

"నాళీకమధూన్మత్తమ
రాళీ ముఖరాళి సుఖకరంబగు కొ నన్
గేళీలాలసగతి డిగి
యాళీనివహంబు లోలలాడెడి వేళన్" --మను. 3-58

పెద్దన జలకేళి ఎక్కువగా వర్ణించలేదు. అందుకు కారణము వరూధిని జలకేళిలో పాల్గొనక గట్టున కూర్చుండుటయే. అటునిటు చూచుచు చింతగా కూర్చున్న యామె కల్లంత దూరాన మాయాప్రవరుడు కనిపించినాడు. లేచి వెళ్ళినది. వాడు ఒప్పుకొన్నాడు. ఇరువురును కలిసి చెంతనున్న ఉద్యానవనమునకు వెళ్ళినారు. ఇక్కడి వాతావరణ సృష్టి అమోఘమైనది. వరూధిని మాయా ప్రవరుల మనస్సునకును, తమకమునకును దీటుగా ఈ ప్రకృతి వర్ణితమైనది. ఉద్దీపన యొక్క ఉత్కృష్టతను చాటుచున్నది. రత్యనుకూల వాతావరణ సృష్టికై అనుకూలమైన ప్రకృతి వర్ణన జరుగుచున్నది. దాని కనుగుణమైన శైలియు సంతరితమైనది.

"మృగనాభి నికరంపు బుగబుగల్ గలచోట
జదలేటి తుంపురుల్ చెదరుచోట
వకుళవాటీ గంధవహుడు పైకొను చోట
గర్పూర తరుధూళి గప్పుచోట
బసమీలు సెలయేలు లిసుక వెట్టిన చోట
జిగురు మావుల నంజ నిగుడుచోట
నవమాలికల తీవెనట్లుట్టి పడుచోట
మాణిక్య దీపముల్ మలయుచోట

భ్రమదమునం దేటు లెలుగెత్తి పాడుచోట
శారికలు ఒగ శాస్త్రముల్ చదువుచోట
గీరికల కంఠములు క్రొవ్వి కేకుచోట
పావురము లారజంబులు పలుకుచోట" -మను. 3-111

"ఆ వరూధిని మణిమండి తాలయంబు
గాంచి యనురాగమునం బ్రవేశించి యంత
వారి నిరువురం గూర్చి యవ్వనజగంధు
లాత్మగృహముల కేగి రంతర బ" -మను. 3-112

"ఫుల్ల లవలీ నవైలా
వల్లిమ తల్లికలతోడ వాసంతికలు
ద్యల్లీల నల్లిబిల్లిగ
నల్లికొనిన యొక లతాగృహాంతర సీమన్" -మను. 3-113

"ఆ గంధర్వ కుమారుడు
నాగజగమనయుఁ ప్రఫుల్ల హల్లక తల్ప
భోగంబున రహిమిగులగ
భోగింపఁ దొడంగి రాత్మఁ బొంగెడు కాంక్షన్" —మను. 3-114

శారీరక ప్రకృతిని పైకొన్న మానస ప్రకృతి యొక్క ఉద్రేకచేష్టయైన రతి యీక్రింద వర్ణింపబడుచున్నది.

"సహసానఖంపచ స్తనదత్త పరిరంభ
మామూల పరిచుంబితాధరోష్ఠ
మతిశయ ప్రేమ కల్పిత దంతసంబాధ
మగణిత గ్లాని శయ్యానిపాత
మతివేల మణిత యాచ్ఞార్థ గల్ల చపేట
మతిదీన వాక్యాచి తాత్మ విరహ
మంకురత్పులక జాలావిద్ధ సర్వాంగ
మానంద కృతహార వానవాజ

మాక్రమక్షీణ నుతివర్ణమా నిమీలి
తాక్షమాస్విన్నగండ మాయత్త చేష్ట
మా స్తిమిత భూషణారవ మా వధూటి
ప్రథమ సురతంబు గంధర్వపతి గరంచె" —మను. 3-116

ఇంత మనోజ్ఞ వాతావరణమును, ఇంత కసికలిసిన మక్కువతోడి రతివర్ణనమును, కావించిన కవి మరొకడు లేడు. సంభోగ శృంగారవర్ణన కావించుటలో పెద్దనది పెద్ద చేయి.

పై విధమున ప్రకృతి యందు రమించుటను కొన్ని కొన్ని కావ్యములందు కన్పట్టుచున్నది. వాల్మీకి రామాయణమునందలి చిత్రకూట వర్ణనలో రాముడు సీతకు కాముక శయనాలను వాడిపోయిన కమలమాలికలను (కాముకు లుపయోగించినవి) చూపినట్లు (రామా. అయోధ్యా. 94-25) వర్ణింపబడియున్నది. ప్రకృతి నాథుడైన పరమశివుడు పార్వతి కోర్కిపై గజరూపమున క్రీడించినట్లు కుమార సంభవమున నన్నె చోడుడు వర్ణించినాడు. (కుమార. 1-101). పారిజాతాపహరణము, ఆముక్తమాల్యద లలో అట్టి వర్ణనలు లేవు. ప్రభావతీ ప్రద్యుమ్న, వసుచరిత్ర, విజయవిలాసముల యందు గల నాయికా నాయకులు మహారాజులు గాన అట్టి రతి క్రీడాసంబంధ ప్రకృతి వర్ణనలు అంతఃపురములకు సంబంధించి జరిగినవి. కళాపూర్ణోదయమునందు మాత్రము సముద్రమును రసోదంచితముగ వర్ణించిన వెనుక మణిస్తంభుడు సుముఖాసత్తితో

ప్రకృతిలోనే రమించినట్లు (కళా.4-205) వర్ణింపబడినది. వీరు కావ్యమందలి నాయికా నాయకులు కారు.

మనుచరిత్రమందలి వరూధినియును, గంధర్వుడును దేవయోని జాతులు. కావ్యమందలి నాయికా నాయకులు కూడ గారు. కేవలము కాముకులుగ చిత్రింపబడినారు. అందులకే వారు ప్రకృతిలోనే రమించినట్లు వర్ణితమైనది.

## మృగయావర్ణన

దండి గాని, విద్యానాథుడు గాని, నన్నెచోడుడు గాని, విన్నకోట పెద్దన, భట్టుమూర్తులు గాని చెప్పలేదు గాని, విశ్వనాథకవిరాజును, కేశవమిశ్రుడును, అప్పకవియును 'మృగయ' గూడ వర్ణనలలో నుండవలెనన్నారు.' అరణ్యము' ను గూడ వర్ణింపవలెనని కేశవమిశ్రుడన్నాడు. రామాయణ, భారత, భాగవతాది పూర్వ గ్రంథములందు వనవర్ణన (అరణ్యవర్ణన) చేసియుండుటచే అట్టి నియమములను కేశవమిశ్రాదులు కల్పించినారు.

కేశవమిశ్రుని మతమునసుసరించి అరణ్య వర్ణనలో ఘరి, వరాహ. ఇభ, ద్రుమ, కాక, ఉలూక, కపోతాదులు వర్ణింపబడవలెను.

రామాయణ భారతములందు అరణ్య వాసములుండుట వలన అరణ్య వర్ణన తప్పనిసరి యయినది. అల్లే భాగవతమునగూడ గజేంద్రమోక్షాదులందు వనమును వర్ణింప వలసిన అవసరము కలిగినది. అనుప్రాస ప్రియుడగు పోతన ఇట్లు వర్ణించుచున్నాడు.

"అని మఱియును మాతులుంగ, లవంగ, లుంగ, చూత, కేతకీ, భల్లాతక, ఆమ్రాతక, పనస, బదరి, వకుళ, వంజుల, కురంటక, కోవిదార, నారికేళ......" భాగ. గజేంద్రమోక్షము భాగ - అష్ట - 24.

తరువాత మృగముల వర్ణించు తఱి-

> "ఖిల్లీ ఖిల్లలులాయక
> భల్లుక ఫణి ఖడ్గ గవయ వలిముఖ చమరీ
> ఝిల్లీ హరి శరభ కిరికిటి
> మల్లాద్భుత కాక ఘూకమయమగు నడవిన్ "- (గజేంద్రమోక్షము) భాగ-అష్ట-25

అని వర్ణించినాడు.

పెద్దన అరణ్య వర్ణన ఉదాత్తమైనది. స్వరోచి వేటకై వెడలివచ్చి ఒకకొండపై కూర్చుండియున్న సమయమున ఒక యెలుక ఏదువచ్చి—

"యుగ విగమ సమయ సముద్భూత జీమూత పటలంబునుంబోలె నైలాస గిరి నితంబ ప్రాంత కాంతార పర్యంతంబు నిరంతరంబై కాఁచుకొన్న యొక్క గహన రేఖం గరాంగుళిం చూపి" భూపతి కిట్లనియె—

"కండూతికై రాయు గర్కశాంబగు తుంటి
బీట వెట్టిన మ్రాను పెల్లగిల్లఁ
జెవిదార్చి విని చీమ చిటుకన్న నొకసారి
సెలవి వెంపరలాడు జిట్టలెల్లఁ
జప్పరించు వెదుళ్ళు పటలుబ్బ దంష్ట్రాగ్ని
చొంగపైఁబడి చుంయి చుంయి మనఁగఁ
జంద్రి నిప్పులు వోలె దిండ్రించు కనుమించు
లెసగనొండొంటిపై నెక్క బాఱు

వెట్టదినముల మడుగుల మట్టిగలప
బుళ బుడ ధ్వని వెడలు బుద్బుదములందుఁ
జిలువ చిలుపని నేతులు జిడ్డుదేఱు
నేమిచెప్పుదుఁ గ్రొవ్విన యేలకములు" —మను. 4–17

అరణ్యములలో వరాహవర్ణన ముఖ్యమయినది. వరాహపోతములు తొండము లేని యేనుగులని మరియొక చోట వర్ణితము (మను. 4-18). తరువాత మనుబ్బిలు (మను. 4-20), దుప్పులు (మను. 4-21), ఇఱ్ఱిపోతులు (మను. 4—22) వర్ణితములు.

స్వరోచికి మృగయాకౌతుకము కలిగి, నగరికి వెళ్ళి డేగలను, జాగిలములను తీసికొని ఒక మహాసైంధవము నెక్కిసుహృత్తుల తోడను పరివారము తోడను బయలు దేరినాడు. కూతలు వేయుచు, "పణవ, దుందుభి, మృదంగాది తూర్యములు కొట్టించుచు, కాహళులు పట్టించుచు, అగ్నియంత్రంబులు ముట్టించుచు, రొద మిన్ను ముట్టన్ జోపు పెట్టించిన" (మను. 4—37)

అపుడు అడవి దద్దరిల్లి పోయినది. ఖడ్గమృగ సంకులములు భయాకులములై అటునిటు దిక్కుతోచక పరుగెత్తి సాగినవి. భయవాతావరణము నెంతో సార్థకముగ వర్ణించు చున్నాడు కవి.

"చకితైణాహుతి దావమావశిత పుచ్ఛస్వల్పగచ్ఛత్తర
క్షుక మద్రిగ్రహయాళు భల్లుకము వక్షోభాగ నిక్షిప్త డిం
భక వల్గత్ ప్లవగీ కదంబము హరిద్రాంభః పోత్రిత క్రోడనా
యక మాఖీలముఖద్విపి స్థపుటితంబయ్యెన్ వనంబత్తఱిన్" -మను. 4-38.

పులివేట ఎంత భయంకరమైనదో యీ క్రింది వర్ణనవల్ల దెలియగలదు.

"గవిలో బెబ్బులి డాగి గ్రుడ్లు మెఱమంగాఁ గాంచి రాజేసె నే
యవడిన్ బాణము వెంటనే నిగిడి పైకళ్లేచి రానేసె రెం
డవ కాండంబుఁ దదస్త్రిమున్ గొనక డాయన్ వచ్చి కౌక్షేయక
ప్రవిభిన్నంబయి నేలఁ గూలెఁ బవిధారా భిన్నశైలాకృతిన్" -మను. 4-46

పై వర్ణన సహజ భయంకరత్వమును వెల్లడించుచున్నది. దెబ్బతిన్న పులి పారి పోక పై బడుట అతి సహజము.

వనవర్ణన అన్నివిధములుగ మనోహరముగ సాగినది మనుచరిత్రలో. ఉద్యాన వర్ణన కథతో సంబంధము గలదియా యని చర్చించుట యనవసరము. వేటతో గూడిన యరణ్య వర్ణనకు కథతో గల సంబంధమును విచారింప వలయును. వేటలేనిదే స్వరోచి యొక్క యోద్ధత్వము ప్రకటితముగాదు. అంత యోధుడు కానిదే స్వారోచిష మనువుకు తండ్రియగుట కర్హుడుగాడు.అందులకీయరణ్య వర్ణనమును వేటవర్ణనయును కథతో ముడిపడి యున్నవి. సార్థక్యము గలిగి యున్నవి.

వీర, భయానక, బీభత్స, రౌద్ర రసపోషణ కిది యాటపట్టు. ఈ వర్ణనను కలుపుకొన్నచో కావ్యమంతయు నవరసపోషణ గలిగి యున్నదన వచ్చును.

## వనవర్ణన - పారిజాతాపహరణము

నారదుడు శ్రీకృష్ణుని దర్శనమునకు వచ్చినపుడు అక్కడున్నరుక్మిణికి పారిజాత పుష్పమహిమనుచెప్పి యిచ్చునప్పటికి సత్యభామ తన ఉద్యానవనములో నున్నది. ఇచ్చటి వర్ణన వసంత వర్ణనమే.

"తన శృంగార వనంబులో నగరి పొంతం జక్కగా దిద్ది తీ
ర్చిన పూఁదేనియ యేటి కాలువ దరిం జెంగల్వ పుప్పొళ్ళు నిం
చిన చంద్రోపల వేదిపై సరస గోష్ఠిన్ బోటియుం దాను న
వ్వనజాతాయతనేత్ర శౌరిగుణముల్ వాక్రుచ్చి వర్ణించుచున్" -పారి. 1-71

ఆ శృంగార వనములో పూదేనియ యేటి కాలువలున్నవి. చెంగల్వపుప్పొళ్ళు నిండిన చంద్రోపల వేదికలున్నవి. చెలికత్తెలతో విహారము చేయుచు, శౌరిగుణములు వర్ణించుచున్నది సత్యభామ (పారి.1-71) రాబోవు శుభాశుభములు ముందే సూచితములు (coming events cast their shadows before) అన్న సత్యమును ఈ ప్రకృతి వర్ణన ద్వారా ప్రకటించుచున్నాడు కవి. ఉద్యానవనమున క్రుమ్మరుచున్న సత్యభామ తన మనసును కృష్ణునిపై కేంద్రీకరించినదిగాబోలు. అతని సన్నిధానమున జరుగుచున్న పనులను ప్రకృతియే నిస్తంత్రి యంత్రమువలె ఈమె మనసున కందించినదేమో! కోకిలా నాదములు వినిపించుచున్నను కమ్మ తెమ్మెరలుసోకుచున్నను మనసు మాత్రము క్రుంగు చున్నది.

> "అళికులరావముల్ గిసలయాకుల కోకిల కాకుకాకలీ
> కలకల నాదముల్ సెలగఁ గమ్మని తమ్మికొలంకు తెమ్మెరల్
> వొలయగఁ దొంటి చందమున బుద్ధికి నేమియు నింపుగామికిం
> గలుగుచు సత్యభామ చెలిఁ గన్గొని యించుక సంశయించుచున్" —పారి, 1-72.

ఇది వసంతమనుటకు పై అళులు. కోకిలలు, తెమ్మెరలే సాక్ష్యము. పైని అనైం ద్రియకమయిన భావ ప్రకృతియొక్క చేష్ట వర్ణితము.

వనవర్ణన విప్రలంభ శృంగారపోషణమందుగాని,సంభోగ శృంగారపోషణమందుగాని లేక రెండింటియందుగాని జరుగుచుండును. ఈ ఘట్టము విప్రలంభ శృంగారమునకు కొద్దిగా ముందటి దశ :

పై వర్ణన కేవలము రెండు పద్యాలలో మాత్రమే సాగినది.

తర్వాత మరల 37 పద్యాలలో నొక వనవర్ణనయును, వనకేళియును, దోహద ములును వర్ణించబడినది. 13 పద్యాలలో జలకేళి వర్ణింపబడినది.

కురవకములు, చంపకములు, కేసరములు, కంకేళులు, సిందువారములు సొంపుగా వర్ణితములు. ఒక వైపు పుష్పవర్ణనయును, మరియొకవైపు దోహదక్రియా వర్ణనయును కలిపిచేయబడినవి. ఈ దోహదక్రియలు రంభాదులవలన జరిగినవి. ఇది జరిగి నది నాకములో.

తలచూపె నొక పంక దరదళత్పేవంతి
　　కాగంధి నీహార కణభరములు　　　　　(హేమంత)
పొడచూపె నొకచక్కి బుష్పిత ఫలనీల
　　వంగవాసిత శైత్య వైభవములు　　　　　(శిశిర)
నెఱసె నొక యెడఁ దామ్రపర్ణీ జలార్ద్ర
చందనాచల పవమాన కందళములు　　　　　(వసంత)
మొనసె నొకకడ సామి సంఫుల్లమల్లి
పాటలీ చంపకోత్పల పౌఢిమములు　　　　　(గ్రీష్మ) —పారి. 3-46

పైన వసంతాది నామముల పేర్కొనక పోయినను వానిని మన మూహించు కొనుట వలన నిది కవి సమయమునకు ఉదాహరణ యననగును.

నందనవనములో నైదు జాతులే గలవు. అవి దేవతరువులు.

"పంచైతే దేవ తరవో మందారః పారిజాతకః
సంతానః కల్పవృక్షశ్చ పుంసివా హరిచందనం"　　　—అమరము-స్వర్గవర్గము.

కాని అన్నిరకాల చెట్లున్నట్లు మన కవులు వర్ణించుట వర్ణనా సంప్రదాయ మనవచ్చును.

వసంతోదయాన పండిన మామిడి యాకులు పడుటను మనోహరముగ ఉత్ప్రేక్షించు చున్నాడు కవి. మలయానిలుని పొందుచేత చిగుళ్ళు పుట్టుట అను గర్భధారణ గలవైన మామిడి కొమ్మలు, గర్భభారమువలన, పైనగల సొమ్ములు తీసివేయుచున్నవా అన్నట్లు పండు మామిడి యాకులు పడుచున్నవట! భావము సొగసైనది -(పారి. 3-47)

వసంత సమయమున చూతములు, గురివెందలు పుష్పించినవి (పారి. 3-48). పిక కూజితములు లేక వసంత వర్ణన యుండదుగదా! విరహుల హృదయముల నిట్లు చీల్తుము అని మన్మధునకు తెలుపుచున్నవా అన్నట్లు చిగుళ్ళను కోయిలలు చీల్చుచున్నవని ఉత్ప్రేక్షించుచున్నాడు కవి.

"తలిరాకుగుత్తి దమిఁ గోయిల చంచునఁ జించి గోల్చె నీ రీతి వియో
గుల గుండియ లవియింపుదుఁ బలువిడినని మరుతి యెదుటఁబచరించెననన్"
　　　　　　　　　　　　　　　　　　　　　　　-పారి. 3-49.

ఇది కసి కలిసిన శృంగార వర్ణన.

వసంత సమయమందలి కోకిలల మదపు చేష్టలును, వాని కసియును సుందరముగ వర్ణితములు. వసంత సమయ సుందర దృశ్యములు ఉద్దీపనములై పథికుల బాధించుననన్న భావము సొగసుగ చెప్పబడినది.

చిలుకలు ముక్కులచే దాడిమీఫలములను కాటుచేయగా, రాలిన బీజములు వానకారున క్రిందపడు ఇంద్రగోపములా అన్నట్లున్నవి. (పారి. 3-55).

పారిజాత పుష్పముయొక్క సొగసును గొప్పదనమును కృష్ణుడు వర్ణించు చున్నాడు.

"అమరారాతి విఘాతి సత్యగని కాంతా చూచితే పారిజా
తము భూమీరుహ చక్రవర్తి త్రిజగత్సంపూజ్య సౌరభ్య కీ
ర్తి మరుల్లోక మలంకరించునది గౌరీనాథు జూటస్థలం
బు మృగాంకుండు రమా మనోరము నురంబుం గౌస్తుభం బుం బలెన్"
-పారి. 4-3.

నారీమణుల నోరూరునట్లుగా కృష్ణుడు వృక్షములను వాని దోహదములను వర్ణించు చున్నాడు. అన్నియును క్రమాలంకార యుక్తములు.

"విను మింతుల్ దిలకంబుఁ జంపకముఁ గోవి న్విందు వారంబు క్రేం
కనము న్మామిడి గోఁగుఁ బొన్నఁ బొగడం గంకేళి నూహించి గ
న్గొన మోమెత్తఁగ గౌగిలించుకొన మూర్కొఁ బాడ జేనంటఁ బ
ల్కనగం గల్గుమియంగఁ దన్న నసుచుం గల్పాగ మాయావిరుల్" -పారి,

కల్పవృక్షములే యాయా వృక్షము లగుచున్నవని (దోహదమున) భావము. అదే భావ మును మరల రూపాంతరమున చెప్పినట్లయినదీ క్రింద-

"కనఁ దిలకంబుఁ గేసరము గల్గుమియ న్రహిబాద క్రేంకనం
బు నిముర మావి నవ్వ సుర బొన్న ముఖాంబుజ మెత్త జంపకం
బు నెఱగవుంగలిం గోరవి మూర్కొన వాపిలి దన్న వంజుళం
బు నుడువ గోగునై తరుణి పూచు సురద్రుమ మిన్ని పువ్వులన్" --పారి. 4-10

ఈ వన సంచారమున పుష్పాపచయము జరుగుచున్నది. (4-16) పెద్దన వలెనే ఇతడును ఇక్కడ రగడను ప్రయోగించినాడు. ఇందు అన్ని రకముల చెట్లును, అన్ని జాతుల పుష్పములును పేర్కొనబడినవి. యావతల కుతూహల కేళికి అనుగుణముగా నుండునది రగడయే గాన ఇతడును రగడను వాడినాడు.

పుష్పాపచయమగు సరికి ఎండతాకిడి తగిలినది. మధ్యాహ్నసమయమున ప్రకృతి యెట్లుండునో వర్ణించుచున్నాడు—

"తూఁగెం జల్లని గాడ్పులేమి ఫణిసందోహంబు, వేరొక్కటన్
లోఁగెం దప్తసరోజ శీధురసముల్ గ్రోలన్మదాళి చ్ఛటల్
గ్రాఁగెన్నీరుగ గాంచనాచలతటీ గండోపల వ్రాతముల్
డాఁగె న్బల్వల పంకసీమ బకజాలత్రస్త పాఠీనముల్" —పారి. 4-20

దేవభూములలో శీతాతపాది బాధలుండకున్నను పైన వర్ణనలో ప్రాతర్మధ్యాహ్నాది వేళల వర్ణించు సంప్రదాయము గూడ నెరవేరినది. ఈ వర్ణన జలకేళికి దోహదము కలిగించుచున్నది.

జలకేళిలో పురుషుడొక్క కృష్ణుడే. మిగిలినవారు సత్యయు దేవతాస్త్రీలును, అదియును భూలోక జలక్రీడవలెనే వర్ణితమైనది.

జలకేళి మొత్తము 16 పద్యములలో వర్ణితము. శృంగార రస బంధురము. ఉత్ప్రేక్షాలంకార ఘటితము.

తిమ్మన పారిజాతాప హరణమున అష్టాదశ వర్ణనల నన్నిటిని దాదాపు చేసినాడు. వనవర్ణనలో గల సర్వర్తు వర్ణన శిశుపాలవధ యందలి సర్వర్తు వర్ణన ధోరణిలో నున్నది. శిశుపాలవధలో తొలుత నారదాగమమున్నది. ఇక్కడగూడ పురవర్ణన కాగనే నారద వర్ణన యున్నది.

పెద్దన వలెనే ఇతడును పుష్పాపచయ సందర్భమున రగడను వాడినాడు. ఇతని తర్వాతి కవులను అట్లే వాడుట జరిగినది.

నన్నెచోడుని వలెనే ఇతడును వనవిహారములోనే దోహదక్రియలను, వనకేళి జలకేళులను వర్ణించినాడు.

## వనవర్ణన - వసంతవర్ణన - ఆముక్తమాల్యద

సాహితీసమరాంగణ సార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయలు వర్ణన కావ్యముల రచించిన వారిలో ప్రథముడు, కేవలము వర్ణనలు చేయుటకు కవిత్వమును చేపట్టినాడు. వనవర్ణన దాదాపు అరువది పద్యములలో సాగినది.

మొదట పురవర్ణన చేయుచు ఉద్యాన వర్ణన చేయుచున్నాడు. పురోపవనవర్ణన పురవర్ణనమునందు చర్చింపబడినది.

వసంతర్తు వర్ణన కథా సంబంధముగ మొదలైనది. మొత్తము 62 పద్యాలలో నిది వర్ణితము. అందు గోదాదేవితో సంబంధము లేని పద్యాలు 48.

ఉత్తరాయణము నెంత సహేతుకముగ ప్రవేశ పెట్టుచున్నాడు కవి:

"మొదల నాముక్తమాల్యద మదన తాప
తరణి పెనువెట్ట వేగిన దక్షిణాశ
మత్కృతోష్మకుఁ దుదముట్ట మాడు ననుచు
దొలఁగెనన నుత్తరాశకు దొలఁగె దరణి" —ఆము. 5-95.

అని కథతో ముడి పెట్టుచున్నాడు.

మీనము పోయి మేషము వచ్చుటతో వసంత ప్రారంభము.

"కినిసి వలఱేఁడు దండెత్త గేతువగుట
మీనమిఁకదోఁచు టుచితంబ మేషమేమి
పనియనఁగనేల విరహోఖ్య పాంథయువతి
దాహమున కగ్గిరాఁగ దత్తడియురాదె" —ఆము. 5-98.

మన్మథుడు దండెత్తుచున్నాడు. మరి అతని వాహనమైన మీనము గూడ అక్కడే యున్నదన్న సమంజసమే! మేషమెందుకున్నది? విరహుల బాధించుటకు అగ్ని వచ్చి నాడుగదా! మరి అతని వాహనము మేషమును వచ్చినట్లేగదా!

మేష ప్రవేశముతో వసంతర్తువు ప్రారంభమయినది. విరహుల బాధ గూడ అతిశయించినది. జ్యోతిషమందలి రహస్యములు చమత్కారముగ కథాభాగముతో నన్వయము పొందుచున్నవి పైన.

మన్మథునికి మరొక బలము చూపుచున్నాడు కవి.

"మునుపే చంద్రబలంబు గల్గి మలయంపుం గమ్మ లేఁగాడ్పుఁడే
రున నేతెంచు లతాంతబాణునకు సూర్యుండు న్మహిన్ గ్రొత్తగ్గా
ననుకూలించెఁ బలంబున న్విరహిణీ ప్రాణాపహారంబు నే
యన యూహించు విధాత కృత్యమిది యేలామాను నెప్పట్టునన్" —ఆము. 5-101.

చంద్రబలమును గూడ పొంది ముందే మలయ మరుద్వాహనుడు దండెత్తి వచ్చుచున్నాడు. అట్టివానికి ఈ భూమియందు సూర్యుడును తోడైనాడు. మన్మథునికి కాలమును దేశమును అనుకూలించినవి. విరహుల ప్రాణముల దీయుటకైన విధాత చేష్ట యిది.

దక్షిణాయనమునుండి ఉత్తరాయణమునకు సూర్యుడు మారుటను చాలమంది కవులిట్లే యుత్ప్రేక్షించి యున్నారు.

వసంత వర్ణనలో ప్రథమ స్థానమును వహించునది మలయమారుతము. భారతదేశ సాహిత్యము లన్నింటియందును దీని వర్ణన చాల విస్తారమును, ప్రముఖమును. ఈ వాయువునకు రెండు ముఖ్య గుణములున్నవి. ఒకటి శీతలత్వమును రెండవది సువాసనత్వమును. దీనిలో కొంత వేడిమి గూడ చేరినట్లు సతార్కికముగ వర్ణించుచున్నాడు కవి.

"మలయకట కోటజస్థిత
కలశీసుత సేవ నిట్లుగనెనొ తదాశా
నిలుడనగ నలసవృత్తిన
మెఁగుచు నాపోశనించె మిహికాజలధిన్" —ఆము. 5-102.

కొంత ఉష్ణములేనిదే మంచునెట్లు ఇంకించగలదు? దక్షిణాన నుండి అగస్త్యుని సేవ చేసినందువల్లనే యీ మలయమారుతము మిహికాసముద్రమును త్రాగ నేర్చినదని పైని వర్ణితము.

వసంత సమయమున ప్రకృతిలో రెండు దృశ్యములు కనిపించును.

"చిలువ సుధారసాధరల చెల్వపుఁ బుక్కిటితావిఁ దీయనై
వలపుల నందు తత్ప్రియుల వక్త్రవిషజ్వలనోష్మ నొట్టనై
వెలువడి దద్గుణద్వితయ వేధ జుమీ యన భ్రాంనుపట్టుటల్
తలిరులు పుట్టుటల్ గలుగ దార్కొనెఁ జందన శైలవాతముల్" —ఆము. 5-107.

వసంత ప్రవేశ సమయమున చెట్లు ఆకులు రాల్చి మోడు పడి యుండుట, ఆ స్థానమున మరల చిగుళ్లు కనిపించుట, అనునవి ప్రకృతి సహజమయిన విషయములు. అది స్త్రీ పురుష సర్పముల ఫలితముగా నైనదని ఉత్ప్రేక్షించినాడు కవి.

పండుటాకులు రాలుటను ఈ దిగువ నర్థగర్భిత శబ్దస్ఫూర్తితో వర్ణించుచున్నాడు.

"మదనస్యందనతా స్వవృత్తిఁ దెలిపెం జాటీర భూభృద్వల
న్మృదువాతం బతి పక్వ పాదప లతావృంతావళీ మూల రం
ధ్ర దళత్పంకజ కర్ణికాగణ హరిద్రాభంగ భాభాసుర
చ్ఛదన చ్ఛద్మనివర్తి కాంచన కనచ్చక్ర చ్ఛటాచీత్కృతిన్" -ఆము. 5-108

చెట్లయొక్కయు, తీవల యొక్కయు, పండుటాకులు రాలుట మన్మథరథమైన మందానిల చక్రములు తిరుగునట్లుండెనట! ఇది నేటి సినిమాలోని దృశ్యమువలె కన్పట్ట జేసినాడు కవి.

ఎత్తయిన చెట్లనుండియు, ఎత్తయిన పొదలనుండియు పండుటాకులు రాలుట గమనించినచో ఈ దృశ్యము అవగతమగుసు. ఇందు రాయలయొక్క సూక్ష్మదర్శిత్వము ప్రకటిత మగుచున్నది.

ఈ క్రింది చిగుళ్ల వర్ణన అందముగను అద్భుతముగను ఉన్నది. వర్ణనా వైవిధ్యమును సంతరించుకొన్నది—

"క్ష్మావళా రక్త రాంకవ మరణ్యానీమ
హాధిపారుణిమ వల్ల్యురగరసని
కోద్గతి తరు గరుత్మద్గరుద్గణ ముద్భి
దాహార్య జీమూత రోహితంబు
నవమిళింద ప్రాహుణక నిమంత్రణ శోభ
నా శుకప్రతతి వాయసవిభక్త
పరభృతాఘప్రాప్త పత్రికమాలతీ
త్రాసామ యావహార్ద్రక్షతజము

ప్రమదవన వనదేవతా సముదయాంగ
రాగ మినజ హారిజ్జగత్ప్రాణ శాణ
కషణదళిత దళాంతసంక్రాంత కాంతి
ఘనమణిశలాక చిగురాకు గలయ మొలిచె" -ఆము. 5-110.

ఇంత పరిశీలనగల కవి, ఇన్ని దృక్కోణములతో చూచిన కవి,ఇంతగా ఉత్ప్రేక్షించిన కవి మరియొకడు లేడేమో!

పై చిగుళ్లను ఎన్ని వస్తువులకు పోల్చదగునో అన్ని ఉపమానముల ప్రయోగించి వర్ణించినాడు. వసంతోదయాన చిగుటాకులు భూమి యనెడు ఆడు ఏనుగు పైని గప్పిన యెఱ్ఱ 'కంబళి' వలెను, మహారణ్యమునకు వసంతమను మద్యము చేత తోచిన రక్తకాంతి వలెను, తీగ లనియెడి పాములు నాలుకలు చాచుచున్నట్లును, వృక్షములనియెడి గరుడ పక్షుల రెక్కలా అన్నట్లును, పొదలనియెడి కల్పిత మేఘములకు కొఱడుల వలెను,

(పుట్టంగి పొదలు పూచినపుడు పొదలు ఈ విధముగనే కనిపించును), తుమ్మెదలనియెడి అభ్యాగతులను క్రొత్తగ ఆహ్వానించుటకు ఉంచిన శోభనాక్షతముల వలెను, కాకులతో కూడియుండి అపుడే వేరుపడి పోయెడి కోకిలల కొదవిన విభాగపత్రముల వలెను (శిశిరములో పొదిగి పిల్లలు చేయుటయు వసంతము రాగానే పిల్లలెగిరి పోవుటయు పరిపాటి), జాజిచెట్లకు భయ రోగమును కల్పించు క్రొత్త నెత్తురు వలెను, క్రీడోద్యానవన దేవతలు నెమ్మేనుల బూసికొన్న కుంకుమ మైపూతవలెను, మలయమారుతమను సానతో నొఅయబడి రాలిన యాకులచేత కానబడి మెండయిన దీప్తి గలిగిన గొప్ప రత్నశలాక జోక యనందగిన చిగురాకు మొనసి కనబడెనని యర్థము.

ఎంతో అర్థవంతమయిన పదప్రయోగము! లోకానుభవము, ప్రకృతి పరిశీలన, రాయలయందున్నంత మరెందును కానము. ఇతరు లెవరో పూర్వులు వ్రాసిన పట్టీకి నకలు కాదిది. తాను స్వయముగా ఎన్ని వసంతములనో పరిశీలించిన ఫలముగా ఆలంకారికము కావించిన కళ యిది.

వసంతమున మొల్లలుండ వనుకవి సమయమును ఉత్ప్రేక్షించుచున్నాడు కవి.

> "శరనిధులమాఘ్యములు దీఱ మరున కట్టి
> యడరున జయింతుమని కదా యద్దినాళి
> గ్రూరతిథిఁ గృష్ణరజనిఁ దద్వైరిఁ గనియుఁ
> బెద్దలిపురాకఁ బట్టెన పెట్టువడిరి"
>
> —ఆము. 5-111

ప్రీతి బహుళపక్ష చతుర్దశి మాసశివరాత్రి. మరునకును శివునకును విరోధము. శివుని దర్శించిన నేమి? మన్మథుడు చివురాకు ఆయుధముచే పెద్దలను సైతము కొట్ట గలుగుచున్నాడట.

వసంతమున మోదుగు పూలకు (కింశుకము) ప్రత్యేకత యున్నది. అవి చక్కగ పూసి చాల మనోహరముగ నుండును. ఎట్లుగ నుండును.

> "అవని నవుడు నవోదితుండైన యట్టి
> మరునకుం గుసుమర్తున స్మంత్రసాని
> బొడ్డుగోసిన కొడవలిఁబోలె విరహి
> దారకంబయ్యెఁ గింశుక కోరకంబు"
>
> —అము. 5-112

దానిరంగు - దాని ఆకారము ఎంత సహజముగ వర్ణన చేయబడినది! గొప్ప సార్థక సామ్యము! స్వరూపసామ్యము.

మోదుగుపూలు సువాసనగలిగి యుండవు. అందుచేత స్త్రీలు శిఖలపై ధరియింపరు. అందుచే అవి సిగ్గుచే వంకర పోయినవి. కాని ఆస్త్రీల భర్తలు ఆ మోదుగ పూలను నూరి, వసంతములో కలిపి చిమ్మనగ్రోవితో చల్లినపుడు ఆస్త్రీల కుచములపై ఆ రంగు నీరు కాసింతసేపు నిల్చినది. అదియే ఆపూలకు తృప్తి. ఎందుకు? మదిరేక్షణల వక్షోజములపై కెక్కుట సామాన్య విషయము కాదుగదా! ఇట ప్రకృతియొక్క శృంగార భావ దృష్టి ద్యోతకమగు చున్నది. ప్రకృతి మానవికరణ జరిగినది. (ఆము. 5-118)

ఇది రసవత్తర వర్ణన! ఈ పద్యమును చూచి కాబోలు వసుచరిత్రకారుడు గిరికా దేవి నాసికను వర్ణించు తఱి "నానాసూన వితాన వాసనల నానందించు సారంగమేలా నన్నొల్లదటంచు" అన్న పద్యమును వ్రాసి సంపంగి జీవిత సార్థక్యమును చాటినాడు. (వసు. 2-46).

వసంతర్తువులో దోహదక్రియల వర్ణించుట పరిపాటి. రాయలవారు దీనిని చాల సొంపుగ వర్ణించినారు. ఇతర కవుల కంటె భిన్నమార్గముల నవలంబించినారు.

"తరుణులు దోహదాన మధు ధార, నన ల్వకుళాళి నింపగా
దరుణుల మేము గామెయని తద్గతతావన దేవతల్సురన్
ధర వకుళాఘుమెల్లను ననల్గన గ్రాయగనించు బుగ్గలై
దొరసె మధుప్రపూర్ణత మధూకములం బృథుపాండు పుష్పముల్" —ఆము. 5-825

ముఖసీధువు చేత తరుణులు పొగడలను పుష్పింప జేసిరి. వనదేవతలు పోటీగా అన్ని పొగడలను ఒక్కసారిగ పుష్పింపజేయ నమకట్టి, ఉమ్మివేయుటకై తెల్లని మద్యమును పుక్కిట్ల బట్టిరా అన్నట్లుగ, వారి బుగ్గలవలె ఇప్పపువ్వులు తెల్లగా పూసినవని పైన వర్ణితము.

ఇతర కవుల వర్ణనలకంటె ఈ వర్ణనలో నూత్నత్వ మున్నది. వనదేవతలే పోటీ చేయుచో ఇక కానిదేమి? సర్వత్ర, ఒక్కుమ్మడిగా పూయుటకు అడ్డేమి?

ఒకేక్షణములో రెండు కార్యములు జరుగగా ఆటు కొండగోగు పూసినట్లును. ఇటు నమేరువు పూసినట్లును వర్ణించినాడు కవి. రెండు కార్యములొకే క్షణమున, ఒకరి ఫలితముగానే జరిగినట్లును వర్ణించినాడు. ఇది గొప్ప చమత్కారము.

"అతులప్రేమరసార్ద్రి యొత్తు ప్రియహాస్యక్రీడ సంకేత వం
చితయై తత్క్షణ జాంగజ జ్వర మిళచ్చిత్తభ్రమం బూని నా
పతినోవృక్షము కానవే యన సపుష్పంబయ్యె గోగంతలో
నతడుం దోచిన నవ్వుడున్ విరిసెం బ్రాంతాంచన్నమేరుద్రువున్" -ఆము. 5-128

వియోగ సంయోగ ఫలసిద్ధిని, ప్రకృతి సహజత్వమును నారోపించుట అమోఘ భావక్రీడకు ఉదాహరణము.

ఈ దోహదవర్ణన సందర్భముననే మరియొక మహత్తరమైన - స్వర్థతోగూడిన శృంగార చేష్టాయుతమైన - దోహదవర్ణన మొకటి గలదు. క్రీడోద్యానమున అళుల ఝుంకారమును, చిలుకల పలుకులును, పికముల గానమును కలిసి సందడించుటను ఉత్ప్రేక్షించినాడుకవి.

మదవతులు వృక్షములకు దోహదక్రియలు కావించి పుష్పింప జేతురు. దోహద క్రియలు రెండు విధములుగా నున్నవి.

1. అశోకమును తన్నుటచేతను, వకుళమును ఉమియుట చేతను, నమేరును నవ్వుటచేత - (పరిహసించుట) కర్ణికారమును పలుకుట (శ్లేషచే దూషించుట) చేతను పుష్పాల పూయింతురు.

2. గోరంటను కౌగిలించుటచేత-బొట్టుగును చూచుటచేత - మామిడిని తాకుటచేత-చంపకమును ముఖరాగముచేత-వావిలిని ఊర్పు పుచ్చుట చేత-ప్రియాళువును పాటచేత-పుష్పముల పూయింతురు.

మొదటి కార్యములు కొంత అవమానమును సూచించును. రెండవ తెగ కార్యములు సల్లాపమును, ప్రీతిని సూచించును.

అవమానదోహదములు పొందిన అశోకాదులు తమనట్లు చేసిన మదవతులను పట్టి ఇత్తురా లేదా యని మిగిలిన చెట్లను తమతో తుమ్మెదల బారు అను నల్లత్రాళ్ళతో బంధించుకొన్నవి. అప్పటికిని పట్టియిత్తురను నమ్మకము కుదరక ఆ ప్రమదలున్న పట్టణము పైకి కంతుసైన్యమగు శుకపికాదులతో చని ముట్టడించినవా అన్నట్లుగా ఆ ఉద్యానము సందోహ బంధురముగా నున్నదని వర్ణించుచున్నాడు. భావము అమోఘము. వర్ణన అనితర సాధ్యము.

> "ఉమియగ, దన్న, నవ్వ, నన, నొచ్చెము గాంచిన కొన్ని మ్రాకు లా
> ప్రమదల నప్పగింపుడని రంజిలు నేతలు గన్న చెట్లకున్
> దమ కళిశృంఖలన్ బెనిచి, నమ్మక, ముట్టెఁ బురంబుఁ గంతుసై
> న్యముఁ గొని వా వెలిన్ శుకపికాదులఁ గేళివనాళి పొల్పగున్" -ఆము. 2-37

ఈ భావమును భట్టుమూర్తి గైకొని వసుచరిత్రలో సుందరముగా వర్ణించినాడు. రాయలవర్ణనలు దర్పాహంకారములు స్ఫురింపగా భట్టుమూర్తి వర్ణనలో వినయపూర్ణ దుఃఖము కనబడుచున్నది. (వసు. 1-155)

దోహదక్రియా వర్ణనలో నే కవి గూడ చేయని భావాత్మక వర్ణనలు రాయలు చేసినాడు.

మరునకు ప్రాముఖ్యము గలది వసంతము. ఇందు మరుని వర్ణన అతి ప్రాకృతికముగ నున్నది, మనోరంజకముగ నున్నది.

ఇచట భృంగములు, మలయమారుతము, కమలములు, ఆమ్ర కిసలయము, పరాగము, సీధువు పలాశము, కీరము—ఇవన్నియును మన్మథ జన్మకారణములుగాను, ఉద్దీపన కారణములుగాను ఉత్ప్రేక్షింపబడినవి. (ఆము. 5-141).

ప్రకృతిని మనోజ్ఞముగ వర్ణించి అందులో స్త్రీ పురుష సంగమును చిత్రించు నలవాటు మన కవుల కందఱకును ఉన్నది. ఆ వర్ణించుటలో తరతమ భేదము లున్నవి. అంతే! అసామాన్యకవుల కంటె గూడ అసామాన్యుడు రాయలవారు.

"సహకార ఫలరస సౌరభ్యములఁగూడి
మాధ్వీమోవులఁ గదంబముగ వలవ
మలయ జోదరత జంభల ఫలత్వగ్గత
శ్రీమించు చెవుల గొజ్జెఁగలు మెఱయ
శశికదళోదరచ్ఛదపుఁ బావడలూరు
చకచకఁబట్టి పాలిఁ బెనఁగ
ద్రాక్షు తేంట్లకుఁ గాక లెక్కిఁపఁ జెవిన
గంధఫలీపంక్తిఁగబరు లలరఁ

గేలఁ గలవంటకపు తావికినిఁ బులిమిన
ఘుసృణములు మించ నల బేరసగెడు వన
ములు నమేరు రజోవృష్టిఁ బూడిఁ జఱవ
నిఁతు లెనసిరి పూబోదరిండ్లఁ బతుల" - ము. 5-143

అంత ఆనందదాయక ప్రకృతిలో నంత ఆనందదాయక క్రీడ! భావపూర్ణమైన వర్ణన!

ఏయే వర్ణన చేయునపుడు ఏయే విధుల పాటింపవలెనో ఆ విధుల నన్నిటిని పాటించినాడు రాయలు. అసలీ కావ్యము కేవలము వర్ణన కొఱకే వ్రాసినది గదా! ప్రతి ఋతువును శాస్త్రోక్తముగ వర్ణించినాడు కవిరాజు.

కుమారసంభవ, మనుచరిత్ర, పారిజాతాపహరణములందువలె నిట జలక్రీడ లేదు.

## వనవర్ణన - కళాపూర్ణోదయము

కళాపూర్ణోదయమందు వనవర్ణన కలభాషిణి యౌవనోదయవేళ, ఆమె విహరించినపుడు మొదలగుచున్నది. కలభాషిణి యొక్క ఉపవన విహార సమయమునను, మధురలాలస యొక్క ఉద్యాన విహార జలక్రీడల సమయమునను రెండుచోట్ల వనవర్ణన కనిపించుచున్నది. మొదటిది ఆరు పద్యాలలోను (ప్రథమాశ్వాసమున) రెండవది ఒక పెద్ద వచనములోను వర్ణింపబడినవి (ఆరవ ఆశ్వాసమున), కలభాషిణి తన చెలికత్తెలతో పురోపవనముల కేగినప్పటి ప్రకృతి.

"క్రొన్నన ల్వలరాచ మన్ననల్ గనఁ గర
మల్లికల్గొని యున్న మల్లికలును
సంతానముల కళిసంతానముల యాట
పాటలములు చూపు పాటలములు
తీవి చేకొన్న పూఁ దావిచేఁ బథికాంత
రంగముల్ నొంచు నారంగములును
మారు మేలైన బంగారు మేడలఁ బోల్ప
భంగిమై మించు సంపఁగి గములు
మంజులములై కనంబడు మంజులములు
గుందములఁను వాసంతికా బృందములనుఁ
గేసరములును నవనాగ కేసరములఁ
గాంతలార! కంటిరె! కడు వింతలనుచు"

-కళా, 1-35,

పై పద్యమున గల వర్ణనయును, తర్వాతి పద్యములును గూడ శృంగారభావ పూర్ణములు.

కలభాషిణి వన విహారములో నొక ప్రత్యేకత యున్నది. వనములో నూయెల లూగుటను అష్టప్రబంధకవులలో నితడు తప్ప మరి యెవ్వరును వర్ణింపలేదు. ఇదిగూడ ప్రయోజనమును కాంక్షించియే చేసినట్లు కనబడుచున్నది. ద్వారకాపురమందలి కన్యలు నాకకన్యలతో కయ్యమునకు కాల్దాచునట్లున్నది ఆ ఉయ్యాలలూగుట. ఆ దృశ్యమును మణికంధరుడు నారదునికి చూపి-

"తమిఁ పూఁదీగల తూగుటుయ్యెలలఁ బంతా లాడుచుందూగు నా
కౌమరుంబ్రాయపు గబ్బిగుబ్బెతలయంఘ్రుల్ చక్కఁగాఁ జాఁగి మిం
టి మొగంబై చనుదెంచు తీవి కనుఁగొంటే దివ్యమౌనీంద్ర నా
క మృగీనేత్రలమీద కయ్యమునకున్ కాల్దాచులాగొప్పెడిన్".

-కళా. 1-44

అన్నాడు. ఈమాట తరువాత జరుగబోవు రంభా కలభాషిణుల పోటీకి బీజారోప ముగానున్నది.

మూడవ యాశ్వాసమున రంభాదులు మణికంధరుని తపస్సును భగ్నము చేయుటకై తపోవనమునకు ప్రవేశించినప్పటి వర్ణన అమోఘమైనది. స్త్రీ అంగములను పుష్పాలతో పోల్చు పద్ధతి సామాన్యమైనదే. కొన్నిచోట్ల అభేదమును చెప్పుటగూడ గలదు. కాని సూరన అట్టి అభేదమును "పాలును నీరును కలిసినట్టుగా నున్నట్టు" చెప్పుట చాల సొగసైనది.

> "అళులు కచంబులున్ లతలునంగములున్ పువుగుత్తులున్ గుచం
> బులును జిగుళ్ళు బాణులును, పుష్పవిలాసము మందహాసమున్
> గలసి తడంబడన్ విబుధ కామినులా వనలక్ష్మలందు శో
> భలు మిగులం బ్రవర్తిలిరి పాలును నీరును బోలె నేకమై" —కళా. 3-10.

ఆరవ ఆశ్వాసమున మధురలాలస శృంగార వనమున చెలికత్తెలతో సంచరించు సమయమునను గూడ రసవత్తరమైన శైలితోడి వచనము సాగినది. వసంత సమయమున నేవేవి వర్ణింపబడవలెనో అవి యన్నియును వర్ణితములు.

"అప్పుడయ్యుపవనంబునకుం ...... చివురుటెలమావి తండంబును......పొన్నలును......వాసంతికా కుడుంగములను.........పోకమ్రాకులును.........వివిధజన కోలాహలంబుల కరణిం పరిఢవిల్లు శుక పికశారికా నికరంబులు గలిగి......అందు నిందువదనలు......క్రొవ్విరులు మించి కోయుచు కమ్మగొజ్జగులకుం జేరుచు, కన్నెగేదంగులకు బోరుచు, బొన్నలకు మూగుచు బొండుమల్లెలకు నేగుచు సంపెంగలకు డాయుచు జాతికుడంగంబుల రోయుచు మల్లెలకు నిగుడుచు మరువంబునకు మగుడుచు... దిలకంబులకు...దిరిసెనపువ్వులకు...నవమాలికల......నారంగంబుల......కలిగొట్లు... కంకేళి...క్రొమ్మావి గురివింద పందిరుల విశ్రమించుచు...అపూర్వ విభ్రమంబున సొంపు మీఱుచు తదనంతరంబ" —కళా. 6-224-

పుష్పాపచయ సందర్భమున పెద్దనయును, తిమ్మనయును, భట్టుమూర్తియును రగడలు ప్రయోగించినారు. సూరన కళాపుర్ణోదయమున పెద్ద వచనమును ప్రయోగించినాడు.(కళా. 6-224).రగడలోని శైలి యువతుల కేళీవిలాసముల తెలుపునట్లే, వచనములోని శైలిగూడ తెలుపు చున్నది.

జలకేళి యందు యౌవతల యాటల కనుగుణమైన ఛందస్సును (లయగ్రాహి) ప్రయోగించినాడు. అది 6-226 మొదలు 233 వఱకు సాగినది.

దోహద క్రియలను వర్ణింపలేదు సూరన.

సూరన ఈ ఘట్టమున (వనవర్ణన ఘట్టమున) పూర్వకవులయిన నన్నెచోడ, పెద్దన, శ్రీకృష్ణరాయ, తిమ్మనాది కవులవలెను సమకాలీనుడయిన భట్టుమూర్తి వలెను విపులముగను వైవిధ్యముగను వర్ణింపలే దవచ్చును.

## వనవర్ణన-ప్రభావతీప్రద్యుమ్నము

కళాపూర్ణోదయమునకును, ప్రభావతీ ప్రద్యుమ్నమునకును రంగభూమి ద్వారకా నగరమే! మాఘుని శిశుపాలవధ నారదాగమనముతో ప్రారంభమగును. వెంటనే ద్వారకావర్ణన జరుగును.

ఇక్కడ కళాపూర్ణోదయప్రభావతీప్రద్యుమ్నము లందు గూడ సూరన మొదట ద్వారకను, తరువాత నారదాగమమును వర్ణించినాడు.

ఇందు శుచిముఖి ప్రద్యుమ్నుని కొఱకు వెళ్ళిన యనంతరము ప్రభావతి వనవిహారము సలిపినది.

నన్నెచోడుని కావ్యమందు వలె నిక్కడ వనవిహారము విపులముగలేదు. రెండు సీస పద్యము లున్నవి. ప్రభావతి అంగకములకు పోల్పదగు ప్రకృతి వస్తువులు ఆమె యొక్క అంగకముల ప్రదర్శన వలన వానికాంతి యినుమడించినట్లు వర్ణించుచున్నాడు కవి.

"అతివ మందస్మిత ద్యుతి ప్రసాదంబున
విరులపొండిమ యభివృద్ధిగాంచె
సతికటాక్ష శ్రీల సాహాయ్యకమునఁ దు
మ్మెదపిండు చెలువ మభ్యుదయ మొందె
జలజాక్షి కరతలచ్ఛవి యనుగ్రహమున
జివురు గెంజాయ పుష్టిని వహించె
దరుణి నిశ్వాసగంధము ప్రోదిమలయ వా
యువుల నెత్తావి వైభవము చెందె
నవి లతాంగికిఁ దోడ్తోన యార్తి బెనిచె
బాటిలదె రజోమాలిన్య పల్లవత్వ
చాపలంబులు కాధారమై పరగెడు
వాఁకిని మేలొనర్చిన వారి కెగ్గు"

– ప్రభా. 3-34

భంగ్యంతరముగా విరులును, తుమ్మెదలును, చిగురుటాకులును, దక్షిణ వాయువులును వర్ణితములు. వానియొక్క ఉద్దీపకశక్తియు వర్ణితము.

తర్వాతి పద్యమున (ప్రభా. 3-35) ఆ ప్రకృతి వస్తువులే ఆమె విరహమును పెంచినట్లు వర్ణించుట జరిగినది.

ప్రభావతీప్రద్యుమ్నమందు వన విహారము తక్కువగ వర్ణింపబడినది. కళాపూర్ణోదయమున నింతకంటె నెక్కువగనే వర్ణితము. అక్కడివలెనే యిక్కడగూడ దోహద క్రియలు వర్ణింపబడలేదు.

## వనవర్ణన-వసుచరిత్ర

వసుచరిత్రలో వవవర్ణన దాదాపు నలువదియైదు పద్యములలో సాగినది. ఇది స్థూల సంఖ్య.

పూర్వకవులు వర్ణించిన వర్ణనలను - అనగా - వసంతాదులను, తన వ్యక్తిత్వముట్టిపడునట్లుగా, సరిక్రొత్తగా, భిన్నముగా, వర్ణించి ధన్యత్వము నొందవలెనను నాశ, పట్టుదల కృషిగలవాడు రామరాజభూషణుడు. ఇతనికి కథయును, వర్ణనానైపుణ్యమును రెండును ప్రధానమే! వర్ణనానైపుణ్యమును, వైవిధ్యమును, ప్రదర్శించుటకు వీలయిన పట్టులు ప్రకృతి వర్ణనలే గదా!

వసంతాగమమును రమ్యముగ ప్రవేశపెట్టుచున్నాడు కవి. రాజు తన పాలనచే ఆ భూమిని అలంకరించుచుండగా చైత్రలక్ష్మి సైరంధ్రివలె పత్రలతా సౌగంధ్యమును, నవకళికా సౌగంధ్యమును సమకూర్చి భూదేవిని అలరింప సాగినదట.

> **"అగతి నభిమత భోగ**
> **శ్రీ గల భువి కొసగె నుల్లసిత పత్రలతా**
> **సౌగంధ్యము నవకళికా**
> **సౌగంధ్యము చైత్రలక్ష్మి సైరంధ్రి క్రియన్"** -వసు. 1-125

ప్రకృతియే భూమిని సేవించుచున్నదన్నపుడు, ఇట ప్రకృతి మానవీకరణ పొందినదని యనవలెను. జడములను సప్రాణవస్తువులుగా చేసి ఆడించుట భట్టుమూర్తి యొక్క హస్తకౌశల మన్నమాట!

ఈ వసుచరిత్ర శృంగారరస ప్రధానకావ్యము. వర్ణనా ప్రధానమైనది గూడ. అందులకే వసంత వర్ణనతో మొదలగుచున్నది. గ్రంథమంతయు నిత్యవసంతముగా సాగునను సూచన తోచుచున్నది.

"లలనాజనాపాంగ వలనావసదనంగ
తులనాభికాభంగ దోఃప్రసంగ
మలనానిలవిలోల దళసాసవరసాల
ఫలసాదరశుకా లసనవిశాల
మలినీగరుదనీక మలినీకృత ధునీక
మలినీసుఖిత కోకకుల వధూక
మతికాంత సలతాంత లతికాంతర నితాంత
రతికాంత రణతాంత సుతను కాంత

మకృత కామోద కురవకా వికల వకుల
ముకుల సకల వనాంతప్రమోద చలిత
కలిత కలకంఠ కులకంఠ కాకలీ వి
భాసురము వొల్చు మధుమాస వాసరంబు" -వసు. 1-126.

మధుమాసము ఎంత సొంపైనదో, ఈ పద్యమును అంత సొంపైనది. వసంతము శృంగారము నెంత సంతరించుకొనునో ఈ పద్యరచన గూడ అంత అందమును సంతరించుకొన్నది. వసంత మెన్నివిధములయిన సుఖముల కాకరమో ఈ పద్యము యొక్కలయ అంత సుఖప్రదమయినది. ఈ క్రింది పద్యము శృంగారమును చిప్పిల జేయుచున్నది.

"ఒనర హిమావకుంఠనము లూడ్చి తెమల్చిన పత్రభంగముల్
సన నసియాడుచున్ మొగడ చన్నులు పల్లవపాణిఁ గప్పు నూ
తన లతికాలతాంగుల నుదారగతిం జలివాపి నెయ్యపుం
బెనకువ నేర్పె దక్షిణ సమీరణు డొయ్యనఁ దావులంటుచున్" -వసు. 1-127

ఇట లతలు నవోఢలు గాను దక్షిణవాయువును దక్షిణనాయకుడుగాను రూపింపబడినవి. వసంతము రాగానే మంచు తగ్గిపోవును. నవోఢలకు రత్యనుభవ ముండదు. నాయకుడు సమీపింపగనే కంపింతురు. స్తనములను చేతులతో కప్పికొనెదరు. నాయకుడు వారిని ప్రసన్నలను చేసికొని రమింప వలసియున్నది.

వసంతమున మంచు తెరలు పరాస్తము కాగా, మలయమారుతము సోకుడు వలన తీగలు వడంకుచు మొగడ చన్నులను కప్పుకొనుచుండగా, ఆ మలయ సమీరుడు తావులు తాకుచు పెనకువలు నేర్పుచుండెను, అనగా మలయమారుతము వ్యాపించి

క్రొత్త తీవలయందు చిగురుటాకులను, మొగ్గలను ఉత్పాదించి, తీగలు అంతటను ప్రాకునట్లు చేసెనని భావము.

శృంగార రసపుష్టికిని వర్ణనా నైపుణ్యమునకును కావించిన వర్ణనవలె నున్నదిది.

దక్షిణ నాయకుడు అనుభవముగలవాడు. నవోఢకు అనుభవము ఉండదు. అప్పుడి దక్షిణ నాయకుడు జాగ్రత్త వహించి, ఇష్టవస్తువుల నొసగి ఇచ్చకములాడి, జాగ్రత్తగ తావుల నంటుచు రతి కెలయించును. దక్షిణానిలము చాలకాలమునాటిది. చిగుళ్లతో నున్న తీవలు క్రొత్తవి. ఇట గొప్ప రూపకాలంకారము ప్రతిపాదితము. ప్రకృతి మానవీకరణ కిది ఉదాహరణము. వసురాజు దక్షిణ నాయకుడుగను గిరిక నవోఢగను సూచింపబడినారు.

శిశుపాలవధలో మాఘుడు గూడ వసంతమును రసవంతముగ ప్రవేశపెట్టినాడు. మందమారుత మెంత సుందరముగ, చల్లగ, ప్రవేశించినదో మనోహరముగ వర్ణించినాడు. లతాంగులయొక్క ముంగురులను సవరించుచు, ముఖములందలి, శ్రమబిందువులను హరించుచు, సరస్సులందు చిన్న చిన్న అలలను రేపుచు, పద్మముల నల్లనల్లన కదలించుచు మందమారుతము వీచినట్లు వర్ణించినాడు (శిశు. 6-3).

రామాయణమున గూడ మందమారుతములోనే వసంతము ప్రవేశించినట్లు వాల్మీకి వర్ణించి యున్నాడు. (కిష్కింధా. 1-17)

రామరాజభూషణుడు గూడ దక్షిణ సమీరమును మొదటనే వర్ణించి యున్నాడు. కాని పై కవులకంటె సుందరముగ సంపూర్ణముగ సార్థకముగ వర్ణించినాడు. ప్రకృతిలోని వృక్షములు మానవులవలె వసంతము పోసికొనుచు ఆనందించుచున్నట్లు కవి రసపూర్ణముగా వర్ణించుచున్నాడు.

"మును సుమనోరాగమున వసంతము సూపె
  కాననేందిర యశోకంపు కొమ్మ
కాకొమ్మ నగుచు నెయ్యమునఁ గ్రొన్నన తేనె
  మెలగెడు సరసాళిమీదఁ జల్లె
నా సరసాళి సొయగవుఁ బాటల తోట
  జని మాధవి ప్రవాళ శాటిఁ దుడిచె
నా మాధవి పరాగ మక్షిరాగము మించ
  ఖలతెంచు కలకంఠి పై విదిర్చె

నిట్లు లతికలు హితకోటి నెనసి యపుడు
మదన దేహోత్సవ క్రీడఁ బొదలు ననిన
వరులుఁ దరుణులు విరుల యొవరులు వరలు
సిరుల వలరాచ జాతర ల్సేయుటరుదె"

— వసు. 1-128

ఇందిర, అశోక, సరస,మాధవి,కలకంఠి మొదలయిన నామములు స్త్రీ నామములు గూడ అగుచున్నవి. వీరు వసంతము పోసికొనుట, ఆనందించుట, సూచింపబడినది. శ్లేషార్థము.

అశోక పుష్పములు వసంత వర్ణము కలిగి యుండును. వనలక్ష్మి అశోకాదుల పుష్పింప జేసినది. ఆ పుష్పమకరందమును భృంగము లాస్వాదించి గానము చేసినవి. బండిగురివిందెలు పుప్పొడితో నలరినవి. కోకిలలు సంచరించినవి. ఇదంతయు వనవృక్షములు చేయు వసంత క్రీడవలెనున్నది. ఈ జడప్రకృతియే ఇంత శృంగార చేష్టల గలిగి యుండగా స్త్రీపురుషులు కలిసి యీ వసంతమున వసంతోత్సవములు శృంగారముగా జరుపుకొందు రనుటలో వింత యేమున్నది? ప్రకృతి మానవీకరణ కీపద్యము ప్రబలోదాహరణము. చమత్కారార్థముతో నిది సాధింపబడినది.

మన్మథరథమును వర్ణించు సమయమున గూడ నిట్టి విధముననే మానవీకరణ పొందించినాడు కవి.

> "చిగురుం గైదువు వేల్పు చైత్రమున నతీణధ్వజోత్తేప వై
> భవుడై తెమ్మెర తేరిపై గదలిరాఁ బ్రత్యగ్ర సాలాగ్ర హ
> ర్మ్య విటంకంబులు ప్రాకి వల్లిసనజాస్యల్ సల్లిరుత్ఫుల్ల ప
> ల్లవ హస్తంబుల భావి భావుక ఫలోల్లాసంబుతోఁ గ్రొవ్విరుల్" —వసు. 1-131

చైత్రమాసమున మన్మథుడు ఎత్తయిన ధ్వజారోపణము గలవాడై తెమ్మెరలు అను తేరిపై కదలి వచ్చుచున్నాడు. అప్పుడు తీగలనెడు స్త్రీలు, వృక్షాగ్రములనెడి సౌధాగ్రములందెక్కి చిగురుటాకులనెడి హస్తములతో భావిఫలోల్లాసముతో క్రొవ్విరులు చల్లిరి. దేవుని రథోత్సవ సమయమందు పురస్త్రీలు పూలుచల్లుట సామాన్యమేగదా! లతలను లతాంగులుగా రూపించి సామాన్య ప్రకృతి సహజకార్యములను సకారణముగా సమర్థించుచున్నాడు కవి. ఇట సుందరముగా మానవీకరణ జరిగినది.

ఈ వర్ణన వలన కవి సాధించినదేమి? ప్రకృతి వర్ణనకావించుట యొకటి. ప్రకృతిని మానవీకరణ పొందించుట రెండవది. ఋతువర్ణన చేయుట మూడవది. భావిఫలమును సూచించుట మరియొకటి. తర్వాత వసురాజున కీవసంతలతాంగులే స్వాగతము పలికి, పూలు చల్లి దోహదక్రియలు నడిపి యానందించుట చూడనగును. గిరిక వసురాజును ప్రేమించి యలరించి యానందించునని గూడ ఈ ప్రకృతి వర్ణనలోని సూచ్యార్థము. ఇది అమోఘమైన ప్రకృతి వర్ణన. ప్రతిపద మానవీకరణ.

గంధవహుని ధౌర్త్యములు నగభేది కెరిగించు ఘట్టమున :-

"ఏ పారు పొదరిండ్ల నాపాట లాశోక
దీపార్చిఁ గనకకలాప మరసె
సాలావలులు దాటి యేలాలతా వార
బాలాతతి పరాగ పటములూడ్చె
నానామధుప నవ్యగానామృతము మెచ్చి
సూనాసవము లెల్లఁ జూఱలిచ్చె
ఝంకారహిత ధీర హుంకార శుకఘటా
హుంకారముల ఫలహతి యొనర్చె
ననుచు నాగంధవహుని ధౌర్త్యములు దెలుపు
లీల విరిసిన విరులు రాలిన రజంబు
లొలికిన రసంబు లురలిన ఫలము లధిపు
మ్రోల నిడి వల్కె రుద్యాన పాలు రపుడు" —వసు 1.133

ప్రకృతి సహజక్రీడకు కారణము కల్పించి మానవీకరణ పొందించి ఇంత గానయుక్తముగ వ్రాయుట సామాన్య కవులకు సాధ్యము గాదు. పదముల నెన్నికొని యేర్చి కూర్చి బిగించుట అనన్య సామాన్యము.

వనపాలు రుద్యానవనమును నానావిధముల వర్ణించిన యనంతరము వసురాజునకు దానిని చూడ వేడుక గలిగెను. అతడు వనములో ప్రవేశించినపుడు వనమునందలి వృక్షముల సంబరమును చూడవలయును.

"కలక తార్కటి నొండొరుం బిలుచుచున్ గాఢచ్ఛదాచ్ఛాటికల్
నొయ్యంగానవగంధ బంధుర రజంబు ల్వ్రీఁదగా జాలకం
బులు గాసి బడగా నికుంజనిలయంబుల్ మీటి వాయుత్వరం
దల సూపెం బ్రతతీ సతీ వితతి గోత్రాకాంతుఁ డేతేరగన్" —వసు. 1-155

రాజు నగరము ప్రవేశించునపుడు పురకాంతలు మేడలెక్కి సందర్శించుట పరిపాటి. ఈ వసురాజు వనప్రవేశము చేయునపుడు వనసుందరులగు చిగురుబోడులు, కోకిలకంఠమిషచే నొకరి నొకరు పిలుచుకొనుచు, చిగురాకు ముసుగు తొలగిపోగా, గంధరజము రాపిడిచే రాలిపోవుచుండగా, జాలకములు (కిటికీలు, మొగ్గలు) ఒరయు నటుల వాయువేగమున సందర్శింప వచ్చిరన్న వర్ణన యిది. అమోఘమైన మానవీకరణ.

ప్రకృతిని మానవీకరణ చేయుటేగాదు. మానవుల వలెనే సంచరించునట్లు భాసింపజేయు నేర్పరి భట్టుమూర్తి. ఇక్కడ ఈ లతాంగులు నగర ప్రాసాద సంచారిణులగు స్త్రీల వలెనే, కలకలలాడుచు, పరస్పరము హెచ్చరించుకొని సంభ్రమించుచు పైటలు జారగా, మైపూతలు రాలగా వాయువేగముతోవచ్చి, కిటికీలగుండ తొంగి చూచు సందడివలె నిది వర్ణితము.

ప్రకృతి మానవులవలె ప్రవర్తించుట ఆదికవి వాల్మీకియందే కనిపించుచున్నది. సీతను రావణుడు ఎత్తుకొనిపోవు సమయమున సీత యేడ్చుచు ప్రకృతితో మొఱవెట్టుకొన్నది. అపుడు ప్రకృతి మానవులవలె సానుభూతి ప్రదర్శించినది.

"ఉత్పన్న వాతాభిహతా నానాద్విజ గణాయుతాః
మాభైరితి విధూతాగ్రా వ్యాజహ్రు రివ పాదపాః" —అరణ్య. 52-36

"నళిన్యోధ్వస్త కమలాస్త్రస్త మీన జలేచరాః
సఖీమివ గతోచ్ఛ్వాసా మన్వశోచ న్తిమైథిలీం" —అరణ్య. 52-37

"జలప్రపాతాస్రముఖాః శృంగైరుచ్ఛ్రిత బాహుభిః
సీతాయాం హ్రియమాణాయాం విక్రోశన్తీవ పర్వతాః" —అరణ్య. 52-39

భట్టుమూర్తి గూడ పై విధముగ మహాకవుల ననుసరించియే ప్రకృతి మానవీకరణ పొందించినాడు. కాని వారికంటె ఆలంకారికముగ, సుందరముగ, సరసముగ, సతార్కికముగ చేసినాడు. మహామనోజ్ఞముగ దోహద క్రియను ప్రదర్శించుచున్నాడీ క్రింద భట్టుమూర్తి—

"చలిత లతాంతకాంతి యను చందురు కావి చెఱంగు దాటి స
మ్మిళిత వయోవిలాసముల మీటిన విచ్చు ఫలస్తనాగ్రము
ల్వెలువడఁ గప్పెఁ దక్షిణ మవేల్లిత దోహద ధూపధూమ కుం
తలములు విప్పి దాడిమలతా లలితాంగి నృపాలు చెంగటన్" —వసు. 1-157

పైన మానవీకరణమందలి దోహదక్రియ వర్ణితము. ధూపము వేయుటచే దాడిమ బాగుగ ఫలించును. ధూపము దోహదక్రియ.

"తరుగుల్మలతాదీనాం అకాలే కుశలైః కృతం
పుష్పాద్యుత్పాదకం ద్రవ్యం దోహదం స్యాత్తుతత్క్రియా"

"అశోకశ్చరణా హత్యా వకుళో ముఖసీధునా
ఆలింగనా త్కురవక, సిన్దువారో ముఖానిలాత్
కరస్పర్శేన మాకందః ముఖరాగేణ చంపకః
గీత్యాప్రియాళు ర్నితరాం నమేరుర్హసితేనచ
సల్లాపతః కర్ణికారః తిలకో వీక్షణేనచ"

దోహద క్రియ అన్నవి ప్రబంధాలలో ఒక ప్రత్యేక ప్రక్రియ. చాల వింత అయినది. ప్రకృతిలోని తరుగుల్మాదులకును, సుందరస్త్రీల మాటలు, ఉమ్మివేయుటలు, కాలితన్నులకును ఏమి సంబంధమో మరి; జడప్రకృతి గూడ (సజీవమైనది గాన) సుందర స్త్రీల జూచినపుడు చైతన్యవంతమై శృంగార భావావిష్టమగును గాబోలు!

అందఱు వర్ణించిన దారివేరు, భట్టుమూర్తి వర్ణించు దారివేరు. దోహదక్రియలను ఎంతో సుందరముగ, ఎంతో ప్రజ్ఞావిన్యాసముగ చెప్పుచున్నాడు! ఇక్కడ వసురాజు కల్పవృక్షమగు చున్నాడు. వనలక్ష్మి దోహద క్రియలు జరుపుచున్నది.

"చిగురు కెంగేలు సాచె రసాల వల్లరి
తేటి చూపుల చూచె తిలకలతిక
పికగీతి బాడి చూపె బ్రియాళులత పల్కెఁ
గీరభాషలఁ గర్ణికార శాఖ
ముఖరక్తి నింపె నింపుగల సంపగి కొమ్మ
వన్నెగా నగియె లేబొన్న తీగ
సురభిళ శ్వసనంబు నెరపె సింధుకవల్లి
గ్రుచ్చెతావులు సోక గ్రోవిరెమ్మ
యాత్మరుచి రోపచారంబు లధిప కల్ప
కంబునకు దత్తదామోద గరిమ బెనుప
నాంగనానిత్య కలిత దోహదవిశేష
సన్నుతాచారముల నడిసన్న కరణి'' —వసు. 1-158

దోహదక్రియలలోనే ప్రకృతి మానవీకరణ పొందినట్లు ఉత్ప్రేక్షించినాడు రామరాజభూషణుడు. పై పద్యమున కరస్పర్శ, వీక్షణ గాన సల్లాప ముఖరాగాది దోహదక్రియలు వసురాజరూపకల్పకమునకు వనవృక్షములు చేసినవి. ఇదివఱకు కన్యామణులు చేయు దోహదక్రియలు తమకు తెలియును గాన ఇప్పుడు వృక్షములు రాజ కల్పవృక్షమునకు చేసినవి. ప్రకృతి మానవీకరణ కిది ప్రబలోదాహరణము గదా!

ప్రకృతి జడమైనను నాటకములలోని పాత్రలవలె నీ కావ్యమున సంచరించు చున్నది. పురస్త్రీలు ఉద్యానమున ప్రవేశించి దోహదక్రియలు సలిపిరి. వారు నగి, పల్కి, పాడి, కని, ఆశ్వాసము నొందించి. చేకొని, మోమిచ్చి, కవుంగిలించి, కొన్ని తరువులనే మన్నించి నారట! పాపము కంకేళిని, కేసరమును, మాత్రము తన్ని ఉమ్మి వేసిరట! అది యవమానముగదా! అందులకు గుచ్ఛవినతిచేతను, పూదేనె కన్నీటిచేతను (మిషచేత), భూజానికి మ్రొక్కినవట! తన్నినచోనే అశోకము పూయును, ఉమ్మినచోనే పొగడ పూయును. పైరసాలాది వృక్షములు నగుటచేత పల్కుటచేత,పూయును, ప్రకృతి సహజ కార్యములకు ప్రకృతియే మానవతా భావముచేత పురస్కార తిరస్కారముల భావించి నట్లు చెప్పు నేర్పు ఒక్క రామరాజభూషణునికే చెల్లును.

"చనువొప్పన్ నగి పల్కి పాడి, కని యాశ్వాసమ్మునొందించి చే
కొని మోమిచ్చి కవుంగిలించి తరులం గొన్నింటి మన్నించి యం
గన లయ్యో మము నెంత చేసిరనుచుం గంకేళియుంగేసరం
బును భూజానికి మ్రొక్కి గుచ్ఛవినతిం బూదేనె కన్నీటితోన్" —వసు. 1-159

ప్రకృతి యింత (సజీవమైన) మానవీకరణ పొందినదని భావించుటకు వీలుగాని (మానవులే అనుకొనుట) మానవీకరణ జరిగిన దిక్కడ.

రాయలవారి ఆముక్తమాల్యద యందు దోహదక్రియలలోని పద్యమును (ఆము. 2-37) పోలియున్నదీవర్ణన. కాని వానిప్రవర్తనలో భేదమున్నది.

గిరికాదేవి నివసించుచున్న వనము సర్వకళలకు నాలవాలము. అందలి పశు లన్నియు లలిత కళావేత్తలు. గిరిక వారివల్లనే అన్ని విద్యలు నేర్చినది. ప్రకృతి వస్తువులే పాఠాల నేర్పు గురుత్వము ఈ క్రింద వర్ణింప బడుచున్నది.

> "మందయానము నేర్పు నిందిందిరాజీవ
> రాజీవరాజన్మరాళరాజి
> కలికి పలుకులు నేర్పు లలిత నానావాస
> నావాస నికట కానన శుకాళి
> గానలు పాటలు నేర్పుఁ గుముద రసామోద
> సామోద మధుప శుద్ధాంతసమితి
> నటనలీలలు నేర్పుఁ దట రూఢ కల్పాగ
> కల్పాగ చర నీలకంఠ వితతి
> యన్నదీ కన్య కఖిల భాగ్యములు గలుగ
> ముని పురంధ్రీ జనంబు దీవెన లొసంగు
> నతివ సైరంధ్రులై చాదులై వయస్య
> లై విపిన దేవతలు ప్రోతు రనుదినంబు" —వసు. 3-28.

గుజ్జనగూళ్ళును, బొమ్మరిండ్లు కట్టుటయును, పిల్లలకు సహజక్రీడ. మానవుల వలెనే యీ ప్రకృతిబాలిక (గిరిక) గుజ్జెనగూళ్ళు వండి వడ్డించుచున్నది. అందలి వస్తు వులన్నియు తేనె, పూలు మొదలయినవి.

> "గురుసవిధ ప్రదేశమున గోమల కల్పక పుష్పధూళిచే
> ధరసుత బొమ్మరిల్ నిలిపి తన్ మృదు పల్లవ పాత్రపంక్తి గే
> సరములు ఖాద్యముల్ మధురసంబు ఘృతంబు ప్రసూనపుంజమో
> గిరమని పెట్ట నన్నియు సఖీతతి కట్టిఁయాఁ క్రియఁ బుంబునన్" —వసు. 3-30.

ప్రకృతి వస్తువులుగా భాసింపని ప్రకృతి వస్తువుల చేత మానవ చేష్టల నడిపించుట వింతలలో వింత.

మనుచరిత్రలో వరూధిని తనకుగల భోగభాగ్యములను—

"సద్యోవినిర్భిన్న సారంగనాభికా హృత్తమై పిసాళించు మృగమదంబు" అన్న పద్యమూలమున (మను. 2-55) తెలుపు చున్నది. అక్కడ లభ్యమగు ఆ భోగవస్తువు లను అనుభవింపుమన్నది వరూధిని. తానుగూడ అనుభవించుచున్నది.

ఇక్కడ గిరిక అంతకంటె భోగమయజీవితమును జీవించుచున్నది. ఆ విషయ మును ఆమె నోటితో చెప్పదు. చెలికత్తెలు చెప్పుచున్నారు. ఇదొక రాజసము! మను చరిత్ర భావమునకు మెరుగులు పెట్టి పెద్ద హోదాను కూర్చిన వర్ణన యిది.

''అడుగు వెట్టదు నవ్యహరిచందన లతాంత
సరణి**పై** గాని యీ యరుణచరణ
**కేలనంటదు** కోరకిత పారిజాత వ
ల్లిc గాని యీ యతి **లలిత** బాహ
తనువుc జేర్పదు **నవో**దార **మందార** మం
**జులశయ్యcగాని యీ** సురభి**ళాం**గి
పెదవి జేర్పదు కల్ప వృధీవీజ ఫలసంత
**తి**యె **కాని** యీ మోవితీపులాడి
**గురుకుల** క్ర**మాయా**త మీ గిరిజ చ**ల్లc**
దనము **జనకై** కరూధ **మీతటిని పట్టి**
సరసగంభీర **భావం**బు సహజసిద్ధ
**మీ నలిన సోదరీమణి మేనితావి**'' —వసు. 3-58.

పద్యము యొక్క నడక గూడ ఠీవిగానే సాగినది. అన్ని విధములను పెద్దనను మించిపోయినా డిక్కడ భట్టుమూర్తి.

గిరిక యున్నచోటున గల హంసవ్రజమును, చిలుకల చాలును, మత్తాళి సమితి యును, బర్హిణగణమును,ఏమిపుణ్యమును చెసికొన్నవోగాని యామె వెంట దిరుగుటకును, ముద్దు గొనుటకును, మోవితావి గొనుటకును, కంకణ నినాద గర్జనల నలరుటకును. నోచుకొన్నవి. ఆయదృష్టము ఇపుడు నాకులేదాయెనే యని వసురాజు తాపము చెందు చున్నాడు. గిరిక సమీపవర్తియగు ప్రకృతియొక్క మహాభాగ్యమునకు అసూయపడు చున్నాడు (వసు. 3-85)

మహారాజుయొక్క విరహవర్ణన అద్భుతముగ నున్నది. ఇంతవఱకు గల పూర్వ కావ్యములలో అంగముల స్మరించి ఆయా యంగములు తనకుగల భాగ్యము లేకుండ, నాయకుని భార్యకు కల్గించి అనుభవించునట్లు చేసితివేమి యని విధిని తూలనాడుచు నాయికలు ఏడ్చుట జరిగినది. ఇపుడు నాయకుడే అట్లు ఏడ్చునట్లు చేయుచున్నాడు

భట్టుమూర్తి. విజయవిలాసకారుడుగూడ ఈ పద్ధతినే అనుసరించి నాయకుడు విరహతాపమును అనుభవించినట్లు వర్ణించినాడు. (విజయ. 3-9,12)

గిరిక మదనార్తయై బాధపడుచున్నది. వనములో క్రుమ్మరు కొలది ఉద్దీపన యెక్కువై పోయినది తాళలేక పోయినది. చనిపోదలచినది. అందులకు తనను పంచభూతముల కర్పింప దలచుకొన్నది. తనకంటి కెదురుగ నున్న ప్రకృతిలోనే తాను లీనము కాదలచినది. అనగా తన పాంచభౌతిక శరీరమును పంచబంగాళము చేయ సంకల్పించినది. అప్పటి ఆ ప్రకృతి సమక్షమున, ఆత్మహననోద్దీపిత మనస్కయైన గిరికయొక్క మనోభావమును సూచించు శైలిగల ఈ పద్యము మనోహరమైనది. పద్యమంతయు తీగవలె సాగినది. నిరాశను వ్యక్తము చేయునట్లున్నది. దుఃఖరాగము సాగదీసినట్లున్నది. వనమునందలి ప్రకృతి యొక్క ఉద్దీపన ఆమెను ప్రాణత్యాగమునకు పురికొల్పినది.

'పవమాన మానవ ప్లవమాన కైరవ
చ్యవమాన రజము మైనంటఁ దివురుఁ
గరసారసాగ్రతామరసాతి సాంద్ర సీ
ధురసాప్తిఁ గన్నీరుఁ దుడువఁ గోరు
మదనానల ప్రభా సదనామ్రికోమల
చ్ఛదనార్పితైఁజూపుఁ బరపఁ జూచు
సలయా హతలతా కిసల యాగమలయాగ
నిలయానిలున కూర్పు దెలుపఁ దలఁచుఁ
గుంజపుటగుంజ దళిపుంజ శింజితంబు
వెగ్గలంబైనఁ జెవియొగ్గి వినగడఁగుఁ
బంచ శరభూత పరిభూత పంచభూత
ములఁ దదీయ స్థలంబులఁ గలువ కరణి" వసు. 3-117

గిరిక కలువ పుప్పొడిని స్పృశింపవలెనని కోరుచున్నది. దేహము పృథివీతత్త్వము. పుప్పొడియును పృథ్వీభూత జన్యము. అందులకు శరీరమును పృథ్వీతత్త్వముతో గలపవలెనని భావించినది.

తననుండి కన్నీరు వచ్చుచున్నది. దేహములోని జలతత్త్వమునకది ప్రతీకము. చేతియందున్న పద్మమందలి మకరందము చేత కన్నీటిని తుడుచుకొన గోరుచున్నది. అనగా జలతత్త్వమును జలములో కలుపుటన్నమాట.

చూపులు తేజోవికారము. మన్మథాగ్ని ప్రభలకు ఆలయమగు నామ్ర కోమలచ్ఛదము నందు అగ్ని తత్త్వమున్నది. ఆ తత్త్వముతో తనలోని తేజస్తత్త్వమును కలుపజూచుచున్నది గిరిక.

ప్రాణము (ఉచ్ఛ్వాస నిశ్వాసములు) వాయుతత్వము. తన నిట్టూర్పును మలయా నిలయములో కలుప జూచుచున్నది.

'శబ్దగుణ మాకాశం'. ప్రాణిలోని శబ్దగుణమునకు ప్రతీకము శ్రవణేంద్రియము. ప్రాణాంతకమైన తుమ్మెదల ఝుంకారమును వినుటకు చెవియొగ్గుచున్నది. అనగా తెగించిన దన్నమాట!

విరహమునకు ఓర్చుకొనని బాలిక గిరిక ఆత్మహత్యకు కడంగినది. పైనంతయు మరణ మనెడి సంచారీభావము వర్ణితము.

పై వర్ణిత వస్తువులు కామభావము నుద్దీంప జేయునవి. ప్రస్తుతము ప్రాణాంతకము లయినవి.

పైని వర్ణితములైన కైరవరజము, సీధురసము, ఆమ్రకోమలచ్ఛదము, మలయానిలుడు, అళుల శింజితము—వీనికంటె ప్రాణాంతకమయినవి అక్కడనున్న అన్యపుష్ట చయమును, మత్తమధువ్రత వ్రజమును, పల్లవోత్కరమును, పంకజావళులును. అందులకే ఆమె పరిస్థితి జూచి చెలికత్తెలు తత్తరముతో "ఎందుకు వచ్చితివమ్మా యీ ఉద్యానము నకు?" అని బాధపడుచున్నారు.

"ఇచ్చహితాహితంబు గణియింపని గోలవు గానఁ గానకున్
వచ్చితిఁగా కయో పథికవర్గము నొంటి జరింప నిచ్చునే
యిచ్చటి యన్యపుష్టచయ మిచ్చటి మత్తమధువ్రత వ్రజం
బిచ్చటి పల్లవోత్కరము లిచ్చటి పాంసుల పంకజావళుల్" -వసు. 3-122

అప్పటి ప్రకృతి నుద్దేశించి తిట్టినటులున్నది పద్యము. చిక్కులలో తగుల్కొన్న ఆప్తుల అసహాయస్థితి చూచి వారికి ఇష్టులైన మానవులు అసహ్యించుకొని తిట్టునట్టి తిట్లుగానే యున్నవి పైవి.

అన్యపుష్టమనగా కోకిలనియు, ఎవరి సంతానమో యనియు. పథికవర్గ మనగా మార్గస్థులనియు వియోగిని జనమనియు-మత్తమధువ్రజమనగా మదించిన కోకిల లనియు, త్రాగి మత్తెక్కిన వారనియు-పల్లవోత్కరమనగా చిగుళ్లనియు విట సమూహమనియు—పాంసుల పంకజావళులనగా పరాగ భరిత పద్మములనియు, జారుల యొక్కయు పాపసంభవుల యొక్కయు సమూహమనియు—శ్లేషార్థముతో సాధించి నాడు కవి. ఇక్కడ అర్థశక్తి, ఆనందప్రదమగు పదప్రయోగము, అవలీలగ ప్రయోగించు మాటలు, అనితర సాధ్యములు.

ఇట్టి వాతావరణములో ఈ ఉద్యానమందలి ప్రకృతియు వాతావరణానుకూలముగనే- ఉద్దీపన ప్రదమైనదిగనే- యున్నది. గిరిక అంకగముల కేవేవి యుపమానములో ఆ ప్రకృతి వస్తువులు ఇపుడు బాధకము లయినవి

"ఫలభంగములు సేయు చిలుకకు సొంగమై
క్రోధరసంబు ముక్కునను యుండు
గాలభేదికి మహాకాలమూర్తికి దంట
కోయిల కెఱమంట గురియు కంట
మదమరాళికి సదంభస్థితి యుడివోదు
ముఖరాగమున గళంబున వినఁబు
నలరు గొమ్మలతావు లార్చి యాసవపూర్తి
నెడలించు నళికి మేనెల్ల మలిన
మట్టి యిటకేల వచ్చి తీ యధర బింబ
మీ తలిరుగేలు నీ భుజామృదుమృణాళి
కలును నీ పుష్పకోమలాంగములు పూని
గట్టుదొరపట్టి వగుచెల్ల గంటి మబల" —వసు. 3-123.

పైన శుకపికాదుల వర్ణన ప్రకృతి వర్ణనయే కాని యవి తటస్థప్రకృతిగా గాక కథలోని దుష్టపాత్రలవలె భాసించుచున్నవి.

పుష్పాపచయమునకు ముందుగా నెలదోటలో దిరుగుచు గిరిక చెలికత్తెలు వసంత విజృంభణమునుగూర్చి చెప్పునప్పటి సందర్భమున గల ఈ క్రింది పద్యమును తిలకించునది.

"ఆలినీలాలక కంచె చిల్క ఛవదీయాలాప లీలాప్తి నిం
పలరం గోరి విపక్వదాడిమ తరువ్యాలంబి శాఖాఫల
జ్వలనావాఙ్ముఖమై తపంబు నవరింపన్ సాగె నేలబ్బడిన్
దలక్రిందైన ననూన వాగ్గ్రహణ మేధాశక్తి బింబాశికిన్" —వసు. 3-148.

"సద్యో బుద్ధిహరం బింబం" అని లోకోక్తి. దొండపండు తిన్నవారు బుద్ధి హీనులగుదురు. చిలుక బింబాశి. 'చిలుకపలుకులు' అని ఎ.తగా చిలుకయొక్క వాక్శక్తిని గుఱించి మాట్లాడినను, గిరిక పలుకులవలె అది పలుకలేదు. అది తలక్రిందుగా తపస్సు చేసినను ఆ సిద్ధిని పొందలేదు. ఇచట ఉపమానమే తలక్రిందైనది.

ప్రకృతి యొక్క సహజవ్యాపారమును ఇట్టి మానవతారోపణ ద్వారా ఉత్ప్రేక్షించు నేర్పు రామరాజభూషణునికే గలదు.

ఇట్టి వర్ణన హర్ష నైషధమునను, శృంగార నైషధమునను గూడ గలదు,

''విదర్భసుభ్రూ స్తనతుంగ తా ప్త్యయే ఘటా నివాసశ్వ్యదలం తపస్యతః
ఫలాని ధూమస్య ధయా నధోముఖాన్ సదాడిమే దోహద ధూపినిద్రుమే"
-హర్ష నైష. 1-88.

పై శ్లోకమునకు అనువాదము ఈ క్రిందిది—

"దమయంతీ స్తనకుంభ విభ్రమముఁ బొందం గోరుటన్ ధూమపా
నముఁ గావించు చధోముఖంబులగు నానాకుంభములోఁ వ్రేలె ధూ
పములన్ దోహద మాచరింపఁగ గడుం బక్వంబులై యున్న దా
డిమముల్ సూచి నృపాలకుండు మదిఁ బాటించెన్ మహౌత్సుక్యమున్''
-శ్రీం. నై. 1-95.

పొగలు దోహదము చేయుచో దాడిమ త్వరగా పండును. భట్టుమూర్తి పై పద్య ముల చూచియుండును. గాని తన గావించిన రచన ఎంతయో అద్భుతము గదా! పై వారి భావన కంటె భట్టుమూర్తి భావన సుకుమారమును తర్కయుక్తమునునై యున్నది.

పుష్పాపచయము చేయుతఱి రగడ వాడుట మన ప్రబంధకవులకు పరిపాటి. పెద్దన కేవలము రగడ వాడగా తిమ్మన,రామరాజభూషణులు గూడ వృషభగతి రగడను వాడినారు.

రగడయందు రెండేసి పాదములకు ప్రాస యుండును. ప్రతిపాదమందును యతి యుండును. పెద్దన సాధారణముగనే వ్రాసినాడు రగడను.

తిమ్మన యతి దగ్గర వచ్చిన పదమును ద్విరుక్తము చేసినాడు. అంత్యప్రాసను జోడించినాడు. ఉదాహరణకు —

"కొమ్మ వేగిరమేటికే కొన గోర గోరట విరుల గిల్లుము
తమ్మి పువ్వుల మీద జలముల దారతారక యుండ జల్లుము" పారి. 4-16

భట్టుమూర్తి మరియొక మెట్టెక్కినాడు. యతి దగ్గరేగాక ప్రాసాక్షరముల కడ గూడ ద్విరుక్తమగునట్లు ప్రయోగించినాడు. యమకాలంకారపూరితముగ నున్నది రచన.

ఉదాహరణ :-

"బాలబాల రసాల మిది పికపాళి పాలిటి యమరసాలము
గేలి గేలిడి గ్రుచ్చ గడురాగిల్లు గిల్లుము తత్ప్రవాళము" -వసు 3-149

వసుచరిత్రలోని వృషభగతి రగడ పై రెండు ప్రబంధములందలి రగడల కంటె నడకయందును, రుచిరార్థ మందును, చమత్కారార్థము లందును ఉత్తమముగా నున్నది. ఆ యావతము ఎగురుచు, పాడుచు, పుష్పావచయము చేసినట్లున్నది.

తరువాత జలకేళి వర్ణింప బడినది. నీరెగజల్లుట-పద్మము లెగిరినట్టు పాణితలములు కన్పించుట (3-157) చిమ్మనగ్రోవితో నీరుచల్లుట (3-198) వర్ణితములు.

ఈ సందర్భమున నొక మంచి వర్ణన గలదు.

కొందఱు మందగామినులు తమ పాణితలములతో ఒక పద్మాననతలను అదిమి నీటిలో ముంచగా పద్మము లన్నియు పగబూని సమయము వచ్చినదని పూర్ణేందుని ముంచినట్లుగా ఉన్నదన్న వర్ణన అత్యంత రమణీయము.

"కొందఱు మందగామినుల కోమల పాణితలంబు లొక్క యిం
దిందిర నీలవేణి తెలినెమ్మొగమంబుల ముంచు నొప్పునె
న్నందగు దావు బల్మినలినమ్ములు దొమ్ములుగూడి క్రమ్మి పూ
ర్ణేందుని మున్నుగొన్న రుచులిమ్మని నీటికి దార్చు కైవడిన్." -వసు. 3-159

వనవర్ణన-ఉద్యానవనవర్ణన-చాలమంది కవులు చేసినారు. సంస్కృతమున కాదంబరి యందును, శిశుపాలవధ యందును గలదు. నైషధకావ్యమున అది విప్రలంభముతో సాక్షాత్కరించినది. ఇక మన తెనుగు ప్రబంధకారు లందఱును నైషధమార్గమునే తొక్కిరి. ఈ వర్ణనలో అందరికంటె మించినాడు రామరాజభూషణుడు.

మను, వసు చరిత్రల యందలి వనవర్ణనలలోని బాలభాగమునునాయికలచెలికత్తెలు చేయుట ఒక ప్రత్యేకతను సంతరించుకొన్నది. ఇతర కావ్యాలలో సాధారణముగ కవియే చేసియున్నాడు.

వసుచరిత్రలోని వనవర్ణన (వసంతవర్ణన) వలన ఋతువర్ణన చేయుట అను ప్రపంధ లక్షణము నెరవేరినది. వసుచరిత్రకారుని భావనా గరిమకును, రచనాపాటవమునకును అక్షర రమ్యతా ప్రదర్శనమునకును, అర్థశక్తి ప్రయోగదక్షతకును, చమత్కారార్థ సృష్టి కిని, సర్వాలంకార ప్రయోగ దక్షతకును, రసోదంచితమైన కథనా నైపుణ్యమునకును నాటకీయతా ప్రతిపాదనా నిపుణత్వమునకును, సర్వంకష పాండిత్య ప్రదర్శనమునకును, వీరవిహార కేంద్ర మిచటి ప్రకృతి వర్ణన. అందునను వసంతవర్ణన కవితా రంగమునకు మణిపూస వంటిది. అందులకే భట్టుమూర్తి గ్రంథాది యందే వసంతవర్ణనకు పూనుకొని తన కావ్య రసవద్రచనకును, కుతూహల పోషకత్వమునకును సాఫల్యమును సాధించు కొన్నాడు.

ఈ వసంత వర్ణనలో నే ఘట్టము దీసికొన్నను అక్కడ ప్రకృతిమానవీకరణ పొంది మన కనుల ముందు సాక్షాత్కరించును. అంతేగాదు, గానము చేయును. గంతులు వేయును. నృత్యము చేయును. మురిసిపోయి మురిపించును. ఆనందించి ఆనందింప జేయును. ప్రకృతి యింత సజీవముగ, ఇంత సచేతనముగ, ఇంత అందముగ, ఇంత ప్రాణపూర్ణముగ మరియొక కావ్యమందు కన్పట్టదు.

ఈ వనవసంత వర్ణనములందు, భావ్యర్థసూచన లెక్కువగా కనిపించును. ఉదాహరణకు :

వసురాజు వన విహారము బయలుదేరినపుడు--

"... ... ... ... ... ...
వెనకువ నేర్పు దక్షిణసమీరణు డొయ్యన దావులంటుచున్"

అని యున్నది (వసు.1-127). దక్షిణ నాయకుడయిన వసురాజుకు ముగ్ధ యగు గిరికతో సంయోగము సిద్ధించుట ఇందు సూచితము.

వసంత మలయమారుతముల విజృంభణము చెప్పుటయు భావ్యర్థ సూచనయే. రాజచటికి వెళ్ళి శుభములు వడసెను గదా! రాజు వెడలునపుడు వనమందలి సంపంగికొమ్మ, దాడిమవృక్షము, రసాలవల్లరి, తిలకము, ప్రియాళులత మొదలగునవన్నియు దోహద విశేషముల పాటించి సత్కరించుట భావి శుభఫల సూచనయే!

ఇట్టి ఉదాహరణములు లెక్కలేనన్ని యీయవచ్చును. ప్రతి పద్యమును రస ఖండము. ప్రతి పదమును మధుబిందువు. ప్రతి భావమును శంపాలత. గ్రంథమును ముట్టగనే మధుర మంజుల మనోజ్ఞ వాతావరణములోనికి దింపి, కడముట్ట చదివించి. అద్భుతానందములలో ముంచెత్తి పరమ రసాంబుధిలో ముంచి, పారము చేరువరకు నుత్సాహము నే నింపు నేర్పరితనము ఒక్క యీ కవియందే గలదు.

## వనవర్ణన – విజయవిలాసము

విజయవిలాసమున ఉద్యానవనవర్ణన చాలకొలదిగనున్నదనవచ్చును. ఈ కావ్యమున నాయకుడు అర్జునుడొక్కడే. ముగ్గురు నాయికలయిన ఉలూచి, చిత్రాంగద, సుభద్రలలో నేయొక్కరు కూడ వనకేళీ జలకేళులు సలుపలేదు. చిత్రాంగద మాత్రము వనకేళీ జల

కేళులు సలిపినట్లు చెప్పబడినది. విహారమునకు సంబంధించిన వివరములన్నియు ఒక్క పద్యములోనే చెప్పివేయుట జరిగినది.

"మంగళస్నాన సంభ్రమము దెల్పెడి రీతిఁ
గెలనఁ గెందామర కొలనఁ దేలి
ధవళముల్ విని చొక్కు హావణి దెల్పెడి లీల
హాళిఁ గోయిల పల్కు లాలకించి
తలఁబ్రాలు వోయు చిత్తరము దెల్పెడు చాయ
గ్రొన్ననల్ దోయిళ్ళ గొలది నొసగి
బువ్వాన భుజియించు పొలుపు దెల్పెడి జాడ
గుమిగూడికొని మరందములు గ్రోలి

తనకు దోడ్తోడనగు పెండ్లి కనబడంగ
జేయునటువలె గారాబు చెలులఁ గూడి
వనవిహారంబు గావించి చనెడు పాండ్య
రాజసుతఁ జూచి యా పాండురాజ సుతుడు" —విజయ. 1-194

పై వర్ణనలో చిత్రాంగద వనకేళీ జలకేళులు తీరిపి జెరిగి పోవుచుండుట చిత్రింపబడినది. పై కేళులను తన పూర్వకవులయిన మను వసుచరిత్రాది కావ్యకవుల వలె వర్ణింపలేదు. క్లుప్తముగా చెప్పుట జరిగినది. అర్జునుడామెను చూడగనే తనకు వధువుగా నెంచుకొనుట జరిగినది. అందులకామె జలకేళి మంగళ స్నానముగను, కోకిల పాటలాలకించుట పెండ్లిపాటల నాలకించుటగాను, చెలికత్తెలు పరస్పరము పూలు చల్లుకొనుటలు తలఁబ్రాలు చల్లుకొనుటగాను, పూఁదేనెలు త్రాగుటను బువ్వము బంతి కుడుపులు గాను అర్జునుడు భావించుచున్నాడు. పాండ్యరాజసుత, పాండురాజ సుతుడు అన్న శబ్ద ప్రయోగముతో బంధుత్వమును చమత్కారముగ తెలిపినాడు. కవి. ఈ భావన వినూత్నమైనది.

ఉద్యానవర్ణనలో వసంతపు సొంపును, మన్మథ పరివారమును వర్ణించుట పరిపాటి. అదియును నీప్రబంధమున క్లుప్తముగ నున్నది.

"ఒక చిగురాకుఁ గొమ్మఁ బికమొక్క ప్రసూనలతాగ్రసీమఁ దేం
ట్లొక ఫలశాఖ రాచిలుకయున్ రొదసేయగ గాడ్పుపొందు వా
యక వలు వెన్నెలల్ పొలయ నామనిసొంపులు నింప జొంపమౌ
నొక యెలమావిక్రింద మరుడో యనగా నరుడుండె నయ్యెడన్" —విజయ. 1-212,

పై వర్ణనలో వసంతసమయమున గల చిగురాకులు, ప్రసూనములు, లతలు, తేంట్లు, పికములు, చిలుకలు, గాడ్పులు, వెన్నెలలు, ఆమని సొంపులు, ఎలమావులు, వాని క్రింద మరుడు, అన్నియును వర్ణితములు.

పూర్వకవులును, ఇతనికి సమకాలికులయిన కవులును పై పేర్కొన బడినవానిలో నొక్కొక్కదానిపై నొకటిగాని, అంతకు మించిగాని పద్యములను వ్రాసియుండగా విజయ విలాసకారుడీ సర్వమును ఒక్కపద్యములో వర్ణించుట సర్వమును ఒక్కసారిగా సాధించినట్లయినది.

కంతుసైన్యము నాయకుని బాధించినట్లు వర్ణించిన ప్రకృతి వర్ణనా ఘట్టము గూడ అతి క్లుప్తమయినది.

> "విధు చక చకలును బంద్రే
> తు ధనుర్ధరు నంపసెకలు శుకపికశారీ
> మధులిట్టులు మలయానిల
> మధులిట్టులు తనదు ధైర్యమహిమగలంపన్" —విజయ. 1-213.

వర్ణన అందరు కవులు వర్ణించినట్లే యున్నను పద్యపు నడక సొంపు యింపయినది, మన్మధునివలె కన్పట్టినను మన్మధుడును, మన్మధ పరివారమును నరుని బాధించినవి.

## సారాంశము

1. వనమనగా అరణ్యమునకు గూడ నర్థమయినను, మన ప్రబంధాలలో ఉద్యానవన వర్ణనగానే స్వీకరింపబడినది. మనుచరిత్ర యందు మాత్రము వేట వర్ణన గలదు గాన అక్కడ అరణ్య వర్ణన గూడ చేయబడినది.

2. కుమారసంభవ మందలి ప్రథమాశ్వాసమున గల వనవర్ణనలో మత్తేభవిక్రీడితమును మత్తేభవిక్రీడితావృత్తమున నే వర్ణించుట ఒక ప్రత్యేకత. ఇదియొక చమత్కారము. (కుమా. 1-101). వృత్తనామము వచ్చునట్లు నన్నెచోడుడు తన కుమార సంభవమున మరికొన్ని వర్ణనలు చేసియున్నాడు.
   అవి:—మత్తకోకిల (4-108), క్రౌంచపదము (10-30), మణిగణనికర (8-92).

3. కుమారసంభవ మందలి హిమవన్నగవనమును, మనుచరిత్ర యందలి వరూధినీ గృహ ప్రాంతోద్యానమును, పారిజాతాపహరణమందలి వైజయంత ప్రాంత వనమును,

కేవలము దేవభూములు. భూలోకోద్యానము లందలి వృక్షాదులను, పక్ష్యాదులను అక్కడ గూడ వర్ణించుట జరిగినది. అది కేవలము వర్ణనా నియమమును పాటించి చేయబడిన కవిసమయములే కాని సహజ వర్ణనలు కావన వచ్చును.

4. వసుచరిత్రమందలి ఉద్యాన వనవర్ణనలు అమోఘరసానంద భరితము లైనవి.

5. విజయ విలాసమందలి ఉద్యానవన వర్ణనలు అతి క్లుప్తములును, భావస్ఫోరకములును.

6. సంస్కృత కవుల వర్ణనల యొక్క ఛాయలు అక్కడక్కడ కనిపించినను, తెలుగు ప్రబంధము లందలి వర్ణనలు సహజములు, స్వకపోల కల్పనాజనితములు, ఋతు సహజ సాకల్య సంపాదకములు.

———

# సప్తమ ప్రకరణము

## శైత్యోపచార వర్ణన

శృంగార రస ప్రధానమైన ప్రబంధములలో శైత్యోపచారములు విశిష్టస్థానము నాక్రమించుచున్నవి. ఇవి ప్రకృతివర్ణనలలోనివి. ప్రకృతి వస్తువులతో స్త్రీల అంగముల పోల్చుటజరుగుచున్నది.కామోద్దీప్తలైన కాంతలకు ఉపశమనము కలిగింపలెనన్నచో వారి అంగములకు ఉపమాస్థానమును వహించియున్న చల్లని ప్రకృతి వస్తువులతో సంయోగము కల్పించవలెను. అపుడే ఉపశమనము కలుగును. శైత్యోపచారములకు వినియోగపదార్థము లన్నియు చల్లనివి. వేడెక్కిన శరీరమున కవి చల్లగ నుండి హాయి నొసగును.

ఆంధ్ర ప్రబంధ కవులు శైత్యోపచారములను వర్ణించు ఘట్టములందు చాల స్వాతంత్ర్యమును పాటించియున్నారు. ఒకరిని మించి యొకరు గొప్పగ వ్రాయవలయు నన్న సంకల్పముతో బ్రహ్మాండమైన భావుకతను ప్రదర్శించియున్నారు.

ఆలంకారిక రచన ఎక్కువగా చోటుచేసికొనుట ఈ ఘట్టములందే జరుగును.

ఉద్యాన వనకేళీ జలకేళుల వంటిదేగాన శైత్యోపచార వర్ణన గూడను వనవర్ణన లోని భాగముగానే భావింపవలెను.

## శైత్యోపచారములు

మొట్టమొదట కాళిదాసకృతమగు అభిజ్ఞానశాకుంతలము నందలి మూడవ అంకమున శైత్యోపచారక్రియ సాక్షాత్కరించుచున్నది. శకుంతల దుష్యంతుని చూచినప్పటి నుండియు, విరహాము ననుభవించుచున్నది. చెలికత్తెలు ఆమెకు శైత్యోపచారక్రియ నడుపుచున్నారు.

> "(ఆకాశే) ప్రియంవదే! కస్యేద ముశీరాను లేపనం మృణాళవన్తి నళినపత్రాణిచ నీయన్తే? (ఆకర్ణ్య) (శ్రుతిమభినీయ) కింబ్రవీషి? ఆతపలంఘనాద్బలవదస్వస్థా శకున్తలా తస్యాశ్శరీర సంతాపనిర్వాపణా యేతి?"
>
> -అభిజ్ఞానశాకుం. తృతీ. శుద్ధవిష్కంభ. పుట. 134-వావిళ్ల 1951

పైన శకుంతల మధన పడుచున్నట్లును, తామరతూండ్లను తామర పత్రములును తదపనయనము కొఱకు తెచ్చియుంచినట్లును వర్ణితము.

మరియొకచోట—

"సఖ్యా: -(ఉపవీజ్య) సఖి శకుంతలే, అపి సుఖాయతే నళిని పత్ర వాతః?
శకుంతలా :-కిం మాం వీజయతః సఖ్యా?
సఖ్యా :- (విషాదం నాటయిత్వా పరస్పర మవలోకయతః)

—శాకుంతల. తృతీ. పుట. 141. వావిళ్ల. 1951.

అనసూయా ప్రియంవదలు తామరాకుతో శకుంతలకు విసరుచు, చల్లగా, సుఖముగా ఉన్నదా అని అడుగుచున్నారు, ఆ శకుంతలకు ఆ శీతల స్పర్శ తగలనట్లు ఆమె ప్రశ్న వలన తెలియుచున్నది. ఆమె మదన తాప బాధిత. శైత్యోపచారములు నడచుచున్నవి. కాని ఆమె తాపము చల్లారలేదు, శైత్యోపచారవర్ణన కీవిధముగ శాకుంతలము ఆదికావ్యమగుచున్నది. దీనిననుసరించి తర్వాత పెక్కురు సంస్కృత కవులు ఈ ప్రక్రియను తమకావ్యములందు పాటించినారు.

## శైత్యోపచారవర్ణన—కుమారసంభవము

మొట్టమొదటగా శైత్యోపచార వర్ణన ఆంధ్రప్రబంధములలో ఆది ప్రబంధమైన కుమార సంభవములోనే ప్రత్యక్షమగుచున్నది.

పార్వతి విరాళిగొని మదన జ్వరముతో వేగునపుడు, చెలికత్తెలు :-

"తలిరులు మొగ్గలున్ వికసిత ప్రసవంబులు దెండు మీరు, శీ
తలికలు పిక్కమూలములు తామరతూడులు దెండు మీరు, చెం
గలువలు దోవకామలును గంజదళంబులు దెండు మీర లీ
చెలువకు శీతల క్రియలు చేయుద మింకెడ సేయ నేటికిన్"

-కుమార. 5-137

"అని అందఱు నొండొరులకు మీరనిట్లనేక శిశిరోపకరణద్రవ్యంబులు తత్క్షణంబకొనివచ్చి, తమలోన—"

-కుమార. 5-138.

"పువ్వుల తొడిమలు పుచ్చునయంబున
చివుళుల కామలు సిదుము, లేత
తూడుల గంటులు తుదలకు ముడువు, చెం
గలువల పై రేకు లొలువు, సురటి
మోసుల వీజనంబులు సేయు కొలది వే
ళ్లిరవుగా గూర్చి చామరలు సేయు
తావ పువ్వు గామలతో లిమ్ముగాఁబుచ్చు
పిక్కమూలంబుల పెనగు వాపు

చందనంబు రాచి సన్నియబెట్టు చెం
గావిమన్ను నీరఁగలిపి తీర్పు
కప్పురంబు దూలిగాఁజేసివడి వెట్టు
మనుడుఁ గడగి ప్రియవయస్యలెల్ల" -కుమార. 5-139.

పార్వతి కుసుమపేశల గాత్రి. పువ్వుల తొడిమలను గాని, చివుళుల కామలుగాని, చెంగలువల పై రేకులుగాని, ఆమె శరీరమునకు ఒత్తుకొని బాధగలిగించునని ఆమె చెలి కత్తెల భయము.

"అవన్నియు నవసరంబుగా నమర్చి శిశిర వీర్య మంత్రంబుల నభిమంత్రించి"
-కుమార 5-140

"చందన కర్దమంబు ఘనసార రజః ప్రసరంబు శీతలుల్
గెందలిరుల్ ప్రసూనములు, గేసరముల్ కుముదోత్పలాబ్జత
త్కందమృణాళపత్ర ఘనధాతుతుషార ఘనోపలాంబువుల్
నాఁదగు శీతలోపకరణంబుల నేర్చి తలిర్చి సిద్ధికిన్" -కుమార. 5-141.

తరువాత —

"హిమధామధాతు మిశ్రములగు శశికాంత
జలములు వాసించి జలకమార్చి
శీతాద్రి కంధర ధాతు రంజితమగు
గైరికాంబరములు కట్టనిచ్చి
ఘనసారపాంసు సంగత మగు నామోద
మలయజ పంకంబు గలయ నలది
కోమల బిసతంతు గుణరోపితములగు
విమలకర్పూర హారములు వెట్టి

సహాజ శైత్యాఖి నవపుష్ప సమితి దుఱిమి
తరుణపల్లవ కర్ణావతంసకంబు
లిడి విదాహంబు వాపి మేయలమి నవక
మెసగ జేసిరి తనుపారు పసదనముల" -కుమార. 5-142

పై ప్రకృతి వస్తువులన్నియు చల్లనివి.

నన్నెచోడుడు శైత్యోపచారములను చక్కగ వర్ణించినాడు. ఈవర్ణనలను ఒర వడిగా నుంచికొనియు, తమ భావనాగరిమ ననుసరించియు, తర్వాతి కవులు ఇంకను చక్కగా వర్ణించినారు. శైత్యోపచారముల నడిపిన ఆంధ్రకవులలో నన్నెచోడుడు ప్రథముడు. ఈ ప్రబంధమందీ వర్ణన క్లుప్తముగ జరిగినది.

## శైత్యోపచారము-మనుచరిత్ర

మనుచరిత్రమున శైత్యోపచారములు కుమారసంభవములో వలె లేవు. పార్వతి వంటి నాయికగాదు వరూధిని. వరూధిని అప్సరస. పార్వతివలె తల్లిచాటు బిడ్డగాదు. యథేచ్ఛగా ప్రేమింపగలదు. ప్రౌఢగా, తన ప్రేమకోఱకు తానే పాటుపడగలదు.

చెలులపై ఆధారపడియున్న నాయికకు మాత్రమే తన చెలులు శైత్యోపచార ములు జరుపుట జరుగుచున్నది. వరూధిని తనచెలులపై ఆధారపడినట్లుగా వర్ణింపబడ లేదు. ఆమె విరహానల బాధకోర్వలేక ఉపశమనార్థము వెన్నెలలోనికి వెళ్ళినపుడామె చెలికత్తెలు—

"పూత పసిండివంటి వలపుం బచరించు కులంబు నీతికిన్
లేతగదమ్మ యిత్తెఱగు లేమ సురాంగనలెల్ల నిట్టి నీ
చేతకు మెత్తురమ్మ దయసేయక తిన్నని మేను వెన్నెలన్
వేతురటమ్మ యింత కనువేదుఱు సెల్లునటమ్మ యింతికిన్" —మను. 3-33

అని అన్నారు.

పై విధముగ మందలించినారేగాని గాభరాపడి శైత్యోపచారములకు గడంగ లేదు. అందులకే పెద్దన ప్రత్యేకించి శైత్యోపచారముల వర్ణింపలేదు. కాని ఒక మోస్త రుగ వర్ణించినాడు.

వెన్నెలలో ప్రేయసీప్రియులు రతిని జరుపుటను, ఆనందముగ సల్లాపములు జేయుటను, చూచిన వరూధిని అందులకు అసూయపడుచు, తన స్థితికి ఆత్మనింద కావించుకొనుచు "మనమిచటినుండి శృంగారవనమునకు పోవుదము"

"అని పతికి పొన్పు డిగి కా
మిని చంద్రాతపము వేడిమికి జైటచెఱం
గున ముసుగిడి నిజకేళీ
వనిజొచ్చి వియోగ వహ్ని వడబడి తెగువన్'' —మను. 3-30

చంద్రాతపము (చల్లనికాంతి) ఆమెకు వేడిగానున్నది. సూర్యాతపమునందు నడచు స్త్రీలు—ఆ యెండ తలకు తగులకుండ నెత్తిపై పైట చెఱగు కప్పుకొనునట్లుగా, వరూధిని కప్పుకొన్నది. వ్యంగ్యముగా, వరూధినిలోని వేడిమిని (కామజ్వరమును) వర్ణించినట్లయినది.

తరువాత మదనతాపమును చల్లార్చుకొనుటకు చల్లని వస్తువులయందే చొరబడు చున్నది. అవి చల్లని వస్తువులేగాని, ఆమెకు మాత్రము ప్రాణాంతకములు. ఆ చంద్ర కిరణములలో దూరియు, చిగురాకు పొదలలో దూరియు, తీగలను ఉరిత్రాడుగా వేసి కొన యత్నించియు, వాసనగాలిలో దూరియు, ప్రాణములను పోగొట్టుకొనదలచినది. ఆత్మహత్యకు పూనుకొనువారు అపాయకర వస్తువులకు జడియరుగదా! మదనతాప ముతో నిండి, ఉద్దీపన కారకములైన వానిని చూచి ఇపుడామె జడియదు. ఇపుడామె అళులకు జడియుటలేదు. పుప్పొడులకు జడియక అందులోనే మునుగుచున్నది. చూతాం కురముల (మన్మథాస్త్రము) కు భయపడక మావిక్రిందనే నిలబడుచున్నది. పూలవాస నలు కసిగా పీల్చుచున్నది. కాని ప్రయోజనమేమియు లేకుండ పోయినది. (మను, 3-31) అవి ఆమెను బాధించునవేగాని ప్రాణములు తీయునవి గావుగదా! అపుడు చెలికత్తెలు ఆమెను తద్వాతావరణము నుండి తప్పించుటే శిశిరోపచారములుగా భావించినారు.

'ఉడుపతిబారికిన్ వెఱచి యూఱట యానని పేరుటామనిన్
ముడివడు కంతుసేనలకు ముయ్యేలగుట్టయినట్టి యిందురా
నడగునె తాపవహ్ని మనమై హరిణేక్షణ ముల్లుపుచ్చికో
ఱ్ఱడచిన చందముయ్యె బరమూ యెలదోట జరింప కింటికిన్'' —మను. 3-34

ఒక్కచంద్రునికి వెఱచి అంతకు కొన్ని యంతల చిక్కులలో చిక్కుకొన్నది వరూధిని. ఇపుడు కంతుసేనలకు ముయ్యేలగుట్టయిన చోటిది. మలయ పవనుడు, తుమ్మెదలు, పూవులు, అన్నియు కంతుసేనలు. ముల్లు తీసివేసి కొఱ్ఱును అందులో చెక్కినట్లు న్నది. మన్మథ పరివారమిది—

"ధనుః పౌష్పం మౌర్వీ మధుకరమయీ పంచవిశిఖాః
వసంతః సామంతో మలయమరుదా యోధన రథః" --సౌందర్యలహరి

వసుచరిత్రమందలి శైత్యోపచారములు నూతన భంగిమలో నడిచినవి. వరూధినిని ఆ వాతావరణమునుండి తొలగించుచేశైత్యోపచారము.శైత్యోపచారములకుపనికివచ్చు సామగ్రి తెచ్చిఉపచారములుచేయుట మాని,కామజ్వరతీవ్రతకుకారణభూతమయినప్రకృతి నుండి ఆమెను చెలికత్తెలు తొలగించుచే ఒక శిశిరోపచారము. ఇట్టి భావమే తరువాత వసుచరిత్రలో గూడ గాననగును. (వసు. 3-121, 122, 123, 124.)

## శైత్యోపచారములు-కళాపూర్ణోదయము

కళాపూర్ణునిపై గల ప్రేమ అధికము కాగా, ఓర్వలేక మధురలాలస సొలసిపోయి కనులు తేలవేసినపు డామె చెలికత్తెలు కొందలమంది శిశిరోపచారములకు కడంగిరి. (కళా. 6-250)

అనువైన విధముగా చప్పరముగట్టి సెజ్జ తయారుచేసిరి. వారు చేరిన స్థలము చల్లనిది. వారుపయోగించిన వస్తువులు చల్లనివి. ప్రయాసపడి ఒక శీతలగృహమును (Air-conditioned room) గూడ నిర్మాణము చేసినారు.

''విరిదమ్మితావులు వెదజల్లు కొలని చెం
గటఁ గమ్మ పన్నీటి కాలువలను
గడునివతాళించు కప్రంపుఁటరటుల
యిరవులఁ బూవుఁ జప్పరముఁబన్ని
వట్టివేళ్లను దడిగట్టి శ్రీగంధంపు
టసలున మెత్తి తదంతరమున
గర్పూర వేదికఁగావించి చల్లని
చెంగల్వ రేకుల సెజ్జదీర్చి

చిలుకుఁ దేనియతోడి గొజ్జెంగపూవు
దలగడ యమర్చి యందు నా చెలువ నునిచి
జగతి గల సర్వశైత్యోపచార విధులు
జరిపి రందును గడగొన కలసి రంత'' --కళా. 6-251

ఇంత చక్కని శిశిరోపచారముల నడపుట మరే కావ్యమునను కానము. శీతల వస్తువులతో శీతల గృహనిర్మాణము చేసి, శీతలవస్తువులపై నాయికను పరుండబెట్టుట

ఈ భావుక చక్రవర్తియే యూహింపగలడు! కుమారసంభవ, మను, వసుచరిత్రల యందుగూడ నింత యందము గలేదు.

చెలికత్తెలు అంతటితో ఊరుకొనలేదు. ఆశను వదలక చేతనయినంతయు చేయు చున్నారు. ఇంతవఱకెవ్వరును గావింపని శైత్యోపచారములను కావించుచున్నారు.

"అప్పువుబోండ్లు వెండియుఁ బ్రయత్నముతోఁ బలుమారు వీను
లం గప్పురమూది పూవిసనకట్టలు గొజ్జెగనీట మాటికిం
దొప్పగఁ దోచి వీచుచుఁ జనుంగవపైనఱకాళ్లఁ బాణులన్
లప్పలుగాగ జందనములఁ దుచుఁ గొందల మంది రందఱున్" -కళా. 6-25?.

పూర్వకవులుగాని, సమకాలీన కవులు గాని ఇంత సొంపుగ శిశిరోపచారములు నడపలేదు. కర్పూరము చెవులలో నూదుట, లప్పలు లప్పలుగా చందనమును అఱకాళ్ల కును, అఱచేతులకును, హృదయమునకును మెత్తుట — మొదలగునవి అపూర్వముగా నున్నని. చందనపంకము ముందే చలువ. దానిని శరీరమునకు మెత్తినపుడు లోపలి ఉష్ణ మును అది లాగి ఎండిపోవును. శరీరమందలి ఉష్ణము బాగుగ తగ్గుటచే శైత్యము క్రమ్మును. మధురలాలసకు శైత్యము క్రిమ్మలేదు. సరిగదా, తాపమే తగ్గలేదు.

శిశిరోపచార వర్ణన కళాపూర్ణోదయమున అతివేలమనోహరముగ నున్నది. నాయిక మధురలాలస గదామరి! అన్ని కావ్యములందలి నాయికలు బాహ్యవాతావరణము లోనే యుండగా కళాపూర్ణోదయమందలి నాయిక శీతలగృహమే నిర్మాణము చేయించు కొన్నది.

## శైత్యోపచారములు—వసుచరిత్ర

శైత్యోపచారములను మనోజ్ఞముగ, అతివేల సుందరముగ వర్ణించినాడు, వసు చరిత్రకారుడు.

గిరిక, చెలికత్తెలతో కలిసి మన్మథపూజ చేసినది, ఆవాహనము గావించినది. మన్మథావేశమును పొందినది. వణికి పోయినది. మారుతపాతిత వల్లికాభయై ఒఱిగినది. చెలికత్తెలకు భయము కలిగినది. కొందఱు శైత్యోపచారవస్తువులను తేచ్చినారు. కొందఱు వానిని సహేతుకముగ నిరాకరించినారు. శైత్యోపచార వస్తువులయినను పరస్పర వైరమున్న వస్తువులుగాన ఈ క్రిందివానిని వాడఁగాదని చెలికత్తెలు అను చున్నారు.

'మోహాపదేశ తమోనిద్రితము లైన
కనుదమ్ముల హిమాంబులునుపరాదు
శ్రమబిందుతార కాగమ ఖన్న కుచకోక
ములఁ జంద్రనామంబుఁదలపరాదు
శీర్యదాశావృంత శిథిల తాసులతాంత
మసియాడ వీవనల్ విసరరాదు
పటుతాప పుటపాక పరిహీనతను హేమ
మిక పల్లవపుటార్చి యిడగ రాదు
లలన కానంగ కీలి కీలాకలాప
సంతతాళీఢ హృదయ పాత్రాంతరాళ
పూరిత స్నేహపూరంబు పొంగి పొరల
జల్లని పటీర సలిలంబుఁ జల్లరాదు''

వసు. 3-180

పై వర్ణన నన్నెచోడుని కుమారసంభవ వర్ణన కంటెను గుణమున నతిశయించి యున్నది. ఉపచారక్రియలకు నిషిద్ధవస్తువులు సహేతుకముగ నిరాకరించబడుట ఇంతవరకే ప్రబంధమందును లేదు. ఈ ఉపచార ధోరణియే అమోఘమయినది. కింకర్తవ్యతామూఢలైన చెలికత్తెలు వెంటనే ఆమె అంగములకు అనురూపములగు చల్లని వస్తువుల దెచ్చి ఆమె అంగముల కంటించి శైత్యోపచారముల నడుపుచున్నారు.

"జవరాలి యడుగులఁ జివురాకు లంటించి
పొలతి యూరుల నంటిపొరలఁబోదివి
కొమ్మ చేదోయి చెందమ్ముల హత్తించి
లేమ బాహులమృణాళికల బెనిచి
యతివ గుత్తపు గుబ్బ లలరు గుత్తులగూర్చి
కాంత చెక్కుల జంద్రఖండ మలది
కలికి క్రేగన్నులు కలువ రేకులు గప్పి
లలన పెన్నెఱుల వాలంబు ముడిచి
నవనవగుణానుబంధ బాంధవములైన
చలువ లెన్నేని గావించి చెలువ చెలులు
నెలత కీవసులాభంబు నించు మంచు
నించువిల్కాని మఱఁ బ్రార్థించుటయును"

వసు. 3-182

పై శైత్యోపచార వస్తువులన్నియు గుణానుబంధ బాంధవములైన చలువ వస్తువులు. సహజత్వమును సార్థకత్వమును గలిగిన వర్ణనలను ప్రయోగించుటలో భట్టుమూర్తి కతని కతడే సాటి.

శైత్యోపచారవర్ణనలో భట్టుమూర్తి నన్నెచోడునితో పోటీపడినట్లున్నది.

## శైత్యోపచారములు - విజయవిలాసము

విజయవిలాసమున శైత్యోపచారములు మొత్తము మూడు పద్యాలలో సాగినవి. ఇతర ప్రబంధకారులవలె, అందు ముఖ్యముగ వసుచరిత్రకారునివలె, శైత్యోపచారము లను చక్కగా వర్ణించినాడు విజయవిలాసకారుడు. శైత్యమును ప్రసాదించు వస్తువులు, కామపీడితలగు నాయికలకు తీవ్రమైన ఉష్ణమును కలిగించుట పరిపాటి. విజయవిలాస మున ఒకే రకపు వస్తువులు ఒకేసారి బాధ కల్గించునట్లు వర్ణించుట అమోఘముగ చిత్రింపబడినది. "తూర్పు కొండపై కార్చిచ్చుతో రాపాడి వెలుగుచున్నట్టి జలజారి వేడివెన్నెలలు కురియుచుండగా, ముక్కంటి కంటి సెగకోర్చి అరితేరిన మారుడు చిచ్చర వాడి ములుకు వేయుచుండగా, పాముకోఱలతో సాముచేసిన మలయమారుతము విసపు విత్తై సోకి వెగటు చూపుచుండగా, క్రౌంచాచలము పోటుగంటి దూరిన రాజ హంసములు హాళాహళులు సేయగా, సాయంతనము మొదలు తెల్లవారు వఱకు అంతః పురమున సుభద్ర కృష్ణ, కృష్ణాయంచును, ప్రమదవనాంతరమున నర్జునుడు రామరామా యనుచును బాధ పడుచుండిరని వర్ణించిన వర్ణన అత్యద్భుతము (విజయ. 3-25).

పైని ప్రయోగింపబడిన పదము లన్నియు సార్థకములు. బాధపడువారు కృష్ణ కృష్ణా అనియును రామరామా యని ఉస్సురనుటయును లోకవిదితము. ఆ పదములను సశ్లేషముగ, సార్థకముగ ప్రయోగించి ధన్యుడైనాడు చేమకూరకవి. అర్జునునికి 'కృష్ణ' యని పేరుగలదు. ఆ నామము నామె జపించినట్లున్నది. రామ యనగా స్త్రీయని యర్థము. ఆ నామమును అర్జునుడు జపించినట్లున్నది. సాధారణముగ బాధలలో ఉచ్ఛ రించు పదములను సార్థకముగ శ్లేషార్థముతో ప్రయోగించుట గొప్పనేర్పు. ఈ వర్ణనలో నితడంందఱను మించినాడనవలెను.

దీనికి ముందటి ప్రబంధాలలో నాయిక యొక్క విరహ తీవ్రతయును విసుగును చెలికత్తెల ద్వారా వాచ్యముగ బహిర్గత మయ్యేడిది.ఇందు వ్యంగ్యముగ బహిర్గతమగు చున్నది.

> "అక్కఱఁ జూడవేటి కల యచ్చికబుచ్చిక సేయునంచలం
> జెక్కిలి గొట్టి చేమిటికిఁ జేరగ వచ్చిన ముద్దు జిల్కలన్
> ముక్కు మొగంబు చూడకటు ముట్టను బొమ్మనెదేలబోట్లు, నో
> చక్కెరబొమ్మ నీ వెగటు జాడలు సూచిన వింతలయ్యెడున్" —విజయ. 3-30.

విరహమున నాయికలు చికాకుగ నుండుట సహజము. ఇదివఱకు ఇష్టము చూపు చుండిన వస్తువులపై నిపుడు నిరాదరణ కలుగును. ఈ తిరస్కారమును వ్యంగ్యముగ పై పద్యమున వర్ణించినాడు కవి,

సుభద్ర చేష్టలు కేవలము విరహచేష్టలని తీర్మానించుకొన్న చెలికత్తెలు గుసగుసలు పోవుచు సలపులకిసమసలని తెలిసి బిసకిసలయకుసుమ విసరము వేగమ తెచ్చి శిశిరవిధ లాలస లయినారు. (విజయ. 3-37)

అందఱు ప్రబంధనాయికలకువలెనే సుభద్రకు గూడ చెలికత్తెలు చలువ వస్తువుల తోనే సింగారించినారు. "పన్నీట జలకమార్చి, చలువలు కట్టి, శరీరమంతయు చందన మలది, కర్పూరపు బొట్టుపెట్టి, సిగలో విరులదండలు తురిమి,చన్నుం గ్రేవల ముత్యాల హారాలు సవరించినారు" (విజయ. 3-39). ఈ వర్ణన కుమారసంభవమందలి (కుమా. 5-142) పద్యభావమును పోలియున్నది.

పై పద్ధతి వలన తాపము హెచ్చునేగాని తగ్గదని చెలికత్తెలకు తెలియును. అందు లకు వారు బాధాకర దుష్టశక్తుల శాంతికై పూజచేసి, నమస్కరించి ఆ పూజాద్రవ్యము లతోడనే శిశిరోపచారములు నడుపుచున్నారు.

"కోటి మధువ్రతంబులకు దండము వెట్టి
        మకరంద మదర బింబమున జిల్కెఁ
జెలి గంధసహున కంజలి చేసి నెత్తావి
        పువ్వుగుత్తులు రోజముల నమర్చె
నాళీకిసాహార పాళికిఁ బ్రణమిల్లి
        నవమృణాళములు బాహువుల గూర్చె
నకికెందలిరుదిండులకు వందన మొనర్చి
        చిగురుటాకులు పాదయుగళిఁ జేర్చె
సరగ నిటులందఱును మీ ప్రసాదమనుచుఁ
బంచ సాయక దేవతా బలమునెల్ల
వేడికొని తగునటు గారవించిరపుడు
చంచలాక్షికి శిశిరోపచార విధులు"

-విజయ. 3-39.

పైని వర్ణించిన దుష్టగ్రహశాంతి చాల రమ్యముగ నున్నది. మకరంద మధర ములకును, పూగుత్తులు స్తనములకును, తామరతూడులు బాహువులకును, చివుళ్లు పాదములకును ఉపమానములుగాన వాని నాయాస్థలములందే నిలుపుట సార్థక్యమును చమత్కారమును. పై వర్ణన వసుచరిత్రమందలి 3-182 లోని పద్యభావమున కనుకరణగా నున్నను, ప్రకృతి శక్తులను జయించుట కష్టముగాన నమస్కరించి మీమీదే భారము అని వదలుట ఇందలి చమత్కారమందలి ఆధిక్యము. వసుచరిత్రలో (3-170) కేవలము మన్మథుని పూజయే యున్నది. ఇచ్చట తత్పరివారమునకు గూడ.

తరువాత సుభద్రపై పన్నీరు చిలికి, శ్రీగంధమలది, విరులు పై దార్పగా ఆమె నరుని గెల్చుటకై వలరాజు పూజచేసిన గజరాజము వలెనున్నదని వర్ణించిన వర్ణన చాల

సుందరమైనది. భావ్యర్థ సూచకమైనది (విజయ. 3-40).ఈ విధముగ నాయికను ఎవరును వర్ణింపలేదు. వలరాజే ఆమెను తన వాహనముగా చేసికొన్న తరువాత గెలుపునకు సందేహమే లేదుగదా!

పై విధముగా విజయవిలాసమందలి శిశిరోపచారములు సార్థకముగ జరిగినవి. కుమారసంభవకర్త మొదలు భట్టుమూర్తివఱకును గల ప్రబంధకవులందఱును పాటించిన విధమున ఈ కవి గూడ శిశిరోపచార సందర్భమున సీసపద్యముల వాడుట గమనింపదగినది.

## సారాంశము

1. శైత్యోపచారములు ఒక సరస క్రీడ.
2. సంస్కృతమున నిది శాకుంతలమందు ప్రగాఢముగా మొదట కనిపించుచున్నది.
3. ప్రప్రథమముగా శైత్యోపచారముల నడిపించిన ఆంధ్రకవి నన్నెచోడుడు.
4. కళాపూర్ణోదయమందలి శైత్యోపచారములు ఇతర కావ్యములందుకంటె సుకుమారముగ నున్నవి. చక్కని వాతావరణములో సర్వశీతల వస్తుసముదాయముతో-శీతల గృహమునే నిర్మించి నాయికకు శీతలమైన పాన్పును వేసినాడు సూరన.
5. పారిజాతాపహరణమందును, ఆముక్తమాల్యదయందును, ప్రభావతీప్రద్యుమ్నమందును శైత్యోపచారములు లేవు.
6. వసుచరిత్రయందు శైత్యోపచారవర్ణన యందలి వాతావరణమే లేదు. అందు మన్మథపూజ గావించుటయును, తదావాహనమును గావించుటయును, నాయిక మూర్ఛపోవుటయు,ఆపైన శైత్యోపచారములు చేయుటయు, సుకుమార సుందరముగా సాగినది.
7. విజయ విలాసమునందలి శైత్యోపచారములు పూర్వప్రబంధకారుల ననుసరించి వర్ణింపబడినవయ్యును, మన్మథ పరివారమునకు పూజచేసి ఆ ప్రసాదమునే సుభద్ర కందిచ్చుట సుందరమైన వర్ణన. ఆ వస్తువులన్నియు తదంగములయొక్క ఉపమాన వస్తువులే.
8. శైత్యోపచార సందర్భమున అందఱు కవులును సీసములవాడుట ఒక విశేషము.

# అష్టమ ప్రకరణము

## ఋతువర్ణన

ఋతువర్ణన కేవలము ప్రకృతి వర్ణన. ఇది కాలగమనమును సూచించి దాని ధర్మముల ప్రకటించుటకును కావ్యవాతావరణ సృష్టికొరకును చేయబడుచున్నది.

వేదములందే ఋతుప్రాశస్త్యముగ్గడింప బడినది. తర్వాత వెలసిన రామాయణ భారతాదులందు కావ్యగతములుగ ఈ వర్ణనలు చేయబడినవి. రామాయణమున హేమంతర్తు వర్ణనయును తర్వాత వరుసగా వసంత వర్షాశరత్తుల వర్ణనయును కావింప బడినది. గ్రీష్మ శిశిరములను ప్రత్యేకముగా వర్ణింపలేదు.

కాళిదాసు ఋతువర్ణనలను కావ్యగతముగ వర్ణించుటతో తనివి తీరక ప్రత్యేకముగ ఋతుసంహారమును వ్రాసి అందు షడృతువుల యొక్క సహజ లక్షణములను భావనా భరితముగ సర్వాంగ, సుందరముగ వర్ణించినాడు.

కాళిదాసునకు ముందు వాడనియును తర్వాతివాడనియును, భిన్నవిధములుగ చెప్పబడుచున్న భరతుడు తన నాట్యశాస్త్రమున ఋతువుల లక్షణములను సూచించుటకు నాటకరంగమున నెట్లభినయింపవలెనో చెప్పియున్నాడు

కాళిదాస కవికి తర్వాతి వాడయిన దండి తన కావ్యాదర్శమున అష్టాదశవర్ణనా నియమమును చెప్పుచు నందు ఋతువర్ణన యొకటిగా పేర్కొన్నాడు.

కాళిదాసు తర్వాతి సంస్కృత కవులయిన బాణ, భారవి, మాఘు, హర్షాదులు తమ తమ కావ్యములందు చాలవఱకు అష్టాదశ వర్ణనా నియమమును పాటించిరి.

ప్రాచీనాంధ్రవాఙ్మయమున కేవలము ఋతువర్ణనా కావ్యములు లేవు. సంస్కృత కవుల ననుసరించియు లాక్షణికుల ననుసరించియు అష్టాదశ వర్ణనా భాగముగ ఋతువర్ణనల చేసియున్నారు. అన్ని ఋతువులును కావ్యమందుండి తీరవలెనన్న నియమములేదు గాన అవసరమని తోచిన వానినే వర్ణించినారు.

తెలుగు లాక్షణికుడైన విన్నకోట పెద్దన (15 వ శతాబ్ది) ఏయే ఋతువుల వర్ణించు తటి నేయే యంశము లుండవలెనో నిర్ణయించినాడు. (కావ్యాలంకార సంగ్రహము 2—99, 101, 103, 105, 107, 109).

## వసంతర్తువు

అన్ని కావ్యములందును వసంతము వర్ణింపబడుటయు నాయికా నాయకుల వన విహారమున వసంతమే వర్ణింపబడుటయు తెలిసిన విషయము. ఎండల తీవ్రతగాని, చలి తీవ్రతగాని, వర్షాలుగాని లేకుండుటయు, సర్వప్రకృతియు చిగిర్చి పుష్పించి యుండుటయు దీనికి కారణము గానోపును.

"ప్రమోద జననారంభము చేతను ఉపభోగవస్తువుల ఉనికి చేతను నానా పుష్పముల ప్రదర్శన చేతను వసంతమును అభినయింపవలె..."[1] నని భరతుడన్నాడు. అనగా వసంతర్తు సంబంధి పుష్పముల ప్రదర్శింపవలెనని అర్థము.

"వసంతర్తువున అంకుర, పల్లవ, పత్ర, ముకుళ, ప్రసూన, ఫలపూర్ణవనాదుల వర్ణింపవలె"[2] నని అన్నాడు విన్నకోట పెద్దన.

రామాయణముననే తొలుత మనకి వసంతర్తు వర్ణన కనిపించుచున్నది. కిష్కింధా కాండాదిలో దాదాపు వంద శ్లోకములలో నిది వర్ణింపబడినది. ఇందు పంపా సరస్సు, మందమారుతము, పుష్పవర్షము, కోకిలలు, నీరుకోళ్ళు, అశోక స్తబకములు, మయూరములు, తుమ్మెదలు, చూత వృక్షములు, పద్మములు, చక్రవాకములు, కర్ణికార పుష్పములు, పలాశ పుష్పములు, జాజులు, మల్లెలు, గన్నేరులు, మొగిళులు, సిందువారములు, అడవి మొల్లలు, పువ్వుల గురివెందలు, కానుగ చెట్లు, నాగ మల్లెలు, ఇప్పచెట్లు, సంపెంగలు, బొట్టుగుచెట్లు, ఉలిమిరి చెట్లు, ఖర్జూర వృక్షములు, నీలాశోకములు, లొద్దుగులు, ఊడుగచెట్లు, గొజ్జెగ చెట్లు, వేప, కలిగొట్టు, కోవిదార, నారంగ, అర్జున, గేదగి, విరిగి, శిరీష, శింశుపా, చంద్ర, బూరుగు, పలాశ, ఎఱ్ఱగోరింట, చందన మొదలగు ననేకములగు పుష్పఫల జాతులు వర్ణింపబడినవి.

రామాయణ వర్ణనలలో నున్న లతలు, వృక్షములు మొదలగునవి తర్వాతికవుల చేతను లక్షణ కర్తలచేతను స్వీకృతము లయినవి.

కాళిదాసు తన కుమారసంభవములో మన్మథ ప్రవేశ సమయమున వసంతర్తు వర్ణన చేసినాడు. చెట్లు దోహదము లేకుండనే పుష్పించినట్లు వర్ణించినాడు. ఈ సమయమునకు దోహదక్రియాసంప్రదాయము వచ్చినదని యర్థము. మోదుగలు, శుకములు, కోకిలలు, మలయమారుతము, బంభరములు, మొదలగువానిని వర్ణించినాడు. ప్రకృతి

---

1. ప్రమోద జననారంభైః ఉపభోగైర్ పృథక్ విధిః
వసంత స్త్వభినేతవ్యః నానాపుష్ప ప్రదర్శనాత్'' —భరత. 25 అధ్యా. 33

2. కావ్యాలంకార చూడామణి —విన్నకోట పెద్దన.

సహజవర్ణనయే గాక భావ వర్ణనమును ఇందు గలదు. ఎందుకనగా నాయికా నాయకుల వర్ణనయును, విప్రలంభ శృంగారమును పోషింపబడినవి గనుక.

ఋతుసంహారమున కాళిదాసు వసంతర్తువు శోభను పూర్ణముగ చిత్రించినాడు. రసాలములను, కోయిలలను, పుష్పములను, బంభరములను, కమలములను, కింశుకములను వర్ణించినాడు.

శిశుపాలవధ యందు గూడ మలయమారుతమును, పద్మములును, చంపకమును అశోకమును, వకుళపుష్పమును వర్ణితములు.

కాదంబరియందుగూడ చూతములును, వకుళములును,అశోకములును,కోకిలలును, మధుపములును, వర్ణితములు (కాదంబరి పూర్వ భాగములో).

సంస్కృత సాహిత్యమున అనేక రీతులలో అనన్య సౌందర్య విలసితముగా వర్ణించిన వెనుక, తర్వాతి సర్వభాషాకవులును అదే దారిన నడిచి ధన్యత గాంచినారు.

వసంత వర్ణన తెనుగు కావ్యాలలో ఉద్యానవనవర్ణన సందర్భమున కనిపించునని ముందే వివరించితిని. నాయికా నాయకుల ప్రవేశమును, వారి విప్రలంభమును, నాయిక యొక్కయు, చెలుల యొక్కయు, వన జలక్రీడలును వసంతమందే జరుగును. నన్నె చోడ కుమార సంభవముననను, మనుచరిత్రయందును, పారిజాతాపహరణమందును, ఆముక్తమాల్యదయందును, కళాపూర్ణోదయమందును, ప్రభావతీ ప్రద్యుమ్నమందును, వసుచరిత్రయందును, విజయవిలాసమందును గల వసంతర్తు వర్ణన ఉద్యానవన వర్ణనలో చేయబడినది గాన దీనికి ఇట ప్రత్యేక ప్రసక్తి లేదు.

## గ్రీష్మర్తువు

వసంతర్తువునకును, వర్షర్తువునకును మధ్యది గ్రీష్మము. రామాయణమందు దీనికి ప్రత్యేక పరిగణన లేదు. వసంతము తర్వాతిదే గాన వసంత వర్ణనలు దీనికిగూడ సరిపోవును. వసంతము కంటె తాపము మాత్ర మెక్కుడు.

గ్రీష్మర్తువును ప్రత్యేకముగ మొదట వర్ణించిన వాడు కాళిదాసే. గ్రీష్మకాలమున పార్వతి మండుటెండలలో పంచాగ్ని మధ్యమున నుండి తపస్సు చేసినట్లు వర్ణించినాడు.

ఋతుసంహారమున గూడ తాను మొదట వర్ణించినది గ్రీష్మమునే! కాళిదాసునకు గ్రీష్మము నెడ ప్రత్యేకాదరమున్నట్లు తోచుచున్నది. అభిజ్ఞానశాకుంతలమున

గూడ ప్రారంభమున గావించిన ఋతుగానము గ్రీష్మర్తు గానమే! ఋతు సంహార మందలి గ్రీష్మ వర్ణనమున తాపాధిక్యమును, వెన్నెల హాయిని, చన్నీటి స్నానములోని తృప్తిని, సాయంకాలములు రమ్యముగ నుండుటలు, మద్యపానము హాయి నిచ్చుటయు, జింకలు మొదలగునవి దప్పిచెంది ఎండమావుల వెంట పడుటయు, నెమిళ్లు, పాములు, ఏనుగులు, సింహములు గూడ దప్పిబాధకు ప్రాణ భయము చెంది పరస్పర విరోధముల మఱచుటయును పడియ లెండి పోవుటయును, బురద నీరు వేడెక్కి యుండుటయును, దవానల విజృంభణమును, మొదలగునవి వర్ణితములు (ఋతు. 1-1 నుండి 23 వఱకు).

భరతుడు నాట్యశాస్త్రమున గ్రీష్మర్తువును ఎట్లు అభినయింప వలెనో చెప్పి యున్నాడు.

> "స్వేద ప్రమార్జనైశ్చైవ భూమితాపై స్సవీజనైః
> ఉష్ణస్య వాయో స్స్పర్శేన గ్రీష్మంత్వభినయేద్బుధః"
>
> -భరతుని నాట్యశా. అధ్యా. 25-34

(చెమట తుడుచుకొనుటచేతను, వీవనలతో విసరుకొనుటచేతను, వేడిగాలి తగులుటను సూచించుచు గ్రీష్మమును అభినయింపవలెను).

తెలుగు లక్షణ కర్తయయిన విన్నకోట పెద్దన తన కావ్యాలంకార చూడామణి యందు ధారాగృహములు, నవఘనములు, పటీరము, మొదలగునవి వర్ణింపబడవలె నన్నాడు.

శిశుపాలవధలో మాఘుడు మూడుశ్లోకములలో మాత్రమే వర్ణించినాడు గ్రీష్మమును, శిరీషపుష్ప సౌకుమార్యమును, నవమల్లికాశోభయును, పాటల పుష్పసౌగంధ్యమును మాత్రము వర్ణించినాడు. గ్రీష్మమున ముఖ్యమయినవి అవియే! ఈ విషయము ముందే శిశుపాల వధలో వివరింపబడినది.

## గ్రీష్మము-కుమారసంభవము (నన్నెచోడ)

పార్వతి తపస్సు వర్షర్తువుతో మొదలై గ్రీష్మముతో ముగియుచున్నది. తపస్సుయొక్క తీవ్రత అంతకంతకు పెరిగి గ్రీష్మమున పరాకాష్ఠనొందినది. అందులకే గ్రీష్మర్తువు నందలి భీకరత్వమునే వర్ణించినాడు నన్నెచోడుడు. అప్పటిపూలను, మారుతమును మొదలగు వానిని వర్ణింపలేదు. దవానలమును వృద్ధిపొందించుటను, సముద్రముల శోషింపజేయుటయును, పక్షులను హతముచేయుటను,పథికజనములను బాధించుటయును, చెట్లనెండించుటయును, కొండల మండించుటయును వర్ణించుచున్నాడు-

"స్ఫురదురు దావపావకము శోషిత సింధుచయోదకంబు సం
హరిత పతంగ సంఘ మసమర్థిత మార్గిగణంబు దప్త భూ
మిరుహకులంబు వర్ధిత సమీరవిదాహ మశేష దగ్ధభూ
ధర నికరంబు నా బటు నిదాఘము పర్వెభయంకరాకృతిన్" -కుమార. 6-134.

గ్రీష్మోద్ధత్యము ననుకరించినట్లున్నది ఇందలి శైలి. గ్రీష్మ తాపము ఎంత తీవ్రముగ నున్న దనగా-

"తలచిన డెందము గందును
బలికిన నోరెల్లఁ బొక్కుఁ బ్రభసూచిన రె
ప్పలు గమరు ననగఁ బటుతర
విలయానలభాతి నెండ వేసవి గాచెన్" -కుమార. 6-135

పై పద్యమందలి భావతీవ్రత, భాషోద్వేగము మఱెందును కానము. వర్ణితవస్తువు యొక్క స్వరూప స్వభావాలు అక్షరాలలో ప్రతిబింబించినవి. అప్పటి ఎండవడను వర్ణించుచున్నాడు కవి.

"స్ఫురదారణ్య మహీధరోపరిసముద్భూతోగ్రజీ వానలో
త్కర విస్ఫార శిఖాలిగూడి రవికాంత వ్రాత సంజాత దు
స్తరతీవ్రాగ్ని చెనంగి వీచె వడ యా సంక్రుద్ధకాలాగ్ని రు
ద్ర రయోచ్ఛ్వాస సమేతమో యని జనవ్రాతంబు గంపింపగాన్'' -కుమార. 6-136

అంతకంటె మించిన వర్ణన మరొకటి. ఏనుగుల కుంభస్థలములు పగిలి అందలి ముత్యాలు మంగలమునందలి ప్రేలాలవలె ఎగిరి పడుచున్నవట.

"ఉరు నిదాఘాతపాహతిఁగరుల తలలు
వ్రస్సితోపల ముత్యముల్ వరుస మెఱసి
మంగలములోని ప్రేలల భంగి దూలి
ప్రేలిపడగాఁ జెగట్టెండ పిడువరించి" - కుమార. 6-137.

ఆ సమయమున అవియని గండశైలములు, మొదలంట నెండిపోని మ్రాకులు, ఇంకి పోయి బీటలు వారని యేళ్ళు, తలలు పగలని పాంథులు లేరట (6-138). అన్నిటికన్న గొప్పవర్ణన మరొకటి గలదు. అది ఒకానొక సహజస్థితికి కారణము కల్పించి మనోజ్ఞముగ చెప్పుట. విష్ణువు నివాసము శరధి. హరునితలపై గంగ స్వతస్సిద్ధమైనది. బ్రహ్మ పద్మమునందు పుట్టుట సహజమైనది. వారట్టిస్థితిని పొందుట గ్రీష్మభయము చేతనట.

"హరి శరధిఁ గ్రుంకె నభవుడు
సురనది దలదాల్చె నబ్జజుడు గ్రమ్మఱ నం
బురుహంబు సొచ్చె నతి దు
స్తర దుస్సహ తీవ్రతర నిదాఘ భయమునన్" -కుమార. 6-139.

గ్రీష్మర్తు స్వభావము నెఱిగిన కవి, దాని స్వరూప స్వభావములను అనుగుణ భాషోద్వేగముతో వర్ణించినాడు.

సంకుసాల నృసింహకవి తన కవికర్ణ రసాయనమున పై పద్యమును మక్కువతో దాదాపు ఉన్నదున్నట్లుగా స్వీకరించినాడు.

> హరి జలధి నాక్రమించెను హరునంతటి వాడు నద్రి నధివసియించెన్
> నరపతి మాత్రున కరిజన దురధిగమంబైన యట్టి దుర్గము వలదే" —కవికర్ణ 2-20

నన్నెచోడుని తర్వాతి కవియగు ఎఱ్ఱాప్రెగడ హరివంశమందు గూడ ఈ ఛాయలు కనిపించుచున్నవి. భావము ఎంతయో గొప్పగ నున్నది. కావుననే ఎఱ్ఱాప్రెగడ వంటి ప్రబంధపరమేశ్వరుడు అనువదించుకొన్నాడు నన్నెచోడుని నుండి.

> "హరి యంభోనిధి సొచ్చె శంభుడు తుషారాద్రి ప్రభుం బ్రాకె వా
> గ్వరుడుద్యన్మకరంద దుర్దిన సమగ్రంబైన యుత్ఫుల్ల పం
> కరుహంబున్ భజియించె దీని మును గల్గంగాంచియే గాక యె
> వ్వరి నింకేల సహించు గ్రీష్మమనగా వర్ధిల్లె(దాపోద్ధతుల్"
> —హరివంశము. పూర్వభాగము. ఆ. 6

పార్వతీదేవి తపస్సు కొంత కొంత ఫలించుచున్నట్లుగా ఆమె కొంచెము కొంచెమే గ్రీష్మమున కరిగి పోవుచున్నదని వర్ణించుచున్నాడు నన్నెచోడుడు.

> "ఉగ్రతపమున దోడ్తోన విగ్రహంబు
> చాల శోషించె బ్రాలేయ శైలతనయ
> యర్ధనారిగా దన దేహ మభవుమేన
> నల్పమల్పము నంటించు నట్ల వోలె'' —కుమా. 6-92.

పై చెప్పబడిన ఉత్ప్రేక్ష సార్థకముగా ప్రయోగింపబడినది.

తపస్సు యొక్క తీవ్రతను సూచించు పదజాలమును కాళిదాసు వాడలేదు. పంచాగ్నుల మధ్య నిలిచి సూర్యునే చూచుచుండిన దని వర్ణించినాడు.

> "శుచౌ చతుర్ణాం జ్వలతాం హవిర్భుజాం
> శుచి స్మితా మధ్యగతా సుమధ్యమా
> విజిత్య నేత్ర ప్రతిఘాతినీం ప్రభా
> మనన్యదృష్టి స్సవితార మైక్షత'' - కాళి. కుమా, 5-2°.

నన్నెచోడుని వర్ణనలోని తీవ్రత యిందు లేదు.

కాళిదాసు ఋతుసంహారమున గ్రీష్మర్తు వర్ణన గలదు. ఇందు గ్రీష్మమున ప్రకృతి యెట్లుండునో వర్ణింపబడినది. శిశుపాలవధలో గూడ గ్రీష్మర్తువునందలి శృంగార పక్షమే వర్ణితము,

నన్నెచోడనిలో నున్నంత సహజత్వము, భావోద్రేకము, భాషోద్వేగము పై వారిలో లేవు. తర్వాతివాడగు కృష్ణరాయలయందుగూడలేదు. ఇతర కవులెవ్వరు నింత విపులముగా, ప్రత్యేకముగా గ్రీష్మర్తువర్ణన చేయలేదన వచ్చును.

## గ్రీష్మర్తువు-మనుచరిత్ర

పెద్దన తన మనుచరిత్రమందు ఋతువర్ణనకు ప్రాధాన్య మీయలేదు. వరూధినీ ప్రవరఘట్టము వసంతమున నడిచినట్లు వర్ణనబట్టి యూహింపనగును. అంతేగాని ప్రత్యేక ముగ ఋతు వర్ణన చేయలేదు.

## గ్రీష్మర్తువు-పారిజాతాపహరణము

ముక్కు-తిమ్మన గూడ అన్ని ఋతువులను వర్ణింపలేదు. శ్రీకృష్ణసత్యాభామల వనవిహారమున వసంతమునే ఎక్కువగ వర్ణించినాడు. వర్షర్తువుతో ప్రారంభించి ఒక్క సారిగా అన్ని ఋతువులును వచ్చినట్లు ఒక సీసపద్యములో వర్ణించినాడు (పారి. 3-46).

## గ్రీష్మర్తువు - ఆముక్తమాల్యద

ఆముక్తమాల్యదయందు రాయలు ముఖ్యముగా గ్రీష్మ వర్ష శరద్వసంతముల క్రమముగా వర్ణించినాడు. ప్రబంధకవు లందఱిలోను-ఋతువర్ణనలను సహజ సుంద రముగ, రసపూర్ణముగ, చేసిన కీర్తి ఒక్క రాయలకే దక్కినది. ఋతువర్ణనా సమగ్ర తకు ఆముక్తమాల్యదయే ప్రతీకకావ్యము. నాలుగు ఋతువులునుకలిసి మొత్తము 225 పద్యాలలో వర్ణింపబడినవి.

రాయలవారు గూడ గ్రీష్మమునే మొదట వర్ణించినాడు. ఈ విషయమున నితడు కాళిదాసును అనుసరించినాడన వలెను.

మొత్తము గ్రీష్మవర్ణన యిరువదియారు పద్యాలలో సాగినది. పాటలవృక్షముల, ఎండమావుల వర్ణనతో గ్రీష్మము ప్రారంభమగుచున్నది.

"పాటల వసుంధరారుహ భాగధేయ
మాతత మరీచికాంబు వర్షాగమంబు
ధరణి బొడసూపె నంత నిదాఘసమయ
మదటుతో శాల్మలీ ఫల విదళనంబు"

-ఆము. 2-45

ఖూరుగపండ్లు పండి, యెండి, యెండకు పగిలిపోవుట పైన వర్ణించినాడు.

రాయల వర్ణనలలో లోకజ్ఞత, స్వానుభవము, సూక్ష్మపరిశీలనము, ఎక్కువగా కన్పట్టును. సెలయేళ్ళు ఎండిపోగనే సేటులం దిదివఱకు పట్టియున్న పాచి వేళ్లెగిర పోయినది (2-46). గువ్వల పట్టుటకై అక్కడక్కడ బోయలుపోసిన నీరుమాత్రము కని పించు చున్నది (2-46). దిశలన్నియు ఉదికి ఆరవేసిన చీరలవలె తెల్లగా (ఎండమావుల చేత) నున్నవి (2-46).

కరులు, కిరులు, కాసరములు, ఎండకు తాళలేవు. అందులకే యవి గ్రీష్మమున నీటియందు పొరలు చుండును. నీరు ఆవిరయిపోయినపుడు బురదలో పొరలును. ఆ బురద వానికంటుకొని ఎండకు ఎండి మైపూతలవలె నుండును. అవి యన్నియు మట్టితో చేసిన బొమ్మలవలె నుండును. ఇది గ్రీష్మమందలి ప్రకృతి సహజత్వము. ఈ గ్రీష్మపు తాకిడికి తట్టుకొనకజాలక యేనుగులు, పందులు, మహిషములు చనిపోవుననియు, గ్రీష్మము దాటి వానిని మరల సృష్టిచేయవలయు ననియు, అందులకు బ్రహ్మ మూసలు కట్టి ఆరబెట్టినాడాయనన్నట్లుగా కరి కిరి కాసరములు మట్టిపూతలతో నొప్పుయున్న వనియు ఉత్ప్రేక్షించు చున్నాడు.

"సరియగు నిట్టవెట్ట నివి సర్వమునంచటమీది సృష్టికై
శరధిప నిజ్ఝరుజ్జ్వలిత చండతరాతప వహ్ని వాఁగా
గరువులఁజుండు పీనిపయి గట్టెసనన్ గముపట్టె వెచ్చలన్
గరికిరికాసరాంగముల గప్పిన ఔంపులు నందయాఁఅగన్"                    —ఆము. 2-47

ఈ క్రింది సుడిగాడ్పులు గొప్పగా వర్ణితములు.

"దవ ధూమంపుఁ దమంబులోఁ దమరసద్రవ్యంబు బంకేజబాం
ధవు ఖాను ప్రతతుల్ హరింప గుయివెంటన్ వెళ్లు కూన్యోరుకూ
ప వితానంబన జూడజూడ బుడమిన్ బాటిల్లి పైనిప్పులై
యవసంబంచుల నాడగా నెగసె వాత్యాళి నక్షత్రక్రముల్"                    —ఆము. 2-48

పై విధముగ సుడిగాడ్పుల వర్ణించిన వర్ణన రాయలసొంతమే అనవలసి యున్నది.

దివసములు దీర్ఘములగుట అను ప్రకృతి సత్యమునకు కారణము కల్పించు చున్నాడు కవి. సూర్యుని రథసారథి అనూరుడు, పగ్గములు పాములు. ఎండవేడిమికి తాళలేక వేడియాహారము (గాలి) భుజింపలేక చిక్కిపోయిన ఆ పాప (సజీవములైన) పగ్గములు వీడిపోవుచుండగా వానిని మరల నురల ముడివేసికొనుటకు రథమునాపుచు ప్రయాణము సాగించుటవలన దినములు దీర్ఘములయినవి.

"పడమర వెట్టు నయ్యుడుకు ప్రాశన మొల్లక కూటిపేదలై
బడలిక నూడు నచ్చిలువ ప్రగ్గములన్ రవి యాజ్ఞమాటికిన్

ముడియిడఁ బిచ్చుకుంటు రథమున్నిలుప న్పయనంబు సాగమిన్
జడనువహించెనాగ దివసంబులు దీర్ఘములయ్యె నత్తఱిన్'' --ఆము. 2-40

బల్లాలసేనుడు రచించిన భోజప్రబంధములో నిట్టి వర్ణనే కాకున్నను భావము కొంత యున్నది. భోజుడు సమస్య నీయగా పూరించిన శ్లోకమిది.

"రథస్యైకం చక్రం భుజగయమితాః సప్తతురగాః
నిరాలంబో మార్గశ్చరణ వికలః సారథిరపి
రవిర్యాత్యే వాన్తం ప్రతిదిన మపారస్య నభసః
క్రియాసిద్ధిస్సత్వేభవతి మహతాం నోపకరణే" --భోజ ప్రబం.

శ్లోకమున సూర్యుని గుఱ్ఱములకు కట్టిన పగ్గములు పాములని వర్ణింపబడినది.

చెలమల నీళ్లయందు ప్రతిబింబించినసూర్యబింబము దేదీప్యమానమై,వరుణ వియోగమువలన గలిగిన తాపముఁనుచల్లార్చుటకై వహించిన దట్టపుము త్తెపుసరులా యన్నట్లు కనిపించినది (ఆము. 2-51).

నీరెండిన మడుగులందలి తామరపూల రేకులు వాలిపోయి దుద్దులు మాత్రము పైకెత్తి పట్టినట్లుగా నుండును. మేఘములుగదా (వాన గురిసి) నదులను సముద్రునితో కలుపు కుంటెన కత్తెలు! ఇపుడా మేఘములకు లంచమిచ్చినచో నయినను తమ ప్రభువు దగ్గఱికి తీసికొని పోవునేమో యన్న తలచేత నదులు మేఘములకోసరమై లంచపు రూకలను చేతితో పైకెత్తి చూపుచున్నవా యన్నట్లున్నవట తామరల దుద్దులు. (2-52) ఇది చాల సహజ వర్ణన. ఇదిగూడ ప్రకృతి మానవీకరణకు ఉదాహరణమే!

వేసవియందు కొంగలయొక్క ఆటలను, పాట్లను, సహజముగ, చమత్కారముగ వర్ణించుచున్నాడు. మొసళ్లపాట్లను, మలుగుచేపల పాట్లను గూడ సహజవర్ణన చేయుచున్నాడు. ఈ వర్ణన మరి యే ఆంధ్రప్రబంధమందును లేదు.

"నులివాడు నాచువల్లుల గొంతొగర్చి శే
బోల వల్చుగాలి వేపోక నెఱిగి
కడకు వెళ్ళగ నొక్కకడనుండి త్రొక్కుచు
మలుచల జిఱుతగుల్లల నిమలుచు
నెంద్రి కాలికికవ నెగసి యొక్కించుక
తొలగి శితత్రోటి దూటి తినుచు
దడియింకునిల జేనుమడివోని తమ్మిగుం
పులను జీగులుల నెండలు గడుపుచు

దనరు బకపంక్తులకు జానుదఘ్నమయ్యె
జెరువుగమి, యుడుములన రేల్ దిరిగె గుక్క
వసికి బావుల బడుటకు బసుల యెరుపు
టెఱలకు మొసళ్ళు-మలుగు మీల్ బొరియ దూఱె'' --ఆము. 2-53

ఎంతయో ప్రకృతి పరిశీలన చేసిన గాని పై విషయములు తెలియవు. స్థూలదృష్టితో నీ దృశ్యముల నన్నిటిని అందరును చూచినవారే. కాని సూక్ష్మదృష్టితో పరికించి వాని స్వభావముల నెందఱు చెప్పగలరు? కొంగలకు నీరు జానుదఘ్నముగా నున్నది. వాని ఆహారము: కొలదిగ వాడిన నాచు తీగల బొబ్బరలను తిని, గొంతు ఒగరెక్కగా నిలుచుండి, చేపలవాసనగల గాలి వీచుటచే కొంతసేపు పొంచియుండి, కాళ్లతో త్రొక్కి, దొరికిన ఉలస చేపలను, నత్తగుల్లలనుతినుచు ఎండ్రకాయ కాలికి కరుచుకోగా కొంచెము తొలగి దానిని ముక్కుతో చిదిపి నములుచు, నీరింకిన చేమకూరమడివంటి తామర గుంపుల యందును, జీలుగ పొదలయందును, ఎండలు గడుపుకొనుచున్నవి కొంగలు. ఉలసలు వేసవిలో దొరకుట అన్నది ప్రకృతి సత్యము.

ఉడుములు ఎనుపులలోని ఎట్టలకొఱకు ప్రాకులాడుట సహజము. నీరు ఇంకి పోవుచుండగా మొసళ్లకు స్థానములేక అవి భూమిపైకి ఉడుములవలె ప్రాకుచున్నవట! ఉడుములను కుక్కలు తరుముట సహజము. కుక్కలకు వెఱచి పరుగిడి బావులలో పడు ఉడుముల వలె మొసళ్ళు పడ్డవట!

మలుగు చేపలు పాము ఆకారములో నుండును. పాములవలె అవిగూడ బొరియలలో దూరుచున్నవని పై వర్ణన.

పై పద్యమున గల ప్రకృతి వర్ణన అతి సహజమైనది. కాన ప్రజ్ఞగల కవియే అట్టి వర్ణనలు చేయును. ఈ వర్ణనగూడ రాయలవారి ప్రత్యేకతనే చాటుచున్నది. ఈ క్రింది వర్ణనము పరికించునది :—

"మీటగు మీలనెల్ల మును మ్రింగి క్రమంబున నైన యెండ పె
న్పీటిక వెంట దోచు తొగవేరుబడిన్ గొడుపై చెలంగగా
త్రోటిక కర్దమద్రవముతోనె నశించిన బొమ్మడాయడా
తూ్కట కుఱుబం దినె బకోటకులంబు జలహ్రదంబులన్" —ఆము. 2-54

నీరింకిపోగా బీటలు వారిన బురదపగుళ్లలో నుండిన బొమ్మిడాయలను, డాతూ్కటము లను కొంగలు తినుచున్నవి. పైకి బురద పగుళ్లు తీసినదిగాని లోపల బాగుగా తేమగా బంకగా నున్నది. ఎంతయో సూక్ష్మపరిశీలన!

చకోరములకు ప్రియమైన వెన్నెలను అపూర్వముగ వర్ణించుచున్నాడు.

"ఎసగు కట్టావిక్రియ నావిరెగయఁ బగటి
కొండ యుడు కారకుండు భూమండలమున
బొలిచె మాపట బండు వెన్నెల చకోర
పోత వితతికి జావట్టు వోసినట్టు" —ఆము. 2-60

మాడుచున్న పెనముమీద నోసెపిండి పోయగనే అవిరెగయును. ఎండలకు కాలిన భూమి గూడ ఇపుడు అటులనే వేడెక్కియున్నది. వెన్నెల కాయగనే ఆ తెల్లని వెన్నెల దోసెపోసినట్లుగా చకోరపు పిల్లలకు కన్పట్టినది. పై ఉపమానము మనోహరము.

వేసవి రాత్రులందు పండు వెన్నెలను-ఆ వెన్నెలలందు రతి క్రీడలను వర్ణించుట ఒక ప్రక్రియయై పోయినది. ఈ వర్ణన యందు గూడ రాయలవారిదే పైచేయి.
"పవలెల్ల దీర్ఘికాంబువు చల్లు పోరాట..."(ఆము. 2-61)

వేసవిలో చెఱకు పంట విరివిగా నుండుట సహజము. ఆ సహజ ప్రకృతిని క్రింది విధముగ నుత్ప్రేక్షించుచున్నాడు.

> "అట్టి వేసవి బెడిసంపు వెట్ట కతన హస్తము సెమర్ప సారెకుల స్తకంబు
> దుసికిలగ గాదె సవరింప వనముగాక పుష్పబాణుని చెఱకువిల్ పుడమిబడియె"
>
> —ఆము. 2-66

కూపోదకవర్ణన

> "కూపోదకం వటచ్ఛాయా తాంబూలం తరుణీకుచా
> శీతకాలే భవేదుష్ణ ముష్ణకాలేతు శీతలం" -అనునది లోకోక్తి.

కూపోదకము వేసవిలో చాలచల్లగ నుండును. అందులకు కారణమును రాయలు వివరించుచున్నాడు.

> "తరుణుల్గల్లి యొరయ స్తుచంబు లునుపం దచ్చైత్యముల్దీములై
> పెరరేపం జనుదెంచెగాక రవి దీప్తిం గ్రుంకి పాతాళగ
> హ్వరముం దూఱిన వారి నీయదకు ద్రాళ్లా తెచ్చునా దీర్ఘత
> చ్చిరకృష్టిం గనునట్టి శైత్యమలరించె న్నూతులం దత్తటిన్" -ఆము. 2-67

బావులనుండి నీరు చేదునపుడు తరుణులు తమకుచములను త్రల్లి యొఱకానించగా ఆ కుచశైత్యములు పాటిగువ్వలై పాతాళమున దాగియున్న జలమును రేపి తెచ్చినవి గాని యీముళ్లు వేసినత్రాళ్ళు తెచ్చునా యన్నట్లు వేసవిలో నూతినీరు అంత చల్లగా నున్నదని భావము. నూతులలోని నీరు పాతాళమంటినదనియు భావము.

మల్లెలును పాదిరి పువ్వులును వర్ణితములు

వేసవియందు మల్లెలు విశేషము. మల్లెలకది ఋతువు. స్త్రీలు మల్లెలను, పాటల పుష్పములను, తలలో ధరింతురు. ఇవి రెండును ఓషధీజాతులు గాన తోబుట్టువులు. కాని విరుద్ధగుణములు గలవి.

> "స్వనిదానోగ్ర నిదాఘవైఖరిన యూష్మన్మల్లికల్ కామినీ
> కనదానీలకచాగ్ర పంక్తి నెఱియల్గా బాపగా బాటల
> ఘ్నినతం దేనియసోన గూర్చునది యాగా నాఖియున్ నిర్విషం
> బును దోబుట్టువులయ్యు వేర్పడ గుణంబులూనపగా జూడమే" -ఆము. 2-68

మల్లెలు విచ్చి కచముల విడదీయును. కలిగొట్టు పువ్వులు తమ తేనె సొనలచే వానిని మరల నదికించును. విషమును, విషహారమును ఓషధీజాతులేగదా; తోబుట్టువులు గూడ. కాని వాని గుణములు విరుద్ధములు, అట్లే ఒకే ఋతువున బుట్టిన మల్లెలును, కలిగొట్టుపూలును. ఇట్టి అమోఘ భావ కలిత వర్ణనలు చేయుటలో రాయలగ్రగణ్యుడు.

ఎండకాలము చేపలు ఎక్కువగ దొరకును. మామిడికాయలు దొరకును. వీని రెండింటిని కలిపి చేసిన కూర చాల రుచిగ నుండును. దానిని తిని జీర్ణమగునపుడు త్రేపగా వచ్చు కనరు పోవుటకును, ఉష్ణము తగ్గుటకును ఇసుకలో పూడ్చిన టెంకాయ నీరు (చల్లగానుండును) త్రాగెడివారట ధనవంతులు. అది యిట గొప్పగా వర్ణితము. ఆముక్తమాల్యద యందలి అర్థపూర్ణ, సహజ, మనోహరవర్ణనతో కూడిన పద్యాలలో నిది యొకటి.

> "తారుణ్యాతిగ చూతనూత్న ఫలయుక్తైలాభిఘారస్వన
> ద్ధారా ధూపిత శుష్యదంబుహ్రుత మాత్స్యచ్ఛేద పాకోద్గతో
> ద్గారం పుంగన రార్చు భోగులకు సంధ్యావేళలంగేళికాం
> తారాభ్యంతర వాలుకా స్థితహిమాంతర్నారికేళాంబువుల్" -ఆము. 2-69

గ్రీష్మర్తువర్ణన విపులముగ జేసిన కవులు నన్నెచోడుడును, రాయలును. నన్నెచోడుని కుమార సంభవమున గ్రీష్మర్తువర్ణన ప్రకరణానుబంధము గలది. పార్వతీదేవి తపస్త్రీవ్రతను అనుగమించి నడచిన శైలి అది. రాయలవారిదిక్కడ శృంగార దృష్టియును కేవల వర్ణనా దృష్టియును. మత్స్యధ్వజుడు వేశ్యాయింటికి బయలుదేరుటకు ముందు గ్రీష్మర్తువర్ణన ప్రారంభమైనది.

గ్రీష్మర్తువు గాబట్టి పరదేశి వైష్ణవుడు బయలులో పండుకొన్నాడని చెప్పుట వలకే ఈ వర్ణనకు కథతో సంబంధము. అనగా కథతో సంబంధము లేదనియే చెప్పవచ్చును. ఇందు సహజప్రకృతి వర్ణనకే స్థానము. శృంగారప్రకృతికి స్థానముగూడను.

రాయలలో గల ఋతుపరిజ్ఞానము మరొక కవికిలేదు. ఇంత సార్థకముగ సహజ సుందరముగ గ్రీష్మము మరెందును వర్ణింపబడలేదు.

## గ్రీష్మ ఋతువు - కళాపూర్ణోదయము

వివాహానంతరము మధురలాలసయు, కళాపూర్ణుండును, కేళీవిలాసములతో ప్రొద్దుపుచ్చు సమయమున వరుసగా షడృతువులును వర్ణితములు. వసంతర్తువు పోగానే—

"కమల సౌగంధికి గంధవాసిత సర్వ
దిక్కంబులగు కేళిదీర్ఘికలను
బన్నీట తువ్వరఁ బరగించు ధారాగృ
హంబుల ఘలనాడంబరముల
వెండి వెన్నెలల జిప్పిలు చంద్రకాంతంబు
మేడలమీది సంక్రీడనవముల
జెంగల్వరేకుల సెజ్జల నొప్పు క
ర్పూర వేదికల విహారములను

వలిపె చెంగావులను ముత్యముల తొడవుల
మల్లె పూవుల దండల మలయజాంగ
రాగముల సంతతము ననురాగ మమర
గడపిరా దంపతులు గ్రీష్మకాలమెల్ల" —కళా. 7-178.

పైని గ్రీష్మమని చెప్పియుండనిచో దాదాపిది వసంతవర్ణన యనియే యనుకొన వచ్చును. ప్రకృతిలోని నీరింకి పోవచ్చును. కాని కేళీదీర్ఘికలు ఇంకలేదు. ధారా గృహములు కలవారికొఱకు నిర్మితములు. చంద్రకాంతపు మేడలును కలవారివే. చెంగల్వ రేకుల సెజ్జ, కర్పూరవేదికలు, మల్లెదండలు, ముత్యాలసేర్లు, గంధము—ఇవన్నియును చలువ గలిగించు వస్తువులు. వీని ప్రాశస్త్యము గ్రీష్మమున వర్ణించి తీరవలెను. విశద ముగ వర్ణింపక ఒక్క పద్యములోననే సర్వవిషయములను చెప్పినాడు సూరన. గ్రీష్మర్తువు ప్రభావతీ ప్రద్యుమ్నమునందును, వసుచరిత్ర యందును, విజయ విలాస మందును లేదు.

## వర్షర్తు వర్ణన

గ్రీష్మతాపమును చల్లార్చునది వర్షమే! వర్షము మానవ మానవేతర ప్రకృతికి జీవనాధారము. అందులకే వర్షర్తు వర్ణనకు ప్రత్యేక పరిగణన యున్నది. చాల కావ్యము లందిది ఋతువుగా కాకపోయినను, కేవల వర్షముగ నైనను వర్ణితమయి యున్నది.

వర్ష వర్ణనయును, వర్ష ర్తువును గురించియును, వేదములందే చెప్పబడియున్నది. ఇది కావ్యగత వర్ణనగా, ఆది కావ్యమయిన రామాయణ మందు ప్రత్యక్షమగుచున్నది. అనేక ఉత్ప్రేక్షలతో వర్ణింప బడినది. అందు సహజవర్ణనలును, భావాత్మక వర్ణనలును గలవు. మేఘములు, వర్ష ధారలు, చాతకములు, కొక్కెరలు, ఆరుద్రపురుగులు(ఇంద్రగోపములు), నెమిళ్లు, తుమ్మెదలు, భేకధ్వనులు, పక్షులు, యువతులు ప్రియము పొందుటలు, వర్ణితములు (కిష్కింధా. 28-22 మొదలు 58 వఱకు).

మేఘములను ఏనుగులతోడను, పర్వతముల తోడను పోల్చు సంప్రదాయము రామాయణము నుండియే యేర్పడినది. రామాయణమున నిది ప్రకరణానుబంధము గలిగియున్నది. ఎందుకనగా ప్రకృతిని చూచి దాని సాదృశ్యముతో రాముడు సీతను తలచుకొని దుఃఖించును గాన.

రామాయణము తరువాత వర్ష ర్తువర్ణన అధికముగ కన్పించుచున్నది కాళిదాసు ఋతుసంహారముననే! అందు రంగు రంగుల మేఘములును, చాతకములును, ఇంద్ర గోపములును, మయూర నాట్యములును. ఉఱుముల సందడియును, మేఘజ్యోతుల తళతళలును, కడిమిచెట్లు పుష్పించుటయును, కేతక, మద్ది, పూలవాసనలును వర్ణితములు. (ఋతు. 2-2 నుండి 18 వఱకు) తరువాత మాఘుని శిశుపాలవధలో గూడ పై వర్ణనలు చాలవఱకు గలవు (శిశు. 6-25 మొదలు 65 వఱకు).

భరతుడు తన నాట్యశాస్త్రమున వర్ష ర్తువును సూచించుట కెట్లభినయింపవలెనో నిర్దేశించినాడు.

> "కాదంబనీప కుటజైః శాద్వలైస్సేంద్రగోపకైః
> మేఘవాతై స్సుఖస్పర్శైః ప్రావృట్కాలం ప్రదర్శయేత్
> మేఘౌఘనాదైర్గంభీరైః ధారాప్రపతనైస్తథా
> విద్యున్నిర్ఘాత ఘోషైశ్చ వర్షారాత్రం సమాదిశేత్"
>
> -భర. నాట్య. 25 అధ్యా. 35, 36.

(కదంబ, నీపకుటజముల చేతను, ఇంద్రగోపములచేతను, మేఘవాయువుల సంబంధమైన సుఖస్పర్శచేతను, ప్రావృట్కాలమును సూచింపవలెను. గంభీర మేఘనాదములతోడను, వర్ష ధారల చేతను, పిడుగుపాట్ల ధ్వనులచేతను వర్షారాత్రులు సూచింపబడవలెను).

15వ శతాబ్ది వాడయిన విన్నకోట పెద్దన "తటిత్తు, మేఘపటలి, శక్రచాపము, ధారాపాతాద్యులు" ఉండవలెనన్నాడు.

అష్టాదశవర్ణనా నియమము "పాటించిన మాఘుడు" శిశుపాల వధలో వర్షర్తువర్ణన చక్కగ చేసినాడు మెఱుపుల తళతళలును, మేఘాలనీలత్వమును, అభిసారికా సంచార

మును, తమాలాతిశయమును, పాంథుల బాధయును, మయూరానందమును మొదలుగా రసవత్తర వర్ణనలు చేసియున్నాడు.

ప్రబంధకవులు పై లక్ష్య లక్షణకావ్యము లన్నియు చదివినవారు. ఆ వర్ణనల జీర్ణించుకొని వారికంటె బాగుగా రచింపవలెనను నుద్దేశముతో రచన చేసినారు.

## వర్షర్తువర్ణన—కుమారసంభవము

పార్వతి ఘోరముగ తపస్సు చేయుచున్నది. ఎండకు భయపడలేదు. ఎండనయినను భరింపవీలుగలుగును కాని వర్షమునకు ప్రాణికోటి శరీరము నర్పించి తాళలేదు. పార్వతి అట్టి ప్రతికూలవాతావరణమునకు గూడ తట్టుకొనుచున్నదని నిరూపించుటకే యీ వర్ష వర్ణన.

గ్రీష్మమందు బాధపడిన ప్రకృతి సర్వస్వమును వర్షర్తువున అహ్లాదము పొందును. అప్పటి వర్షర్తువు-

"గత సంతాపము శీతలీకృత మహీ కాంతాంగ మత్యుద్గత
స్మిత కుందోత్కర కేతకీకుటజరాజీ భ్రాజితామోద మూ
ర్జితవల్లీ ప్రకరంబు వర్ధిత శిఖిశ్రేణీ ప్రమోదంబు ర
మ్యతరంబై కుతలంబు నాబరగె వర్షారంభ మత్యున్నతిన్" -కుమా. 6-94.

"దిశల బొలయ మెఱుగుదృష్టులు ఘుర్ఘుర
గర్జనంబులులియు గజవగతులు
ఘనపయోధరములు దనరంగ జవ్వని
వోలె వచ్చె వానకాల మర్థి" -కుమా. 6-95

కుంద, కేతకీ, కుటజములకు వృద్ధికరమైనది వర్షాకాలము. తీగలు ననలువేసి సాగును. నెమిళ్లకు ఆనందము కలుగును. మెఱుపులను చూపులతో గజరాజ గమనముతో, ఘన పయోధరములతో మదవతి వలె వర్షాకాలము ప్రవేశించినది. ఇది చాల రసవత్తరమైన, శృంగారభావ పూర్ణమైన వర్ణన.

తరువాత వానకాళ్లను, వడగండ్లను, చాతకములను వర్ణించినాడు కవి (కుమా. 16-97 నుండి 99 వఱకు)

ఇంద్రగోపములను గొప్పగా ఉత్ప్రేక్షించినాడు. భావము అపూర్వము.

"కారెను వీరుడు, మెఱుగను
దోరసి బాంధవుల రిపుల, దున్నిమిన దద్దే

హారుణబిందులు దొరిగెనో
ధారుణినన నింద్రగోపతతి విలసిల్లెన్" -కుమార. 6-101.

ఇంద్రధనుస్సుయొక్క శోభ భూమ్యాకాశములను కలుపుచున్నట్లు వర్ణితము. వర్ణన సుందరము.

"సురపగోపచాప శోభితంబై యుండు
నవ పయోద వేళ భువియు దివియు
దెసలు దీటుకొనగ దృణఘన నివహ సం
ఛన్నమయ్యె మఱియు మన్ను మిన్ను" -కుమార. 6-102.

రాజాస్థానమున నాట్యముచేసి నట్లున్నది ఈ క్రింది మయూర నాట్యము—

"అక్రోకాకారను రాజు మ్రోల నిజరావానంత గేయాభ్ర నా
దైకాతోద్యము గూర్చి మ్రోయ సురగోపాంభోజరాగత్విషా
సీకోద్యద్ధరి దశ్మక స్థలస న్నృత్యో రురంగ స్థలిన్
గేకీ పాత్రము లాడె భావముగ నుత్ క్షిప్తాగ్ర పింఛంబులై"
-కుమార. 6-103.

పై రూపకాలంకారము శోభావహమయినది. అనితరసాధ్యమైనవర్ణన. క్రోకాకారు రాజుగా, మేఘధ్వనులు కేకులకేకలుగా, రక్తాంభోజములు ఇంద్రగోపములుగా, పచ్చ రాతి ప్రదేశము నాట్యరంగస్థలముగా, గొప్పనాట్యము జరిగినది. ఇది రాజాస్థానమున జరుగు నాట్యప్రదర్శనమును గుర్తుకు తెచ్చుచున్నది. నన్నెచోడుడు మహారాజకవి గాన ఇట్టి వర్ణన చేసినాడన్నచో సత్కారికమే యగును.

వాల్మీకి రామాయణమందుగూడ వర్షర్తువున నెమిళ్ళు నాట్యము చేయుటను వర్ణించినాడు—

"క్వచిత్ ప్రవృత్తైః క్వచిదున్నదద్భిః క్వచిచ్చవృక్షాగ్రనిషణ్ణకాయైః
వ్యాలంబి బర్హా భరణైర్మయూరైః వనేషు సంగీత మివప్రవృత్తం"
-రామా. కిష్కింధా. 28-55.

వాల్మీకి మునికిని నన్నెచోడ మహారాజునకును గల దృష్టి భేదము నిది చాటుచున్నది.

ఆ తర్వాతి వర్ణన అమేయ భావసుందర మయినది. మిన్ను మన్నేకమై వర్షము కురియుచున్న వర్షమొక ప్రవాహముగా నున్నది.

పైన రూపకాలంకారము శోభాయమానమై యున్నది. మిన్నుమన్నేకమయి నట్లుగ వర్షము కురియుచున్నది. ఎడతెఱిపిలేక పడుచున్న వర్షము ఒక ప్రవాహముగా నున్నది. ప్రవాహమున్ననేగదా చేపలు ప్రయాణము చేయుటకు వీలగుట! ఇప్పుడు ఆకాశగంగలోని చేపలు సముద్రములోనికిని సముద్రములోని చేపలు ఆకాశగంగలోనికిని

పయనించుచున్నవని కవి యుత్ప్రేక్షించుచున్నాడు. ఇది అమేయ భావనా సంజనితమైన వర్ణన.

"సురనది ఝుషములు డిగ్గగ
శరనిధి శాశరథిలోని ఘషకము లెక్కన్
సురనది కిల్లెడ పడకయ
కురిసె మహావృష్టి గుండ్లు కూల్చిన భంగిన్" —కుమార. 6-105.

మదాంధ గంధ సింధురములవలె నదులన్నియు గట్లను కోయుచు భయంకరాకృతిలో వృక్షములను వేళ్లతోగూడ కుళ్లగించి వేయుచు, మడువుల నన్నిటిని కలచి వేయుచు, పద్మములను లాగివేయుచు, ప్రవహించు చున్నవని రూపించినాడు. ప్రవాహమును మదపుటేనుగునకు పోల్చుట ఎంతయో ఉదాత్తమును, ఔచిత్య భరితమును అగుచున్నది. (6-106)

పార్వతి తపమునకు మెచ్చి సురలు పూల వర్షము కురిపించిరా యన్నట్లుగ పార్వతి జడలపై అంబుకణములు ప్రకాశించినవి (6-108) అపుడు—

"అడరు నవాంబుధారలు జటాటవిలో బడి విభ్రమించి వె
ల్వడి చనుదెంచి తాలుగొని పక్ష్మములన్ వెడనిల్చి మోవిపై
బడి కుచఘట్టనం జెదిరి పాటి లయంబున ముత్తరంగలన్
మడుగులువాటి నాభిశెడమానక( జొచ్చెనను క్రమంబునన్" —కుమార. 6-110

నీటిధారలు తలనుండి జారి కనురెప్పలపై పడి, అందుండి పెదవులపై బడి, తర్వాత కుచములపై బడి, అక్కడినుండి వళిత్రయమున చొరబారి, అందుండి నాభిప్రవేశించినవని క్రమముగా వర్ణించినాడు. ఈ వర్ణన కాళిదాసు కుమారసంభవమందలి శ్లోకమునకు అనువాదముగా నున్నది.

"స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః
పయోధరోత్సేధ నిపాత చూర్ణితాః
వలీసు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే
చిరేణ నాభిం ప్రథమోద బిన్దవః"

కాళిదాసు వర్షావర్ణన కేవలము పై శ్లోకమే. ఇంకొక శ్లోకమున తటిత్తును వర్ణించినాడు. కుమారసంభవకారుడైన నన్నెచోడుడు పదునేడు పద్యాలలో బ్రహ్మాండమైన వర్షము కురియించినాడు.

కాళిదాసు ప్రథమమైన ఉదబిందువులను పై శ్లోకమున వర్ణించినాడు. కొలది పాటి వర్షమే అని భావింపవలసి వచ్చుచున్నది. నన్నెచోడుడట్లుకాక గొప్పగా వర్షించి

నట్లు వర్ణించినాడు. పెద్ద వర్షము చాలసేపు కురిసిననే తలనుండి ఆ విధముగ నీరు ప్రవహించుట జరుగును.

కాళిదాసు నాలుగు శ్లోకములలో సూచించి వదలగా నన్నెచోడుడు ఆలంకారిక ముగ పదునేడు పద్యాలలో ప్రౌఢమైన వర్ణన చేసినాడు.

## వర్తువు-మనుచరిత్ర

మనుచరిత్రలో వర్షర్తువర్ణనలేదు. కాని వర్షవర్ణన గలదు. అదియును స్వరోచి వేటకు వెళ్ళుటకు ముందు.

"కరకా చిటపటరవ భీ
కరమై ఫెళఫెళ నినాదఘనమై ఝుంఝూ
మరుదుజ్జ్విత బిలమంద్ర
స్వరమై యక్కొండనొక్క వర్షము కురిసెన్" -మను. 4-11

"తెలతెలవారిన నగ్గిరి
జల జల బ్రవహించు సెలల చప్పుళ్ళు శిఖా
వలకుల కలకేకా కల
కలములు గల తలపోలంబు గనుగొను వేడ్కన్" -మను. 4-12

వర్ణిత వస్తు స్వరూప స్వభావములు శబ్దములందు ప్రతిబింబింప జేయుట అనల్ప విషయము. పై రెండు చిన్నపద్యములందు వర్షముయొక్క ధ్వనులును, సెలయేళ్ళ గలగలలును, పక్షుల కలకలారావములును ప్రతిబింబించినవి.

ఇందు కరకలు, ఘనాఘన ధ్వనులు, ఝుంఝూమారుత ధ్వనులు, సెలల చప్పుళ్ళు, నెమిళ్ళ కేకలు, వర్ణితములు.

## వర్షర్తువు-పారిజాతాపహరణము

సర్వర్తు వర్ణనతో నొక పద్యమున్నది. అంతే. ప్రత్యేకముగ వర్షర్తువర్ణన లేదు. (పారి. 3-46).

## వర్షర్తు వర్ణన-ఆముక్తమాల్యద

గ్రీష్మర్తువున మల్లెలు, పాటలములు, ఎండిన సరస్సులు, కొంగల వేటలు, చంద్రికలు, సంభోగములు, మతచర్చలు, శృంగారచేష్టలు వైరాగ్యములు, భక్తిబోధనలు, మొదలగు వన్నిటిని వర్ణించిన యనంతరము వర్షాకాల వర్ణన చేయుచున్నాడు రాయలు.

ఈ వర్ణనను వరుసగా 61 పద్యములలో వర్ణించినాడు. ఈ పద్యము లన్నిటి యందును వర్షాకాలము యొక్క వివిధ రూపములును, మానవ పశుపక్ష్యాదుల వివిధావస్థలును, వివిధ భావములును ఉత్ప్రేక్షోపమాద్యలంకార సహితములుగ ప్రతిబింబితములు. ఇంత వైవిధ్యముగ, ఇంత విశేషముగ వర్షాకాలవర్ణన చేసిన కవి ఏభాషలోను గానరాడు బాల్య యౌవన, కౌమార వృద్ధాప్యాది మానవావస్థానుగుణ భావచేష్టాదికములను--స్త్రీ పురుష భావభేదాదులను అవిద్యా విద్యాధికాది భేదములను-ప్రభుత్వోద్యోగ, సామాన్య ప్రజానీకాది భేదములను, తిర్యగాదుల స్వరూప స్వభావాదులను, ఋతుతత్వమును, రీతి రసపాక, వ్యంగ్య శ్లేష ధ్వని గుణాలంకారాదులను-చక్కగ నెరిగినవాడు గావుననే ఇంత విశదముగ, ఇంత సాకల్యముగ వర్షర్తువర్ణన గావించినాడు. అందులకే యీ ప్రకరణమున విశదముగను, విపులముగను వివరించుట జరుగుచున్నది.

సూర్యుడు కర్కటరాశియందు ప్రవేశించినపుడు వర్షర్తు వారంభమగును. అట్లు చెప్పుటకు కవి చక్కగ ఉత్ప్రేక్షించుచున్నాడు.

> "కర్కశుడంట కోర్వక కుదకంబులు వాఃపతి గూర్చినట్లు న
> య్యర్కుడుఁ దానుఁ గూర్చి మఱి యాసలిలాధిప చిహ్నవాహతం
> బెర్కలఁగంగ నాత డెలమిన్ మకరస్థితిఁగన్న నీర్ష్య దా
> గర్కటకస్థు డయ్యెనన గర్కటకస్థితిఁగాంచె నత్తఱిన్" —ఆము. 4-76

ముందు వేసవిన, సూర్యునికి కర్కశుడను పేరుపడినది. ఆ చెడ్డపేరును పోగొట్టుకోవలెను. అందులకై వరుణుడు జలముల నెట్లు గ్రహించునో ఇతడును జలములను గ్రహించెను. వరుణుడు మకర వాహనుడు గదా! వరుణుడు మొసలియందుండగా నసూయచేత సూర్యుడు గూడ కర్కటకస్థితిగాంచెనో యన్నట్లుగ కర్కటక రాశియందు ప్రవేశించెను. సూర్యుడు కర్కటక రాశియందు ప్రవేశించునపుడు వర్షము లారంభమగును.

వేసవి యనంతరము వర్షారంభము సర్వప్రాణికోటికి సుఖదాయకము. అందు ముఖ్యముగ కొన్నిటికి అధికానందము.

> "వనతతి వరాహ వాహరి వాయుభుగ్వి
> రోధి వారణ వర్షాభు లాధిదొఱగ
> నెండ్రి రవిచేర మూడవ యొకకు జేరు
> కరణి ధరణిం బ్రమోద సంధాయి గాదె" —ఆము. 4-77

వేసవి సెగలలో మాడిమాడి వేసారిన వనతతికి, వరాహములకు, వాహోరులకు, వాయుభుక్ విరోధులకు, వారణములకు, వర్షాభులకు, ఆధి తొలగినది. అవియన్నియు వకారాది శబ్దములు. వీనికి నామనక్షత్రము రోహిణి. (వోవావీవో రోహిణి) (కృత్తికా త్రిపాదం, రోహిణీ, మృగశిరార్ధం వృషభం).వీనికి లగ్నము వృషభము.ఈ వృషభమునకు మూడవలగ్నము కర్కాటకము. జన్మలగ్నమయిన వృషభమునకు మూడవది యైన కర్కాటకమందు రవి ప్రవేశింపగానే పై జంతువులకు శుభము కలిగెను. జన్మరాశికి మూడవ స్థానమందు రవి యున్నచో శుభములు గలుగునని శాస్త్రము.

వర్షర్తువు ప్రవేశింపగానే ప్రకృతియంతయు నానంద సందోహమున నోలలాడినది.

ప్రకృతికంతటికిని మూడవస్థానమందిపుడు రవి యున్నాడు. సుఖదాత యైనాడు. రాయలవారి జ్యోతిశ్శాస్త్ర పాండిత్యమునకు ప్రతీకలు పై వర్ణనలు—జ్యోతిశ్శాస్త్ర విషయములను గూడ సరసముగ ఉత్ప్రేక్షించుట ఇందులోని ప్రత్యేకత.

వడగండ్లను-చిన్న ఉఱుములను-వర్ణించుచున్నాడు.

## వడగండ్లు-కరకలు

> "ఒకచినుకున్ సపస్యయగు నుర్వికి డిగ్గగ నీవు మూగి చా
> తకములటంచులోఁగనలి దట్టముగా నలమేఘు డాడుచుం
> డక చన నూదగాఁదొరగు నాళవుటుండలు వోలె రాలె ద
> క్కక పడు వర్షధారల ముఖస్థములై కరకా నికాయముల్" —ఆము. 4-90

ప్రకృతి మానవీకరణకు గూడ నిది యుదాహరణము. ఇది స్వరూపవర్ణన.

> "కృత పయః పాన నవమేఘ పృథుకములకు
> రాలె నొయ్యన వడగండ్ల పాలపండ్లు
> మఱి బలాకా ద్విజాళి సంప్రాప్తి గలిగెఁ
> బెరుగఁ బెరుగంగ ధ్వనియు గంభీరమయ్యె" —ఆము. 4-82.

పసిబిడ్డలకు పాలపండ్లు రాలి మరల పండ్లు వచ్చినపుడు క్రమముగాధ్వని విశదముగను గంభీరముగను పరిణమించును. ఇట, వడగండ్లను, మేఘపృథుకములయొక్క పాలపండ్లుగను అవి రాలిపోగా కొంగలు అను దంతములు మరల కలిగి ధ్వని గంభీరమయ్యెనా అన్నట్లు ఉఱుములు అతిశయించుటయును ఉత్ప్రేక్షితము, పై వర్ణనలో బలాకాద్విజాళి వర్ణితమగుట వర్ణనా సంప్రదాయ భాగమే కాక కాలసహజ మయినది

గూడ వర్షర్తువున మేఘముల నంటి బలాకములు నడచుట రామాయణ మందును శిశుపాలవధ యందును చక్కగా వర్ణింపబడినది.

"మేఘాభికామా పరిసంపతన్తీ సంమోదితాభాతిబలాక పంక్తిః
వాతావధూతావరపౌండరీకీలంబేవమాలార చితాంబరస్య"
—రామా. కిష్కింధా. 28-23

ఆకాశాన మేఘములున్నపుడుగర్భాధానార్థమై తత్సుఖమును బలాకములు పొందు నను టప్రకృతి సూత్రము. ఈ వర్ణన కాళిదాసు చక్కగా చేసియున్నాడు.

"మందం మందం నుదతి పవనశ్చానుకూలో యథాత్వాం
వామశ్చాయం నదతిమధురం చాతకస్తే సగంధః
గర్భాధానక్షణ పరిచయాన్నూనమా బద్ధమాలాః
సేవిష్యంతే నయన సుభగం ఖేభవన్తం బలాకాః" —మేఘ. 1-9.

రాయలవారు పై సంప్రదాయమును అనుసరించిరే గాని పై వారి వర్ణనను అను వాదము చేయలేదు.

**వానకాళ్ళు**

ఇంద్రధనుస్సు ఒకవైపు కన్పించుచుండగా ఈవలివైపు వర్షధారలు మనోజ్ఞ ముగా కనపట్టుటను ఉత్ప్రేక్షించుచున్నాడు. ప్రకృతి పరిశీలనా జనిత రమ్యవర్ణన.

"పుట్టవెడలి నభోభిత్తి బట్టు శక్ర
కార్ముకపు బెద్ద వలువన్నెకట్ల జెట్టి
దైన నడచెడు కాళ్ళ గుంపనగ గాలి
గార్కొని దిగంతముల వానకాళ్ళు నడచె" —ఆము. 4-89.

వానకాళ్ళను వన్నెలకట్ల జెట్టి నడచెడి కాళ్ళగుంపుగా ఎంతయో చక్కగా వర్ణించినాడు! వానకాళ్ళు అనుటలోనే ఉన్నది ప్రజ్ఞయును, సొగసును. ప్రకృతిని కళాదృష్టితో చూచు స్వభావము రాయల యందతిశయించి యుండుటను పైని చూడ గలము. నన్నెచోడ మహారాజు వానకాళ్ళను వర్ణించిన (కుమార. 6-97) దృశ్యము రాయలవారి స్మృతి యందున్నట్లు భావింపవలసి యున్నది.

**ఇంద్రధనుస్సు**

ప్రతి వస్తువును, హేతూత్ప్రేక్షద్వారా బ్రహ్మాండవర్ణన గావించు నేర్పును ఓర్పును రాయల కున్నట్లు మరొకరికి గానము.

> "తనతోయం బినరశ్మిలెత్త నిల వాత్యా రేణుమూర్తి న్మహేం
> ద్రునకుం జెప్పగ ముచ్చుబట్ట దివమందున్ విల్లుటింపన్ భయం
> బున దద్రశ్మి సహస్రము న్వెస డిగెంతో డాగి వేగుమ్మరిం
> పననం ధారలు దోచె మించు వెలిగింప న్మబ్బుల న్వెల్లిపై" —ఆము. 4-83

ఒకవైపు హరివిల్లు ప్రకాశించుచుండగా ఈవలివైపు వర్షము కురియుటను ధారలు ధారలుగా వర్ష ధారలు కనిపించుటను - గొప్పగా వర్ణితము. పైది రాజోచిత వర్ణన. దొంగనుగూర్చి రాజునకు ఫిర్యాదుచేయుట - రాజు దొంగను పట్టి సొమ్మును కక్కించుట, అను రాజోచిత సహజ శౌర్యధర్మ విషయములను ప్రకృతి సహజత్వముతో జోడించి చెప్పిన ఈ కవియొక్క రాజరీవి ఇట ప్రదర్శింపబడినది.

**బెడిదపు టుఱుములు**

అడ్డుపడిన మేఘబృందముల పగులగొట్టుకొనిపోవు సూర్యచంద్రుల రథచక్రాల శబ్దమువలె నున్నవట యుఱుములు.

> "ఎడపక యున్న మింటిపయి నేతగులంబును లేమి మూకతన్
> వెడలెడుచో గఠోర ఘనబృందము లడ్డము వడ్డ వాని మే
> యిడియ జవోష్ణ బాఱెడు రవీందుల దట్టపు బండి కండ్ల చ
> ప్పుడు గతి మ్రోసె రేపగలు భూరి భయంకర గర్జలత్తఱిన్" ఆము. 4-85.
> "దినముల వెంబడిన్ జడనిధి న్మనుగ్రోలిన నీరిలోన బే
> రిన లవణంపు ఘట్టముల దృప్య ద్విరమ్మద దావముల్ దవు
> ల్కొని పెటలించు నార్భటు లొకో యనగా సతటిద్భయంకర
> స్తనితములన్ సృజించె నతిసాంద్ర ఘనాఘన గర్భగోళముల్" -ఆము. 4-86

అడ్డుపడిన వానిని లెక్కింపక తొక్కించుకొని నిరాటంకముగ పోవు రాజరీవియే పైన ప్రదర్శితమయినది. ప్రకృతి వర్ణనవంటి పరాశ్రయ కవితా (objective poetry) రచనలలో గూడ ఆత్మాశ్రయతను (subjectivity) ప్రదర్శించు స్వభావము రాయలయం దెక్కువగాగలదు.

పై వర్ణనలో ఇరమ్మదములను దావాగ్నిచే, పేరుకొనియున్న యుప్పును కాల్చి పెటలించినట్లున్నవి మేఘ గర్జనలు. ఉప్పును వేయించినపుడు పెటపెట శబ్దమధిక ముగా వచ్చును.

మృగశిర ప్రవేశించిన యనంతరము తొలకరి వర్షముల జోరును,హోరను వర్ణించు చున్నాడు. ఇది ఎంతయో సహజమైన వర్ణన. నిరంతర ప్రకృతి పరిశీలనా ఫలితమైనట్టి తీవ్ర భావజన్యమైన వర్ణన. ఆగి ఆగి, అంతకంతకు తీవ్రమై, బ్రహ్మాండముగ వర్షించు తొలకరి వర్షముల దృశ్యము అతిసహజముగా వర్ణింపబడినది.

> "ఎలగోలు జల్లు ముస్నేళ పెళ నేటవా
> లుపడి గాలి నట్టిండ్ల దడిపి చనగ
> నైదుతో వడగండ్ల కట్టావులు దుమార
> మావులు రేచి రెండవదియు జన
> మఱి మూడవది నిల్చి మెఱసి బిట్టుఱిమి శీ
> కరవారి సృష్టి జీకటిగ నలమ
> నుయ్యేల చేరుల యోజఁ బైపై వెండి
> జల్లుపై జల్లు పెల్లల్లుకొనగ
> భూభిదా పాది దుర్భరాంభో భరంపు
> వడి మరుద్ఘుర్ఘు దెరలక కడవ వంచి
> నట్లు హోగని ధారౌఘమైక్య మొంది
> విన్ను మన్నును నొకటిగా వృష్టి బలిసె"

—ఆము. 4-91

**ఇంద్రగోపములు**

పర్జన్యుడు కేకులగుంపాడించునపుడు మద్దెల వాయించు చున్నాడు. ఆ మద్దెలకు దారములును వానికొనలకు కెంగుచ్చులును ఉన్నవి. అవి క్రిందికిని పైకిని ఎగురు చున్నవి. ఈ వర్షాకాలపు వర్షధారలు ఆ తెల్లదారముల వలెను, ఇంద్రగోపములు ఆదారపు కొనలనున్న ఎఱ్ఱని కుచ్చుల వలెను ఉన్నవి. ఇది ఆరుద్రకార్తె వర్షము.

ఆర్ద్రికార్తెలో ఇంద్రగోపములు ఎక్కువ గన్పించును. అవి ఆకాశమునుండియే పడునని ప్రజలనమ్మకము. అంతకు ముందేమియు కన్పించక హఠాత్తుగ నవి యెక్కు వగ భూమిపై - తడినేలపై-కన్పించుట జేసి, అట్లు భావింతురు. ఆర్ద్రికార్తెలో వర్ష మెట్లుండునో ఇక్కడ వర్ణితము.

"అల పర్జన్యుడు కేకిపాత్రముల గుంపాడించుచో మేఘమం
డలపున్ మద్దెల గ్రుంగ లేవనుమరున్మార్దంగి కుండర్థినొ
త్తలలిన్నేంకు వ్రాలుచున్నెగయుచున్ ధారాడు నత్తెల్ల జ
ల్లులుం గెం గుచ్చులు నయ్యె ధారలును తల్లోలేంద్ర గోపంబులున్" -ఆము. 4-92.

ప్రకృతి సహజచేష్టలను నాటక కళాదృష్టితో చూచి సరసముగ వర్ణించు వర్ణనా కవితా చక్రవర్తి కృష్ణరాయ చక్రవర్తి.

అంతియగాదు తెట్టువవలె కన్పట్టుచున్న పచ్చికలందు ఇంద్రగోపములు ఎంత దట్టముగా నున్నవో ఈ క్రింది వర్ణన సహేతుకముగ తెలుపుచున్నది.

"స్ఫురణ మొగుళ్ళపై మొదలం బొల్చి జలస్రుతి నాడునాటి కిం
గరగుచు బుట్టుచుండు మణి కార్ముక రక్తిమ యెల్ల వెల్లిగ
న్నురుగులు గట్టినట్టులు గనుంగొన నయ్యె సురేంద్ర గోపముల్
గరగిన వింటి యప్పసరు కైవడి దెట్టెలు పెట్టు పచ్చికన్" - ఆము. 4-100

"బాలేంద్ర గోపాంతర చిత్రితేన విభాతి భూమిర్నవ శాద్వలేన
గాత్రానువృత్తేన శుక ప్రభేణ నారీవలాక్షోఢితికంబళేన" -కిష్కింధా. 23-24

రాయలవారు పై శ్లోకమును చూచి యుండును. దాని సంస్కార మతని వర్ణనలో కనిపించుచున్నది గాని ఏవిధముగను అనువాదముగాదు.

"సారెకు మింట మేఘుడు నిజస్ఫురణంబుల గ్రూరమౌ పురో
గారక యోగమూది తిరుగన్నకుటుంబము దగ్ధ్రిహంబు నెం
తేరుష ద్రొబ్బ నంతలును నింతలునై పడు తన్నభ శ్చ్యుతాం
గార శిఖ ప్రతానముల కైవడి రాలె సురేంద్ర గోపముల్" -ఆము. 4-107

పై వర్ణన నన్నెచోడుని ఇంద్రగోప వర్ణనకంటె గుణాధిక్యము గలది.
(కుమా. 6-1(1).

ఎన్ని దృక్కోణములనుండి చూడ వీలున్నదో, అన్ని దృక్కోణములనుండి తిలకించిన మహాకవి రాయలు.

ఇంద్రగోపముల నిన్ని విధాలుగా ఎవరును వర్ణించి యుండ లేదు.

**కరకలు**

"ద్యుమణి కరాళి మొగుళ్లై
యమవసళి గలయగూర్చి హదనౌటయు న

> య్యమృతపు బిందులె క్రమ్మఱ
> నుమిసెడు నన వాన గరకలుడుగక రాలెన్" - ఆము. 4-99

అమావాస్యనాడు చంద్రుని గూడి గ్రహించి కూడబెట్టుకొన్న అమృతబిందువులను ఆ మేఘములైన సూర్యకిరణములు సమయముు రాగానే క్రక్కినవని ఉత్ప్రేక్షితము.

ఇంకొక మంచి వర్ణన; సహజముగ నున్న ఉత్ప్రేక్ష.

> "జలధర ముప్పతోఁ బులుపొసఁగు రసంబని యప్పయోధి నిం
> పొలయగఁ గ్రోలి పై దధిపయోధియుఁ గ్రోలగఁ బ్రాచి దాట బె
> ద్బులుసుఁ గరుళ్ళఁ గ్రాయ నవివో వడగండ్లన రాలె గాని నా
> డిలఁబడు వాని దిన్నయపుడే చలిపండ్లు వడంగ నేటికిన్" -ఆము. 4-116

పై చెప్పబడిన వడగండ్లు మృగశిర, ఆర్ద్రికా కార్తెలవిగావు, పునర్వసు కార్తెవి. అందుకనే అంతచలి. కడుపులో పులుపు (ఆమ్లము) అధికమయినపుడు వాంతులువచ్చుట సహజము. సతార్కికమగు వర్ణన. కరకలెంత తెల్లగనున్నవో ర్ణించుచున్నాడు. చూడుడు,

> "ఉలుమువిని యలక కైదివి
> వెలఁబఱచు మరాళపఙ్క్తి విడిచిన బడన
> క్కఱచిన బిసలవ వివరము
> తెలుగున వడగండ్లు ధవళదీధితి రాలెన్" -ఆము. 4-121.

పై వర్ణనలో కరకల తెల్లదనము వర్ణితమైనది. వర్షాగమ సమయమున మరాళములు మానస సరోవరమునకు పారిపోవునను కవిసమయముగూడ పాటించినట్లయినది. ఈ కవిసమయము రామాయణముననే పాటించుట జరిగినది. రామాయణమున వర్షర్తు వర్ణనలో "హంసలకిది సమయముగాదు· అందువలన అవి మానససరోవరమునకు వెళ్ళినవి" అని వాల్మీకి వర్ణించినాడు (కిష్కింధా. 28-14).

మనుచరిత్ర పీఠికలో ఒకచోట ఈ కవిసమయము కనిపించుచున్నది· తిమ్మభూపతిని వర్ణించుచు అల్లసాని పెద్దన "అరిహంస సంసదభ్రాగమంబు" అన్నాడు. (మను. 1-26)

ఇన్ని విధములుగ కరకలను వర్ణించినవాడితడే. నన్నెచోడుని వర్ణనల కంటె మిన్నగా మన్నవివి.

## కప్పలు

వర్షములు బాగుగా కురిసిన యనంతరము నేల యంతయు చల్లబడును. ఆ తర్వాత పడ్డ వర్షములకు భూమి బాగుగ తడిసి నీరు సర్వత్ర నిండును. ఇపుడు కప్పల బెక

బెకలు, రకరకాల ధ్వనులు వినిపించును. వర్షసమయములలో పాములు బయట తిరుగవు. ఇది ప్రకృతి సత్యము.

"కాకోదరాహితుల వ
ల్మీకంబులఁ దూర్చె మెఱసి మేఘుండని గుం
పై కనుగొని పొగడెడు నన
భేక ధ్వను లెసఁగె వృత్త భేదానుకృతిన్" -అము. 4-108.

సకారణముగ నున్నది యీ పొగడ్త. శత్రువులను పారదోలిన రాజును ప్రజలు పొగడుట ఈ రాజకవి మనసులోనున్నది.

## నెమిళ్ళు

వర్షర్తువులో ముఖ్యముగ వర్ణింపబడునవి నెమళ్ళు. మేఘమునకును, నెమిలికిని అంత సంబంధము గలదు. మేఘావృతాకాశమును జూచినచో నెమలి యత్యానందముతో నాట్యము చేయును. రామాయణ, శిశుపాలవధ, మేఘదూతముల యందలి వర్ణనలందీ విషయము చక్కగ వర్ణింపబడినది.

"నటన పర కేకి పాత్ర
స్ఫుట యవనికలన మొగుళ్ళు పొదివెన్ భూ భృ
త్తటుల నవి యాకు దిను చిట
పొట రవము సెలంగెఁ దాళముల చప్పుడునై" ఆము. 4-115

వర్షకాలమందు, పర్వతాగ్రభాగములందు పొడవుగా తీరి, తెల్లమేఘములుండును. వానిని జూచి ప్రజలు మొగిళ్ళు మేయుచున్నవి యనెదరు. తార్కాణముగా ఆ ప్రాంతమందు చిటపటధ్వనులువిననగును. మేఘములుగూడ ఇంచుక వేడిగానుండి పొగవలె ప్రాకుచుండును. ఎంతో అనుభవముతో వ్రాసిన వర్ణనయిది. లయాన్విత ధ్వనులకు నెమిళ్ళు నాట్యమాడుట ప్రసిద్ధము. ప్రసిద్ధ కవులందఱును అట్టి వర్ణన చేసియున్నారు.

తాళలయ ననుసరించి నెమిళ్ళు నాట్యముచేయునని రామాయణమున వర్షర్తు వర్ణనలో చెప్పబడినది. (కిష్కింధా. 28-37).

మరియొకచోట—

"వ్యామిశ్రితం సర్జకదంబ పుష్పైర్నవం జలం పర్వత ధాతు తామ్రం।
మయూర కేకాభిరనుప్రయాతం శైలాపగాశ్శీఘ్రతరం వహన్తి"
—కిష్కింధా. 28-18

కాళిదాసు మేఘదూతములో యక్షుని భార్య బర్హిణములచే నాట్యము చేయించెడి దనియు, ఆమె కడియముల ధ్వనిని తాలములుగా గ్రహించి నెమిళ్ళు నాట్యముచేసెడి వనియు వర్ణితము.

"తన్మధ్యేచస్ఫటిక ఫలకా కాంచనీ వాసయష్టిః
మూలే బద్ధామణిభిరనతి ప్రౌఢవంశప్రకాశైః
తాలైశ్శింజావలయ సుభగై ర్నర్తితః కాంతయామే
యామధ్యాస్తేదివస విగమే నీలకంఠః సుహృద్వః" -మేఘ. 2-18

దాదాపిట్టి వర్ణనే శిశుపాల వధయందును వర్షర్తువర్ణనా సందర్భమున చూడగలము.

"జలదపంక్తి రనర్త యదున్మదం
కల విలాపికలాపికదంబకం
కృత సమార్జన మర్దల మండల
ధ్వని జయానిజయాస్వనసంపదా" శిశు. 6-31

కాళిదాస మహాకవి తన ఋతుసంహారమునవర్షర్తు వర్ణన చేయు సందర్భమున నెమిళ్ళ యానందమును నృత్యమును సొంపుగ వర్ణించినాడు-

"సదామనోజ్ఞః స్వనదుత్సవోత్సుకం
వికీర్ణ విస్తీర్ణ కలాపశోభితం
ససంభ్రమాలింగన చుంబనాకులం
ప్రవృత్తనృత్యంకులమద్యబర్హిణాం" -ఋతు. 2-6

సర్పములు నెమళ్ళకు ఆహారము. మేఘములవలన అవి బొరియలలో దూరినవి. అయినను నెమళ్ళు ఆనందముచే నాట్యము చేయుచున్నవి. ఆహారముకంటె మేఘ దర్శనము వానికి ఆనందజనకము.ఆనందానుభవమున ఆకలిదప్పుల మఱచుట సహజముగదా.

"తటి దుత్సారిత ఫణ భృ
త్పటలి నిరన్నంబు లయ్యు దక్కవు బర్హుల్
నటన మతి హర్ష హేతూ
త్కట లాభంబిడునె మదిక్షుధ స్నీర్వట్టున్" -ఆము. 4-122.

లయాన్విత ధ్వనులను నెమిళ్ళు నాట్యమాడుట అల్లసాని పెద్దన కృత మనుచరిత్ర మున "అటజనికాంచె భూమి సురుడంబర చుంబి..." యన్న (మను. 2-3) పద్యమున వర్ణితము. సర్వకళా సనాథుడగు రాయలవారు తత్తత్కళానుభవమున అన్నిప్రాణి యముల నైతము లెక్కించి యుండరనుటకు పై వర్ణన తార్కాణము.

**గేదంగి**

వర్షర్తు వర్ణనచేయు కవి యెవ్వడయినను గేదగిని వర్ణింపక వదలడు. శరత్తునందు గూడ వర్షములు పడుచుండును గాన అపుడును గేదంగి వర్ణన యుండును.

> "సురభి చడిఁ జన్న సప్తలాశోక కమల
> కువలయామ్రమాళికిఁ గదంబ కుటజనీప
> కకుభ యూధికలను సాయకములు మరున
> కేనుగల్గి గేదగి సురె యెక్కుడయ్యె" -ఆము. 4-114

కుసుమ బాణునకు తన సహజ సాయకములే గాక ఈ ఋతువున గేదగి, అధిక సాయకమైనదిగాన, ఈ వర్షర్తువు వసంతము కంటె మిన్న అయినది. శృంగార చేష్టలకు ఆకరమైనది.

**తడిసిన పక్షులు**

వర్షకాలమందు తడిసిన పక్షులు ఒక ప్రత్యేక దృశ్యము. పక్షి ముద్దగా తడిసినచో ఎగురుట కష్టము. రెక్కలు బరువెక్కుట కారణము. తడిసిన పక్షుల వేటాడుట సులభము. ముఖ్యముగా జెముడుకాకులు,చీకురాళ్ళు, ఎగురలేవు. తరిమినచో సులభముగా చిక్కును. తడిసిన పక్షుల సహజ చేష్టలిట వర్ణితములు-

> "తడి తలడిగ్గి ముంప జడతం దుదిరెప్పలఁ గన్ను విప్పి పు
> ల్పొడచుచు నీరు ముంగరల పోలిక ముక్కున గూడ నోటఁగొం
> తొంఁడియుచు గూటికట్టు పగ మొత్తుచు ఱెక్క విదుర్పు మున్నుగా
> వడకుచు కాక చేష్టుడిగె పక్షులు పక్షము జానువుల్ చొరన్'' -ఆము. 4-118

నిశిత పరిశీలనగల కవియే యీ వర్ణన చేయగలడు.

పై వర్ణన జడివాన సందర్భమందలిది. కనీసము రెండు మూడురోజులు ఎడతెరిపి లేకుండ వర్షము కురిసినపుడే పక్షులు ఆ అవస్థను పొందునది.

**దుర్దిన వర్ణన**

పగలంతయుగూడ వర్షము కురియుచున్నది. రాత్రులు గూడ కురియు చున్నది. అహోరాత్రములు ఆకాశము మేఘావృతమై యున్నది. ఈ సమయమున మానవ ప్రకృతియొక్కయు మానవేతర ప్రకృతి యొక్కయు భావములు వర్ణించుచున్నాడు కవి.

"రవి జూచి కుడుచు వారలకును కృకలాస
 ములకును దృష్టి మిన్నులనె నిలిచె
సంధ్యార్ఘ్యదాయి ద్విజశ్రేణి కిలుసేరు
 మొదవులకును భ్రాంతి మది జనించె
హాల జీవి సందోహములకు బలాకి కా
 విసరంబులకు మంచి వెదలు దొరికె
నెలమి బొల్పగు యూధికలకు సంతలకూట
 ములకును మఱి విచ్చు మొగ్గ లొదవె
నతిథి సంఘంబునకు నీనివట్టి యెనుప
కదుపు లేగలగమికి వాకట్టు లెసగె
మంటి మిద్దెలవారికి మరుపనులకు
నెలత వాసిన వారికి సిదుర చెడియె" -ఆము. 4-123

పైని తొండలగురించి చెప్పిన వర్ణనయును, కొంగలకు గర్భమగునని వర్ణించుటయును, యెనుప లేగలకు వాకట్టయినట్లును, మంటిమిద్దెల వారికి మరుపనులు చెడుటయును, వర్ణించుట అతి మనోహరము. ఎంతయో సహజములు. ప్రకృతి పరిశీలనా జనితములు.

సర్వత్ర వర్షించుటచేత హాలికులానందముచే విస్తారముగ వ్యవసాయము చేయుచున్నారు. దున్నని తావులేదు. అట్టితటి, కాలుని దున్నయును, మహాకాలుని నంది యును మాత్రము తప్పించుకొన్నట్లు కవి వర్ణించుచున్నాడు.

"కాలుని దున్న న దినయి గంటలు దూన్క మంచి నా మహా
కాలుని నంది దున్ననయి కర్దమ మగ్నత లేక మంటినా
హాలికు లెన్నడుం దెగని యారుల చేలును జౌడు మళ్ళునుం
గా లలి నేరుసాగిరిల గల్గు పసింగొని పేదమున్నగన్" -ఆము. 4-124

ఇందు హాస్యరసము కొంత పోషింప బడినది. పై వర్ణన కేవలము సహజవర్ణన.

## నీరుకట్టెలు

నీరుకట్టెలకు నీరుకట్టె పురుగులని గూడ వ్యవహారము. పేరుకు పాములేగాని అవి యేమియు చేయవు గావుననే వానిని జూచి జడవరు. ఒకవేళ అది కాటేసినను అక్కడే నీటిని కాసింత బురద చేసి, ఆనీటిని త్రాగినచో విషమెక్కదను నమ్మకముగలదు. పాము భయపడినపుడు కాలికి చుట్టుకొనుట తెలిసిన విషయము. నీరుకట్టెల కడుపు పసుపు

పచ్చగా నుండును. ఈ ప్రకృతి సత్యమును తెలిసికొన వలెనన్నను, ఎంతయో పరిశీలన ముండవలెనుగదా!

''వరుజుబడి రొంపి ద్రొక్కం
జరణంబులఁ జుట్టి పసిడి చాయకడుపులం
బొరి నీరుకట్టెలమరెను
బిరుదులు హాలికులు దున్న బెట్టిరొ యఁగన్'' -ఆము 4-125

వర్షములుబడివట్టి కురియు సందర్భమున గృహిణుల యొక్కయు, గృహస్థుల యొక్కయు పరిస్థితులను, మనస్తత్వమును ఎంతో రమ్యముగ, సహజ పూర్వకముగ, సరసముగ, వ్యంగ్యగర్భిత హాస్యముగ వర్ణించుచున్నాడు. గొప్ప వర్ణన ఇది. ఎంతయో సహజతను సంతరించుకొన్నదిది.

''ఇల్లిల్లు దిరుగ నొక్కింతబ్బుశిఖ యబ్బె
  నేనింటిలో బూరియిడి విసరక
రాజదు, రాజిన, రవులు కొల్పాపసలె
  గాని కల్గదుకూడు, దానగలిగె
నేని కూరగుట మందైన బెన్పొగ సుఖ
  భుక్తిసేకూర దాభుక్తి యిడినఁ
బ్రాగ్భోక్తలకె తీఱు బహుజనాన్నము, దీఱ
  నారుల కొదవుఁబునః ప్రయత్న
మాజ్యపట ముఖ్యలయ మెన్నరాఁయాంగ
దారులయ మెన్న రంతిక కారజనిక
పచన నాంధో గృహిణి రామిఁ బడక మరుడు
వెడ వెడనె యార్వ నొగిలి రజ్జడిని గృహులు'' -ఆము. 4-127

ఇంకను మధురమైన మరొక సహజ వర్ణన కావించుచున్నాడు కవి. వర్షము వచ్చి నపుడు అధ్వగులు పరుగెత్తి వచ్చి రచ్చలపై ఒదిగి కూర్చుండుట పరిపాటి. తర్వాత ఊరకుందురా? కొన్నికొన్ని సమస్యలపై చర్చలు సాగింతురు. చాలతీవ్రముగ గూడ- మనఃపూర్ణముగ గూడ. వాదించుకొందురు. వర్షమాగగనే-ఏమియు పట్టించుకొనక ఎవరిదారిన వారు పోదురు. అట్టి పరిస్థితిని సహజ సుందరముగ వర్ణించు చున్నాడు కవి. మానవ మనః ప్రకృతి ఇట ప్రదర్శితము.

''రయమున వృష్టికై యొదిగి రచ్చలపై విధియింతు రుగ్రతన్
హయపతి మీద దంతిపతి నాతని పై నృపతిం గణాది ని
ర్ణయములమొత్తులాడుదురు ద్రమబ్బొకయించుక విప్ప విచ్చు మొ
గ్గయి మఱి పారిపోదురు సమస్త దిశాగతులైన యధ్వగుల్'' -ఆము. 4-131

పునాస సస్యముల పిసికిళ్ళను తిసుట పరిపాటి. ఈ వర్షాకాలమున కామ ప్రకోపము గూడ అధికము. పొలములో పనిచేయువారికి పునాస ధాన్యముల పిసికిళ్లు లభించుటతో పాటు వారి భార్యల కుచములయొక్క పిసికిళ్ళుగూడ లభించినవట.

"వసతుల్వెల్వడి వానకై గుడిసె మోపన్ రాక తానాని యే
పసగా నిల్చిన జమ్మునగూడ బొలమంబళ్ళోమ్రయుచుంబట్టి
పెన్ముసురం దీగెడు కాపు గుబ్బెతల పెన్గుబ్బల్ పునాసల్వెలిం
బిసికిళ్ళుం బిసికిళ్ళు హాలికుల కర్పించె న్నభస్యంబునన్" -ఆము 4-133

ప్రకృతి వర్ణనతో పాటు శృంగార చేష్టలు చొనిపినాడు కవి. వర్షర్తువర్ణన లక్షణ యుక్తముగను, సాంప్రదాయికముగను, విపులముగను, వర్ణించిన కవులలో రాయలగ్రగణ్యుడు.

## వర్షర్తువు - కళాపూర్ణోదయము

మధురలాలసయును, కళాపూర్ణుడును వివాహానంతరము సర్వసుఖములతో క్రీడించిరని చెప్పుచు నన్ని ఋతువులను వరుసగ వర్ణించు చున్నాడు కవి.

గ్రీష్మము తరువాత వర్షాగమమును వర్ణించు చున్నాడు. నీపాది వృక్షములను, కమలములను, మెఱపులను, ఉఱుములను వర్ణించుచున్నాడు. కేవలము శృంగార రస పోషణ ఘట్టములో వర్ణితముగాన ఉద్ధత శైలి యుండుటకు తావులేదు. వర్షావేగమున కీడుగా నుండవలయును గాన ఇక్కడ ప్రసాదగుణపూర్ణమై, సమాస భరితమైనది కవిత్వము.

"అందముగాగ నంతట ఘనాగమ కాలము చాలనొప్పెని
ర్నిందిత గంధ బంధ నవనీప వనీ కమనీ భవన్నిజేం
దిందిర బృంద ముక్త నళినీ మలినీ భవనాగ నాగనా
స్పంద జుగుప్స తర్జన యశాయిత యూయుతదూళ జాలమై" -కళా. 7-171

పై వర్ణన ఋతువర్ణనలోనిది. అంతకు ముందొకచోట కేవలము వర్ణన జరిగినది. శాలీనుడు తోటలో పనిచేయునపుడు దైవ ప్రేరణవలన గొప్ప అకాలవర్షము వచ్చినది.

"మిగుల జగంబు బెగ్గడిలమించె దదుద్ధత వృష్టి యద్భుతం
బగుచు ఘనాఘనౌఘ సముదగ్ర నిరర్గళ ఘర్ఘరార్భటి
లగన ఘనోచ్ఛలజ్జల ఝళంఝళ నిర్ఝర ఝర్ఝరీ భవ
న్నగ విగళచ్ఛిలాగణ ఘణంఘణ ఘోషణ భీషణంబుగన్" -కళా.4-88.

ఉదధి సమేత పీతోద్వాంత బాడబ
జ్వాలాయతోగ్ర శంపాలతంబు
నిర్ఘాత రవ సరంధ్రీకృతాజాండ బ
హిర్జల భ్రమద ధారోర్జితంబు
నిర్హ్రాద్య గర్జిత స్ఫూర్జ ఘూత్కర్జిత
ప్రళయ భైరవరటత్పటహ రవము
ఝంఝూప్రభంజన జాత సంఘట్టన
పరిగతత్కార కత్కారకగణము
నగుచు ఘనఘనాఘన సంఘమవ్విధమున
బూని హోరున బెడిదంపు వాన గురియఁ
గరము ఘూనభోంతరము చీకట్లుగొని యె
నఖిల లోకంబు నుదకమయత్వమొందె" -కళా. 4-89

సుగాత్రి మనసులో భయము నుప్పతిల్ల జేయు వాతావరణ సృష్టియది. జగత్తంతయు భయపడునట్లుగా, వర్షము కురిసినది. సుగాత్రి తన భర్తయొక్క భద్రత విషయమున భయపడినది. అందులకే యీ భయంకర వాతావరణ సృష్టి జరిగినది. వర్ణిత వస్తుస్వరూప స్వభావములు ప్రతిబింబింపజేయు అక్షర ప్రయోగము జరిగినది.

వర్షర్తువు- ప్రభావతీ ప్రద్యుమ్నమందును, వసుచరిత్రమందును, విజయ విలాసమందును, వర్ణింపబడలేదు.

**శరదృతువు**

వసంతర్తువు తర్వాత అంత ప్రశస్తమైన ఋతువు శరత్తే! దీనిని అనేక కవులు అనేక విధములుగ గానము చేసియున్నారు.

వాల్మీకి రామాయణమందు కిష్కింధాకాండలో చాల రమ్యముగా వర్ణింపబడిన ఋతువిది. ఇందు నీరసించిన జలప్రవాహములు, నదీతీర వనములు, ఏడాకుల అనటులు, హంసలు, చక్రవాకములు, క్రౌంచములు. నిర్మలాకాశము, చంద్రప్రకాశము, తెల్ల మేఘాలు, తామరలు, కలువలు, రెల్లుపూలు, వేగిసపూలు, కాంచనములు, మంకెనలు, ప్రేంకణములు, వరిపైరు మొదలగునవన్నియు వర్ణితములు. మొత్తము దాదాపు అరువది శ్లోకములలో ఈ వర్ణన సాగినది. అంతయును పాత్రముఖమున (రాముని) సాగినది.

ఆ తరువాత కాళిదాసు తన ఋతుసంహారమున శరత్తును గూర్చి విపులముగ వర్ణించి యున్నాడు, రెల్లుపూలును, పద్మములును, హంసలు, తెల్లమేఘములు మొదలు

లగునవి వర్ణితములు. భరతుడు తన శాస్త్రములో (భరతనాట్య శాస్త్రము) శరత్తునెట్లు సూచింపవలెనో వివరించినాడు.

"సర్వేంద్రియ స్వస్థతయా ప్రసన్న వదనస్తదా
విచిత్ర భూతలా లోకైః శరదంతు వినిర్దిశేత్" -భరత నాట్య. 25 అధ్యా. 28.

(సర్వేంద్రియములు స్వస్థత చెందినట్లు చూపుటచేతను, ప్రసన్న వదనమును ప్రదర్శించుటచేతను,విచిత్రమైన భూతలాలోకనమును ప్రదర్శించుట చేతను శరత్తును సూచించుచు అభినయింపవలెను). ప్రకృతి యంతయు చల్లబడి హాయిగా నుండునని భావము.

మాఘుడు తన శిశుపాలవధ ఆరవ సర్గలో శరద్వర్ణన మనోహరముగ జేసినాడు. సహజ సౌందర్య విలసితమయిన దానినిగా వర్ణించినాడు. వర్ణనలు ప్రౌఢముగా, శృంగార రసస్ఫోరకములుగా వర్ణించినాడు. శరత్తును ఒక స్వచ్ఛప్రేయసిగా ప్రవేశ పెట్టినాడు. (శిశు. 6-42) వర్షర్తువులో నెమిళ్ళకు విజృంభణము. అది ఇపుడు హంసలకు (శిశు. 6-44).

జపాపుష్పములను, సప్తవర్ణిని మొదలగు వానిని వర్ణించినాడు. వర్ణనయంతయు ఉత్ప్రేక్షలతో ప్రౌఢముగా నున్నది.

తర్వాతి వాడైన తెలుగు లాక్షణికుడు విన్నకోట పెద్దన శరత్తును వర్ణించు నపుడీ వివరము లుండవలెనన్నాడు.

"వెన్నెలసొంపు, చుక్కల ప్రకాశము, జలద విచ్ఛిన్నత తెల్లని దెసలు-మొదలగునవి."

## శరదృతువు - కుమారసంభవము

నన్నెచోడుడు, మొత్తము తొమ్మిది పద్యాలలో శరదృతువును వర్ణించినాడు. పద్మములను, ఉత్పలములను, కాశములను, హంసలను, చంద్రకాంతిని, శరద్రాత్రిని, కలమ వనములను వర్ణించినాడు. శరదాగమమును ఇట్లు వర్ణించుచున్నాడు.

"దళితాంభోరుహ సప్తపత్ర సుమహాత్కాశాస నౌఘంబు ని
ద్దళితాంబు ప్రద కేతకీ కుటజ కుంద వ్రాతముద్భాసి తేం
దుల సన్మత్త మరాళకంబు గత విద్యుత్కేకి సల్లాస్యమ
గ్గలమై పర్వె జగంబులందురు శరత్కాలంబు రమ్యాకృతిన్" -కుమా. 6-112

శరత్కాల మంత సుందరముగా నడిచినదీపద్యపు నడక!

శిశుపాల వధలో కృష్ణుడు రైవతకాద్రి యందు సంచరించు సమయమున శరత్తును ప్రవేశపెట్టిన తీరు ఇంతకంటె అందముగ నున్నది.

"స వికచోత్పల చక్షుషమై క్షత
క్షితి భృతోఽక్కగతాం దయి తామివ
శరద మచ్ఛగలత్ వసనోపమా
క్షమఘునా మఘునాశన కీర్తనః''
-శిశు. 6-42

వర్షర్తు సమయమున హరి నిద్రించు ననియు శరత్తున మేల్కొను ననియు పురాణములు చెప్పుచున్నవి. ఇపుడు——

"జలశాయులైన హరిల
త్ములు వర్ష నిశావసానమున మేల్కని క
న్నులు విచ్చి చూచినట్టులు
జలజోత్పల రుచులు వెలసె శారదవేళన్''
-కుమా. 6-113

శరద్రాత్రులందలి చంద్రికా వర్ణన ఒక శృంగార వర్ణన. రామాయణమందు అమోఘముగా వర్ణింప బడినదిది.

"చంచత్ చంద్ర కరస్పర్శ హర్షోన్మీలిత తారకా
అహో రాగవతీ సంధ్యా జహాతి స్వయమంబరం"
——వాల్మీకి రామా, కిష్కింధా. 30-46.

నన్నయ శారద చంద్రికను ఉజ్జ్వలముగ వర్ణించినాడు.

"శారదరాత్రులుజ్జ్వల లసత్తర తారక హార పంక్తులన్
చారుతరంబులయ్యె వికసన్నవ కైరవ గంధ బంధు రో
దార సమీర సౌరభము దాల్చి సుధాంశు వికీర్యమాణ క
ర్పూర పరాగ పాండు రుచి పూరము లంబర పూరితంబులై"
-భారత. అరణ్య పర్వ, ఆశ్వా 4-142

నన్నెచోడుడు అంతకు తక్కువగా వర్ణింపలేదు. ఇతడు శరత్తును విష్ణువునకు పోల్చినాడు.

"శ్వేత ద్వీపము చంద్రబింబము మహాక్షీరాబ్ధి తజ్జ్యోత్స్న ద
ద్భాతిం గృష్ణుడు దన్మృగాంకము లసత్పద్మాలయాక్షి ద్యుతుల్
ప్రీతిం జారు చకోర దంపతులునా బృధ్వీధరుంబోలి వి
ఖ్యాతిం బొల్పగు శారదాభినుత రాకా రాత్రులత్యున్నతిన్" కుమా. 6-117

గొప్ప వర్ణన అది. తర్వాత కాళలను (6-118) కలమ వనములను (6-119) వర్ణించినాడు. శరచ్చంద్ర చంద్రికాకాశములను వాల్మీకి వర్ణించిన యంత రసవత్తరముగ నితర కవులెవ్వరును వర్ణింపలేదు.

**శరదృతువు**-మనుచరిత్ర, పారిజాతాపహరణములందు లేదు.

## శరదృతువు - ఆముక్తమాల్యద

శరత్తున నేయే ప్రకృతి యెట్లుండునో వర్ణితము. ఇట రాజమరాళ ప్రయాణము వర్ణితము. వరి వెన్ను వదలుటయును-పద్మముల వికసనమును ఆధిక్యమును, హల్లకముల విస్తారతయును వర్ణితములు. మొత్తము 47 పద్యములలో సాకల్యముగ వర్ణింప బడినది.

> "రాజమరాళ లబ్ధ గిరి రంధ్రము శాలివనీ శరావళీ
> వై జనంబు యజ్వహుత వాజహుతాశయ భాస్వదిందిరాం
> భోజ నమాగమం బుదిత బోధ భుజంగ శయోపచార నీ
> రాజన పుల్లహల్లక సరఃబునయించె శరద్దినం బిలన్" -ఆము. 4-137

ఆశ్వయుజ కార్తీకమాసములు శరదృతువు. ఈ ఋతువున ముఖ్యమైన వాన కార్తెలున్నవి. ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖలు ప్రబలమైన వానకార్తెలు. మరి యెందుకో—శరదృతు వర్ణనలో వర్షాల వర్ణింపరు. కృష్ణరాయలు నివసించు ప్రదేశము హంపి. ఆ ప్రాంతము వర్షచ్ఛాయా ప్రదేశము. వర్షపాతము నైఋతి ఋతుపవనముల వలన సాధారణముగ వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణములందే యుండును. అందులకే రాయలిట్లు వర్ణించెనేమో; వర్షములు లేకుండ—స్వచ్ఛజ్యోత్స్నలు, తెల్లమేఘములు, కాశ ప్రకాశము, కొంగల విహారములు మొదలగువాని విలసనములు కనుపించుట కార్తీక మార్గశిరములందు.

### శరద్ఘనములు

వర్షర్తువు గడచి పోగనే విష్ణుమూర్తి నిద్రనుండి లేచునన్న పురాణ వాక్యమును రాయలు కూడ శిరసావహించుచున్నాడు. శరత్ ప్రారంభమున విష్ణువు నిద్రలేచు చున్నాడు. అపుడు నిద్రనుండి లేచిన విష్ణువునకు నీరాజనమెత్తినట్లుగ నున్నవట సాంధ్య రాగ రంజితములైన శరన్మేఘములు.

"సాంధ్య రాగ లహరి సామిరంజితములై
తిరిగె మింట నిమర దెలిసినట్టి
యిందిరాధి పతికి నెత్తు కర్పూర నీ
రాజనములన శరద్ఘనములు" -ఆము. 4-139

పై వర్ణన నన్నెచోడుని వర్ణనను పోలి యున్నది (కుమార. 6-113). అక్కడను ఇక్కడను వర్షానంతరమున విష్ణువు నిద్రనుండి లేచుట వర్ణింపబడినది. అక్కడ హరిలక్ష్మల నేత్రములకు పద్మకుముదముల పోల్చుటయును ఇక్కడ శరద్ఘనములను విష్ణువున కెత్తిన నీరాజనమునకు పోల్చుటయును జరిగినది.

ఈ క్రింది వర్ణన యింకను మనోహరముగ నున్నది.

"ఆళిగరు దంచలా మలత దంతర బింబిత యయ్యె బాక ని
ర్గళిత మహా ఫలౌఘ హరితచ్ఛద కర్కటి కావనాలి నా
గలమ వన భ్రమ చ్చుక నికాయములోపల సాంధ్య రక్తిమం
బలతిగ దాల్చి మింట గనన య్యె విపాండు పయోద ఖండముల్" -ఆము. 4-140.

చాల మనోజ్ఞమయిన సహజ వర్ణన.

ఈ క్రింద శరత్కాల మేఘములను మణిధనువు యొక్క పరాగములని వర్ణించుట జరిగినది. ఆకాశము స్వచ్ఛనీలముగా ప్రకాశించుచున్నది (ఆము. 4-141)

ఈ క్రింద కుంకుడుకాయ నురుగుతో పోల్చబడినవి శరన్మేఘములు. చక్కని ఉపమానము. స్త్రీలు తమ ఆభరణములను కుంకుడు కాయ పిసికిన ఊటతో శుభ్రము చేయుట సహజము. దొంతరలు కట్టిన కుంకుడు కాయలనురుగు ఆకారమందును, వర్ణమందును తెల్లమేఘపుదొంతరలవలెనే యుండుట ప్రకృతిదృశ్యము

"గగన లక్ష్మి నిజోరు నక్షత్ర మాలి
కలు వియన్నది జలముల గడుగ బిసుక
నెఱయు కుంకుడు పండుల నురువులనగ
బలపలని పాండురాంబుద పఙ్క్తులమరె" -ఆము. 4-157

సముద్ర జలమునంతటిని మేఘములు పీల్చి నీటినంతను వర్షింపగా మిగిలిన ఉప్పు ఇపుడు తెల్లగా ప్రకాశించుచున్నదా అన్నట్లు శరన్మేఘములు ప్రకాశించుచున్నవట. ఈ వర్ణన సోపపత్తికముగ నున్నది.

"శరధి జలమెల్ల రిత్తగాఁ గురియ నుప్పు
డొక్కఁజేరిన నత్తెల్పి చిక్కిమీద
గాననగుచున్న దచ్ఛత చేవనంగ
బఱచు శరదభ్రముల మేని పాండి మమరె" -ఆము. 4-170

## రెల్లు వర్ణన

రెల్లుపొదలు ఎన్నులు దీసి తెల్లగా ప్రకాశించుట ఎట్లున్నది?

వర్షాకాలములో పిడుగులు పడినపుడు భూమికి పాతాళములోతు వరకు విశేషముగ రంధ్రాలు పడినవి. సముద్రముపై పరుండి నిద్రలేచిన విష్ణువు బలముగా ఊదుకొని లేచినపుడు భూమి ఒత్తబడి అణిగినది. లోపల నుండిన నీరు ఆ రంధ్రాలగుండా పైకి ధారగా చిమ్మినదా' అన్నట్లు రెల్లు కాడల శిఖరాలలో రెల్లు పూలు ప్రకాశించినవి. వర్ణన ఎంతయో మనోహరము. వస్తు స్వరూపము కన్నులకు కట్టినట్లుగా వర్ణితము.

> "సంభూత జ్ఞప్తి వాతాశన శయనము విశ్వంభరుఁడూది లేవన్
> గంభీర ప్రక్రియా మగ్నత డిగు జగతిం గ్రందుగా దోఁచు వర్షా
> దంభోళి స్థూల రంధ్రోద్గత సిత పృథు పాతాళ జాతాంబు ధారా
> స్తంభంబుల్వోలె నెన్నుల్దవళ రుచిశర స్తంభ పంక్తిం జనించెన్" -ఆము. 4-143

## స్వచ్ఛజలాలు—అగస్త్యవర్ణన

జలములు స్వచ్ఛములుగ నున్నటులవర్ణించుట శరద్వర్ణనలో ఒక పరిపాటి. అగస్త్యోదయముతో వరదల నీరు తేరి, తక్కువప్రమాణములో ప్రవహించుట సహజము. అందులకు అగస్త్యుని చిల్లగింజగా వర్ణించుట జరిగినది. శరత్కాలములో అగస్త్య వర్ణన చేయుట సంప్రదాయము. ఆ సంప్రదాయమిట పాటింపబడినది. ఈ వర్ణనను మిగిలిన యేడు ప్రబంధకారులును కావింపలేదు,

> "అలమలయాద్రి కుంభ భవుఁడన్కతకంబు శరత్తు కుండ మం
> డలి ప్రతిబింబ కైతవమునం దమకిచ్చిన వారి దేవుడ
> ల్లోలకుల కేలఁ దావనిడి తోమ గలంకడిగెం దదీయత
> త్ఫలతకు హ్రస్వమౌచు కరి తారక లంబువుఁ దేర్చునే యనన్" -ఆము. 4-146

## శా ర దా కా శ ము

గ్రీష్మమందు వాతాహతివలన దుమ్మెంతయు ఆకాశమున కెగిరి అందు కొంత నిలుచును గాభోలు! వర్షాకాలమున బాగుగ వర్షించుటతో ఆకాశము శుభ్రముగ కడిగి

నట్లు అగును. అపుడు ఆకాశము స్వచ్ఛనీలవర్ణముతో ప్రకాశించును. శరద్వర్ణనలో ఆకాశవర్ణన ఒక భాగము.

"భువి సరః కైరవ శ్రేణి పోవఁదోల
దివిఁ గనత్ గ్రహ నక్షత్ర దీప్తి దఱుమ
కృష్ణ పక్షపు వాసిలే కిరుఖ దనదు
నలుపునను గూడె ననవైల్యమొలసె నభము" —ఆము. 4-167.

శారదాకాశమును వర్ణించుటలో మిగిలిన కవులందఱును వాల్మీకికి తీసికట్టే యన్నచో నతిశయోక్తికాదు (రామా. కిష్కింధా. 30-46).

## మరాళములవర్ణన

శరత్కాలమున హంసల వర్ణన ప్రముఖ స్థానమువహించి యున్నది. ఆయా ఋతువులలో వర్ణింప దగిన వానిని ఇతర కవులు ఒక పదముతో ఒక ఒక పద్యముతో సరిపుచ్చుకొందురు. కాని కృష్ణదేవరాయలు పరిపూర్ణముగ సాకల్యముగ వర్ణించును.

"హెచ్చిన మైత్రిఁ బద్మినులకెల్ల ఘనాత్యయ కారకుండు సొ
మ్మచ్చుపడంగఁ జేయుటకు నైయలకాగించ నగఁబు పేరి క
మ్మచ్చున నీఱు శర్వగిరి యందలి వెడి శలాక పిందునా
వచ్చి మరాళ మాలికలు వ్రాలె గొలంకుల జక్ర ఝుంకృతిన్" ఆ-ము. 4-148.

"కలయగ వారి దేవతలు గాంచు సరోవర రంభ దర్పణం
బుల పయిదట్టపుంజిలుము వోవగఁ దారలకించు గీయగా
బలె నలువంకలంగలయఁబాయక తేలుచుఁ బద్మ రేణువు
ల్కెలకులఁ బాసి పోజెలగెఁ గేంకృతులిచ్చు మరాళ మాలికల్" -ఆము. 4-189

## పద్మము - తేంట్లు

శరత్తున పద్మ ప్రకాశమును, తేంట్ల మధుర ప్రచారమును సొంపుగ వర్ణించుచున్నాడు—

"కెరలు స్రవంతిపై నిసుక క్రిందగు వేళ నిముండు మేఘపుం
దెరసన జల్లగా విరహదీప్త కరప్లుత మౌన జీరకో
త్కర గుడమట్ల పద్మినులఁ గ్రమ్మ సకేసర మాధ్వి పాల్చెఁ బై
గర మరుదారెఁ దేంట్లు సెక కందిన ముత్తెపు సేసలోయనన్" -ఆము. 4-150

"పంకమడుగంది తేటయై బావులెల్ల
బంకములె చేసె గ్రమ్మఱం బంకజములు
గళిత మకరంద యుత రజః కర్దమమున
గారణ గుణంబు గలుగదే కార్యమునకు" —ఆము. 4-174

శరజ్జ్యోత్స్న

శరజ్జ్యోత్స్నకు చాల ప్రాముఖ్యము గలదు. కార్తిక పూర్ణిమ యిందులోనిదే. కార్తీక దీపము వెలయించుట మన యాచారముగూడ. కార్తీక పూర్ణిమనాడు వెన్నెలలో భోజనము చేయు నాచారముగూడ గలదు. వెన్నెల చాలస్వచ్ఛము. ఇట దట్టమైన వెన్నెల వర్ణితము. గొప్ప ఉత్ప్రేక్ష.

"కరుపాతపత ప్తంబగు
ధరణీ పాత్రమున బడుట దళ మయ్యె జుమీ
పరిపక్వంబై యనగా
శరదిందు జ్యోత్స్న లేలు సాంద్రత గాంచెన్" —ఆము. 4-176

ఈ కవియే గ్రీష్మర్తు రాత్రులందలి జ్యోత్స్నచాపట్టు పోసినట్లుగా దట్టముగా తెల్లగా నుండెనని వర్ణించియున్నాడు. (ఆము. 2-60)

కేకులు

వర్షాకాలములోని బర్హిణములకును, శరత్కాల బర్హిణములకును భేదము గలదు, వర్షాకాలమున వాని యానందము వర్ణించుట పరిపాటి, శరత్తులో తద్విరుద్ధము. సంస్కృత కవులయిన వాల్మీకి, కాళిదాసు, మాఘుడు ఈ కవిసమయమును పాటించి సహజముగ వర్ణించి యున్నారు.

వాల్మీకి రామాయణమున కిష్కింధా కాండమందలి శరద్వర్ణనలో నెమిళ్ళు పింఛములు లేకుండ నదీ తీరములందు పోగా హంసలు వానిని చూచి పరిహాసము చేసినట్లుగా వర్ణించియున్నాడు. వర్షాకాలమున అహ్లాద నృత్యములు చేయు మయూరములు శరత్కాలములో పురులు విప్పి నాట్యము చేయలేవనియు, కేకలు వేయలే వనియు కవిసమయము—

"త్యక్త్వావరణ్యాత్మవిభూషణాని బర్హాణి తీరోపగతానదీనాం
నిర్భర్త్స్యమానా ఇవసారసౌఘైః ప్రయాన్తి దీనా విమదామయూరాః
—రామా. కిష్కింధా. 30-41

కాళిదాసకవి తన ఋతు సంహారమునను (3-13), మాఘుడు తన శిశుపాల వధయందును (శిశు, 6-44) ఇట్టి భావమునే వర్ణించియున్నారు.

సంస్కృత ప్రాకృతాంధ్ర కర్ణాట ద్రవిడాది సర్వభాషాపండితుడైన కవిరాజు శ్రీకృష్ణదేవరాయ లీ సంప్రదాయమును పాటించుచు వారికంటె మనోజ్ఞముగ వర్ణించుచున్నాడు. నెమిలియొక్క ఛాధావమానములను మరంత చక్కగా చిత్రించుచున్నాడు.

"అరకమండలి కత్రి మడ్డ మైనంతనె
యెఱమాని మోము బిట్టెత్తి చూచి
ఘుమ ఘుమ ధ్వని గాలి గుహం జొర బురి యొకిం
చుక విచ్చి కని తలంచుకొని వంచి
నిష్పుష్ప కేతకీ నేత్రాంబు లొత్తి భే
కపుం డెంకి వడియచోం గర్ణ మొగ్గి
కేకకు దర్వ్యవనత గ్రీవమై రాక యొ
క్కింతార్చి వాత నేమేమొ కమిచి
వెడలు బిరెండకును శరద్వృతుముడిగి
వార్షికమె యెక్కి త్రోటినిర్వంక పక్ష
తులను గిరుపుచు వెట్టి చూపుల నురంబు
కెఱకులం గనుంగొనుచుం గాన కేకులుండె" -ఆము. 4-181

ఆముక్తమాల్యదలో ఋతువర్ణనా సాకల్యమును చూడగలము. అనితర సాధ్యమైన సహజ ప్రకృతి వర్ణనల చూడగలము.

## శరదృతువు-కళాపూర్ణోదయము

మధురలాలసయును, కళాపూర్ణుడును వివాహానంతరము కేళీవిలాసములలో నుండు సమయమున శరదృతువును వర్ణించుచున్నాడు కవి.

"తనవిభు డనిశము నవ్విధ
మున నాసతి బాయకునికిం బోలెన్ మహింధా
ఘన ఫల శాలిఈు శరా
సన బాణా క్రాంతిం జెందె శరదృతువమరన్" -కళా. 7-175

పైన వనజములు వర్ణితములు. అవి కాము బాణములు.

మధుర లాలస కళా పూర్ణుల వివాహానంతరము క్లుప్తముగ ఋతువర్ణనల క్రమముగ చేయుచున్నాడు సూరన. పై శరదృతువర్ణన గూడ అతిక్లుప్తముగ సాగినది.

### శరదృతువు

ప్రభావతీ ప్రద్యుమ్నమునను, వసుచరిత్రమునను, విజయ విలాసమునను లేదు.

### హేమంత ర్తువు

హిమ ప్రభావ మెక్కువ గలది హేమంతము. వాల్మీకి రామాయణమున నిది పూర్ణముగ వర్ణింపబడినది. సీతారామ లక్ష్మణులు పంచవటిలో నుండిన కాలమున ఉదయము స్నానార్థమై బయలుదేరిన సమయములో లక్ష్మణుడీ ఋతువర్ణన చేయు చున్నాడు. మొత్తమిది యిరువదేడు (27) శ్లోకములలో సాగినది. వర్ణనలు సార్థకము గను, రమణీయముగను ఉన్నవి. (వాల్మీకి రామాయణము, అరణ్యకాండ 16వ సర్గ)

జనుల దేహములు (ప్రాణుల) బిరుసెక్కుటయు, జలములు ముట్టరాకుండుటయు, అగ్ని మనోహరమగుటయు, పశువులు పాలెక్కువగా నిచ్చుటయు. సస్యములు పండి గ్రామములు సుభిక్షముగ నుండుటయు, మధ్యాహ్నమయినను ఎండలో తిరుగుట హాయిని గూర్చుటయు, మంచు పడుటచేత ఏదియు కనిపించకుండ నుండుటయు, చంద్రునివలె సూర్యుడు చలగానుండుటయు, మంచువల్ల కేసరములు గూడ రాలిపోగా కమలములు మోడులై యుండుటయు, మొదలుగా గల వర్ణనలు వర్ణితములు.

కాళిదాసు గూడ తన ఋతు సంహారమున పద్మములకు హేమంత ర్తువు విప్లవమని వర్ణించినాడు. వృక్షాలందున చిగుళ్ళు కనిపించు చున్నట్లును, ముఖ్యముగ లొద్దుగు పూలు పూయుచున్నట్లును వర్ణించినాడు (ఋతు, 4-1). వరి పండుటను అందఱును వర్ణించినారు. రతివర్ణనలు ఈ ఋతు సహజములు. ఇవి ఋతుసంహారమున అధికములు. రామాయణమున ఈ ఋతువర్ణన సీతారాముల సన్నిధిలో లక్ష్మణుడు చేసినది గాన రతి వర్ణనలు తక్కువ.

భరతుడు తన నాట్యశాస్త్రమున హేమంతర్తువు నెట్లు సూచింపవలెనో చెప్పు చున్నాడు-

"గాత్ర సంకోచ నాచ్చాపి సూర్యాగ్ని పటుసేవనాత్
హేమంత స్త్వభినేతవ్యః పురుషై ర్మధ్యమాధమైః"
"శిరోదంతోష్ఠ కంపేన గాత్ర సంకోచనేనచ
కూజితైశ్చ సశీత్కారైః అధమాశ్శీత మాదిశేత్''
"అవస్థాంతర మాసాద్య కదాచిత్తు త్తమైరపి
శీతాభినయనం కుర్యాత్ దేవాద్వ్యసన సంభవం"

-భరత. నాట్య. అధ్యా. 25 - 29, 30, 31

(గాత్ర సంకోచమును సూచించుట చేతను, ఎండను, చలిమంటను కాయుట చేతను, శిరస్సును, దంతములను, పెదవులను వణికించుట చేతను, ఊహూహూ అని అనుట చేతను, మధ్య మాధమ పాత్రల వలనను, కేవలము అధమ పాత్రల వలనను, అవస రము ననుసరించి ఉత్తమపాత్రల వలనను - హేమంతర్తు ప్రభావమును సూచింపవలెను).

విన్నకోట పెద్దన యువతుల చన్నులు వేడిగా నుండుట మొదలగునవి వర్ణింపవలె నన్నాడు. (కావ్యాలం. 3-107)

ఇక తెలుగు ప్రబంధములలో దీనినెట్లు వర్ణించిరో పరికింతము.

## హేమంతర్తువు - కుమారసంభవము

ఆంధ్ర కవులు చాలమంది యీ ఋతువర్ణనను చేయలేదు. కొందఱు మాత్రమే చేసినారు.. నన్నెచోడుడుగూడ చాల కొలది పద్యములలోనే, అనగా నాలుగు పద్య ములలోనే వర్ణించినాడు.

''శరదాగమంబు తనసుత
కురు పరితాపంబు సేయుచుండుట హిమభూ
ధరపతి గనివాని పయిన్
బరిగొనియెనో నాఁగ దుహిన పటలము పర్వెన్" -కుమా. 6-123

పై వర్ణన కథతో నన్వయింప బడినది.

"శీతాత్యంత నిపీడనఁబడి జగజ్జీవాళు లత్యార్తులై
పాతాళంబులు సొచ్చునట్టి రవులొప్పన్ భూగృహావాసులై
క్షితిన్ వెల్వడకుండ వహ్ని మెయి గంపింపం బ్రచండార్చికిన్
జేతుల్ గ్రొవ్వెర వోవుచుండ శిశిరోచ్ఛేదంబు వర్వెన్ మహిన్" -కుమా. 6-124

పైన హేమంతమందలి సహజత వర్ణితము.

పార్వతి కొలనులో మెడబంటి లోతున నుండి తపస్సు చేయుచున్నది. ఆమె

తలమాత్రమే పైకి కనుపించుచున్నది. ఆమె మొగము పద్మమువలెనున్నది. ఆ మొగమును ఉత్ప్రేక్షించుచున్నాడు కవి.

"తనరి హేమంతమగుడుఁ బద్మంబు లడగి
పోవఁ బోయినఁ గొలనొక్కపువ్వు తనకు
విత్తుగా డాచికొనియున్న విధము పోలె
శైలసుత ముఖముదక వాసమున నొప్పె" -కుమా. 6-126

ఇది గొప్ప ఉత్ప్రేక్ష. తామరలన్నియు ధ్వంసము కాగా, విత్తుకొఱకై కొలను ఒక పద్మమును నిలుపుకున్నదా అన్నట్లున్నదట ఆమె ముఖము! అమోఘ వర్ణన యిది. శరత్తున తామరలకు నాశనము అను కవిసమయము పాటింపబడినది.

కాళిదాసుగూడ తన కుమార సంభవమున పార్వతి పెదవులు తామర రేకుల వలె నుండుట వలన తామరలు లేని కొలనికి తామర వాసన లిచ్చుచున్నదా అన్నట్లుండె నని వర్ణించుచున్నాడు.

"ముఖేన సా పద్మ సుగన్ధినా నిశి ప్రవేపమానాధర పత్ర శోభినా
తుషార వృష్టి క్షత పద్మ సంపదాం సరోజ సంధాన మివా కరోదపాం"

-కాళిదాసు కుమార. 5-27

(ఆమె కెమ్మోవి తామరరేకువలె విరాజిల్లుచున్నది. వదనము తామరవలె పరిమళించుచున్నది. మంచు వాన వలన తామరలు నాశనమైనను, ఆ లోపము తీరునట్లు పార్వతి తామరను సమకూర్చినట్లుగా నున్నది)

పై కాళిదాసు వర్ణన కంటె నన్నెచోడుని వర్ణన సారభూతముగనున్నది. కాళిదాసు కుమారసంభవమున శరచ్ఛిశిరర్తు వర్ణన చేయలేదు. నన్నెచోడుడు అన్ని ఋతువులను వర్ణించియున్నాడు.

## హేమంతర్తువు - కళాపూర్ణోదయము

మధురలాలసయు, కళాపూర్ణుడును వివాహానంతర భోగముల ననుభవించు సందర్భమున గావించిన ఋతువర్ణనలో నిది యైదవది. హేమంతము వచ్చుటను వర్ణించుచున్నాడు.

"హేమంతంబంత నంతర్హిత కమల జలోదీత విస్ఫీత శీత
ధామాత్మ స్వామి ధామ క్రమణ కృశ వపుర్ష ప్రవిశ్రాణితాతి

క్షేమ ప్రేమ ప్రకామ శీతర తముదిత స్త్రీ ముఖ వ్యూహ సౌహా
ర్దా మందానంద దీదూదయకల నబలె న్యామినుల్ మెచ్చ వచ్చెన్"
-కళా. 7-177.

పై వర్ణనలో కవి సమయమైన పద్మవిప్లవమును, సంప్రదాయసహజమైన రతివర్ణనమును జరిగినవి.

"అగలున జవ్వాదిని జే
మగఁ బూసిన యట్టి వజ్రమణి సౌధములన్
బిగి కౌగిటఁ జేర్చె విభుం
డిగు రాకుంబోడి నట్టి హేమంతమునన్"

హేమంతమున రతివర్ణనలు చేయుట పరిపాటి.

పై పద్యములలో నిది స్పష్టము. హేమంతర్తు వర్ణనలు, మనుచరిత్ర, పారిజాతాపహర ణము, ఆముక్తమాల్యద, ప్రభావతీ ప్రద్యుమ్నము, వసుచరిత్ర, విజయవిలాసముల యందు లేవు.

## శిశిర ర్తువు

హేమంతము తర్వాతిది శిశిరర్తువు. దీనియందలి గుణములు చాలవఱకు హేమంత గుణములను పోలియుండును. దీనియం దాకులు రాలును. క్రొత్త చిగుళ్లు పొటమరించును. చలి ప్రాబల్యము తగ్గుచుండును. రతిక్రీడ కింపుగానుండును.

శిశిరర్తువున దేవలోకమందును త్రాగుటకు నీళ్లు దొరకవనియు. మనుష్యలోకమున గూడ మార్గమధ్యమందు నీళ్ళు దొరకవనియు వేదములలో నున్నది (మల్లాది సూర్య నారాయణశాస్త్రి—వేదవాఙ్మయము, పుటలు 258, 259).

వాల్మీకి రామాయణమున దీని ప్రసక్తి లేదు. హేమంతాంతర్భాగముగా దీనిని పరిగణింపవచ్చును.

కాళిదాసు తన కుమార సంభవమున దీనిని గూర్చి ప్రత్యేకముగా వర్ణింపలేదు. ఋతుసంహారమున దీని లక్షణములు వర్ణింప బడినవి. అందుగూడ ఎక్కువగా లేదు. వరిని గూర్చివర్ణన లున్నవి. (ఋతు. 5-1) జక్కవలు కూయుచుండుటయు, కామము వృద్ధి పొందుటయు వర్ణింపబడినది.

భరతుడు నాట్యశాస్త్రమున శిశిరర్తువు నీ క్రింది విధముగా సూచింప వలెనన్నాడు.

"ఋతు జానాంతు పుష్పాణాం గంధా ఘ్రాణై స్తథైవచ
రూక్షస్య వాయో స్పర్శాచ్చ శిశిరం రూపయేత్ బుధః"

-భర. నాట్య. 25-అధ్యా. 32

(ఆ ఋతు సంబంధిక పుష్పముల చేతను, వాని గంధము నాఘ్రాణించుటచేతను, శీత వాయు స్పర్శ నభినయించుటచేతను శిశిర ర్తువు సూచింపబడవలెను)

విన్నకోట పెద్దన, రవిరశ్మి మాంద్యమును, కమల విచ్ఛిన్నతను వర్ణింప వలెనన్నాడు.

శిశుపాలవధలో కామక్రీడలు, ప్రియంగు లతలు, లోధ్ర పుష్పాలు, మొదలగునవి అయిదు శ్లోకాలలో వర్ణితములు. (శిశు. 6-55 నుండి 59 వఱకు).

## శిశిర ర్తువు-కుమారసంభవము

హేమంతముతోనే శిశిరమును ముడివెట్టినాడు నన్నెచోడుడు.

"తనరి హేమంత...(6-126) అను పద్యము తర్వాత "మఱియును. ." అను వచనము వ్రాసి (6-127) పై పద్య భావమునే హెచ్చు చేయు భావమును వర్ణించుచున్నాడు.

"వనజము లెల్ల మంచుకొని వాడినచో నొక పువ్వ నిల్చినన్
గని యలు లన్నియున్ నెలవు కైకొని దీనికి ముచ్చువచ్చునో
యనువగ, మీద బిండుకొని యడ్డము నిల్చెనొ నాగ నంబుజా
నమము పయిం జటావలి పెఱంగి నగాత్మజ కొప్పు సత్తఱిన్"

—కుమా. 6-128.

పద్మములన్నియు చెడిపోగా ఒక పువ్వు మాత్రము విత్తనము కొరకు భద్రముగా కాపాడబడినది. ఆ పువ్వు పార్వతి ముఖము. కాపాడినవి ఆమె శిఖారూపమున నున్న అళులు. మనోహరవర్ణన.

## శిశిరర్తువు - కళాపూర్ణోదయము

మధురలాలస కళాపూర్ణుల వివాహానంతర క్రీడా సందర్భమున నిది వర్ణితము,

"అన్యోన్యోన్నతిఁ బొల్చె మాఘము లవంగా సంగ భృంగౌఘమై
యన్యక్కార తుపార భృత్యవర శైత్యచ్ఛన్న కందర్ప దౌ
ర్జన్యా సంగమ సంప్రవర్ధిత పరీరంభ క్రియా సంభృతా
న్యోన్యాంగ ప్రసభ ప్రవేశ యువ యుగ్మాతః కృతశ్లాఘమై" —కళా. 7-180.

పైని లవంగా సంగ భృంగములు, కందర్ప దౌర్జన్యములు వర్ణితములు.

"మడుత పసిమిడి గింటెముల్ మంజి!జిరి
దోమతెర మంచములు, హసంతులు, జవాది
యగలు సిరులు చిన్నెలుగాగ నతడు గడపె
జలి నెలలు తద్వధూ కుచ శరణుడగుచు" —కళా. 7-181

దోమతెర మంచములు, కుంపట్లు, జవాదియగలు, మొదలగువానితో పాటు వధూకుచములు గూడ వేడి నిచ్చునవిగా పైన వర్ణితములు.

మనుచరిత్ర, పారిజాతాపహరణము, ఆముక్తమాల్యద, ప్రభావతీప్రద్యుమ్నము, వసుచరిత్ర. విజయవిలాసముల యందు శిశిరర్తు వర్ణనలు లేవు.

## సారాంశము

1. ఋతువర్ణనలు వేదకాలమునుండి వచ్చుచున్న సంప్రదాయ సంబంధులు.
2. ఋతువర్ణనల కాదికవి వాల్మీకియే, కావ్యత్వమిచ్చినాడు.
3. కాళిదాసు కేవలము ఋతువర్ణనల కొఱకయియే ఋతు సంహారమును వ్రాసినాడు.
4. సంస్కృత కుమార సంభవమున శరచ్ఛిశిరములు లేకున్నను తెలుగు కుమార సంభవమున అవి గూడ గలవు.
5. కాళిదాసు తన కుమారసంభవమున అన్ని ఋతువులను ఒక్కసారిగా వర్ణించుట చేతను, ఋతు వర్ణన అష్టాదశ వర్ణనా నియమములో నొకటి యగుటచేతను, పారిజాతాపహరణమున తిమ్మన - తప్పనిసరి యని భావించినాడేమో - సర్వర్తు వర్ణన చేసియున్నాడు.
6. ఋతువర్ణనా ప్రధానమగు కావ్యము ఆముక్తమాల్యద. మొత్తము 225 పద్యాలలో నాల్గు ఋతువుల వర్ణన గలదు. వర్షర్తువున నింద్రగోపము● నెన్నియో విధములుగ వర్ణించిన కీర్తి రాయలకే దక్కినది,

7. గ్రీష్మర్తు వర్ణన అందఱికంటెను గొప్పగా చేసినవాడు నన్నెచోడుడు.

8. వసంతర్తువు నందఱు కవులును వర్ణించినారు. చాలమంది కవులు కొన్ని కొన్ని ఋతువులనే వర్ణించిరి.

9. వర్షర్తువున నిద్రించి శరత్ ప్రారంభమున హరి నిద్రలేచుట అను సంప్రదాయమును చాలమంది కవులు పాటించినారు. అందు నన్నెచోడుడును, రాయల వారును ముఖ్యులు.

## ఋతువర్ణనలు- పద్యసంఖ్య

| ఋతువు | 1. వాల్మీకి రామాయణము | 2. కాళిదాసు ఋతుసంహారము | 3. మాఘుని శిశుపాలవధ | 4. నన్నెచోడ కుమారసంభవము | 5. పెద్దన మనుచరిత్ర | 6. తిమ్మన పారిజాతాపహరణము | 7. రాయల ఆముక్తమాల్యద | 8 సూరన కళాపూర్ణోదయము | 9. సూరన ప్రభావతీప్రద్యుమ్నము | 10. భట్టుమూర్తి వసుచరిత్ర | 11. చేమకూర విజయవిలాసము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| వసంతర్తువు | 100 | 28 | 20 | 255 (వసంతోత్సవ వర్ణనలు కలిపి) | 40 | 40 | 60 | 10 | 10 | 50 | 10 (దాదాపు) |
| గ్రీష్మర్తువు | – | 28 | 3 | 12 | – | – | 26 | 1 | — | — | — |
| వర్షర్తువు | 60 దాదాపు | 28 | 15 | 17 | 2 (వర్షము మాత్రము) | – | 61 | 3 | — | — | — |
| శరదృతువు | 60 దాదాపు | 26 | 15 | 10 | – | – | 47 | 2 | — | — | — |
| హేమంతర్తువు | 27 | 18 | 6 | 4 | – | – | – | 2 | — | — | — |
| శిశిరర్తువు | – | 16 | 5 | 1 | – | – | – | 2 | — | — | — |
| మొత్తం | 247 | 144 | 64 | 299 | 42 | 40 | 194 | 20 | 10 | 50 | 10 |

# నవమ ప్రకరణము

## నదీ సరో వర్ణనలు

నది ప్రకృతి లోనిది. నదీవర్ణనలు వేదములందే గలవు. నదులు సముద్రునికి భార్యలుగా వేదములందే చెప్పబడినవి. "ప్రయత్సింధవః సముద్రం రథ్యే వజగ్ముః" అని ఋగ్వేద 3-33-1 లో గలదు. గంగ, యమున, సరస్వతి, శతుద్రి మొదలగు నదులు పేర్కొనబడినవి.

సరయూ నది (రామా, బాల. 24-6, 7) గోదావరి (అరణ్య 15-12, 13, 14) మొదలగునవి రామాయణమున వర్ణింపబడినవి.

నదీ సరోవర్ణనలు చేయుతటి హంస సారసములును, తీరవనములను, పుష్ప ఫలములను, చిలుకలను, చక్రవాకములను, మయూరములను, గజములరు, పద్మములను, పనస, తమాల, ఆమ్రాది వృక్షములను వాల్మీకి రామాయణమున వర్ణించినాడు.

రామాయణమున రెండు గొప్ప సరస్సులు ప్రత్యక్షమగుచున్నవి. అవి పంపా సరస్సును, పంచాప్సరస్సును. వానిని గురించి రామాయణ నదీ సరోవర్ణనల చర్చించుతటి ముచ్చటింప బడినది.

అష్టాదశ వర్ణనలలో 'జలకేళి' యున్నది. ఈ జలకేళి నదియందుగాని, సరస్సనందుగాని జరుగును.

జలకేళి వర్ణనలో తప్పనిసరిగా పాటించవలసిన వివరములను విన్నకోట పెద్దన సూచించియున్నాడు. అవి --

"నీరు, చెంగలువలు, వీచికలు, పద్మములు, కరయంత్రి పయోధారలు, ఆవర్తములు"

--కావ్యాలం. 3-117

తర్వాతివాడగు కేశవమిశ్రుడు తన అలంకార శేఖరమున (16 వ మరీచి, 1 శ్లోకమున) ఇట్లు వివరించినాడు.

1 నదీ వర్ణనమందు :-

"జలప్రవాహము, గజములు, పద్మములు, షట్పదములు, హంసలు, నదీవక్రత, తీరోద్యానములు, స్త్రీ, పాంథులు,".

**2. జలకేళి వర్ణనమందు :-**

"సరస్సును క్షోభపరచుట, చక్రవాకములు, హంసలు తొలగిపోవుట, నీళ్లు చల్లికొనుట, భూషణచ్యుతి మొదలగునవి"

సంస్కృత కావ్యాలయిన శిశుపాలవధేత్యాదులందు గల యీ వర్ణనలు ముందే --ప్రథమ ఖండమందలి చతుర్థ ప్రకరణమున--చర్చింపబడినవి.

సరోవర్ణనలు కాదంబరి యందు రమ్యముగను పరిపూర్ణముగను చేయబడినవి. ముఖ్యమయినవి (1) పద్మ సరోవర్ణన, (2) అచ్ఛోద సరోవర్ణన.

సరస్సును వర్ణించు సమయమునఁ నేయే వర్ణనలు చేయవలెనో అన్నియు నిందు గలవు.

**ఉదాహరణకు పద్మ సరోవర్ణన**

"జలనిధి పాన ప్రకుపిత వరుణ ప్రోత్సాహితేన అగస్త్య మత్సరాత్ తదాశ్రమ సమీపవర్తీ అపర ఇవ వేధసా మహాజలనిధి రుత్పాదితః ... ఉత్ఫుల్ల కుముద కువలయ కల్హారం ...... ఉన్నిద్రారవింద మధు బిందు నిష్యంద బద్ధ చంద్రకం ... అళికుల పటలాంధకారిత సౌగంధికం, అరసిత మదసారసం ... అశంకితావ తీర్ణాభి రంభః క్రీడా రాగిణీభిః స్నాన సమయే వనదేవతాభిః కేశకుసుమైః సురభీకృతం ... సలిల పాతమవ తీర్ణైః జలధరై రివ బహుళ పంకమలినైః వనకరభి రనవరత పీయమానం ... అగాధం... అనన్తం ... అపాం నిధానం పంపాభిధానం పద్మసరః ...'

**అచ్ఛోద సరోవర్ణన**

"ప్రవిశ్యాచ తస్య తరుషండస్య మధ్య భాగే మణి దర్పణ మివ ... చంద్రాతప రసతాముపేతం ... అనిలోద్ధూత తరంగ శీకర ధూళీ జన్మభిస్సర్వత స్సముత్థితైః స్సంరక్ష్యమాణ మివ ఇంద్ర చాప సహస్రైః ... ఉపకూల తమాల వన ప్రతిబింబితాంధ కారితాభ్యంతరైః దృశ్యమాన రసాతల ద్వారై రివ సలిల ప్రవేశైర్గంభీరతరం ... అచ్ఛోదనం నామ సరోదృష్టవాన్ ..."

సకల వర్ణనా సార రచన చూడవలెనన్న బాణుడొక్కడు చాలు. ఇక ఆంధ్ర ప్రబంధములందలి నదీ సరోవర్ణనల తిలకింతము.

## నదీసరోవర్ణనలు — కుమారసంభవము

ఈశ్వరుడు తన రేతముతో నగ్నిని ముంచెత్తినాడు. అతడు బ్రహ్మ దగ్గఱకు వెళ్లి మొఱపెట్టగా నతడు గంగలో వదలుమనినాడు. గంగ యిష్టపడలేదు. మరల బ్రహ్మ కడకు రాగా నతడు శరవణ సరసిలో వదలుమన్నాడు. అగ్నిదేవుడు శరవణసరసికి వచ్చి నపుడు శరవణ సరస్సు ఒక స్త్రీ రూపములో కనిపించినట్లు నన్నెచోడుడు వర్ణించు చున్నాడు.

ఇందున్న మృణాలములు, అంబుజాతములు, ఉత్పలములు, జక్కవలు, పులిన ములు, తరంగములు, సుడులు, - అన్నియు వర్ణితములు. పైవన్నియు స్త్రీ అంగములకు రూపింపబడినవి. ఇది ప్రకృతి వర్ణనయే.

"లోలాళిజాలముల్ నీలాలకములుగా
కాలమృణాలముల్ కేలుగాగ
కళికాంబుజాతంబు కెలిమోముగా నుత్ప
లములు విశాలనేత్రములు గాగ
జక్కవకవ నిండు చనుగవగాఁ బులి
నస్థల మురుజఘనంబుగాగ
మొలచు తేదరగలు ముత్తరంగలుగాగ
కొలిల్లు సుడి నిమ్న నాభిగాగ

నబ్జ వనలక్ష్మి శంభు వీర్యమునఁ గొడుకు
బడసి దివిజుల కీఁ బూని పావకునకు
నొలసి తన రూపు చూపునట్లొప్పు దోచె
శీకరంబగు నా కమలాకరంబు"

—కుమా. 10.29

ఇందు గంగానది వర్ణన గూడ గలదు. శరవణ సరసు గంగానదిలోని భాగమే గదా! పై వర్ణనతో సరోవర్ణన లక్షణమును గూడ జెప్పినట్లయినది.

## నదీసరోవర్ణన-మనుచరిత్ర

ప్రవరుడు వెళ్లిపోయిన వెనుక వరూధిని బాధపడుచున్నది. ఆమెను ఆమె చెలి కత్తెలు వనవిహారమునకు తీసుకొనిపోయిరి. తరువాత వారు జలక్రీడలాడుచుండగా

వరూథిని అందులో పాల్గొనక గట్టున కూర్చున్నది. అప్పటి జలాశయమున నాళీకములు, మత్తమరాళములున్నటుల వర్ణితము.

"నాళీక మధూన్మత్త మ
రాళీ ముఖ రాళి సుఖకళంబగు కొలనన్
కేళీలాసలసగతి డిగి,
యాళీ నివహంబు లోలలాడెడు వేళన్" -మను. 3-85

మనోరమాదుల వివాహమాడి స్వరోచి వారితో క్రీడించుచు ఒక కాసారమునకు వచ్చినాడు. కాసారమున హంసలను, చక్రవాకములను వర్ణించు పద్ధతి గలదు. తీరమందలి వృక్షములను, మందమారుతమును వర్ణించుట గూడ పద్ధతి.

"అరవిందాతులుఁ దాను నిట్లభిమత వ్యాపారముల్ సల్పుచున్
ధరణీకుండొక చోటఁ గాంచె లమశీత స్వచ్ఛవాః పూరమున్
వరకీర వ్రజ చంచుపాటిత తట వ్యాకీర్ణ మందారకే
సర మాకంద వినిస్సరత్ఫల రసా సారంబుఁ గాసారమున్'' -మను. 6-33
"కని తత్తట స్థలంబున ననుమతి విహరించె సవిధ హరిహయవర నం
దన నందన హరిచందన వన పవనార్భక వినోద వశగతుడగుచున్'' -మను. 6-64
"అందొక యంచతేమ గహనానిల సంచల దూర్మిమాలికా
మంద విహార సౌఖ్యమున మత్తిలి దవ్వుల నున్న చక్రవా
కిం దగ జేర నిల్చి పరికించిచె యెంత తపంబొనర్చిరీ
యిందునిభాస్యలుం బతియు నేకమతిన్గన గూడి యుండగాన్'' మను. 6-65

పై వర్ణనలో మనకు కావలసినది ఆ భావవర్ణనగాదు అందలి ప్రకృతి వర్ణనయే.
ఈ మనుచరిత్రమున వరణానదీ ప్రశంస మాత్రము గలదు.

"వరణాద్వీపవతీతటాం చలమునన్ ...." అన్నచోటను (మను. 1-49)
"వరణాతరంగిణీ దరవికస్వర నూత్న కమల......'' అన్నచోటను (మను 1-54)

ఈ నదీ ప్రశంస గలదు. అందులో కమలములున్నట్లును వర్ణితము

ఇట్లే గంగానదీ ప్రసక్తి గలదు. అంతే.

## నదీ సరోవర్ణన—పారిజాతాపహరణము

నాకస్త్రీలును, సత్యాకృష్ణులును జలక్రీడలాడు సమయమున ఆకాశగంగ వర్ణితము. ఆకాశ గంగలో గూడ పద్మములు (4-81) రాజహంస (4-35) నాచు, చక్రవాకములు (4-46) వర్ణితములు, తరువాత ఇలకేళి 16 పద్యములలో వర్ణితమైనది.

## నదీ సరోవర్ణన—ఆముక్తమాల్యద

ఇందు పురాతన తీర్థకుండములు మాత్రము వర్ణింపబడినవి.

"అలరు బురంబునందొగల నంతర దామరఁ బ్రాచిగ్రపున్
వలపులు మీఱలోవలుద వాలుగమొత్తము వోర నీరు కో
ళ్ళాలకోల మంచు గ్రుంకు మెడగుంపుల వంపులు దోప మావితో
పుల విరులన్బయిన్ నడువఁ బొల్చు పురాతన తీర్థకుండముల్" -ఆము. 1—71

తీర్థకుండములలో తొవలు, అంతరదామర, ప్రాచి, ప్రాచియొక్క కప్రపు వలపులు, లోపల వాలుగ చేపలు, కలవకొలను, నీరుకోళ్లు మామిడి తోపులనుండి రాలిన పుప్పొడి నీళ్ళపై తేలుటలు కనిపించుచున్నవి.

ఈ ప్రకృతి వర్ణనలో ఎంతో అనుభవము స్ఫురించును. ఇది పురవర్ణన సంబంధమైన వర్ణన. అతి స్వాభావికముగ నున్న వర్ణన.

## నదీ సరోవర వర్ణన—కళాపూర్ణోదయము

మణికంధరుడు తీర్థయాత్రలు సేవించు తటి కావేరీ వర్ణన జరిగినది (కళా 2-14).

మధురలాలస చెలికత్తెలతో గూడ వనకేళి జరిపిన యనంతరము జలకేళి జరుపు సందర్భమున కాసారము వర్ణితము.

"చంచల వీచీ సంచయ లీలా సలలిత తరళిత జలరుహపాళీ
సంచిత హస్తోదంచిత భంగి జనితమదనమత సరణి గుణ వ్యా
ఖ్యాంచిత గోష్ఠి సంచరణ ప్రత్యయ సముచిత హళహళి కలతో రా
యంచలు ప్రోయం గొంచలు గూయన్ వ్యవహిత పద రసమయిన
కొలంకున్" —కళా. 6-225

పైన అంచలు, గొంచలు వర్ణితములు. శైలి, వర్ణిత వస్తుస్వరూప స్వభావానుగుణముగ నున్నది.

"అంతట సంతరంగముల నంబు విహార కుతూహలంబుల
త్యంతము మీఱ మెట్లుడిగి రామగువల్ మునిఁగొంగు లూరుగా
ఘాంతర సీమఁ బట్టుచు జలాశయ లక్ష్మి పయి న్నఖచ్ఛటా
కాంతులచేఁ బడాబ్జములు కప్రపు ధూళి వసంతమాడగన్" కళా. 6-227

"ఆ రమణీ మణుల్ సరసినట్లు ప్రవేశమొనర్పు వేళ ద
త్కాకరణ వీచికా చలిత కంబములన్ మధులోల భృంగముల్
వారక సోరెకున్నెగసి వ్రాలుచు నొప్పెఁ దదంబు దేవతల్
నేరుపుతోడ నాడు హరి నీలపు టచ్చన గండ్ల కైవడిన్" —క శా. 6-229

పైన కాసారమందలి జల సంక్షోభమును, మధుప సంక్షోభమును వర్ణింపబడినది. పరాభూతమైన ఉపమానములుగా, కొలనులోని విరిదమ్ములు, రక్త జలజములు, కోక మిధునములు, శైవాలములు, భృంగ నిచయములు, మీన నికరములు (6-230) వర్ణితములు.

ఇది ప్రకరణానుబంధము లేని ప్రకృతి వర్ణన. లక్షణమును పాటించిన వర్ణన. నదీ సరోవర్ణనలు ప్రభావతీ ప్రద్యుమ్నమున లేవు.

## నదీ సరో వర్ణనలు—వసుచరిత్ర

వసుచరిత్రమందు నదీ సరోవర్ణనలు గలవు. మొదటి సరోవర్ణన తిలకింతము—

గిరికయు, చెలికత్తెలును జలకేళి జరుపు సమయమున సరోవరము వర్ణితమగుచున్నది.

"వనముజఖుల్ గనుంగొని రవారిత వారి తరంగ రంగన
ర్తన సలిల భ్రమద్భ్రమణ రంగ దభంగ రథాంగ ధామమున్
మనసిజ హోమకుండ నిభమంజుల కంజగతాళిధూమమున్
ధనద సరోజ ధామ సమధామము నొక్క సరోలలామమున్" వసు. 3-153

వారి తరంగములు, నీళ్ళ సుడి తిరుగుటలు, చక్రవాకములు, ఎఱ్ఱదామరలు, తుమ్మెదలు పైన పేర్కొనబడినవి. అంతేగాక, తీరప్రాంతమందలి వృక్షములు సరోవరములోనికి రాల్చిన పుష్పాళ్ళు, హంసలును, మగ బేడిసలును, విచ్చిన పుండరీకములును, క్రౌంచ కారండవములును మొదలగునవి గూఢ వచనమున వర్ణితములు (3-154).

పై వర్ణనలుగల వచనము చాలా సొంపుగా, ఆలంకారికముగ, చమత్కారార్థస్ఫోరకమైనదిగ రచింపబడినది. చిమ్మనగ్రోవితో నీళ్ళు చల్లుకొనుటయు (8-158) రసోదంచితముగా వర్ణితము. ఇది జలక్రీడలో పాటించవలసిన విశేష క్రీడ.

ఇందు నదీవర్ణన :-ఇంగలనది శుక్తిమతి. ఇది మొదట మనకు నదిగనే సాక్షాత్కరించును. ఆనక నొక శృంగారవతియైన కన్యగా, గిరికకు తల్లిగా వర్ణితము. ఈ సమయమున, అర్థ

శ్లేషచే- మహాకవియైన భట్టుమూర్తి- శుక్తిమతి నొక సుందర, సుకుమార, లావణ్యాయుత, ప్రాగల్భ్యయుతమైన అతిలోక మానవకన్యగా సాక్షాత్కరింపజేసినాడు. జడమన్న భావమే మనకు కలుగదు. ఇక్కడ నది మానవీకరణను పొందినదన్నను, దైవీకరణ పొందినదన్నను సమంజసముగా నుండును.

## కేవలము నదిగా శుక్తిమతి

వసురాజు రాజధానియైన అధిష్ఠానపుర ప్రాంతమున శుక్తిమతి ప్రవహించుచున్నది.

"అమరుం దత్పురి చెంతఁ గాంత కనకాబ్జాలంబ రోలంబ శు
క్తిమతీ వాహిని సారసారణులు తత్కేదార కోదార స
స్యము ముక్కారునుఁ బండజేయ దివివారల్ వీటి సత్రాన్న భా
గము లాశింపగ దత్పురాలయ నదీ ఖ్యాతిన్ విడంబించుచున్" వసు. 1-109

కనకాబ్జములును,రోలంబములును గలిగినదిగాను,ఆకాశ గంగతో సాటియైనదిగను వర్ణింపబడినది.

నదియందు శంఖములును, ముత్తెములును గలవని వర్ణితము. (వసు.1-110)

## మానవస్త్రీగా (విలాసవతిగా) శుక్తిమతి

"జీవనమెల్ల సత్కవి నిషేవిత మాశయమెల్ల సచ్ఛతా
పావనతా గభీరతలపట్టు ప్రచారము లెల్ల విశ్వధా
త్రీవలయ త్రికాలఫలదేశికముల్ నవకంబులెల్ల ము
క్తావళి విభ్రమాస్పదము లానది పెంపు నుతింప శక్యమే" -వసు. 2-105

పైన, శుక్తిమతీనది ధార్మికురాలగు స్త్రీగను, నదిగను, అర్థద్వయముచే వర్ణింపబడినది.

"అనుకూల ఖేలనా యత్త జీవనమైత్రి
నడరి నర్మద కోటియై భజింప
మూర్మి కాకంకణ ద్యుతి కలాపము దోప
బాహుద కైదండఁ బరిఢవింప

ప్రముదితారావ సంభ్రమకు సాంద్ర యై సారె
సారె వేత్రవతీ హస్తచుంబకఁ దెల్పు
గంభీర రంగుంభ సంస్కృత ప్రౌఢిమ
తో సరస్వతి పల్కఁ దోడుఁగాగ

గులములోఁ బెద్దయు నమూల్య గుణమణి ప్ర
కాండ పరిపూర్ణయును గాన గారవమున
నఖిల నదులునుఁ దనుగొల్వ ననుదినంబు
నలువ కొలువున కేగుచున్నది యతీంద్ర" -వసు. 2-108

పై పద్యమున గల నర్మద, బాహుద, వేత్రవతి, సరస్వతి యను పదములు మూడర్థములు గలవిగా ప్రయోగింపబడినవి.

నర్మద : 1.. నర్మదానది 2. నర్మదయనుస్త్రీ 3. నర్మగర్భముగా మాట్లాడునది.

బాహుద : 1. బాహుదానది 2. బాహుదయనుస్త్రీ 3. కై దండ యొసగి సహాయము చేయునది.

వేత్రవతి : 1. వేత్రవతీనది. 2. వేత్రవతి యను పేరుగలస్త్రీ 3. వేత్రహస్తయయిన స్త్రీ

సరస్వతి : 1. సరస్వతీనది. 2. సరస్వతి యను పేరుగలస్త్రీ. 3. చక్కగా మాట్లాడగలస్త్రీ

ఇన్ని విశేషార్థములచే శుక్తిమతిని స్త్రీగను, నదిగను గూడ వర్ణించినాడు.

ఈ శుక్తిమతిని కోలాహలుడను హిమవత్ పుత్రుడు వాంఛించుచున్నాడు. ఈ ఘట్టమున తప్పు చేయగూడదనుకొన్నస్త్రీ యే విధముగా గుట్టుచప్పుడుగా తప్పించుకో జూచునో, అట్లు తప్పించుకొనుచున్నట్లున్న స్త్రీగను-పర్వతము అడ్డుగా వచ్చినచోట ప్రక్కకు మరలి పోవునట్టి నదిగను-రెండువిధములుగా-అటు ఉత్తమజాతి స్త్రీపరముగను, ఇటు నదీ పరముగను-శుక్తిమతిని వర్ణించు చున్నాడు కవి.

"అనుపమ భాగ్యశాలి కచలాధిప మౌళికి బుత్రుడై జగ
జ్జనని కనుంగు దమ్ముడయి శంకరు ముద్దు మఱంది కుఱ్ఱయై
మనుతన భాగధేయ మహిమంబున మిన్నులు ముట్టి వచ్చు ధ
న్యుని నతనిన్ భజించి నదియున్ వినయంబున నోరయై చనన్'' -వసు. 2-109

## ఒక విలాసవతిగా శుక్తిమతి

వయ్యారిగా కనిపించిన శుక్తిమతి కోలాహలునంత వానిని ధైర్య హీనునిగా జేసి నది. ఆమె యందు ప్రయోగింపబడిన ఉపమానములు నదీపరముగా సహజ వస్తువులు!

స్త్రీ పరముగా ఉపమాన వస్తువులు. అర్థద్వయముచే రమ్యాతి రమ్యార్థమును గూర్చు చున్నాడు కవి.

"బాల కూర్మ విలాస పదములు కాంత రం
 భా ప్రతిబింబోరు భవ్యరుచులు
సరస సైకత సార జఘన సౌభాగ్యంబు
 నతనాభిరూప వన భ్రమంబు
లెడగారు దరుల యొప్పిదమును నామీద
 జను జక్కవల నిక్కు చక్కదనము
కమల కోమల ముఖ కామనీయకము ను
 త్పల మంజులాలోక విలసనంబు
ఘనఘటా నీలవేణియుఁ గల తరంగి
ణీ రమణి నిత్య నిర్మలాకార కాంతి
ధారధారున నెదిరినంతనె నగేంద్రు
గాఢతర ధైర్యమువ్వెత్తుగా హరించె" -వసు. 2-110

ఆ విధముగ నతడు స్మరాధీనుడయినాడు. చింతలో పడిపోయినాడు. ఇక తాళలేక నదిని చేరినాడు. ఆమె ఆ మహాభాగుని రాక కలరి పూజా విధానము నిర్వర్తించినది. ఇక్కడ మరల స్త్రీపరముగా, నదీ పరముగా అర్థద్వయము సాధింపబడినది.

"చేరన్ రానదియున్ దటోద్గత ఝరీ సీమాధికోదగ్ర సం
చార శ్రీ నెదురేగి యూర్మి మయ హస్త న్యస్త రాజీవ రా
జీ రాజన్మణి భాజనంబుల రజశ్శ్రీ గంధకింజల్క రే
ఖా రక్తాక్షతముల్వహించి వరుసంగావించె పూజావిధుల్" -వసు. 2-119

అట్లు పూజించి, ఒదిగి నిలబడి, "నా పూజలెంత, నేనెంత"యని నిగర్వముగా పల్కినది. ఆమె ప్రగల్భముగా మాట్లాడుచున్నట్లు భావించినాడు. "నిన్ను నేను వలచు చున్నా" నని చెప్పినాడు. అపుడామె తన నీచ జన్మనుగురించియు, అతని ఉన్నతత్త్వమును గురించియు చెప్పి, తప్పుకో జూచినది. అతడును ప్రతిగా సమాధానము చెప్పి ఆమెను బలాత్కరించి పట్టుకొన్నాడు, ఒప్పని స్త్రీ యెట్లు సంభ్రమించునో, ఎంతగా తప్పించు కొని పారిపోజూచునో ఇట గొప్పగా వర్ణితమగుచున్నది.

"వేణి చలింపఁ గంపిత నవీన మృణాళ భుజాగ్ర కంకణ
శ్రేణి నటింప లోల శఫరీ నిభిరీన కటాక్ష కాంతి వి
న్నాణము చూప హంసక గణక్వణనంబులు మీఱ సైకత
శ్రోణి వివర్తితాబ్జముఖ శోభితయై వడు సంభ్రమించినన్" -వసు. 2-138

ఎంతయో విసురుగ, శృంగార పూర్ణముగ, జీవపూర్ణముగ, వేగపూర్ణముగ నున్నది రచన! ఒల్లని పురుషుని కామోద్రేకమును సహింపలేని కన్య—అన్యపురుషాక్రాంతయై భయపడి ఓరమోమిడు కన్య—తప్పించుకోవలెనని పెనుగులాడుకన్య—ఎదుటి పురుషునకు తగనన్న భావము మాత్రమే కలిగి ద్వేషములేని కన్య—ఏమూలలో ప్రేమ గూడగల ముగ్ధ—ఎట్లు సంచలించి భయ భ్రాంతయగునో—అట్లే అయినది శుక్తిమతి!

ప్రకృతి మానవీకరణ పొందుట అనుదానికి శుక్తిమతీ కోలాహల ఘట్టము కంటె మించిన ఉదాహరణ వేరొండు కానరాదు.

శ్లేషను ప్రయోగించుటలో ఇంతనేర్పు, ఇంత అధికారము, ఇంత సహజత్వము మరే కవికిగాని, మరే గ్రంథమందుగాని, నభూతోన భవిష్యతి.

## మాతృమూర్తిగా శుక్తిమతి

కోలాహలుని వల్ల గర్భమైనది శుక్తిమతికి.

"ఆపన్న సత్వయాపగ
యాపగిదిన్ నీరుమోసి యధిగత సేవా
వ్యాపార ద్విజ మహిళల్
గాపాడగ నొక్క పుణ్యలగ్నమునందున్" —వసు. 3-21

"గురుతర నవ్య వేతస నికుంజము రంజిలు చోట హాల్లకో
త్కర కరదీప దీధితులు గ్రమ్మెడు చోట నవారవింద బం
ధుర మకరంద తైలములు నూల్కొనుచోటఁ బరాగ రక్షచే
గరమరుదైన చోట నదిగాంచెఁ గుమారుఁ గుమారికామణిన్" —వసు. 3-22

గిరికకు తన తండ్రి రత్నాంకిత హారము వేసినపుడు, బిడ్డకది బరువు గదాయని తల్లి హల్లక కలాపము లుంచినదట (3-31)

వసురాజుతో గిరికకు పెండ్లియయిన తరువాత కూతురిని సాగనంపుచు ధైర్యము చెప్పుచున్నది తల్లి.

"తమ్ములఁ బంపుదున్ మణి శతమ్ములఁ బంపుదు రాజహంస పో
తమ్ములఁ బంపుదున్ బరిచి తమ్ములఁ గానన దేవతాళి జా
తమ్ములఁ బంపుదున్ ద్రుమ గతమ్ముల నేనును సారణీ ప్రపా
తమ్ముల వస్తు విశ్వ విదితా ముదితా మదితావ మేటికిన్" —వసు. 6-60

పైన మాతృత్వము ఉట్టిపడుచున్నది.

శుక్తిమతిని నదిగా భావింప జాలనంత సుందరముగా వర్ణించినాడు కవి. కాని పై వస్తువులన్నియు నదీ సంబంధికములే.

నదీ వర్ణన చేయుటలో ఏ కవియును సాధింపని 'మానవీకరణ ను సాధించినందు వలననే యీ నదిని గురించి యింత విపులముగా చర్చించుట జరిగినది.

ఈ నదీ వర్ణన కేవలము నదీ వర్ణన గాదు. ఇతివృత్తముతో పూర్ణముగ ముడివైచుకొన్న నాయికా (నాయికామాత) వర్ణన. శుక్తిమతి వసుచరిత్రలో ఒక సజీవ పాత్ర.

## నదీ సరోవర్ణన - విజయవిలాసము

విజయుడు తీర్థయాత్రలు చేయు సందర్భమున గంగానదీ వర్ణన జరిగినది. అతని మనసులోని ఆహ్లాదము ననుసరించి భుజంగ ప్రయాతవృత్తము ప్రయోగింపబడినది.

"సునాసీర సూనుండు సూచె న్నిమజ్జ
జ్జనౌఘోత్పత చ్ఛంక శంకా కరాత్మో
ర్మి నిర్మగ్న నీరేజ రేఖోన్నమద్భృం
గ నేత్రోత్సవ శ్రీని, గంగా భవానిన్" —విజయ. 1-112

పై వర్ణనలో ఊర్మికలు, నీరేజములు, భృంగములు వర్ణింపబడినవి. అంతేగాక పాపము నల్లగానుండునన్న కవిసమయము గూడ పాటింపబడినది. గంగ పాపములను హరించుననన్న సాంప్రదాయిక భావముగూడ నుల్లేఖింపబడినది.

గంగానది ప్రకృతిలోని భాగమే యయినను, దానికి దేవత్వ మిచ్చియుండుట మన సంప్రదాయములోని ఒక విశేషము. ఈశ్వరుడు ప్రకృతికి అధినాథుడనియు, అతని స్వరూపము ప్రకృతి రూపమనియు మనకు తెలిసినదే! ఈశ్వరునియొక్క కట్టు బట్టలుగాని, ఆభరణములు గాని, శిరోలంకారములుగాని, అన్నియును ప్రకృతి వస్తువులే.

గంగ యీశ్వరుని తలయందలి అలంకరణముగా పురాణములందు వర్ణింపబడినది. ఆ పురాణ సత్యమయిన ప్రకృతి వర్ణనను మనోహరముగా నీ క్రింద చేసినాడు.

"తా సైరింప కపర్దయుండగ భవన్గర్భమ్మునన్ దాల్చి తే
జో సహ్యున్ శరజన్ముగాంచి యలనీహారక్షమాభృత్ కుమా
రీ సాపత్న్యము ( గన్న మోహపు పురంధ్రీ రత్నమౌ దీవకా
వే సర్వజ్ఞుడు నిన్ను నేల తలపై నెక్కించుకో జాహ్నవీ" —విజయ. 1-114

ఈశ్వరుడు గంగను తలపై కెక్కించుకొనుటను సొగసుగ, రసోదంచితముగ వర్ణించినాడు కవి. "తలపై కెక్కించుకొనుట" అన్నది జాతీయమైన పలుకుబడి. పుష్పాలు మొదలయిన యిష్టవస్తువులను తలపై కెక్కించుకొనుట సహజము. ఇష్టవ్యక్తులను అభిమానముతో చూచినపుడు "తలపై కెక్కించుకొనె" ననుట సామాన్యమయినదే. ఈశ్వరుడు గంగను మౌళియందు ధరించినాడన్నది ప్రకృతి సత్యము. తలపై కెక్కించుకొన్నాడన్న జాతీయపు పలుకుబడితో జోడించుట చమత్కార విశేషము.

ఈ వర్ణన సందర్భములోనే చేసిన బాల సమీర వర్ణన గూడ సార్థకమయినదిగ తోచు చున్నది.

> "సకల శుభమ్ము లిమ్మనుచు సన్నుతులీ గతి చేయ నా స్రవం
> తిక దయ దెల్పఁ బంచిన గతిం జనుదెంచె నుదంచ దూర్మికా
> నికర విలోల ఖేల దళినీ కలగాన లసత్ ప్రఫుల్ల హ
> ల్లక సుఖడోలికా విహృతి లాలన బాల సమీరమయ్యెడన్" -విజయ. 1-117

పై వర్ణనలో ప్రకృతి మానవీకరణ కనిపించుచున్నది. జడ ప్రకృతియైన నదిపై నుండి వచ్చు గాలి గూడ ప్రకృతి వస్తువే. నదియే దానిని పంపినదనుట మానవీకరణకు ఉదాహరణము. అర్జునునకు గంగ పితామహి అగుచున్నది. మనుమని కోరిక లీడేర్చుట కామె సుముఖ వాతావరణము కల్పించుట సహజము.

సూర్యకాంతికి తళుక్కుమని మెఱయుచున్న తరంగములును, అళినీ కలగానములచే నలరింపబడుచున్న ప్రఫుల్లహల్లకములును హల్లకారూప సుఖడోలికా విహార లాలసములైన బాల సమీరములును వర్ణింపబడినవి. అలల కదలికలకును, సుందసమీరముయొక్క మంద మంద ప్రసారముకులను అనుగుణముగ నున్నది శైలి.

## సారాంశము

1. వేదములందలి నదీ సరోవర్ణనలు కావ్యములందు ప్రాధాన్యము వహించి వర్ణనా నియమమునందు చోటు చేసికొన్నవి.
2. రామాయణమున గంగా సరయూ గోదావరీ నదులును, పంపా పంచాప్సరోవర వర్ణనలును కలవు. మిగిలిన సంస్కృత కావ్యములలో నీ వర్ణనలు చాల తక్కువ.

౩. తెలుగు కావ్యములందును ఇది చాల తక్కువగనే యున్నది.

4. భట్టుమూర్తి యొక్కఁడే తెలుగు కావ్యకర్తలలో అధికముగ నదీవర్ణన చేసినవాఁడు. శుక్తిమతీ నదిని మానవీకరణ చేసినందువలననే ఇంత విస్తృతముగ వర్ణన జరిగినది.

౫. ఆంధ్ర ప్రబంధములలో జలకేళి వర్ణించు ఘట్టములలో కొలకులు వర్ణింపబడినవి.

# దశమ ప్రకరణము

## సూర్యోదయాది వర్ణనలు

"నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనైః"

సూర్యోదయము అష్టాదశ వర్ణనలలో నొకటి యని దండి. ఈ సూర్యోదయ మన్ని తెలుగు కావ్యములందును వర్ణింపబడలేదు. దీనిని తప్పనిసరి వర్ణనగా భావించి చేసిన వారు కొలదిమంది కవులే! కావించిన వర్ణనలును కొలది మాత్రమే!

"సూర్యుని వర్ణించుతటి సర్వత్ర ప్రకాశమును, త్రిమూర్తిత్వమును వర్ణింప వలెను." -కావ్యాలం. తృతీయ 113

అలంకార శేఖరమందు కేశవ మిశ్రుడు "అరుణత్వము, సూర్యకాంత చక్రవాక పథికాదులకు ప్రీతిని - ఇందు, తార, దీప, ఓషధి, ఘూక, తమస్, చోర, కులటాదులకు పీడను-వర్ణింపవలెను" అన్నాడు.

సూర్యవర్ణన వేదములం దెక్కువగా నున్నది. దానిననుసరించియే రామాయణాది సంస్కృత కావ్యములందు గూడ ఎక్కువగా గావింపబడి యున్నది.

వేదములందు మిత్రుఁడుగా వర్ణింపబడిన సూర్యుడు పురాణములందును, ప్రబంధము లందును గూడ దేవతగానే స్వీకరింపబడినాడు. కాని అది ప్రకృతి వర్ణనయే!

తెనుగు నందలి యే ప్రబంధముననూ సూర్యోదయ వర్ణనలు ఎక్కువగ లేవు.

### సూర్యోదయము-కుమార సంభవము

సూర్యోదయమును ఇతివృత్తముతో ముడివెట్టు పద్ధతి ముఖ్యముగా భారత రచనా కాలమునుండియే యున్నట్లు కన్పట్టు చున్నది.

> "ప్రభాతంబగుటయు పాండవ సైనికుల డెందంబులతోడన యరవిందంబులు వికాసంబునొందెఁ బదంపడి తదీయ ప్రతాపోదయ సహవర్తి యగుచు మార్తాండో దయంబు వెలుగుటయు" భార. భీష్మ. ఆ. 2-21

పార్వతీ పరమేశ్వరుల వివాహ సమయమున కుమారసంభవకారుడైన నన్నెచోడుడు ఇటులనే సూర్యోదయమును ఇతివృత్తముతో ముడివెట్టుచున్నాడు.

"హరు వివాహమునకుఁ గరమనురక్తుడై
వరుస జగములెల్ల వసుమయంబు
సేసెనో రయమున చిత్రభానుడనగ
వసు సమూహి గప్పె వసుధ యెల్ల" -కుమా. 8-191

చిత్రభాను శబ్దము సార్థకముగ ప్రయోగింప బడినది.

చంద్రాస్తమయ సూర్యోదయముల నొక్కసారే వర్ణించుచున్నాడు, కవిరాజ శిఖామణి. ఇది మనోహర వర్ణన. లోక ప్రవర్తనకు ముడిపెట్టుచున్నట్లు చేసిన ఈ వర్ణన రమణీయము.

"అస్తగిరిఁ గ్రొందె రాజుద యాద్రి నెక్కె
నినుడు దేజమ్మలగు వాకిళ్ళెల్ల ప్రొద్దు
మానితంబగు నిల నొక్కమాట పొందు
హాని వృద్ధులు సూచించునట్ల వోలె" -కుమా. 8-190

ఈ పద్ధతిని తర్వాతి కవులయిన పెద్దనాదులు తమ కావ్యములందు అనుసరించిరి.

## సూర్యోదయము-మనుచరిత్ర

సూర్యోదయ మయినది (3-59). అప్పుడు ముకుళిత పద్మ గర్భస్థ మధుపములు ఎట్లు బయటికి వచ్చి గానము చేసినవో కవి వర్ణించు చున్నాడు.

"కరకరిగూటఁ గట్టి యిడగా మొఱవెట్టెడు లీల జాలకా
స్కర కరకాండ కందళ విఘట్టన నించుక వాయివిడ్డ తా
మర మొఱవెట్టి పెట్టి పలుమాఱును వాకిలి దాటి యాగుచున్
మొరయు విపంచి మీటు గతిమ్రోసి యళుల్ వెడలెన్ గొలంకులన్" -మను. 3-60

రాత్రులందు చక్రవాకదంపతులకు ఎడబాటు తప్పదు. సూర్యోదయము కాగానే రాత్రియంతయు పడిన విరహవేదనను తలచుకొని, దుఃఖానంద జనితాశ్రువులు రాల్చుచు ఒకదాని నొకటి కౌగిలించుకొని పెనగును. అది సొంపుగా వర్ణింపబడు చున్నది.

"కొలకొల గూయుఁ జైనొఱగుఁ గుత్తుకఁ గుత్తుకఁ జుట్టుఁ జాఱుచి
వ్వల క్రియఁ గానరాని గతులన్ మయిమ్మైఁ బెనుచున్ జనించు న

క్రుం లలుత నొత్తు నోలు నిలుచున్ విధి చాతురిఁ గూడియున్ రతిన్
దలపవు కంలెు పాసిన వెతల్ దలపించుచుఁ గోక దంపతుల్" —మను. 3-62

తమకము యొక్క ఉత్కంఠను ఇంత గొప్పగా వర్ణించిన కవులు చాల అరుదు.

ఇందలి సూర్యోదయ ఘట్టము ప్రకరణానుబంధము గలది. మహాదుఃఖములో విరహ తీవ్రతలో — మునిగియున్న వరూథిని మనసును ఓదార్చుటకు ఆమె చెలికత్తెలీ వర్ణన చేయుచున్నారు. "కోకదంపతులు పూర్వపు వియోగమును తలంచుకొని రతిని గూడ తలంపక అశేషానందము పొందుచున్నవి" అనుటలో విరహానందముతో తృప్తి పడుమని యొక యర్థమును, సూర్యోదయము కాఁగానే కోక దంపతులకు వలె నీకును ప్రియాసమాగమము లభించునని మరియొక యర్థమును స్ఫురించుచున్నది. తప్పక సమాగమము జరుగుననియే సూచన. తరువాత సమాగమము సిద్ధించినదిగాన ఈ ఘట్టము ప్రకారణానుబంధము గలిగియున్నదనుటకు సందేహము లేదు. ఈ వర్ణనవలన కథా వేగమునకు భంగము లేదు.

## సూర్యోదయము — పారిజాతాపహరణము

ఉదయము కాగానే ప్రకృతి యెట్లుండునో అందు ముఖ్యముగ సరస్సులు ఎట్లుండునో వర్ణించుచున్నాడు తిమ్మన.

"కమలినీ జృంభికలకు దిక్కాంతలెల్ల
హస్త తాళంబు లొనరించి రనగ జెలగె
లలిత కాసార కూల కులాయ చలిత
శకున పతఙ్గ పటపటస్వనము లధిప" —పారి. 2-67

ముకుళించిన పద్మము లావులించినవట. అందులకు దిక్కాంతలు హస్తతాళము లొనరించిరా యన్నట్లు నిద్రలేచి ఎగిరిపోవు పతుల పక్షుల పటపట స్వనము లెగసినవట; ఇంత సుకుమారముగ ముక్కుతిమ్మనే చెప్పగలడు; పారిజాతాపహరణ కావ్యము చిన్నది. కథయు చిన్నది. వర్ణనలు మాత్రము మిన్నలు,

అంతఃపుర మర్యాద లెరిగిన తిమ్మన ఉపమానములను గూడ అంతఃపుర మర్యాదా ద్యోతకములుగా ప్రయోగించుచున్నాడు.[1]

---

1. ఆవులించినవారు నోటిదగ్గఱ చిటిక వేసికొందురు. రాజులును రాజకాంతలును ఆవులించినచో ప్రక్కనున్నవారు చిటిక వేయుదురు. అది పైన సూచింపబడినది.

ఎండ తగుల్లగనే కుముదములు ముకుళించుట కవిసమయము. కుముదములకు చంద్రుడు పతి. చంద్రుడు రాజు గదా! కుముదములు రాజకాంతలు. ఆ రాజకాంత లిపుడు అసూర్యంపశ్యలట! అమోఘమైన సమర్థన.

> "కమలాప్తోన్నమదంశుజాలములు దిగ్భాగంబులం గ్రమ్మినం
> గుముదాంతఃస్థిత లక్ష్మి యెండవడ సోకుల్ సైపగా లేక ప
> త్రముల న్మాటుగఁ జేసి కప్పుకొనియెం దత్కాల సంకోచన
> క్రమ దంభంబున రాజవల్లభ లసూర్యంపశ్య లౌదుర్గదా" —పారి. 2-69

పైది చాల రమ్యమగు వర్ణన. ఈ వర్ణన కథా సందర్భశుద్ధి గలది కాదని చెప్పుట సాహస మనిపించుకొనును. ఉదయము కానిదే యెవరును, ఏ పనియును చేయలేరు గదా! తర్వాత ఎరుపు రంగుతో సూర్యుడుదయించుచున్నాడనుట సందర్భశుద్ధిగలది. ఈ ఉదయముననే కృష్ణుడు ప్రయాణము కట్టుచున్నాడుగదా; సత్యానాథుడగు (కమలాప్తుడు) కృష్ణుని విజృంభణకు శచీత్యాది రాజస్త్రీలు భయపడి దాగిరని గూడ శ్లేషార్థము నూహింప వచ్చును.

> "కోలకోలమంచు మేతలకు గూడుల వెల్వడు పక్షిరావము
> లక్కల మృదువాక్య వైఖరులుగా నల వేకువ పూవుఁబోడి వే
> డ్కలు దళుకొత్త దోహదమిడం దొలిగుబ్బలి కొండగోగు పూ
> గొల యలరించెనాఁ బొడిచెఁ గోకనదాప్తుడు పాటలద్యుతిన్" —పారి. 2-70

కొండగోగునకు దోహదము సల్లాపము. వేకువ అను పూవుబోడియొక్క సల్లాపోక్తులకు సూర్యు డనురాగిల్లినట్లుగా పైన వర్ణితము. కోకనదములనగా ఎఱ్ఱని పద్మములని యర్థము. సూర్యుడు వాని ఆప్తుడు గాన ఎఱ్ఱగా నున్నాడని యర్థము ఉదయము కాగానే సత్యాప్రియుడు కృష్ణుడు ఆమెను తృప్తిపఱచుటకై ప్రయత్నము చేయగలడని గూడ పైన సూచితము.

## సూర్యోదయము - కళాపూర్ణోదయము

> "మిళిత భూ గగనాంతముల సందు విచ్చిన
> గాన్పించు బ్రహ్మాండ కాంతి యనగ
> దిశలెన్నుచిది పూర్వ దిశయని బ్రహ్మ ని
> ల్పిన యట్టి మొదలిట లెక్క యనగ
> నుదయాచలాధీశు నుత్తమాంగంబున
> భాసిల్లు హొంబట్టు పాగయనంగ
> గగనాఖ్య పనస వృక్ష ప్రకాండోపరి
> ప్రాభీతంబగు పక్వ ఫల మనంగ

దారకాభర్త చంద్రికాక్షీర భోజ
నాంతమున బూర్వ సంధ్య యన్కాంత వెలచి
లీలఁ జేర్చిన పసిడి పళ్లెర మనంగ
ధరణి విశ్వంబుఁ గాన్పించె వరుసతోడ" -కళా. 8-35

చంద్రుడు, చంద్రికాక్షీరముల భుజించిన తరువాత కడిగి గోడకు ఆనించిన బంగారు పళ్లెరము వలె సూర్యుడున్నాడట; చక్రనిభావుకత; సతార్కికమైన ఉపమాన ప్రయోగములో సూరనకు సూరనే సాటి. ఇది కేవలము వస్తువర్ణన వలెనే యున్నది.

## సూర్యోదయము - ప్రభావతీ ప్రద్యుమ్నము

పూర్వదిశాధిపతి యగు నింద్రుని సమక్షమున పూర్వదిక్కాంత తన పాతివ్రత్యమును నిరూపించుటకు కాలుచున్న ఇనుప ముద్దను త్రాగుటకై రెండుచేతులతో పట్టి యెత్తి చూపుచున్నదా యన్నట్లు సూర్యోదయము జరిగినదని కవి యుత్ప్రేక్షించుచున్నాడు.

ప్రభావతీ ప్రద్యుమ్నుల రత్యనంతరము తెల్లవారినట్లు కవి వర్ణించిన ఘట్టమిది.

"పఁగలలోన నొంటెఱుగ నీవె విభుండవు సందియంబు నా
పైఁ గలదేని చూడుమని ప్రాగ్దిశ గౌతమదాన జారునిన్
దాఁగడు నమ్మ జేయుటకుఁ ద్రాగగ నెత్తెడునట్టి యెఱ్ఱగా
గ్రాగిన మడ్డుచంద మెసగన్ గనుపట్టె నినుఁడు నుష్ణతన్" -ప్రభా. 5-60

ఇంద్రుడు వ్యభిచారి. పూర్వదిక్సతి పతివ్రత. కథలో గూడ ప్రద్యుమ్నుడు దక్షిణ నాయకుడు. ప్రభావతి పతివ్రత. పై సూర్య వర్ణన ప్రకరణానుగుణముగ నున్నది.

## సూర్యోదయము - వసుచరిత్ర

వసుచరిత్రకారుని భావనాధోరణియే వేరు. ఇతరులుత్ప్రేక్షించుటకన్న మిన్నగను, సతార్కికముగను, ఉత్ప్రేక్షించుట ఆతనిలోని గొప్పతనము.

కుముదము అనగా భూమికి ముదము కల్గించు నట్టిది అని యర్థము. భూమికి లక్ష్మీదేవి సవతి. లక్ష్మి పద్మాలయ, కువలయములన్న పడదు. చంద్రుడు కుముద

డు. సూర్యుడు పద్మ బాంధవుడు. సూర్యచంద్రులు విష్ణువు యొక్క వలపలి
కన్నులు. లక్ష్మీదేవి ప్రీత్యర్థము (పద్మముల కొఱకు) విష్ణువు తన యెడమ
మూసి కుడి కంటిని తెఱచుచున్నట్లుగా సూర్యోదయమైనది. ఇది అత్యంతమైన
రసావిష్టమైన భావము. తర్కగర్భితమైన వాదము. పారిజాతాపహరణమందలి
"...స్తైన్నమదంశు...(2-66)" అన్న పద్యమును మనసులో పెట్టుకుని యీ భావ
మూర్తి వెలయించినట్లున్నది.

"కుముదాధార విహారముల్ కమల కన్గోఁజాల కంభోజ గే
హాము మూయు దెఱపింతు వేగనని వామాలోకము న్మాటి యా
సమయోపేంద్రుడు దక్షిణాక్షిఁ దెఱచెన్ సంజాత రాగాను బం
ధముతో నావిధుదేగఁ ద్రొద్దువొడిచెన్ బంధూక బంధుచ్ఛవిన్" -వసు. 4-136

మైన కలువలును పద్మములును కూడ వర్ణితములు. శ్లేషానుప్రాణితమైన
...ష ద్వారా రమణీయార్థమును చమత్కారముగా ప్రతిపాదించినాడు

సూర్యోదయము ప్రకరణానుబంధము కల్గియున్నది. రాత్రియంతయు బాధించిన
...గుట చేతను సూర్యుడుదయించుట చేతను గిరిక పెండ్లి మాటలు జరుగబోవుట
...బడుచున్నది.

గిరికాదేవి యొక్క తండ్రిని ప్రార్థించి వసురాజున కిప్పింపగోరి వచ్చుచున్న
...ని శెక్కెముపై గల బంగారు వన్నె గొడుగా అన్నట్లుగా సూర్యుడు ఉదయించు
...ని ఈ క్రింద ఉత్ప్రేక్షింపబడినది.

"ఓ చామీకర చారుగాత్రి నిను గోత్రోత్తంసమున్ వేడి నే
డా చేదిక్షితిపాల శేఖరునితో హత్తింపగా వచ్చు త
త్ప్రాచీ భర్తకుఁ బట్టు పట్టుగొడుగై భానుండు దోపం బ్రభా
వీచుల్ తద్గతరత్న గుచ్ఛముల కీవిన్ బొల్చె ప్రాంతంబునన్" -వసు. 4-137

వసుచరిత్రకారుడు ప్రతివర్ణనయందును, అందఱను మీరిన వాడగుచున్నాడు.
...కొన్నను సరిక్రొత్తగ, హేతుబద్ధముగ సులభగ్రాహ్యముగ, అనేకార్థముల
...దిగ నుండునట్టి రచన చేయవలయునన్న పట్టుదల అతనియందున్నంత యే
...వులందును కానము.

...సము - విజయవిలాసము

సూర్యోదయానంతరము పద్మవికసనము జరుగునన్నది కవిసమయము. ఈవర్ణనను
...విలాసకారుడు చమత్కారముగ, రసవంతముగ చేసినాడు—

"తనకుం గౌగిలి యీ వొకప్పుడును నాథా నీ కరస్పర్శనం
బున గిల్గింత లె యంచుఁ బద్మిని కరాంభోజంబునన్ మందమం
ద నటద్వాయు చలద్దళాంగుళులు గన్పట్టంగ నవ్వెల్గు రా
యనిరారాః యని పిల్చె నాఁ దగె ద్విరేఫాత్యంత దీర్ఘధ్వనుల్" —విజయ. 1-204

"దూరముననుండి, ఎంతయో యెత్తుననుండి, ప్రతిదినమును కేవలము కరములచే చక్కిలిగింతలు కల్గించుటేగాని దగ్గరకు వచ్చి ఒకనాడును కౌగిలి యీయవుగదా, దగ్గరకురారా" అని పద్మము అను చేతితో గాలికి కదలుచున్న తామరరేకులు అన్న వ్రేళ్ళతో సైగలు చేయుచు, తుమ్మెదల ధ్వనులు అన్న యెలుగుతో పద్మినులు పిలుచు చున్నవా అన్నట్లున్నది. ఎంతయో శృంగారమును సంతరించుకొన్నది వర్ణన. రారా అన్నచోటను, ద్విరేఫాంత దీర్ఘధ్వనులు అన్న చోటను గొప్ప చమత్కారమున్నది. రారా అన్న చోట ద్విరేఫమున్నది (రెండు రేఫములు) ద్విరేఫము రారా అనుచున్నది. (ద్విరేఫము యొక్క రూపము రెండు 'ర' లను ఒకదానిపై నొకటి పెట్టినట్లుండును) ఇది ధ్వని పూర్ణమైన వర్ణన. మలయధ్వజుని కుమారిత చిత్రాంగదను అర్జునుడు చూచి విరాళిగొన్నప్పటి ఘట్టమునందలిది వర్ణన. ఆ కన్య పద్మినీ జాతి కన్య. ఆ పద్మినీ జాతి కన్యయే తనను కౌగిటికి రమ్మని యాహ్వానించినదాయన్న ధ్వని యీ వర్ణనలో గలదు.

పై వర్ణింపబడిన ప్రకృతి మానవీకరణ వంటివి రామాయణమునందు గలవు. (అరణ్య 62-36, 37, 39). ఆ మానవీకరణకంటె ఇక్కడి మానవీకరణ గొప్పగ నున్నది.

పై వర్ణనలో శుభశకునము గూడ ద్యోతమై యున్నదని విజయుని మిత్రుడైన విశారదుని మాటవలన తెలియుచున్నది.

"నావిని హావభావ పరిణామ విదుండు విశారదుం' డనున్
దేవరవారలిందు నరుదే శకునమ్ములు మంచివయ్యె, వే
రావతె శోభనోత్సవ పరంపరలిప్పుడు చూడు' డంచు నె
త్తావుల దీవులై తనరు తామర మొగ్గలు రెండొసంగెనన్" —విజయ. 1-205

పై పద్యమున గల రెండు తామర మొగ్గలు ప్రకృతి వస్తువులు. ఈ తామర మొగ్గలు పైపద్యమునందలి (1-204) భావముతో పొత్తు గలవి. నాయిక కౌగిలి కోరిన దన్న అంతరార్థము ఆ పద్యములో నున్నది. ఈ పద్యములో (1-204) స్తనోపమానము లైన పద్మాల జంట రాజునకు లభించినది. ఆ "తావుల దీవులై తనరు తామర మొగ్గ లందుకొన్నాడు" విజయుడు. కస్తూరీ కుంకుమాంకితములైన స్తనపద్మములు తావు లీనును గదా!

"అదియునొక శకునంబుగా నధిపుడంది
చేతికందిచ్చినట్లనె చేకుఱంగఁ
గలదుపలిగుబ్బ గుబ్బెత చెలిమి యంచు" ఆనందించినాడు. (విజయ. 1-206)

వక్షోజములకు ఉపమానములైన తామరమొగ్గల వర్ణనలో నింత ధ్వనిని నింపిన కవి సామర్థ్యము కొనియాడదగినది.

పద్మములపై నింకను చమత్కార రసోదంచితములైన భావములను ప్రసరింప జేయుచున్నాడు కవి (విజయ. 1-207). అర్జునునికి చిత్రాంగదా స్నేహము చేతికబ్బినట్లే యున్నది. ఆమెయొక్క వక్షోజ పద్మసమానములైన పద్మములు చేతిలో నున్నవి. కాని అవి చిత్రాంగదా వక్షోజములు గావు. ఇక రాత్రికి ఆమె వక్షోజ రాజీవములు కుముదములగును. (ముదము లేనివగును. రాత్రులు పద్మములకు ప్రకాశముండదనుట కవిసమయము) పగలుకాగనే ఆ కుముదములు నీరజములగును. రజము లేనివగును. (పగలు కుముదములకు వికాసముండదనుట కవి సమయము) అనగా ఈ రాత్రికి చిత్రాంగదా సమాగమము జరుగుటగాని, ఆమె వక్షోజపద్మములకు సఫలత లభించుట గాని జరగదని తాత్పర్యము.

పై వర్ణనలలో అమేయ భావశబలతను, అత్యంతమగు చమత్కారమును ప్రదర్శించినాడు చేమకూర కవి.

**సారాంశము**

1. అష్టాదశ వర్ణనలలో నొకటి యయినను, అందఱు కవులును ఈ సూర్యోదయవర్ణన చేయలేదు. చేసిన వారును కొలదిగనే చేసిరి. సంస్కృత భారత రచనా కాలము నుండియే సూర్యోదయాదులను ప్రకరణానుబద్ధము చేసి వర్ణించు సంప్రదాయమున్నది.
2. నన్నెచోడుని కుమార సంభవమున నిది హరుని వివాహముతో ముడిపెట్టబడినది. ఆ విధముగ ప్రకరణానుబంధము గలిగి యున్నది.
3. మనుచరిత్ర, పారిజాతాపహరణములందు ఈ వర్ణన కథతో నన్వయము నూహించుకొనదగి యున్నదే గాని ప్రత్యక్ష సంబంధము కలిగి యుండలేదు.
4. కళాపూర్ణోదయ, ప్రభావతీ ప్రద్యుమ్నములందు ఇది వర్ణన కొఱకు చేయబడినట్లున్నది.

5. వసుచరిత్రలో ప్రకరణ సంబంధము గలిగియున్నది.
6. ఆముక్తమాల్యదయందీ వర్ణన లేదు.
7. విజయవిలాసమున నీ వర్ణనలు చమత్కారముల తోడను. కవి సమయ సమర్థనల తోడను నిండియున్నవి.

# ఏకాదశ ప్రకరణము

## సూర్యాస్తమయాది వర్ణనలు

సూర్యాస్తమయాది వర్ణనలు ప్రతి కావ్యమందును అతిలోక భావనా విలసితములు. శృంగార భావావిష్టులైన కవులందఱును తమ తమ శృంగార భావ వీర విహారములకు రంగస్థలముగా ఈ సమయమును వాడుకొని యున్నారు.

సూర్యోదయమును, చంద్రోదయమును, ప్రకృత కథా కథనముతో ముడిపెట్టు పద్ధతి పూర్వ సంస్కృత కావ్యములందే కనబడుచున్నది. భారతమందీ పద్ధతి బాగుగా కనిపించుచున్నదని క్రింద వివరింపబడుచున్నది.

సూర్యుడు పగలంతయు తన ఖరకిరణములచే, రసమునంతను పీల్చివేయగా ఆ ఓషధిప్రతతికి సుఖము కల్గించుటకును. చకోర దంపతుల ముదింప జేయుటకును, భారత సేనను తన్పుచేయుచు చంద్రుడుదయించినాడని వ్యాసభారతమందు గలదు.

> "తతః పురస్తాత్ భగవాన్నిశాకరః
> సముత్థితస్తామభి హర్షయం శ్చమూం
> దివాకరాపీత రసా మహౌషధీః
> పునః స్వకేనైవ గుణేన యోజయన్"  —సంస్కృత భారత. అధ్యా. 51-38

తిక్కన కవి ఈ భావమునిట్లే అనువదించినాడు. చాలచోట్ల తన భారతానువాదమున ప్రకరణానుబంధముగా సూర్యచంద్రోదయాస్తమయముల వర్ణించినాడు.

మన తెనుగు కవులందఱి కంటె ముందువాడయిన బాణుడు గూడ సూర్యాస్తమయమును ప్రకరణానుబంధముగ వర్ణించినాడు.

చంద్రాపీడుడు మహాశ్వేత వృత్తాంతము విన్న తర్వాత సూర్యాస్తమయమును వర్ణించుచున్నాడు బాణుడు.

"అత్రాంతరే, శ్రుత మహాశ్వేత వృత్తాంతోపజాత శోకఇవ సముత్సృష్ట దివస వ్యాపారః రవిరపి భగవాన్ అధోముఖతామయాసీత్. అథ క్షీణే దివసే పరిణత ప్రియంగు మంజరీ నిభేన పింజరిమ్ణా రజ్యమానే విలంబినీ బ్రధ్నమండలే అవిరళ కుసుంభ కుసుమ రస రక్త దుకూల కోమలేనచ అస్తాతపేన ముచ్యమానేషు దిఙ్ముఖేషు చకోర నయన

తారకా కాంతినాచ పింగళిమ్నా విలిప్యమానే తిరోహిత నీలిమ్ని వ్యోమ్ని, కోకిల విలోచనచ్ఛవి బభ్రుణిచ అరుణయితి సాంధ్యే..." --కాదంబరి - పూర్వ భాగము.

ఇంతేగాక అనేకులు సంస్కృతకవులు సూర్యాస్తమయ, చంద్రోదయాది ఘట్టములలో తమ తమ ప్రజ్ఞల ప్రదర్శించి మనోహరవర్ణనలు చేసియున్నారు. మన ప్రబంధకవులును అంతకు తక్కువ కాకుండ వర్ణించి యున్నారు.

సూర్యచంద్రోదయాస్తమయాది ప్రకృతి కార్యములను ఇతి వృత్తముతో ముడివేయు పద్ధతి - మన ప్రబంధకారులు చక్కగా అవలంబించినారు.

సూర్యాస్తమయాది వర్ణనలలో (1) సూర్యాస్తమయము, (2) సంధ్యావర్ణన (3) అంధకార వర్ణన, (4) నక్షత్రవర్ణన మాత్రము వచ్చును.

## సూర్యాస్తమయాదివర్ణన-కుమారసంభవము

సూర్యాస్తమయమున సూర్యునియొక్క మెరుపును, చక్రవాక పద్మములకు విప్లవమును వర్ణింపవలెనని అలంకారశేఖరమున గలదు.

కుమారసంభవమున సూర్యాస్తమయము ప్రకరణముతో ముడిపెట్టబడినది. అతడు గూడ తావులేక తొలగిపోవుచున్న పాత్రవలె వర్ణింప బడినాడు.

"మృదుబలము లుర్విగ్రిక్కొన
విడిసిన దశశతకరుండు విడియగఁదనకె
య్యెడ నెక సాలక యరిగిన
వడువున నపరాద్రి నంద వనమున కరిగెన్" -కుమార, 8-88

మరియొకవర్ణన :-

సూర్యుడొక పాత్రవలెను, మానవమూర్తివలెను, శుచిత్వాశుచిత్వముల పాటించువాడుగను వర్ణింపబడుట మానవీకరణకు ప్రబలోదాహరణ. సూర్యుడు, పశ్చిమాంబుధిలో పడుటను, అంటు బాపుకొనుటకు శుచి స్నానార్థమేగిన క్రియగా ఈ క్రింద వర్ణింపబడుచున్నది-

"పోంక నలినీ రజస్వల
సోంకిన దోషంబు వాయ సూర్యుడు గలిశా
శంక నపరాంబునిధిలో
గ్రుంకెనొకో యనగ బ్రొద్దు గ్రుంకుడునంతన్" కుమార. 8-88

గొప్ప చమత్కార ప్రతిఫలనోత్ప్రేక్ష.

ఇనుడు సమీపించినందులకు అపరదిక్కాంత ముఖమంతయు రాగమయ మయినది, అది చూచి పూర్వదిక్కాంత మొగము మాడ్చినట్లుగా తూర్పున చీకట్లు కమ్మినట్లు చేసిన వర్ణన రసపూర్ణము. ఇందు చీకట్లు వర్ణింపబడినవి.

## సంధ్యా వర్ణన

''కువలయారిసనియె గువల యహితుడగు
రాజువచ్చెనని కరంబు నమ్మి
రమణ లోకమెల్ల రాగిల్లునట్లై అ
సంజ గలయ బర్వె సకలదిశల'' —కుమార 8-90

పైన సాత్త్వికభావ ముత్ప్రేక్షింపబడినది. రాజు పురవీధులలో ఊరేగునపుడు పురకాంతలందఱు తద్దర్శనమున రాగోన్మత్తు లగుదురను భావమిందు వర్ణితము. లోకమంతయు ప్రేమభావములో పడినదట: అందులకు ఎఱ్ఱని సంధ్య వ్యాపించినట్లు ఉత్ప్రేక్షితము.

## అంధకారవర్ణన

అంధకార వర్ణన మన్నది గూడ సంస్కృతమునుండి తెనుగులోనికి వచ్చినదే; ఆంధ్రకవులందఱును, ముఖ్యముగ ప్రబంధకవు లందఱును ఈ ఘట్టమున సీసపద్యములనే వాడి యుండుట ఒక విశేషము.

నల్లని వస్తువులు ఏవేవిగలవో వానినన్నిటిని చీకట్లతో ఉపమించి వ్రాసినారు.

ప్రతిభా సంపన్నుడైన నన్నెచోడ మహారాజు అంధకారము నన్ని నల్లని వస్తువుల తోడను పోల్చుచున్నాడు. నల్లని రంగు ద్విగుణీకృతమగుచున్నది.

"హరి గడుఁ బ్రీతిఁ గస్తురి పూసెనో కాలు
డర్థి గాలాగురు నలదెనొక్కొ
మహిషాసురుడుఁ గర్దమం బాడెనో మహా
కాళి నీలపటంబు గప్పెనొక్కొ
మదహస్తిపై నలి మండలి ముసరెనో
బలి నీల ఘూషాళి బొలిచెనొక్కొ

భైరవుండు గృష్ణమణి మయా కల్పములో
దాల్చెనో యనంగ ( దర తరంబ
తలచి చూఱరాని తఱచుతో నభమున
భూరి తర మహాంధకార మడరె"

-కుమా. 8-97

నల్లని వ్యక్తులు నల్లని వస్తువుల పూసికొన్నట్లుగా, నల్లని వస్తువులపై నల్లని వస్తువుల కప్పినట్లుగా చీకట్లు ద్విగుణీకృతములైనట్లు పైన వర్ణితము. గొప్ప భావుకత.

నిమ్నోన్నతములను, ఉచ్చనీచములను సమము చేయునట్లుగా, చీకట్లను వర్ణించుట కవి సమయము. ఉదాహరణము :-

"నుతవర్ణాంతర నిమ్నో
న్నత తల నిఖిలోచ్చ నీచ నానావస్తు
స్థితి సమము సేసె గతగా
రత( జీకటి దుర్వివేకి రాజ్యము పోలెన్"

-కుమా. 8-98

## నక్షత్రవర్ణన - కుమారసంభవము

కుమార సంభవమందు నక్షత్ర వర్ణన సంప్రదాయము ననుసరించియే యున్నది. రసమయముగ గూడ నున్నది.

"చాల( బ్రియుడగు శశి నిశాసంగతాను
రాగరసమున సంధ్యానురాగ మడరి
కవయ నాచంద్ర రజనీ ముఖముల నడరు
ఘర్మబిందులనంగ( జుక్కలు వెలింగె"

-కుమా. 8-91

చంద్రుడు నిశానాథుడు. ఆమెపై రాగమడిరి కవిసినాడు. వారి యిరువురి ముఖములందును జనించిన ఘర్మబిందువులా యన్నట్లు నక్షత్రములు ప్రకాశించినవని యుత్ప్రేక్షింప బడినది.

"సరసిజ హితుడట చన( దరతరమ
త్యరుణ రుచిన్ మెఱుగడరుడు వడి నం
బరమున నుడుతతి ప్రవిమలమయ్యెన్
నిరుపమ మణిగణ నికర విభాతిన్"

-కుమా. 8-92

పై పద్యము మణిగణ నికర వృత్తములో వ్రాయబడినది. వృత్తము సేసుగూడ పద్యములో వచ్చినది. ఈ పద్ధతి నన్నెచోడునిలోనే చూడగలము. గజక్రీడ చూచి

పార్వతి తనయుద్దేశమును సూచింపగా, శివుడు గజమై గజక్రీడ సల్పెను. ఆ సందర్భమున 'మత్తేభ విక్రీడిత' వృత్తమును ప్రయోగించి అందులో 'మత్తేభవిక్రీడితము' అను సమాస ప్రయోగము కావించినాడు. ఇటులనే చాల వృత్తములను వాడి వాని నామములు పద్యములోనే వచ్చునట్లు వ్రాసినాడు. ఈ విషయమీ వ్యాసమున "వనవర్ణన - కుమార సంభవము" అన్న శీర్షిక క్రింద చర్చింపబడినది. ఇట నక్షత్రముల కాంతిలో క్రమ వికాసము వర్ణింపబడినది.

## సూర్యాస్తమయాది వర్ణన – మనుచరిత్రము

ప్రవరునిపై సానుభూతిగల వారు చాల తక్కువ మంది. వరూధినిపై సానుభూతి గలవారు చాలమంది. పెద్దన కవియొక్క సానుభూతి వరూధిని పైననే. మామూలు మానవులకే గాదు, ప్రకృతికి గూడ నామెపై సానుభూతి మెండు. ప్రవరుడామెను తిరస్కరించినపుడు ఆమె విరహావస్థను చూచి,

> "తరుణి ననన్య కాంత నతిదారుణ పుష్పశిలీముఖవ్యథా
> భరవివశాంగి నంగభవు బారికి నగ్గము సేసి క్రూరుడై
> యరిగె మహీసురాధము డహంకృతితో నని రోషభీషణ
> స్ఫురణ వహించెనో యన నభోమణి దాల్చెఁ గషాయదీధితిన్" -మను. 3-10

పాపము వరూధిని తరుణి. అన్యకాంత గూడ గాదు. అనగా ఇంతవరకెవరిని గూడ పొందలేదని యర్థము. అతిదారుణ పుష్పశిలీ ముఖ వ్యథాభర వివశాంగి.అట్టి సుర కాంతను మహీసురాధము డహంకారముతో త్రోసివేసి పోయెగదా అని సురుడైన సూర్యుడు రోషభీషణుడైనాడా యన్నట్లుగ సాయంసంధ్య ఎరుపెక్కి పశ్చిమాకాశము ఎరుపెక్కినది.

ప్రకృత కథలోని వ్యక్తుల యవస్థకు సానుభూతి ప్రకటించుచున్నట్లుగ ప్రకృతిని చిత్రించుట పరంపరాగతముగ వచ్చుచున్న పద్ధతియే. ఇక్కడ ప్రొద్దు క్రుంకుటను పెద్దన ఉత్ప్రేక్షించుచున్నాడు. ప్రొద్దు క్రుంకుట అను సామాన్య ప్రకృతి కార్యమును ఇతివృత్తముతో నన్వయించుట జరిగినది. దీనివలన వరూధిని యెడ సానుభూతి చూపు చున్న వారికి ఇంకను బలము కలిగినట్లయినది.

ఈసాయంసమయమున మరొక చమత్కారమును ప్రదర్శించుచున్నాడు కవి.

"ఉరుదరీకుహర సుప్తోత్థ శార్దూలముల్
 ఘురవారి శోణిత శంక ద్రావ
వనకుంజ మధ్య శాద్వల చరన్మృగ పంక్తి
 దావపావక భీతిఁ దల్లడిల్ల
ఆశ్రమాంతర భూరుహాగ్రముల్ మునికోటి
 బద్ధ కాషాయ విభ్రాంతిఁ జూడ
ఘన సానుశృంగ శృంగాటకంబుల గాంచి
 యమరులు హేమాద్రి యనుచు వ్రాల

గాసె వేశలరుచి గింశుక ప్రవాళ
ఘుసృణ కిసలయ కంకేళి కుసుమగుచ్ఛ
బంధుజీవ జపారాగ బాంధవ బు
లన్నగంబున జరఠారుణాతపములు"

-మను. 3-11

ప్రకృతిలోని ఎఱ్ఱని వస్తువులతో సాయంకాలపు ఎండలను పోల్చినాడు కవి. కింశుకము (మోదుగు), ప్రవాళము (పగడము), ఘుసృణము (కుంకుమ పువ్వు), కిసలయము (చిగురు), కంకేళి (రక్తాశోకము), బంధుజీవము (మంకెనపువ్వు), జపా (జపాకుసుమములు) - వీనియొక్క ఎరుపు రంగునకు సాయపుటెండలు సోదరులని వర్ణించినాడు. ఇంత ఎరుపు రంగుగల సాయం సూర్యుని కిరణములు ప్రసరించినపుడు ప్రకృతిని చూచి ప్రకృతియే భ్రాంతి గొన్నది. అపుడే నిద్రనుండి లేచి గుహలనుండి బయటికి వచ్చుచున్న శార్దూలములు, మామూలు ఘురీజలమును రక్తమేమో అని త్రాగుచున్నవట. దావాగ్ని పడెనని లేళ్లు భీతిల్లి బసుగిడినవట. చెట్ల కొనలన్నియు నెఱ్ఱగా ప్రకాశింపగా అవి వ్రేలంగట్టిన కాషాయవస్త్రములని మునులు భ్రాంతి నొందిరట. హేమవన్నగ శిఖరములందు, మేగువను భ్రాంతితో అమరులు దిగుచున్నారట. ఇంత భ్రాంతి గొనుట సహజమే.

ఈ భ్రాంతిమదలంకార పూర్ణ రచనకిట గల ప్రయోజనమేమి ?

ఇది భావ్యర్థ సూచకము. ఈ సాయం సూర్యుని వర్ణన వలన - అందునను భ్రాంతి మదలంకార వర్ణన వలన - భావ్యర్థమును సూచించుచున్నాడు కవి. ఈ ప్రకృతి సహజమైన సాయపు ఎండల చూచి ప్రకృతి భ్రమపడినట్లుగానే రాగగుణభరితయు కామోద్రిక్తయు నగు వరూధిని గూడ గంధర్వుని (మాయా ప్రవరుని) ప్రవరునిగా భ్రాంతి పొందును. ఇట్లు భ్రాంతి పడుటకై పూర్వరంగమును పై విధముగ చిత్రించినాడు కవి.

పెద్దన చాలమంది పూర్వకవుల ననుసరించినాడు. వారివర్ణనలను కొన్ని యథాతథముగను, కొన్ని మార్పును పొందించు కొనియును, రచన చేసినాడు. సంస్కృత కవు

లను, కన్నడ కవులను, పూర్వాంధ్ర కవులను బాగుగనే యనుకరించినాడు.

పై పద్యమునకు సరియైన పద్యమొకటి శ్రీనాథుని భీమఖండమున గలదు.

"గిరినికుంజములఁ గుంజర పుంజమను శంక
కంఠీరవంబు లుత్కంఠ నెగయ
బల్వలంబులఁగిరి ప్రకరంబులను శంక
నెఱుకు రాజులు విండు లెక్క పెట్ట
... ... ... ...
... ... ....
రజతగిరియందు దాండవారంభ రభస
భంగి పతిత పరశ్వథ పాణి వికట
కంధరారుద్ధ గజకృత్తి కంఠశంక
ప్రమథులకు దోప నంధకారంబు ప్రబలె" -భీమఖండము.

మనుచరిత్రలోనిది సంధ్యావర్ణన అగుచో భీమఖండములోని పై పద్యమున నంధకార వర్ణన. వస్తువుల పేర్లు మార్పు అంతే: అంతేగాదు పద్యశైలియును, ముఖ్యముగ నెత్తుగీతి శైలియు నంతే.

ఈ సాయంవర్ణన సాభిప్రాయముగ గావింప బడినది. ఇతివృత్తముతో సంబంధము గలిగియున్నది (గౌణముగ).

సాయంకాల వర్ణనలో సరోజ పీడను వర్ణింపవలెనను కవి సమయము గలదుగదా!

"సరోజ షండములు నిద్రాణంబు లయ్యెన్ గడున్" -మను. 3-12

అని సరోజ పీడను గూడ వర్ణించినాడు. దీనివలన వర్ణనా సంప్రదాయము (కవి సమయము) నెరవేరినది.

## సంధ్యావర్ణన-మనుచరిత్ర

సంధ్య నిట్లు ఉత్ప్రేక్షించుచున్నాడు కవి పెద్దన.

"రవిబింబ పతన దీర్ణపయోధి గర్భ ని
ర్గత శేషఫణి ఫణారత్న రుచి యొ

దివసావసాన సందీప్తాస్తగిరి శిఖా
జ్యోతిర్గతా ప్రతానాతపంబొ
తపన ధూర్దండ నిర్దళిత దిక్తట దృశ్య
కమలజాండ కటాహ కనక ఘృణియొ
చండీశ తాండవోత్సవ సంభృత క్షపా
హస్తాగ్ర దీప గభస్తి చయమొ
ప్రాగ్విదా హచ్ఛిదా వినిద్రాణ మదవ
దంబనా లాన మూల శయ్యావిధాన
వారుణా ధోరణా కల్పి తోరుశోణ
మృత్తికా రాశియో యన మెఱసె సంధ్య" -మను. 3-17

సంధ్య, తెలుపుతో కూడిన యెరుపునుండి పూర్తి యెరుపులోనికి పరిణమించుచున్నవర్ణము యొక్క వర్ణన యిది. ఈ సంధ్య యందు చక్రవాకముల పీడను ఉత్ప్రేక్షించుచున్నాడు.

"ఏ విహంగముగన్న నెలుగిచ్చుచును సారె
కును సైకతంబులఁ గూడఁ దారు
ద్వారి గన్గొని యదితన జోడు గాకున్న
మెడయెత్తి కలయంగ మింట నరయు
నరసి కన్నీటితో మరలి తామర యెక్క
వదన మెండగ సరోవారి నద్దు
నద్ది త్రావగ సైప కట్టిట్టు గన్గొని
ప్రతిబింబ మీక్షించి భ్రమసి యుఱుకు

నుఱికి యెఱకలు దడియ వేఱొక్క తమ్మి
కరుగు నరిగిరవంబుతోఁ దిరుగు తేంట్ల
బొడుచు ముక్కున మఱియును బోవు వెదుక
సంజఁ బ్రియు బాసి వగనొక్క చక్రవాకి -మను 3-16

ఈ వర్ణింపబడిన చక్రవాకి ప్రియుని బాసిన యట్టిది. దీని యవస్థను ప్రత్యేకముగ, సొంపుగ, వర్ణించినాడు కవి. దీనికి మూలమగు మార్కండేయ పురాణములో గూడ నీ వర్ణన యున్నది.

"ఆయాతి యాతి పునరేవ జలం ప్రయాతి
పద్మాంకురాణి విచినోతి ధునోతి పక్షౌ

ఉన్మత్త వత్ భ్రమతి కూజతి మందమందం
కాంతావియోగ విధురో నిశి చక్రవాకః"

మూలములోని అర్థముకంటె, మనుచరిత్రలోని అర్థము అందముగ నున్నది. మూలమందలి "చక్రవాకః" అనునది పుంలింగము.ఆడుపక్షిని బాసిన మగ చక్రవాకము అని మూలములోని అర్థము. ఇక్కడ మనుచరిత్రలో చక్రవాకి యనుటలో వరూధిని యవస్థ సూచిత మగుచున్నది. ఇట సంధ్యావర్ణన సాభిప్రాయ వర్ణన గలదై యున్నది.

## మనుచరిత్రలో అంధకారవర్ణన

నన్నెచోడుని వలె పెద్దన గూడ సంప్రదాయానుగుణముగనే చీకట్ల సాంద్రతను వర్ణించుచున్నాడు. అతినైల్యమును వర్ణించుచున్నాడు.

"మృగనాభి పంకంబు మెయినిండ నలదిన
మాయాకిరాతు మైచాయ దెగడి
నవపింఛమయ భూష లవధరించి నటించు
పంకజాతుని చెల్వు సుంకమడిగి
కాదంబ నికరుంబ కలితమై ప్రవహించు
కాళింది గర్వంబు కాకు సేసి
తాపింఛ విటపి కాంతార సంవృతమైన
యంజనాచలరేఖ నవఘళించి
కవిసె మరియును కాకోల కాలకంఠ
కంఠ కలకంఠ కరిఘటా ఖంజరీట
ఘనఘనాఘన సంకాశ గాఢకాంతి
గటిక చీకటి రోదసీ గహ్వరమున" -మను. 3-19

చాల నల్లని వస్తువుల నెల్ల ఒక్కచో చేర్చి చీకట్ల వర్ణన కావించినాడు కవి. వాని నల్లదనమును తిరస్కరించునట్టి నల్పుదనము అని వర్ణించుచున్నాడు. కస్తూరి నలుపు. మాయాకిరాతుడు నలుపు. ఆ నల్లనివాడు నల్లని కస్తూరి పూసికొన్నపుడు ఇంకను నల్లగ నుండును. ఆ నలుపును గూడ అధఃకరించు నలుపు గలవి ఆ చీకట్లు. నెమిలి పింఛము నలుపు. కృష్ణుడు నలుపు. ఆ నల్లని పింఛపు ఆభరణములు ధరించిన కృష్ణుడు మరింత నలుపు. ఆ నలుపునకు మించిన నలుపుదనము ఆ చీకట్లకున్నది. ఇట్లే మరికొన్ని నల్లని వస్తువులు వర్ణితములు,

ఈ వర్ణన పూర్ణముగ కుమార సంభవములోని అంధకార వర్ణన వలెనే యున్నది. (కుమార. 8-97).

నక్షత్రవర్ణన మనుచరిత్రలో లేదు.

## సూర్యాస్తమయాది వర్ణన — పారిజాతాపహరణము

నారదుని వీడ్కొల్పిన యనంతరము సత్యాదేవితో శ్రీకృష్ణుడు జూదమాడుచుండు సమయమున ప్రొద్దు గ్రుంకినట్లు కవి వర్ణించుచున్నాడు. దినాంతయోధుడు సూర్య పత్నియైన ఛాయాదేవిని ఈడ్చుకొని పోవుచున్నాడని హా యని యేడ్చినట్లుగ శకుంత ముల రోదనము వ్యాపించినదని ఉత్ప్రేక్షితము. సాయంకాలమున పక్షుల రొద వర్ణింప వలెను గదా!

"ఆయత తేజము ల్దఱిగి యంబుజబాంధవుఁడ స్తసీమకుం
బోయినఁ జూచి వేచిన తమోవిభుడంప దినాంతయోధు డీ
ఛాయఁ దదీయ పత్నిఁ జెలుచం బడనీడిచి కొంచుఁ బోయెడిం
గో యను మాడ్కి నంతట శకుంతరవంబు చెలంగె నెల్లడన్" —పారి. 2-30

శ్రీకృష్ణుడు సత్యభామతోడను, దేవకాంతల తోడను కలిసి జలక్రీడలాడిన యనం తరము సూర్యాస్తమయము వర్ణితము.

"ఘన సాంధ్య రాగ వినతా
తనయ గరుత్సమితి కడిది తాకున ధరవ్రా
లిన గగన ఫణి ఫణామణి
యన రవిమండలము పశ్చిమాంబుధి గ్రుంకెన్" —పారి. 4-45

గరుత్మంతుని ఱెక్కలు ఎరుపు. మణులు గూడ కొంత యెరుపు. సాయం సూర్యుడు సముద్రములో పడినాడని ఉత్ప్రేక్షింపబడినది.

## సంధ్యావర్ణన

సూర్యుడు చక్రవాకములకు బంధువు. అతడు క్రుంకగనే చక్రవాక దంపతులు ఏడ్చినవట! చంద్రుడు కనిపింపగనే ఆ దంపతులకు వేర్పాటు కలుగును. అందుల కవి

బాధపడి యేడ్చినవి. సహవాసుల బాధలు చూడలేక జలదేవత, వనరుహములు అను తన కన్నులను మోడ్చెనా యన్నట్లు పద్మములు ముకుళించినవి. సాయంసమయమున చక్రవాకముల యొక్కయు, పద్మముల యొక్కయు పీడను వర్ణించుట సంప్రదాయ సిద్ధమే!

ఇట ప్రకృతి మానవీకరణ జరిగినది.

కవి చాల రమణీయముగ, సార్థకముగ చేసినాడీ వర్ణన.

"ఇనుదెసఁ జూడనోడి తలలెత్తక నీట దదీయబింబమున్
గని వగ జక్కవల్మొగమొగంబులు సూచుచుఁ గుంది మూర్ఛ జెం
దిన దెసఁ జూడలేక వనదేవత హాయని కన్ను మోడ్చెనా
వనరుహముల్ముడింగె సహవాసుల దుఃఖము నెయ్యురోర్తురే" -పారి. 2-31

జక్కవలకును, తామరలకును సూర్యుడు మిత్రుడుగదా! ఇట కవి సమయము చక్కగ పాటింపబడినది.

ఈ క్రింది రూపకము అతి మనోహరముగ నున్నది.

"తనువున నంధకారపు మదంచలమిన్న మభద్రదంతికి
న్మొనసినఁ జిందరేగి తపనుండను మావుతుఁగ్రుంకు మెట్టలో
య నురల వైచిన న్మొగిలి యచ్చట నెత్తురు గ్రక్కెనోయనం
గనుగవ గోరగింప బొడగట్టె సముజ్జ్వల సాంధ్యరాగముల్" -పారి. 2-32

ఆకాశము మదించిన యేనుగు. దానిని అధిరోహించిన మావటీడు సూర్యుడు. అది వానిని అస్తపర్వతముయొక్క లోయలో క్రిందపడవేయగానతడు రక్తముగ్రక్కెనా అన్నట్లు సాంధ్యరాగము వ్యాపించినది. వర్ణన క్రొత్తగ నున్నది.

## అంధకార వర్ణన

నన్నెచోడ మహారాజువలె - అల్లసానిపెద్దన మహాకవివలె - రామరాజభూషణ మహాకవివలె - ముక్కుతిమ్మన గూడ నంధకారవర్ణనను సీసపద్యములోనే వ్రాసినాడు. మనోరంజకోపమానములచే నుత్ప్రేక్షించినాడు.

"దివవారిరాశి మాపను మౌసిఁ గ్రోలంగ
నడుగునఁ గనుపట్టు నసలనంగఁ
గ్రుంకు మెట్టడవి గార్కొనిన సంధ్యావహ్ని
బొడమిన ధట్టంపుఁ బొగ యనంగ

దనమణి పడిపోవ ధరణీ తలంబున
నెమకంగ వచ్చిన నింగియనగ
వలచుక్కలనియెడి వలరాజు గెలుపువ్రాల్
తెలియంబూసిన మషీలేపమనగ

వృద్ధవారవిలాసినీ విసరమునకు
నపలితంకరణౌషధం బనగ జార
నలినముఖుల కదృశ్యాంజనం బనంగ
నంధకారంబు జగమెల్ల నాక్రమించె'' -పారి. 2-34

అంధకారము చాల నలుపని అందఱును వర్ణించిరి. నైల్యము యొక్క దైర్ఘ్యము సూచించునట్లు అందఱును సీసపద్యములలోనే వర్ణించిరి.

కామమున కుద్దీపనము చీకటి. చీకటి తప్పులు విశేషముగ జరుగుచుండినట్లు వర్ణించుటను బట్టి ఆ నాటి సమాజభావముగూడ స్పష్టముగ వ్యక్తమగుచున్నది. ప్రతి కవియు జారుల వర్ణించియే యున్నాడు.

ఇంద్రుని వాహనమగు ఐరావతము తెల్లనిదని కవి సంప్రదాయము. ఇక్కడ దాని దానశోభ నలుపనుచున్నాడు కవి. అష్టదిక్పాలకులలో నొక్కొక్కరికి సంబంధించిన యొక్కొక్క నలుపు వస్తువుతో చీకట్లను పోల్చుచున్నాడు. దీనివల్ల దశదిశలను చీకట్లు దట్టముగా వ్యాపించినట్లు చెప్పకయే చెప్పినట్లున్నది.

"మరుదీశద్విప దానశోభ శిఖిధూమ్యారోచి కీనాశకా
సర దేహప్రభ రాక్షసాతిలతి కాంచద్దీధితి న్వారిధీ
శ్వర కేతుద్యుతి మాతరిశ్వహరిణచ్ఛాయన్ ధనాఢ్యక్షు నీ
లరుచిన్ ధూర్జటి కంఠకాంతిఁ దమముల్ ప్రాపించె దిగ్భిత్తులన్" -పారి. 4-46

పైన చీకట్ల యొక్క నలుపు, మొదట ఎరుపును మించిన నలుపుగా నుండి, పోను పోను అతి నీలమైనట్లుగా వర్ణింపబడినది.

## నక్షత్రవర్ణన — పారిజాతాపహరణము

చుక్కలు లెక్కలేనన్నిగాన వానికి సంబంధించిన యూహలును లెక్కలేనట్లుగా వర్ణితమై యున్నవి. నన్నెచోడుడు నక్షత్రవర్ణన చేయుచు చంద్రరజనీ ముఖములందలి చెమట బిందువులని వర్ణించి యున్నాడు. (కుమా. 8-91). ఇతడు గూడ అట్టి భావము వ్యక్తీకరించుచున్నాడు.

"కారొక్కన్న కటిక చీకటి మొగుల్మొత్తంబు
గురిసిన వడగండ్ల గుంపులనగఁ
గవజక్కవలు వాయఁ గరనాళములఁ జందు
రుండూదు పటికంపు టుండలనగ
నెల్లెడ మిన్నేటి యిసుమున నచ్చర
కొమలిడ్డ వెన్నెల కుప్పలనగఁ
దెలివి వెన్నెల వెండితీవెలు నిగిడించు
చదలుఁ గమ్మచ్చు బెజ్జములనంగ

జగము గెల్వంగ దండెత్తు మగని మీద
లీల రతి చల్లు దీవనఁ బ్రాలనంగ
వేడి వెలుగెండ గ్రాగిన విన్ను మేన
నెక్కొను చెమట బొట్లునాఁజుక్కలమరె" —పారి. 2-37

పైన చుక్కలు ఎన్నియో విధముల ఉపమింపబడినవి. సాత్విక భావ ఫలమైన చెమటబొట్లుగా గూడ వర్ణింపబడినవి.

## సూర్యాస్తమయాది వర్ణన — కళాపూర్ణోదయము

భావనాభాగ్య గరిమలో నొకరికి తీసిపోవువాడుగాడు సూరన. కళాపూర్ణోదయమున సూర్యాస్తమయమును చిత్రముగ వర్ణించుచున్నాడు.

కాలము అను కృషీవలుడు పండిపోయిన యెండలనెడు వరిపైరును కోసి ఒక్కచోట పడవేసి కుప్ప చేయుచున్నాడన్నట్లుగ సూర్యబింబము ఎరుపెక్కి అంతకంతకు పెద్దది యగుచున్నదని ఉత్ప్రేక్షించుచున్నాడు.

"కాలకృషీవలుండు గడకం బరిణత్యరుణా తపచ్ఛటా
శాలిచయంబు గోసి పెలుచం బనమోయుచు నున్నవాడు గాఁ
బోలును గుప్పగానన నభోమణి మండల మంతయంతకుం
జాల విశాలమై చరమశైలము చేర్పున నొప్పెఁ జూడ్కికిన్" —కళా. 8-8

## అంధకార వర్ణన

కృష్ణుని రూపము విరాట్టయినట్లుగా, అష్టమూర్తి తన మూర్తుల కంతయు ఏనుగ తోలు కప్పినట్లుగా, దశదిశలును వృత్రాసురరూపము ధాల్చినట్లుగా చీకట్లు ఉత్ప్రేక్షింప బడుచున్నవి.

"కేశవుఁ డవ్విరాట్తనువు కృష్ణసమాఖ్య వహింప జేసెనో
యీశుఁడు మూర్తులెన్మిదియు నేనికతోలునఁ గప్పెనో సమ
స్తాశలుఁ గూడి వృత్రదనుజాధిప ధూమికఁ దాల్చెనో యనం
బేశలతం దమః పటలి పేర్చి సమస్తముఁ గప్పె నంతటన్" —కళా. 8-11

నల్లని మేఘములను వృత్రాసురుడన్నట్లు వేదములవల్ల విదితము (ఋ. 1-32-47)

## నక్షత్రముల వర్ణన

"నింగి యనియెడు ప్రత్తి చేనికిని రక్త బలి యిడి రనంగ నెఱసంజతోలుతనమర
దఱచుగా దాన విఱిసిన మెఱుగు ప్రత్తి విళ్ళనా జుక్క లెంతయు నుల్లసిల్లె"
—కళా. 8-12

పైన పత్తి విళ్లతో చుక్కలను పోల్చుటలో ప్రాంతీయ ప్రకృతి దృష్టి స్పష్టము. సూర్యాస్తమయమును, అంధకారమును, నక్షత్రములును, మొత్తము 5 పద్యాలలో మాత్రము వర్ణించినాడు. సంధ్యాంధకారవర్ణనలో నన్నెచోడ, పెద్దన, తిమ్మన, భట్టుమూర్తులవలె సూరన, తన ప్రబంధాలలో సీసమును వాడలేదు.

## సూర్యాస్తమయాది వర్ణన-ప్రభావతీ ప్రద్యుమ్నము

సూర్యాస్తమయమును, సంధ్యారాగమును, చుక్కలను ఒక్కట వర్ణించుచున్నాడు కవి. ఆరగట్టిన రక్తాంబరమువలె కడ సంజయును, అందుండి కారు నట్టి నీటిబొట్లవలె చుక్కలును మెఱయుచున్నవట!

"అంబుధిలోని కంతటను హంసుడు డిగ్గె దినాంతమజ్జనా
ర్థంబును బోలె నట్టియెడఁ దత్తటి నాఱగ గట్టినట్టి ర
క్తాంబరమో యనంగఁ దనరారె గడుంగడ సంజకెంపు యం
తం బొడసూపె దారకలు తత్పత నోద్గత బిందులో యనన్" —ప్రభా. 4-117

సూర్యబింబ పతనమువలన సముద్రమునుండి యెగిసిన నీటి బిందువులను నక్షత్రములతో చాలమంది సంస్కృతాంధ్రకవులు పోల్చినారు.

## అంధకారము

"తోరపుఁ జీకటు లంతన్
ఘోరోత్సవ కలశమునకు ముదిఁ బొంగుచ్చుఁ ధి

జార్జిజను లాదెశిక
స్తూరి ఘనంతముల యొప్పు చొప్పడ నెరసెన్" —ప్రభా. 4-118

చీకట్లు కామకార్యములకు ప్రోత్సాహమిచ్చునట్టివని పైన భావము. అష్టదిక్కులును నల్లని దట్టమైన చీకట్లతో కప్పబడి పోయినవని యర్థము. చాలమంది కవులు కస్తూరితో చీకటిని పోల్చుట గమనింప దగినది.

## సూర్యాస్తమయాది వర్ణన - వసుచరిత్ర

వసుచరిత్రలోని సూర్యాస్తమయమునకు ప్రత్యేకత యున్నది. భట్టుమూర్తి సూర్యాస్తమయమును ప్రకృతి కథాంశముతో ముడి పెట్టున్నాడు.

"భవదన జాత్మజన్ వసున్నపాలుడు గైకొను నెల్లి నేట న
య్యవని వరప్రసాదమున నంటదువో భవదీయ జాతికిన్
బవిభయ మంచు మంచుమల పట్టికి భావి శుభంబు లోకబాం
ధవు డెఱిగింపఁ బోయిన విధంబున నేగెఁ బయోధి చెంతకున్" —వసు. 4-4

సూర్యాస్తమయమునకు కారణమును కల్పించినాడు కవి. గిరికా వివాహము వసురాజుతో ఖాయమైనదనియు - ఇక పవిభయము పర్వతములకే యుండదనియు అభయము పలుకుటకు సూర్యుడు పయోధిచెంత కేగినట్లుగా వర్ణితము. మను చరిత్రలో వలె నిచట గూడ నీ వర్ణన యితి వృత్తముతో నన్వయముగావింపబడినది.

అపరదిక్కాంతను సూర్యుడు వరించినాడు అని అతని భార్య అయిన పద్మిని మొగము ముడిచినది, ఛాయయును వెనుకకు మరలినది. పరస్త్రీ వెంట దగులు భర్తలకు పత్నులు పరాఙ్ముఖులగుట నీ క్రింద ఉత్ప్రేక్షించుచున్నాడు కవి.

"అప్పుడపరానుషంగ లబ్ధాంగరాగ
మేర్పడగ నతిగతుడైన యినుని జూచి
పద్మిని ముడించె నెమ్మోము ప్రభదలిర్ప
దయ్యె వెంబడి జనక ఛాయయును మరలె" — వసు. 4-6

పైన ప్రకృతి సహజ వ్యాపారమునకు కారణము ఆపాదింప బడుటయే గాక మానవులలోని యీర్ష్యాదులు మానవేతర ప్రకృతిలో నున్నట్లు సజీవముగ చిత్రించుట ప్రకృతి మానవీకరణ కొక యుదాహరణము.

సాయంకాల వర్ణన చేయుటలో నన్నెచోడుని కంటె, పెద్దన కంటె, మరింత

సొగసుగ నుత్ప్రేక్షించినాడు భట్టుమూర్తి. రసోదంచితముగ, చమత్కారపూర్ణముగ, అలంకారభూయిష్ఠముగ, సార్థకముగ గూడ నున్నది వర్ణన.

## సంధ్యావర్ణన - వసుచరిత్ర

సంధ్యావర్ణన ఉత్ప్రేక్షమయముగా నున్నది. ఏ విషయమునైనను, ఎన్ని దృక్కోణములలోచూడనగునోఅన్నిదృక్కోణములతోచూడగల ప్రజ్ఞాశాలి భట్టుమూర్తి.

"వనజాలయము మూసి యినుజాడ దిలకించు
  లలితాబ్జినీం రాగలక్ష్మి యనగ
ఘనపదాయసపట్టికం దమోంజనము పట్ట
  నపరాశ యిడిన దీపార్చి యనగ
గప్పుజూపుచు బాంధ గణము నేచు ప్రదోష
  కరిమేని ధాతు శృంగారమనగ
ద్విజసూక్తి బఠిరాక తెలిసి మోమెత్తి రా
  త్రివహించు కాశ్మీర తిలకమనగ
సమయ మృగహత రవిరఘూత్తముని సతి ప్ర
భామయి దమోనిశాటుండు పఱవకుండ
ననల ధామంబులో డాచి యమరులిడిన
వంచనా గౌరగాత్రినా వరలె సంధ్య" -వసు. 4-7

ఉత్ప్రేక్ష రూపకములతో నడిచినది రచన. ఉత్తరోత్తరము బలీయమన్నట్లుగా నన్నెచోడ, పెద్దన, తిమ్మనాదుల కంటె మించిన భావుకతతో వర్ణించినాడు భట్టుమూర్తి.

## అంధకారవర్ణన - వసుచరిత్ర

దేనిని దీసికొన్నను పాతవారి కంటె నవ్యముగ వర్ణింపవలెనను పట్టుదల గలవాడు భట్టుమూర్తి. ఇక్కడగూడ నన్నెచోడుని కంటె, పెద్దనకంటె - మించి పోయినాడు. వారివలె సాంప్రదాయికముగనే వర్ణించినాడు. అందులోను నవ్యత చొనిపినాడు. తారలయొక్కయు, క్రౌంజీకటుల యొక్కయు దర్శనమెంతయో రమ్యముగా నున్నది.

"నటదీశాన శిరస్తట త్రుటిత రత్నచ్ఛాయ కల్లోలినీ
విటమధ్యంబున వ్రాలె నక్షమణి తద్వేగాభిపాతోన్నమ
త్పటు పాథోలవధారఁ దారలెగసెన్ దద్బింబు సంధానితో
త్కట సంధ్యానల ధూమ కందళములై కన్పట్టెఁ గ్రొంజీకటుల్" -వసు 4-10

అతి వేగముతో అంత సూర్యబింబము సముద్ర మధ్యములో పడుటవలన జలకణములు పైకి ఎగసినవి. అవియే నక్షత్రములుగా ఉత్ప్రేక్షింపబడినవి. కాదంబరి యందలి "అపరసాగరాంభసి పతితే దివస కరే పతన వేగోత్థిత మంభశ్శీకర నికరమివ తారాగణ మంబరమధారయత్" అను దానికి అనుకరణముగా నున్నదిది. సంధ్యారాగమనెడి అగ్నితో ఈ బిందువులు సంపర్కము పొందుట వలన ఆవిరి ధూమములు ఎగసినవా అన్నట్లు వ్యాపించినవని ఉత్ప్రేక్షింపబడినది. తొలిగా చీకట్లు పుట్టినపుడు అంతనలుపుగా అంత దట్టముగా నుండవు. అందులకే ఆవిరి రూపముతో జన్మించినట్లు వర్ణించినాడు కవి. ఇది సొగసుగ, సతార్కికముగ నున్నది. ఆ తర్వాత చీకట్లను చాల నల్లగ నున్నట్లు వర్ణించుచున్నాడు. పూర్వ కవులవలె (నన్నెచోడ, తిమ్మన, పెద్దనలు) నితడు గూడ సీసపద్యమునే వ్రాయుచున్నాడు. అందునను గూడ వారితో స్పర్థించి వ్రాసినట్లుగ, అతివేల మనోహరతను ప్రదర్శించుచు వ్రాసినాడు. పూర్వులపై స్పర్థతో వర్ణించుటే గాదు, సార్థకతను సాధించి సెబాసనిపించుకొనువాడు భట్టుమూర్తి. నన్నెచోడుడును, పెద్దనయు చీకట్ల నైల్యమును ఉగ్గడించుచు వ్రాసినారు. అంతేగాని ఆ చీకట్ల నైల్యములో క్రమపరిణామము కానరాదు, భట్టుమూర్తి వర్ణన చాల సొంపుగనున్నది. క్రమవికాసమున్నది.

"హరిహయ వాహనా హంకారము హరించి
వేడివేలుపు జాడ వెంటనంటి
తపన జాయస దండ తాండవం బెడలించి
దనుజ ఘోరాకార దర్పమడచి
కడలిఁజేని బిడార మడుగుముట్ట గలంచి
గాలి రజోవ్యాప్తిఁగాకుసేసి
ధనరాజ నిధిముద్రఁ దనవశం బొనరించి
యిభదైత్యహరుని పట్టెల్ల జెఱిచి

యవనిఁ గబళించి నభమెల్ల నాక్రమించి
కమల జాండ కటాహంబు గడవఁ బెరిగె
జాలితాదిత్య సంధ్యాభిచార హోమ
వీతిహోత్ర భవాభీలవృత్రమూర్తి" -వసు. 4-12

దట్టమైన నలుపు రంగు గలవస్తువులలోని నలుపు రంగును, హరించి, ధిక్కరించి. తిరస్కరించి, దర్పమడచి, చీకాకుపొందించి-నలుపునంతను తనవశము గావించుకొని,

ఊర్జితమై, దశదిశలు నిండి బ్రహ్మాండము పిక్కటిల్లునట్లుగా విజృంభించినది అంధకారము.

చీకటి కామ విజృంభణమును నెఱపునది· కాముకులు చీకటిని బాగుగ మెచ్చుకొందురు. సంకేతము నుంచుకొన్న కాముకులు చీకట్లకొఱకు ప్రార్థింతురు. అది వారికి కనులపండువు. గొప్పగొప్పవారికే ఇది శిరోధార్యము అయినట్లుగా భట్టుమూర్తి వర్ణించుచున్నాడు. ఈ విధముగ నెవరును వర్ణింపలేదు. ఈ క్రింది రమ్యార్థదాయియయిన పద్యము సతార్కికమైనది.

"తమి నహల్యాజారతా రతాశయుడైన
జంభారి కిది రత్నజాలమయ్యె
వల్లవీతతి గూడి మల్లాడు మాయ గొ
ల్లని కిది చూడా కలాపమయ్యె
దారుకావనమౌని దారకాముకుడైన
పశుపతి కిది గళాభరణమయ్యె
తారాభిసారసాదరతఁ ద్రిమ్మరిన త
మ్ముల దాయ కిది యురోముద్ర యయ్యె
అభిమత నవీన వరనిధానాప్తి హేతు
దివ్యసిద్ధాంజనం బైన దీనివంటి
యనుగుఁగనుగవ నొత్తుచే యరుదటంచు
గులటలు నుతింపఁ దిమిరంపుఁ గుంపులెసగ" —వసు. 4–13

ఇంత శృంగార రసయుక్తముగ, ఇంత సార్థకముగ, ఇంత అద్భుతముగ నితర కవులు వర్ణింపలేదు. సహజ నైల్యములకు కారణ కల్పనచే శిరోధార్యము అయిన వనుట చమత్కారముగదా;

నిమ్నోన్నతముల సరిగావించు గుణమున్న దను సంప్రదాయ పద్ధతిని గూడ వర్ణించినాడు –

"అరవిందోదరమూర్తి భానుడపు డూష్మాంతంబుగా సంకుచ
త్సరసీజేక్షణుడైప యోనిధిఁజొరన్ సంధ్యాతటిత్పూర్వమై
నెరసెం జీకటి కార్మొగుల్గగతిపై నిమ్నోన్నతాభోగము
ల్సరిగావించుచు సర్వతోముఖ మహాసార ప్రసారంబులన్'. -వసు. 4–11

పై వర్ణనమందు చీకట్లు నిమ్నోన్నతములను సరిచేయును అన్న కవిసమయమును పాటించుట జరిగినది.

## నక్షత్రవర్ణన – వసుచరిత్ర

సాంప్రదాయికమయిన యీ నక్షత్రవర్ణనను పెద్దన యేల చేయలేదో తెలియదు. పెద్దన యనుసరించిన వ్యక్తియని చెప్పబడుచున్న శ్రీనాథుడు తన శృంగార నైషధ

మందు నక్షత్రవర్ణన నాలుగు పద్యములలో గావించియున్నాడు.

వసుచరిత్రకారు డీసంప్రదాయమును పోగొట్టకుండ నక్షత్రవర్ణన కావించినాడు. నక్షత్రములు ప్రకృతి వస్తువులు. చీకట్లు పడిన యనంతరము తమ వెలుగుతో ప్రపంచమునకు ఊరట కల్గించెడి ప్రకాశ వస్తువులు.

నక్షత్రముల నానావిధములుగ ఈ క్రింది విధముగ ఉత్ప్రేక్షించుచున్నాడు భట్టుమూర్తి.

"నటదీశ హార విస్ఫుటిత వేధోండరే
ఖలదోచు వరణాంబు కణికలనగ
బెల్లుబ్బు నిగ్గ పెన్వెల్లి నెల్ల పదార్థ
ములు మున్గ బోడము బుద్బుదము లనగ
రవికి మందేహ నిర్మథన సాధనములై
వచ్చిన ద్విజమంత్ర వర్ణములన
హరిపదంబును నీకుశీరమునైన నభంబు
న నభోగతులు నించు ననలనంగ

జరమగిరియను మరకాడు జలధి సరణి
దరణి డించిన నతడు తత్సలిల మగ్న
విమల ముక్తా ఫలంబులు వెలికి జొరిపె
ననగ నవతారకా నికాయంబు లడరె" వసు. 4-15

పై వర్ణన ఎంతో భావుకతను సంతరించుకొన్నది. సంస్కృత కావ్యమందలి వర్ణన పఠనా సంస్కారమిందు ప్రతిబింబించుచున్నది.

## సూర్యాస్తమయాదివర్ణన - విజయవిలాసము

పెద్దనాది కవుల వలె విజయవిలాసకారుడు సూర్యాస్తమయానంతరము చీకట్లను గాని నక్షత్రములను గాని వర్ణింపలేదు. సూర్యాస్తమయ చంద్రోదయముల నొకేసారి జరిగినట్లు మాత్రము వర్ణించినాడు. "పూర్వపశ్చిమోత్తుంగ మహీధరాగ్రములందు, తోయజ శాత్రవ మిత్రబింబమును" రాజునకు దాసులు పట్టు జాళువా బంగరుటాల వట్టములవలె నుండెనని (విజయ. 1-208) వర్ణించిన యనంతరము

''ఒక మెట్టు తరణి డిగ్గిన
నొకమెట్టు శశాంకుడెక్కె నుర్వీస్థలిలో
నొకరాజు సన్నగిల్లిన
నొకరాజంతంతకును మహోన్నతి గనడే -విజయ. 1-209

అని లోకసామాన్య ధర్మమును ప్రకృతి ద్వారా సమర్థించినాడు. ఈ వర్ణన అభిజ్ఞాన శాకుంతలము నందలి (4-2) శ్లోకము నందు చెప్పబడిన భావముననుసరించి నట్లున్నది. అంతేగాదు.నన్నెచోడుని కుమారసంభవమందలి (8-190) పద్యమునకు గూడ- అనుసరణముగ నున్నది.

ఇతరకవులకంటె భిన్నముగను, అందముగను వసంత సాయంతనమును వర్ణించి నాడు చేమకూరకవి (విజయ. 1-210). శిశిరర్తువునందు పర్ణములు రాలి వృక్షములు మోడులుగనుండును. వసంతర్తువు ప్రవేశింపగనే అవి చిగుర్చును. ఈ వసంత సమయ మున వసంతుడు మోడులనే చిగురు జేయగా చంద్రుడు రాళ్ళనే కరిగించు చున్నాడు. ఈ ప్రకృతి దృశ్యమును ఇద్దరు సమర్థకవుల పోటీగా చమత్కారముగా వర్ణించు చున్నాడు.

> "క్షితిపయి వట్టి మ్రాకులుఁజిగిర్చ వసంతుడు దా రసోపగుం
> భిత పదవాసనల్ నెఱప మెచ్చక చంద్రుడు మిన్నునన్ ప్రస
> న్నతయును సౌకుమార్యముగనంబడ ఱాల్గరగంగ జేసె, నే
> గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా" - విజ. 1-210

ఈ ప్రకృతి వర్ణన ద్వారా అటు కవుల స్పర్థయును, ఇటు సమకాలము వారలు మెచ్చరను లోకసామెతఁయును వ్యక్తములయినవి. వసంత శోభ భూమిపైన మాత్రమే కాబట్టియును, చంద్రికా విలసనమంతయు ఆకాశమందే కాబట్టియును, క్షితిపయిన్ మిన్నునన్ అన్న పదములు సార్థకముగ ప్రయోగింపబడి మన్ను మిన్నుల వ్యత్యాసము గూడ నిరూపింపబడినది.

సూర్యాస్తమయానంతర వర్ణన విజయ విలాసమందు ప్రత్యేక ధోరణిలో నడిచినది.

### సారాంశము

1. సూర్యుని యెరుపు, సంధ్యారాగము, చక్రవాక పద్మ విప్లవము, మొదలగు కవి సమయ వర్ణనలు చాలవఱకన్ని ప్రబంధము లందును పాటింపబడినవి.
2. అందఱును సహజముగను, భావాత్మకముగను, మనోహరముగను, సంధ్యను వర్ణించినారు. మను, వసుచరిత్రలలో సంధ్యావర్ణన సీసపద్యములలో సాగినది. పెద్దన రెండు సీస పద్యములను ప్రయోగించినాడు.
3. తెలుగు ప్రబంధములలో అంధకారవర్ణన ఉద్దండముగా సాగినది. ఇందు పూర్వ కవుల (సంస్కృత కవుల) ప్రభావమున్నది. కాని భావములును, రచనయును

స్వీయమే; ఈ సందర్భమున కుమార సంభవమందును, మనుచరిత్రమందును, పారిజాతాహరణమందును, వసుచరిత్రమందును, ప్రజ్ఞావిలసితమైన భావాత్మక వర్ణనలు సాగినవి. వీరందరును దాని విస్తృతత్వమును సూచించుటకా యన్నట్లు సీస పద్యములనే వాడిరి. కళాపూర్ణోదయమందును, ప్రభావతీ ప్రద్యుమ్నమందును సీసములు ప్రయోగింపబడలేదు. ఆముక్తమాల్యదయందీ వర్ణనలే లేవు.

4. నక్షత్రవర్ణనలో కుమారసంభవమున మణిగణ నికర వృత్తము వాడుట ఒక ప్రత్యేకత. నక్షత్రవర్ణన మనుచరిత్రమునను, ఆముక్తమాల్యద యందును, ప్రభావతీ ప్రద్యున్నమ్నమందును లేదు. పారిజాతాపహరణమందును, వసుచరిత్రయందును, కళాపూర్ణోదయమందును గొప్ప ఉత్ప్రేక్షలతోగూడి యున్నది.

5. అంధకార వర్ణన చేయుటలో కుమార సంభవమందును, మనుచరిత్ర, పారిజాతాపహరణ, వసుచరిత్రలందు సీసపద్యములనే వాడుట ప్రత్యేకత.

6. విజయవిలాసమున నీ వర్ణనలు చెప్పుకొనదగినట్లుగ లేవు.

---

# ద్వాదశ ప్రకరణము

## చంద్రోదయాది వర్ణనలు

చంద్రోదయాది వర్ణనలు, సాధారణముగ వసంత కాలముననే చేయబడును. ఈ పద్ధతి సంప్రదాయసిద్ధము. విషువత్ సమయముననే వర్ణింతురు. ప్రబంధములందంతట నట్లే వర్ణించినారు.

"సమరాత్రం దివేకాలే విషువత్" అని అమరము. ఇది మార్చి ఆఖరునందును సెప్టెంబరు ఆఖరునందును వచ్చును. మార్చినెల ఆఖరున వచ్చు విషువత్తుకు ప్రాధాన్య మెక్కువ. అది వసంతర్తువున వచ్చును గనుక సాధారణముగ మార్చి 22వ తారీఖు అని చెప్పనగును. అపుడు పగలును, రాత్రియును సమానములు. ఆ పూర్ణిమలు ప్రతి కవియు వర్ణించును. ఆ పూర్ణిమనాడే సూర్యాస్తమయము పడమటను, చంద్రోదయము తూర్పునను ఒకేసారి కనుటకు వీలుండును. అట్లే సూర్యోదయ చంద్రాస్తమయముల నొకేసారి చూడ వీలుండును.

ప్రతి ప్రబంధమునందును అతివేల మనోహరత్వమును సంతరించుకొన్నవి చంద్ర వర్ణనలు. అసలు చంద్రుడు హృదయ సంబంధి. మనసునకు చంద్రుడధినాథుడని శాస్త్రములు చెప్పుచున్నవి. భావములకును చంద్రునికిని సంబంధమున్నది. చంద్ర దర్శనము మనసుపై పనిచేసినంతగా మరొక శక్తి చేయజాలదు. మనసునకు మత్తెక్కించుట గాని, పిచ్చెత్తించుటగాని జరుగుట చంద్ర ప్రభావమువల్లనే. ఇంగ్లీషున చంద్రునికి మూన్ (Moon) అని పేరు. దానికి విశేషణ రూపము లూనార్. పిచ్చివాళ్ళను లూనటిక్స్ అందురు. దీనిని బట్టి చంద్రునికిని పిచ్చికినీ సంబంధమున్నదని తేలినది. చాలమంది కవులకును భావుకులకును సాముద్రిక శాస్త్రమునను సరించి వారిచేతులయందలి చంద్రస్థానము ఉన్నతముగ నుండును. వారి హస్తమందలి హృదయ రేఖ చంద్రస్థానము పైకి కొంత వంగియుండును. అందులకే వారిలో భావుకత మెండై కవిత్వము చెప్ప గలరు. ఆరేఖ ఇంకను వంగి, చంద్రస్థానములోనికి చొచ్చుకొని పోయినచో హృదయాంశమైన భావుకత అతిశయించి బుద్ధిస్థానము బాగుగ లోపించి పిచ్చివారగుదురు.

ప్రబంధములలోని మన చంద్రముఖులందఱును అతి కాముకత్వమును ప్రదర్శించి యుండుటను చూచుచున్నాము. వారి వర్ణములో - ఆకారములో - హృదయములో

చంద్రాంశమధికము అగుటచేతనే వారంతపిచ్చిగా ప్రవర్తించుట జరుగుచున్నది. కామమునకు తాళలేక చంద్రదూషణ అందులకే చేయుచున్నారు.

పూర్ణిమ, అమావాస్యలందు చంద్రుడు పూర్ణుడై భూమికి దగ్గరగ జరుగును. అపుడు భూమిపై చంద్రాకర్షణ శక్తి అధికముగ నుండును. సముద్రములు పొంగును. కామాతురులు మరింత కామాతురులగుదురు. అందులకే మన పూర్వులు పూర్ణిమా అమావాస్యలందు కామక్రీడను నిషేధించినారు. వెన్నెలలో - అందు ముఖ్యముగ పూర్ణిమనాడు ఆరుబయట పడుకొనరాదని మన పెద్దలు నిషేధించినారు.

మన ప్రబంధములందలి నాయిక లందఱును చంద్రముఖులు. చంద్రాంశ మెక్కువగ గలవారు. వారు వెన్నెలలో విహరించిన యనంతరమే విరహ మధికమై చంద్రదూషణ గావించినవారు. చంద్రున కంత ప్రభావమున్నది ప్రాణుల జీవితముపైన.

కవులు చంద్రోదయమునకును, చంద్రికావిలసనమునకును, అధికస్థానమిచ్చి యున్నారు. వారివారి భావుకతను - విషయ పరిజ్ఞానముతోడను లోకానుభవముతోడను మేళవించి అతివేలముగ ప్రదర్శించి యున్నారు.

కులట, అంబుజ చక్రవాకములకు పీడ కలుగునట్లు వర్ణించుటయును. చకోరములకు, దంపతులకు, చంద్రకాంతలకు, కలువలకు, ప్రీతి కలుగునట్లు వర్ణించుటయును సంప్రదాయము.

సంస్కృతకవులు వర్ణించిన దారినే మన తెలుగు కవులును అనుసరించిరి. కాని వీరి వర్ణనలో స్వతంత్రత, భావుకతాధికత, అతిశయించి కనుపించుచున్నవి. సంస్కృత కృతులలోని వర్ణనలు వీరు చూచినారే గాని, వానిని అనువదించలేదు. సొంతముగ వర్ణనలు చేసినారు.

అందమయిన ప్రకృతి, ఆనందదాయియైన దేవతగా, శృంగార రసాధి దేవతగా చంద్రుడు కావ్యాలలో కీర్తింపబడియున్నాడు. వాల్మీకి మొదలయిన సంస్కృతకవులు రమ్యాతి రమ్యమయిన వర్ణనలు చేసియున్నారు. ఉదాహరణకు:

రామాయణములో కిష్కింధాకాండమందు శారదాకాశమును, శరత్సంధ్యను అమోఘముగ వర్ణించుట జరిగినది.

ప్రేమోత్కంఠితయైన నాయిక తన నాయకుని కరస్పర్శచేత నేత్రతారకలు ఆనందముతో జ్వలింపగా, తన వస్త్రమును తానే సురతార్థము వదలి వేయుచున్నదా అన్నట్లుగా ఒక అర్థమును చంద్ర కరస్పర్శచేత ఉజ్జ్వలముగా ప్రకాశించుచున్న నక్షత్రములుగల ఆకాశమును రాగవతియగు సంధ్య తనంతట తానే వదలు చున్నదని మరియొక అర్థమును స్ఫురించునట్లు చేసిన అమోఘమగు వర్ణన.

"చంచచ్చంద్ర కరస్పర్శ హర్షోన్మీలిత తారకా
అహోరాగవతీ సంధ్యా జహాతి స్వయమంబరం"

-వాల్మీకి రామా. కిష్కింధా. 30-46

శ్లేషద్వారా పై శ్లోకమున అమోఘమైన శృంగార వర్ణన చేసినాడు వాల్మీకి. తర్వాతి శ్లోకములో శారదరాత్రి ఒక నారిగా వర్ణింపబడుచున్నది. ఆమె ముఖము చంద్రుడు. తారాగణములు నేత్రములు, జ్యోత్స్న వస్త్రము. అవన్నియు కలిగి శుక్ల వస్త్రధారిణియైన స్త్రీవలె శరద్రాత్రి ప్రకాశించినదట.

"రాత్రిశ్శశాంకోదిత సౌమ్యవక్త్రా
తారాగణోన్మీలిత చారునేత్రా
జ్యోత్స్నాంశుక ప్రావరణా విభాతి
నారీవ శుక్లాంశుక సంవృతాంగీ" వాల్మీకిరామా-కిష్కింధా. 30-47

సుందరకాండమందలి పంచమ సర్గమందలి చంద్రవర్ణన అత్యంత రమణీయమైనది. (రామా. సుందర. 5వ అధ్యాయము)

సుభాషిత రత్నభాండాగారములో నొక శ్లోకమున్నది. అది-

"కరిష్యతి కళానాథః కుతుకీ కరమంబరే
ఇతి నిర్వాపయామాస రవిదీపం నిశాంగనా"

-సుభాషితరత్నభాండాగారము – శ్లో. 55, పుట 494 (కాశీనాథ పాండురంగ పరబ్ నిర్ణయ సాగర ప్రెస్-1886)

కళానాథుడు (చంద్రుడు) సంతోషముతో అంబరమును (ఆకాశమును) గ్రహింపగా నిశాంగన రవియను దీపమును ఆర్పివైచినదట.

ఇది పై దానికన్న రసవత్తరమైనది. ప్రియుడు చేరి అంబరమును ముట్టుకోగానే మానవతియగు స్త్రీ దీపమునార్పును. సురతమునకది పూర్వపు చేష్టకదా! ఇట్టిదే మరియొక వర్ణన —

రాగము వృద్ధిపొందగా, కనుగ్రుడ్లు (తారకలు) చలించుచుండగా చంద్రుడు నిశాముఖమును గ్రహించెను. ఆమెయు అనురాగాతిశయముచే, తిమిరాంశుక మంతయు జారుచున్నను గ్రహింప జాలకుండెను.

రాగము = ఎరుపురంగు, ప్రేమ

తారకలు = కనుగ్రుడ్లు, నక్షత్రములు

తిమిరాంశుకము = నల్లని వస్త్రము, వస్త్రమువంటి చీకట్లు

శ్లేష ప్రయోగము వలన శృంగార భావ నవర్ణ జరుగుచున్నది.

"ఉపోఢరాగేన విలోలతారకం తథాగృహీతం శశినా నిశాముఖం
యథాసమస్తం తిమిరాంశుకం తయాపురోపి రాగాద్గళితం నలక్షితం"
— సుభాషిత రత్న -13 వ శ్లో. పుట. 505 (నిర్ణయ సాగర్ ప్రెస్ - 1886)

సూర్యాస్తమయ చంద్రోదయము లొక్కసారిగా ప్రకృతిలో నెట్టి మార్పులు కలిగించుచున్నవో చూడుడు :

"కోకానాకులయన్ చకోరతరుణీ వైకల్యమున్మూలయన్
అంభోజాని నిమీలయన్ కుముద్వినీ రున్మీలయన్ సర్వతః
పాంథానాకలతాంనయన్ కులవధూ చేతస్సముల్లాసయన్
అస్తరయాతి దివాపతిః సముదయం యాత్యేషదోషాపతిః"
—సుభాషిత రత్న. శ్లో. 111. పుట. 510 (నిర్ణయసాగర్ ప్రెస్ -1886)

సూర్యాస్తమయము కోకములకును, అంబుజములకును, పాంథులకును బాధ కల్గించును. అదే బాధ చంద్రోదయము వల్లను కలుగును. తద్విరుద్ధముగా సూర్యాస్తమయము చకోరములకును, కుముదములకును, కులవధువులకును అందమును కూర్చును. అట్టి ఆనందమునే చంద్రోదయము గూర్చును.

కువలయానందములో అపహ్నవాలంకారమునకు ఉదాహరణగా చంద్రకళంక వర్ణనగల బిల్హణకవి శ్లోకమున్నది.

"అంకం కేపి శశంకిరే, జలనిధేఃపంకం పరే మేనిరే
సారంగం కతి చిచ్చ సంజగదిరే భూచ్ఛాయ మైచ్ఛన్ పరే
ఇందౌ యద్దళితేంద్ర నీలశకల శ్యామా దరీదృశ్యతే
తత్సాంద్రం నిశిపీత మంధతమసం కుక్షిస్థమాచక్ష్మహే
—కువలయానందం -శ్లో. 26, పు.29-చౌకాంబా విద్యాభవన్, బెనారస్ -1956.

"చంద్రునిలోని నలుపును కొందరు మచ్చనుగా శంకించిరి. కొందరు జలధిలోని పంకముగా తలచిరి. (జలనిధి సుతుడు గదా!) సారంగమని మరి యొకరు, భూమి యొక్క నీడయని మరికొందరు. కాని, కోయబడిన ఇంద్రనీల దళమువలె నల్లనై చంద్రుని యందున్న దట్టమైన ఆ గుహను, చీకట్లను భక్షించిన రాత్రియొక్క కుక్షియని భావించుచున్నాము".

సంస్కృత కవులేగాక, ఇతర భాషాకవులందఱును గూడ చంద్ర వర్ణనలు తనివి దీర చేసియే యున్నారు. ఆంధ్రకవులు సంస్కృత కవులకు తీసిపోరు. కొన్ని యెడల అధికులమనిపించుకొన్నారు, ఈ విషయము తర్వాత చర్చించ బడును.

**చంద్రోదయాది వర్ణనలు - కుమార సంభవము**

ఆంధ్రప్రబంధములలో మొదటిదిగా భావింపబడుచున్నదియును, ప్రబంధకారులకు ఆరాధ్యమును అయిన కుమార సంభవమున చంద్రోదయ వర్ణన రమణీయముగ నున్నది. ఎంతో భావుకతను సంతరించుకొన్నది, ఎంతో సహజతను సంతరించుకున్నది. చంద్రోదయ క్రమవికాసము నిట్లు వర్ణించుచున్నాడు నన్నెచోడుడు.

"సంధిల్లు పూర్వదిక్సతి కటిమణి కాంచి
రంజిల్లు నాయక రత్న మొక్కొ
విలసిల్లు నద్దేవి వృత్తస్యనాంతరా
పూరిత కాశ్మీర పుంజమొక్కొ
ననరారు నాహరి త్రిరశాక్షి పరిపక్వ
బింబారుణాధర బింబమొక్కొ
మేలిల్లు నబ్జాల ఫాల తటంబున
విలసిల్లు రోచన తిలకమొక్కొ
మవ్వమొప్పఁ దన సమాగమంబునకు నా
రమణి వలన బర్వు రాగమొక్కొ
యనగఁ దరతరంబ తనరె నత్యరుణాంగ
భాతిఁ గువలయైక బాంధవుండు" -కుమా. 8-108

చంద్రుడు ప్రేమకు చిహ్నము. అనురాగమునకు అధి దేవత. సర్వ మానవుల అనురాగమే చంద్రునియందలి అనురాగమని యీ పద్యమున వర్ణించుచున్నాడు కవి.

"తన రాగంబున ద్రిజగము
నను రాగిల్లెనొ జగంబు నను గముతో
ననురాగిల్లెనొ తావఁటి
యన జగములతోన చంద్రుడనురాగిల్లెన్" -కుమా. 8-109

అనురాగ విషయమున జగములకును చంద్రునికిని గల పారస్పరికమును వర్ణించినాడు. అనురాగ శబ్దమున శ్లేషను ప్రయోగించినాడు.

"శశునుద్వాహమున కమరేంద్ర దిగ్వి
లాసవతి పైడి పాళియఁ బోసి తెచ్చు
పాదములో నాగరాగపూర్ణోదయేందు
బింబమునఁ బాండు కిరణాంకురంబు లెసగె" -కుమా. 8-112

క్రమక్రమ వికాసము నొంది చంద్రవర్ణము రాగవర్ణమునుండి ధవళ వర్ణములోనికి పరిణమించుటను వర్ణించినాడు, ఈశ్వరుని వివాహమునకు పైడి పాళియలోపోసి

తెచ్చు పాదములా అన్నట్లు చంద్రకిరణములు తెలుపెక్కినవని ఉత్ప్రేక్షించుట ఇతి వృత్తముతో చంద్రోదయమును ముడివేయుట.

చీకట్లు క్రిందికి జారుచుండుటను, చంద్రిక దానిని అణగద్రొక్కుచు వ్యాప్తి పొందుటను రమణీయముగ ఉత్ప్రేక్షించుచున్నాడు. ఇందలి పోలిక ఎంతయో సహజ తను సంతరించుకొన్నది.

"మేలుగ నెలకొన్న తమో
జాలముఁ బోఁద్రోలి యెసగెఁ జంద్రాతప మ
క్కాళిందీ పూరంబుల
నోలిన గంగా ప్రవాహ మొత్తిన భంగిన్" -కుమా. 8-115

యమునా జలము నలుపు. గంగాజలము తెలుపు. యమునా జలమును క్రిందు జేసి పై ప్రవహించు గంగా జలమువలె చంద్రికలు ప్రకాశించుచున్నవి. గంగా యము నల సంగమముచూచిన వారికిది సత్యమని తోచును. ఈ ప్రకృతి సత్యము పోనుపోను కవిసమయముగా గూడ నయినది. చంద్రికావర్ణన ఇంకను మనోహరముగ చిత్రితమై నది. వెన్నెలను పాలకడలితో పోల్చుట సంప్రదాయమే.

"తన సుతుడగు శశిమెయి కళ
గని చెచ్చెరఁ గడిగి పుచ్చుగానని దుగ్ధాం
బునిధి నభంబున కెగసెనో
యనఁ జంద్రిక పర్వెసాంద్రమై విపులంబై" -కుమా., 8-118

వెన్నెలను పాలకడలితో పోల్చుట సంప్రదాయమేగాని ప్రేమ, సానుభూతి, బాధ్యతలను క్షీరసముద్రుని యందారోపించి చెప్పిన ఉత్ప్రేక్ష కవియొక్క అతిలోక భావుకతకు ఉదాహరణము.

వెన్నెల బ్రహ్మాండమెల్ల నిండి నిబిడీకృతమైనది. దిక్కులన్నియు పిక్కటిల్లి నవి (కుమా. 8-117) వెన్నెల ప్రసారమును దేవతలనెల్ల భ్రమింపజేసినట్లు చేసిన యీ క్రింది వర్ణన అందమైనది.

"దుగ్ధాంబునిధి నిట్ట దోచెనో యని శేషుఁ
    బాన్పుగా హరి నీటఁ బవ్వళింప
నొదవి సుధారస ముప్పొంగెనో యని
    దేవతల్ దనివోవఁ ద్రావఁదలఁప
దొలకాడు మిన్నేరు వెలివిరిసెనో యని
    శీల సురాంగన లోల లాడ
బాదరసం బుర్విఁ బరగెనో యని సిద్ధ
    నికరంబు కలశముల్ నించికొనగఁ

పాండురాంగుడు విశ్వరూపంబుఁ దాల్చి
యెలసెనో యని సద్భక్తు లెలమి కొలువ
నఖిల జీవుల కానంద మతిశయిల్ల
నచ్చ వెన్నెల విమలమై యలరి కాసె" —కుమా. 8-118

పైన భ్రాంతి మదలంకారము ప్రయోగితమైనది. వెన్నెల ఎంత స్వచ్ఛముగ ఎంత దట్టముగ, ఎంత విమలముగ కాసినదో - ఎంతమందిని భ్రాంతి పొందించినదో వర్ణితమైనది.

వెన్నెల, కామ విజృంభణమునకు, కామినీ కాముకుల విహారమునకును ఉత్ప్రేరకము వంటిది. ఉద్దీపన విభావము పోషించుటకు చంద్రిక గొప్ప సాధనము. వెన్నెలలో కామినీ కాముకుల విహారము అధికము. కుమారసంభవమున నీ ఘట్టము ముప్పదియైదు పద్యములలో వర్ణితము.

## చంద్రాద్యుపాలంభనము - కుమారసంభవము

పార్వతి విరహోత్కంఠిత యయినది. తానున్నది పర్వతమందు. చుట్టుపట్టుల గల దంతయు ప్రకృతియే ; మనసునందున్న కాముడొక వైపు బాధించు చుండగా ఎదురుగా నున్న ప్రకృతి గూడ బాధకముగా తయారయినది. చంద్రునికిని మన్మథునకుగల బల మును చూచి ఆశ్చర్యము పొందుచున్నది.

"కంతుడనంగు డమ్ములనగా విరు, లిందుడు దాసుధాంగుడ
త్యంత హిమంబు చంద్రిక వయంబినుడాలయమూర్తి కల్కమై
నింత బలంబు, కొన్విరులకింత ప్రచండతయున్ సుధాత్మనం
దింత బలంబు శైత్యమున కింత విదాహకరంబు గల్గునే'' కుమా 5-163

పార్వతి ఆ ప్రకృతి శక్తులకు లొంగుచున్నదని చెలులు భావించినట్లున్నది. ఆమెను హెచ్చరించుచున్నారు. ఆమెయందీశ్వరుడున్నాడు గాన భయపడ వలదనుచున్నారు. ఆ బాధకవస్తువులు తనను బాధింపవనుచున్నారు.

"బాల నీవేనతి కాలిరగంబని
మలయానిలంబు నీవలన రాదు
కమలాస్య నీకను గవచకోరములని
వెన్నెల పొరదు నీ యున్న యెడకు
నబలనీ యెలుగు పికారావమని నీకు
జూతమ్ము కొమ్మలు నూప వెఱచు

> జపలాక్షి నీ ముక్కు చంపకమను భీతి
> నళులు నీపొడగని యలయఁబాఱు
> వనిత నీకు ఘ్రాణ వల్లభుండై మది
> నొలసి శివుడు నాయకుండు గనియు
> పేదమరు శరములు నీ దెస రానోడు
> వీనికేల నీవు వెఱచెదమ్మ"

-కుమార. 5-165

అని ఊరార్చినారు. ఇది చాల సొగసైన ఆలంకారిక రచన; సుతిమెత్తని ఉపాలంభన. పార్వతి యీ యుపాలంభన చేయకున్నను, ఆమె చెలులు వ్యంగ్యముగ ఉపాలంభించినట్లయినది. ఇది ఉపాలంభనము కాని ఉపాలంభన, విరహిణుల బాధించువాని నన్నిటిని ఉపాలంభించుట జరిగినది.

ఇంత సొగసుగ ఉపాలంభించుటయందు ఇతరాంధ్ర ప్రబంధకారులలో నితడాది పురుషుడగుచున్నాడు.

## చంద్రోదయాది వర్ణన - మనుచరిత్ర

పెద్దన కవి చంద్రోదయమును గొప్పగ వర్ణించుచున్నాడు.

> "మరున కొసంగఁ గాలము తమశ్చట గాటుకగా నవోదయ
> స్ఫుర దరుణ ప్రభా పటిక శోణిత సిక్త సితోడు భక్తమున్
> హరి హయ దిఙ్నభస్థమునవి బలిచల్లి వటాంకమున్ వసూ
> త్కర భరితంబునై వెలుగఁగాంచి సుధానిధి నెత్తె నత్తఱిన్"

-మను.3-21

నిధులను కని పెట్టుటకు అంజనము వేయుట జరుగును. కన్నులకు కాటుక పెట్టుకొని నిధులను వెదుకవలెను. ఆ నిధుల రక్షణలో నున్న పిశాచములకు బలిఇచ్చి అనగా నెత్తుటికూటిని తూర్పుగ చల్లి నిధిని త్రవ్వి యెత్తుదురు. అటులనే కాలపురుషుడు చీకటి అను కాటుకను పెట్టుకొని, చూచి, చంద్రోదయమున తూర్పున కనుపించు రక్తిమ అను రక్తమును కలిపి నక్షత్రములు అను అన్నమును తూర్పు దిక్కున బలిగా చల్లి, మఱ్ఱి చెట్టు గుర్తుగా గల చంద్రుడు అను నిధిని మన్మథుని కిచ్చుటకు త్రవ్వి యెత్తెనని వర్ణింపబడినది.

విరహి జనమునకు మన్మథ బాధయే దుస్సహము. ఆ బాధకు చంద్రోదయమును చంద్రికావిలసనమును మరింత సహకారులు.

వరూధిని ముందే విరహము ననుభవించుచున్నది. ఆ భావమును మరింత తీవ్రము చేయుటకు చంద్రోదయమును ప్రవేశపెట్టుచున్నాడు కవి. భావము లింకను చంచల

ములై విచక్షణ కోల్పోవ జేయుటకే యీ చంద్రోదయ పరివేశము. తరువాత వరూధిని విచక్షణ పోగొట్టుకొని, తొందరపాటుతో, మాయా ప్రవరుని కలియబోవుచున్నది. అందులకే యీ వాతావరణ సృష్టి.

**చంద్రికా విలసన వలని ఫలితముల వర్ణించుచున్నాడు:**

"పరిదిలె కైరవదళ శ్రేణి నొక్కులు దీరె
    శశికాంత పంక్తుల జలము లూరె
కోరికాంతులతోఁ జకోరికల్ రతిఁగేరె
    వారాశి గర్వంబు మేరమీఱెఁ
దోరపడి యిర్తులు పటాపంచలై పాఱె
    దిఙ్ముఖంబుల వింత తెలివి సేరె
జక్రవాకంబు లబ్జకుడుంగముల దూఱె
    గామినీకాంతుల కలఁకఁ దేఱె
మదను డమ్ముల నూఱె హిమంబు పేరె
జడిసి విరహిణి సగ గూరె జారచోర
దర్పములుఁ జాఱె రవి కర తాపమాఱెఁ
జూడఁజూడంగఁ దారక స్ఫురణ దాఱె" -మను. 3-23

వెన్నెల రాత్రులందేయే వర్ణనలు చేయవలెనను సంప్రదాయమున్నదో-ఆ సంప్రదాయ వర్ణన లన్నియు పైపద్యమందు గలవు.

హిమాంశుడు ప్రకాశించు తఱి హిమబిందువులు రాలుననుట ప్రసిద్ధము.

"కలయ జగమున గలయట్టి నలుపులెల్లఁ
దెలుపులుగ జేసి నీడలు దెలుపు సేయ
గా వశము గామిఁ బొడము దుఃఖమున బోలె
సాంద్ర చంద్రిక తుహిన బాష్పములు గురిసె" -మను. 3-27

జగత్తున గల నలుపుల సన్నిటిని తెలుపు చేసి, మ్రాకులక్రింద నీడలను తెలుపు చేయంజాలక పోయితిమి గదా అని చంద్రికలు దుఃఖపడెనా అన్నట్లు మంచు బిందువులు రాలినవని ఉత్ప్రేక్షింపబడినది.

చంద్రికా ప్రకాశము తరువాతి వచనములో అతివేల మనోహరముగ, అతివిస్తారముగ సర్వాంగ సుందరముగ వర్ణింపబడినది. (మను. 3-28)

కౌముది ఆ రాత్రి యంతయు వీర విహారము గావించిన యనంతరముచంద్రాస్తమయమును వర్ణించుచున్నాడు. ప్రబంధకవులందఱును దీనిని పాటించిరి.

> "ఉరు సంధ్యాతప శోణ మృత్కలితమై యొప్పారు బ్రహ్మాండ మ
> న్గరిడిన్ గాలపు హొంతకాడు చరమాగ స్కంధమున్ జేర్చి ని
> బ్బరపున్ సంగడమో యనన్ శశిడిగెం బ్రాగ్భూమి భృత్ కైరవే
> తర బాహాగ్రపు సంగడంబనగ మార్తాండుండు దోచెన్ దివిన్" —మను. 3-59

బ్రహ్మాండము ఒక సాముగరిడి సాల. గరిడి సాలలో ఇసుక గాని, మట్టిగాని యుండ వలెను. అది ఇపుడు ఎరుపు రంగుతో నున్నది. అదియేది? సంధ్యారాగమే; కాలము అను జెట్టికి ఉదయాద్రి ఒక మూపును, అస్తాద్రి మరియొక మూపును అయి యున్నవి. సంకోల్తా అనగా గరిడి సాధనము. దానికి రెండు వైపులను రెండు పెద్ద గుండ్లుండును, క్రుంకుచున్న చంద్రుడును, ఉదయించుచున్న సూర్యుడును ఈ సంకోల్తాకు ఇరువైపుల నున్న గుండ్లవలె వర్ణితము. పూర్ణిమనాడే ఈ దృశ్యమునకు అనుకూలము. అదియును, విష్ణువత్తు (సమయము) ననే వీలగును, ఇట్టి వర్ణనను దాదాపందఱు ప్రబంధకారులు కావించి యున్నారు.

పై వర్ణన అద్భుతముగనున్నది. గొప్పభావుకతను సంతరించుకొన్నది.

శశాంక మనోజ్ఞమూర్తి ప్రవరుడు వరూధినిని త్రోసిరాజని వెళ్లిపోయినాడు. రాత్రంతయు శశాంకుడు వేధించినాడు. పగటిని కాంక్షించుచున్నది వరూధిని, అది కేవలము శశాంకుని బాధపుండితప్పు కొనుటకే; కాని పగలు మాత్రము ఆమెకు ఆశా వహము అగునని నమ్మకమేమి? ఆమెకిపుడు రాత్రియును పగలును ఒకటే; రాత్రికంటె, పగలు కొంత ఊఱటను కల్గించును. క్రుంకుచున్న చంద్రుని చూచినపుడు వరూధిని ఒక్క నిట్టూర్పు వదలుటకు వీలున్నది. ఉదయించుచున్న సూర్యుని చూచినపుడు ఊఱట కలుగుటకు వీలున్నది. ఒకేసారి యీ రెండు భావములును వరూధినిలో కలుగు టకు వీలున్నట్లుగా పెద్దన ఊహించి పై వర్ణన చేయుచున్నాడు.

సూర్యాస్తమయ చంద్రోదయ వర్ణన అందముగ నున్నది.

> "సాంధ్య నటన చండ చండీశ పదహతి
> ధరణి చక్ర మొరగి శరధిఁ గ్రుంగ
> దొరగల్లు వడియె భూరథేతర భాగ
> చక్రమనగ నపుడు శశియుఁదోచె" మను-5-35

ఈశ్వరుడు తాండవ నృత్యము చేయుచున్నాడు. భూమి రథము, సూర్యచంద్రులు రథచక్రాలు. ఒకవైపు భారమెక్కువై సూర్యుడను చక్రము సముద్రములో దించుకొని పోగా రెండవ వైపు చక్రమగు చంద్రుడు పైకి లేచినట్లు చంద్రోదయమాయెను.

ఇందీవరాక్షు మర్దనానంతరము స్వరోచి ప్రతాపమును తీక్ష్ణతయును ఉపసంహ రింపబడినవి. శాంతచిత్తుడయినాడు. ప్రతాపమునకు సూర్యుడు ప్రతీకము. ప్రశాంతతకు

చంద్రుడు ప్రతీకము. అందులకే తర్వాత ఈ క్రింది విధముగ చంద్రుని వెన్నెలను వర్ణించుచున్నాడు కవి.

"కలయ వెల్లువ గట్టి జలజల ప్రవహించు
    శశికాంత వాంత నిర్ఝరము జలము
మలయానిలము చే దుమారమ్ము రేగు సౌ
    గంధికంబు రజంబు కఱకు దుమ్ము
నిండార విరిసిన బొండు మల్లెలనుండి
    వడియు మరందంబు గుడరసంబు
తొలకి మింటికిం బొంగు దుగ్ధ పాథోరాశి
    కరడుల మీది మీగడల మెఱుగు

తనకు రసవర్గములుగా సుధారసంబు
సారె సారెకుం గరములు సాచి సాచి
యచ్చ తెలుపుగ నపుడు బ్రహ్మాండ మండ
పంబు వెన్నెల సన్న సున్నంబు సేసె" -మను. 5-38

బ్రహ్మాండమైన వర్ణన. బంగారమును గైకొని మనోహరమగు సొమ్ములను చేయు గొప్ప అగసాలి పెద్దన.

ప్రశాంతవాతావరణములో వెన్నెల అంత సొగసుగనున్నది. ఆ వాతావరణములో స్వరోచియును, తనకు మామ గాబోవు ఇందీవరాక్షుడును -

"శశికాంత శిలామండపమున దట్టంబుగా పఱచిన చిగురు పరపుల గంధర్వరాజునుం దానును సుఖాసీనులై యిష్టకథాగోష్ఠి నారాత్రి గడపె నంత" -మను. 5-39.

పెద్దన చంద్రోదయాది వర్ణనలు చాల అందముగ నున్నవి.

## ఉపాలంభన

రచనలలో కెల్ల అతి చమత్కారమును, వ్యంగ్య వైభవమును, భావుకతాతిశయమును - రమ్యత్వమును, సుకుమారత్వమును, తర్కమును, మధురత్వమును, సంతరించుకొన్న రచన ఉపాలంభనము. ప్రబంధములలో ఇది ఎక్కువ చోటుచేసికొన్నది చంద్రోపాలంభనము, మన్మథోపాలంభనము, మలయమారుతోపాలంభనము- ఇవి ముఖ్యములు. ఈ ఉపాలంభన సాహిత్యములో ఎంతో వేడి యున్నది. వాడి యున్నది. దూకుడున్నది. ఎత్తి పొడుపున్నది. వ్యాజస్తుతి యున్నది. వ్యాజనింద యున్నది.

ఆంధ్ర ప్రబంధాలలో ఉపాలంభన అతివేల మనోహరము. కేవలము ప్రకృతి సంబంధమైన వర్ణన. ముఖ్యముగా అంతఃప్రకృతికి సంబంధించిన వర్ణన. ఇది ఒక అందమైన సాహితీ ప్రక్రియ.

ఉపాలంభన సాహిత్యము చంద్రోదయ సంబంధమైన ప్రకృతివర్ణనలోని భాగము. కళాపూర్ణోదయము, ప్రభావతీప్రద్యుమ్నము, మనుచరిత్ర, వసుచరిత్ర, విజయ విలాసము, ఆముక్తమాల్యద, పారిజాతాపహరణము, కుమారసంభవములలో - కళాపూర్ణోదయ, ప్రభావతీప్రద్యుమ్న, మనుచరిత్ర, వసుచరిత్ర, విజయవిలాసముల యందే యీ ఉపాలంభన వర్ణన లున్నవి. ఇందొకరిని మించి మరొకరు వర్ణించి యున్నారు.

మనుచరిత్రమున చంద్రోపాలంభనము రసోదంచితముగ నున్నది. దాని ననుసరించి మన్మథోపాలంభనమును, మలయమారుతోపాలంభనమును కావింపబడినవి.

ఇపుడు వరూధినికి ఇంత బాధకల్గించుచున్నవాడెవడు ? చంద్రుడు. విరహిణీ జనములను, అందు ముఖ్యముగా స్త్రీలను - ప్రాణాంతకముగ బాధించు వారిలో చంద్రుడు అగ్రగణ్యుడు. అందులకే విరహిణులయిన నాయికలు చంద్రుని పైబడి ఉపాలంభన గావింతురు.

ఈ సాహితీ ప్రక్రియ అయిన ఉపాలంభన సాహిత్యములోని సొగసు మరే భాగమున నుండదేమో అన్నచో అతిశయోక్తి గాదు.

మనుచరిత్రలోని చంద్రోపాలంభన ప్రత్యేకతను సంతరించుకొన్నది. చంద్రుడు దేవ సంబంధి. ప్రకృతి సంబంధి గూడ.

చంద్రుడువిరహిణులను బాధపెట్టును. అందుకే వారి మనస్సులలో తిరస్కార ధిక్కార భావములు గలుగును.

వరూధిని వెన్నెలలో వేగిపోయినది. తాళలేక పోయినది, ప్రాణాంతకముగ భావించినది. చంద్రునిపై మండిపడి ఉపాలంభింప సాగినది.

"ఓ యీ హంతా! నీవు యమధర్మరాజుతో సమానుడవు. కాదు కాదు. యముడే నీకంటె మేలు! ఏలనగా నీవు కేవలము రాజనాముడవు. అతడు ధర్మరాజు. ధర్మమతని యందు అధికముగ కన్పట్టుచున్నది. యముడు ప్రాణ బాధకుడని దుష్కీర్తి పొందియుండగా నీవు అంతకంటె బాధాకరుడవు"- అని నిందించుచున్నది.

"తొలుదొల్తఁ గమలమిత్రుని వంక రూపొట
దక్షాధ్వర ధ్వంసి తన్నుఁగనుట
బరివేషమిషమునఁ బాశంబుఁ దాల్చుటఁ
గప్పుదేహమునందుఁ గానబడుటఁ

గాలవళంబుసగాని తోపక యుంట
సతత నిష్ఠుర గదా న్వితత గనుట
బూని పాండు క్షేత్రమునఁ బ్రవర్తించుటఁ
బ్రకటానురాగ తారకుడగుటను

నంతరంబెద్ది యాత్మలో నరసి చూడ
రాజనీకను నలధర్మరాజు నకును
బ్రాణిలోకంబు బాధలఁ బఱచునపుడు
ధర్మపద మొక్కడెక్కుడా ధన్యునందు" -మను. 5-37

అని కసిగా తిట్టినది. పగవానిని తిట్టినట్లుగాదిది. ఈ తిట్లలో సొగసున్నది. తీపి యున్నది. వరూధినికి ఇంకను కసి యెక్కువైనట్లయి నీవేల చావలేదురా అనుచున్నది.

"త్రిపుర సంహార మొనరించునపుడు హరుడు
బండికల్లుగ నీ మేను గండి సేసె
నదియు సెలవాఱి తెగటాఱవైతి చంద్ర
యకట: రోహిణి యెడ నపథ్యమున జేసి" -మను. 3-40

వ్యక్తుల యెడ కోపము వచ్చినపుడు అతడు పుట్టిన వంశముతోపాటు, కులమును తడువుట గలదు. ఒక్కొక్కపుడు మంచి వంశాన జన్మించినను మంచి గుణములు రాక సోవచ్చును.

"పాలబుట్టిన మాత్రాన మేలిగుణము
నేడు నీకేల గల్గునో నీరజారి
నీటఁ బుట్టిన వాడు గాడోటు వహ్ని
గాల్చుచున్నాడు జగమెల్లఁగరుణ లేక" -మను. 3-41

చల్లని నీటబుట్టిన అగ్ని సాదృశ్యమును దెచ్చి పాలబుట్టిన చంద్రుని తిట్టుచున్నది వరూధిని.

చంద్రుని జాతిని ఆక్షేపించి తరువాత అతనిని కొల్చు జాతిని నిందించుచున్నది.

"గోవధము చేయు తురకల
దైవంబవు నీవు మొదలఁ దక్కక పాంథ
స్త్రీ వధము సేయ రోయుదె
నీ వర్తనమేమి సెప్ప నీరజవైరీ" -మను. 3-42

మహమ్మదీయులు గోవధను చేయువారు. గోవిషయమున హిందూ మహమ్మదీయులు పరస్పర వ్యతిరేకులు. హిందూ స్త్రీగా ఆమె తురకలదైవమును కరుణాహీనుడుగా నిందించుచున్నది.

ఇట్టి మతదూషణ విజయవిలాసమందుగూడ ఇట్టి సందర్భముననే జరుగుచున్నది. చేమకూరకవి పెద్దన నీ విషయమున ననుసరించెననుటకంటె తన కాలమున గూడ పెద్దన కాలములో వలె హిందూ మహమ్మదీయ కక్ష్యలున్నవనియు, పరస్పరము ఈసడించు కొనువారనియు భావించుట సమంజసము కాగలదు.

రాయలకాలమున మహమ్మదీయులకు హిందువులకు పరస్పరము యుద్ధములు గూడ జరుగుచున్నవి. అవకాశమును పురస్కరించుకొని సహేతుకము, అన్యాప దేశముగ జాతినింద చేసినాడు.

పెద్దన హర్షనైషధము ననుసరించి చంద్రోపాలంభన చేసినాడు. కాని అను వాదము కాదు, వర్ణన యంతయు స్వతంత్రమే.

## మన్మథోపాలంభన

చంద్ర సంబంధి గదా మన్మథుడు. అసలు మన్మథుడే మొదటివాడు. మన్మథ భావము మొదట కలగనిదే చంద్రాదుల వలన ఉద్దీపనమే లేదు. చంద్రుడు బాహ్య ప్రకృతిలోని వాడు. మన్మథుడు ఆంతర ప్రకృతికి సంబంధించినవాడు. కావున మన్మ థోపాలంభన గూడ ప్రకృతి వర్ణనే అగుచున్నది. అందులకే వరూధిని ద్వారా పెద్దన మన్మథుని ఉపాలంభింప జేయుచున్నాడు.

> "సాహంకారత శంకరుండలిగి నేత్రాగ్నిన్ బయిఁబంపినన్
> స్వాహాకాముకుడౌట నిన్నతడు గావం బోలు మోమోడి సం
> దేహంబే నిరతీశ నీవు మగుడన్ దేహంబుతో నుండు టె
> ట్లాహా! దైవము దోసకారులకె తోడై వచ్చు నెప్పట్టునన్" -మను. 3-47

అగ్ని భార్య స్వాహాదేవి. తానుగూడ ఒక ప్రేమంపు స్త్రీకి భర్తే గనుక రతీ నాథుని కాల్చకుండ సానుభూతితో రక్షించినాడు అగ్ని. దైవము గూడ దోసకారులకే తోడవుచున్నది గదా అని వాపోవుచున్నది వరూధిని.

మన్మథోపాలంభనగూడ నైషధముననుసరించి వర్ణింపబడినదే. అక్కడక్కడ నొక పదమును, కొలదిగ భావమును, తీసికొనెనేగాని వర్ణనమంతయు పెద్దన సొంతమే.

ఇట్లే మరికొంత తిట్టిన యనంతరము మలయమారుతోపాలంభన గావించుచున్నది. మన్మథుని నిందించిన యనంతరము -

"అనుచు నిందించి వలవంత యినుమడింప
నవ్వరారోహ విదళిత హల్లకముల
కమ్మ పుప్పొడిపై దుమారమ్ము రేచు
మలయ మంథర పవనుపై నలుక వొడమి'' -మను. 3-49

"నాలుకలు రెండు నిన్నున్
గ్రోలనె కల్పించె నలువ ఘోరాహికి న
న్నాలి గ్రహమిపుడు దిగఁ దిన
జాలద మృదుపవన విరహిజన దురితమునన్'' -మను. 3-51

బ్రహ్మాండమగు పదశక్తి! "విదళిత హల్లకముల కమ్మ పుప్పొడిపై" అనుటలో చంద్రునికి తోడు నీడైన వాడను అర్థము స్ఫురించుచున్నది. అందులకే చంద్రునితో పాటు మలయమారుతోపాలంభన గావించుచున్నది వరూథిని. సర్పమునకు రెండు నాల్కలు జన్మవలన సిద్ధించుట సామాన్యము. ఆ సామాన్యమును విశేషముగ, తార్కికముగ సమర్థించుటయే సార్థక పదప్రయోగము.

విరహి జనులకు రాత్రి యెంతకును వేగదు గదా! అందులకే వారికి బాధావహమగు చంద్ర మన్మథ మలయమారుతములపై దండయాత్ర చేయుచుందురు. మలయమారుతోపాలంభన ఇందులో ఆఖరిది. మలయమారుతము తెల్లవారుఝామున వీచును. తెల్లవారుటకు ముందుగా ఈ వర్ణన (ఉపాలంభన రూపమున), కావింపబడుట విశేషము. ఏకావ్యమందయినను మలయమారుతోపాలంభన ఆఖరిది అగుటకు కారణమిదియే!

మలయమారుతోపాలంభన కేవలము పెద్దన సొంతము. ఇది నైషధమందు లేదు. ఆంధ్రనైషధమందును లేదు. కాదంబరియందు కేవలము పదము (ఏకత్ర ఖలు మదన మధుమాస మలయమారుత ప్రభృతయః సమస్తాః ఏకత్ర చాయం పాపకారీ చంద్రహతకః నశక్యతే సోఢుం) మాత్రమే కనిపించుచున్నది.

## చంద్రోదయాది వర్ణన-పారిజాతాపహరణము

చంద్రోదయాది వర్ణనను సుందరముగను, మనోహరముగను వర్ణించిన కవులలో నంది తిమ్మన మేటి అనవచ్చును.

సత్యాదేవి కోపఘట్టమెంత మనోజ్ఞముగ నుండునో, చంద్రోదయాది వర్ణన గూడ అంత మనోజ్ఞముగ నుండును. పారిజాతాపహరణమున ముఖ్యస్థానము వహించి

యున్నట్టి ఈ రెండు ఘట్టములే మనోహరములన్నచో నతిశయోక్తి గాదు. చంద్రోదయ. వర్ణనమును - శీత మయూఖుని కిరణ వర్ణనమును - అన్ని ఉత్ప్రేక్షలను మించిన వర్ణన

"కెరలి చీకటి ఖ్రానుగెడపంగ నిక్కిన
సమయగజంబు దంతంబులనగఁ
జదలు గేసగి తూర్పు తుదకొమ్మ నరవిరి
యై కానుపించు పూరేకులనగఁ
బొడుపు గుబ్బలి నేల పురిటింటి యిడుపున
జఱచిన గందంపుఁ జట్టలనగ
మరుని ముందర బరాబరి చేయు కంచుకి
కులముచేతుల వెండి గుదెలనంగఁ
గైరవములకు వెన్నెల నీరు వఱపఁ
బూని చేర్చిన పటికంపు దోనులనగ
గ్రమముతో శీతకరమయూఖములు గగన
భాగమున గొన్నియల్లనఁ బ్రాకు దెంచె" -మను. 2-39

చంద్రోదయ సమయమున, చంద్రుడు కనిపించక పూర్వము చంద్ర కిరణములు పట్టెలుపట్టెలుగా గంధపు రంగుతో నెట్లాకాశము పైకి ప్రసరించునో దృశ్యమును క్రమ వికాస రూపమున వర్ణించినాడు. ఆ విధముగ పైకి వచ్చు కిరణముల రంగు యొక్కయు, ఆకారము యొక్కయు, పరిమాణము యొక్కయు క్రమ వికాసమును మనోజ్ఞముగ వర్ణించినాడు. క్రమక్రమముగ వర్ణము పరిణతి పొందుటయుస్థౌల్యమును పొందుటయు వర్ణించినాడు.

చంద్రబింబము క్రమక్రమముగ పైకి వచ్చుటను గొప్పగ వర్ణించుచున్నాడు. ఇది భావుకత్వముతో బాటు సునిశిత ప్రకృతి పరిశీలనమును సంతరించుకొన్నది.

"అమరు లమృతాంబునిధిలోని యమృత రసము
వెండిచేరుల ( బటికంపు కుండగట్టి
చేదుకొనియెదరో నాగ శీత రోచి
మెఱుగు మెయితోన యల్లన మిన్ను ప్రాకె" పారి. 2-40

దేవతలు పైనున్నారు. క్రింద అమృత సముద్రమున్నది. ఆ అమృత రసమును పైకి తోడుకొనవలెను గదా! పటికముతో చేసిన తెల్లని కుండను సముద్రములోనికి వదలుచున్నారు. అమృతముతో తడిసిన ఆ భాండము నిండగనే పైకి చేదుకొనుచున్నారు. అమృతముతో తడిసిన ఆ తెల్లని కుండ చల్లగాను, తెల్లగాను మెఱిసిపోవుచు కొంచెము కొంచెమే పైకి పోవుచున్నది.

గొప్ప భావుకత! సుందరమైన సార్థక వర్ణన.

చంద్రోదయ సమయమున సంప్రదాయానుసారముగనే చేసి వర్ణింపవలసి యున్నవో అవన్నియు వర్ణితములు. ఒకవైపున సూర్యాస్తమయమును, మరొక వైపు చంద్రోదయమును అతివేల రమణీయముగ వర్ణించుచున్నాడు కవి (పారి. 2-41).

సూర్యుడు అను అరటి దుంపను పశ్చిమమున నాటగా అది మొలకగా అయి ఆకులు సాగి పెద్దదై గెలవదిలి తూర్పువైపునకు వ్రాలగా, ఆ పండిన గెల ఎట్లుగా చంద్ర రూపమున కన్పట్టుచున్నదని వర్ణింపబడినది. సుగంధములను అరటిజాతి దుంప ఎట్లుగా నుండును. అంకురము ఎట్లుగా నుండును. మొక్క ఎట్లుగా నుండును. ఆకు కాడలు గూడ ఎట్లుగా నుండును. పండ్లుగూడ ఎట్లుగా నుండును.

సూర్యుని వల్లనే చంద్రునికి ప్రకాశమున్నదని లోక ప్రసిద్ధి. శాస్త్రసత్యము గూడ. వర్ణన ఎంతో సార్థకతను ప్రసాదించుకొన్నది. రమ్యత్వమును సంతరించు కొన్నది.

> "పొందుగఁ బశ్చిమాబ్ధితట భూస్థలి నంశుమండలు మత్ఫలా
> కందము వాసరాంతహాలిక ప్రవరుండిడ సాంధ్య వారి భృ
> త్కందళము ల్తమోదళ యుతంబులునై గెలపండి వ్రాలె బూ
> ర్ణేందుని పేరఁ బ్రాచి నది హేతువు వెన్నెల కల్మి కల్మికిన్" -పారి. 2-42

సూర్యాస్తమయ చంద్రోదయము లొకేసారి జరిగిన వనుటకు మరొక ఉత్ప్రేక్ష.

> "సమయ విలాసి శోణమణి సంగత మౌక్తిక చారుహారముం
> గ్రమమునఁ గూర్చుచో నరుణరత్నము దామును సాంధ్య రశ్మి సూ
> త్రమున బొసంగ గ్రుచ్చి యెడతప్పుగఁ ద్రోచి పిఱుంద జేర్చు ము
> త్తెము క్రియదోచె నయ్యమృత దీధితి లాంఛన రంధ్ర సంగతిన్" -పారి. 2-43

చంద్రికలు మనోహరముగ గాయుచుండగా, చకోరములు వెన్నెలను భక్షించుట వర్ణించుచున్నాడు. బంధువు లందఱును బువ్వపు బంతిలో ఆనందముగ ఎట్లు భక్షింతురో చకోరములు వెన్నెలను పిండివంటకములుగ జేసికొని అట్లు భక్షించుచున్నవి.

> "విరహులమై సోకి వేడి యౌ వెన్నెలఁ
> బచ్చి వెన్నెల నులివెచ్చఁ జేసి
> కలువ పుప్పొళ్లచేఁ గసరైన వెన్నెల
> వలిపి వెన్నెలలోన వడిచి తేర్చి
> చంద్రకాంతపు నీట జాలైన వెన్నెలఁ
> ముదుగు వెన్నెలఁ జుట్టపదును చేసి
> సతులమైపూతఁ బిసాళించు వెన్నెల
> దనుపు వెన్నెల రసాయనము గూర్చి

చిగురు విలుకాని జాతర సేయబూని
కొలము సాములనందఱఁ గూడ బెట్టి
వంతుగలయంగ బువ్వంపు బంతి విందు
పెట్టిరెలమిఁ జకోరపుఁ బేరటాండ్రు" -పారి. 2-49

ఎన్నెన్ని విధములుగానో వెన్నెలలు మలినమగుచున్నవి. చకోరములకు ఆస్వాద్యములు కాకుండ పోవుచున్నవి. కాని నేర్పుగా వానిని ఆస్వాద్యములుగా చేసికొని, విందు తయారు చేయుచున్నవి చకోరములు. కొలము సాములు మెచ్చుకొనునట్లు రుచిగా, సువాసనాయుక్తముగా, స్వచ్ఛముగా, పదునుగా తయారు చేసికొనుచున్నవి

కేవలము కవిసమయమయిన దీనిని సహజ ప్రకృతివర్ణనగా చేసిన ఈ వర్ణన అద్భుతము. చంద్రవర్ణనలో ఇతడు ఎంతో భావుకతను ప్రదర్శించినాడు. ఇట్టి ధోరణిలో ఇతడు అగ్రగణ్యముగా వర్ణించినాడు. ఇంతగొప్పగా చంద్రోదయాది వర్ణన చేసినవారు చాల అరుదు. ఈ ఒక్క పద్యము నభూతో నభవిష్యతి అనవచ్చును. కాని, ఇటువంటి ఛాయలు కొంత వఱకు గల పద్యము శ్రీనాథుని శృంగార నైషధ మందున్నది (నైషధ. 8-198) దానికి మూలమైన సంస్కృత నైషధమందు—

"ఉపనత ముడు పుష్పజాత మాస్తే
భవతు జనః పరిచారక స్తవాయమ్
తిలతిలకిత పర్వటాభ మిన్దుం
వితర నివేద్యముపాస్వ పంచబాణం" (హర్షనైషధ. 22-149) అని గలదు.

(నక్షత్రములను పుష్పజాతము దగ్గరగా (సిద్ధముగా) నున్నది. మేము నీకు పరిచారకులముగా నున్నాము. నువ్వుపిండి ముద్దవలె నున్న (నలుపు గలిగి యున్న) చంద్రుని నివేదనము చేసి పంచబాణుని సేవింపుము).

దీని అర్థమునకు మెఱుగు పెట్టుచు 15 వ శతాబ్దపు కవి నయనచంద్రసూరి రచించిన ప్రాకృత నాటకమగు 'రంభా మంజరీ' యందు ఒత ప్రాకృత శ్లోకమును రచించెను. అది :-

''నఖ్కత్త యఖ్కయ సణాహతలే విసాలే
థాలే హరిమ్మణిమ ఏణిసి దేవియా ఏ
అంకచ్ఛలేణ తిల తెల్లగుడం సముత్తో
చందో విభాది గమణి బలి దుడ్డి యవ్వ"

పై దానికి సంస్కృత ఛాయ

''నక్షత్ర కాక్షత సనాథ తలే విశాలే
స్థాలే హరిన్మణిమయే నిశాదేవ్యాః

అంకచ్ఛలేన తిలతైల గుడాంశ యుక్త
శ్చన్ద్రో విభాతి గగనే బలి దుగ్ధ కేవ"

అనగా :-

"నక్షత్రములనియెడి అక్షతలతో కూడుకొన్న తలము గలదియు, విశాలము అయినదియును, అయిన ఆకస పళ్లెరమందు అంకమనెడి నూవుల నూనెతోడి బెల్లపు భాగముతో కూడుకొన్నవాడై చంద్రుడు రాత్రి దేవతకు ఉపాహార పాయసము వలె ప్రకాశించుచున్నాడు."

శ్రీనాధుని పద్యము దీనికి మెఱుగు పెట్టినట్లున్నది.[1] చాల సమంజసముగ నున్నది. ఈ భావమున ఉద్దీప్తుడై ముక్కు తిమ్మన "విరహులమైసోకి" అను అతివేల మనోహర పద్యమును వ్రాసినాడు. ఇంత లలిత మనోహర భావపూర్ణ పద్యమును - ఇంత రస నిష్యందియగు పద్యమును - ఇంత ఆహ్లాదమును సంతరించుకొన్న పద్యమును - మరొక కవి వ్రాయలేదన్నచో నతిశయోక్తిగాదు. ముక్కుతిమ్మనార్యుని యీ పద్యములోని పలుకులు ముద్దుగనే గాదు ముచ్చటగ గూడ నున్నవి.

చంద్రోదయాది వర్ణన రచించిన ప్రబంధకవులలో పెద్దనకంటె నన్నెచోడుడును, అంతకంటె భట్టుమూర్తియును గొప్పగ రచించినారు. ముక్కు తిమ్మన వారందఱికంటె నందముగ వర్ణించినాడన్న అతిశయోక్తిగాదు. చంద్రవర్ణన ఘట్టమున నేయే వర్ణనల చేయవలయునను సంప్రదాయము గలదో ఆయా వర్ణనల నందఱును గావించినారు. ఒకరిని మించి మరియొకరు భావనా పూర్ణవర్ణనల గావించినారు.

ఈ కావ్యమున చంద్రాద్యుపాలంభనకు తావులేదు.

## చంద్రోదయాది వర్ణన - ఆముక్తమాల్యద

నారికేళపాకమునకును - సంస్కృత శైలికిని - కేవల ప్రకృతి వర్ణనలకును - అతి ప్రౌఢతకును - పేరెన్నికగన్న ఆముక్తమాల్యదయందు చంద్రోదయాది వర్ణనలు

1. "ఉడువీధీ హరినీల రత్నమయ పాత్రోత్సంగ భాగంబునం
గడు గారామొనరన్ ఝషాంకునకు నంకచ్ఛాయయన్ కమ్మనూ
విడితో గూడ సుధాంశుబింబమను సర్పిః పాయసాహారముం
గుడువంబెట్టెనొ బంతికూళ్ళకును జాగోరంబు లేపారగన్''

—శృంగార నైషధ, 8—198.

అంతగా కనుపించుటలేదు. ఇతర ఆంధ్ర ప్రబంధములకును, ఆముక్తమాల్యదకును వస్తుభేద మున్నది. అవి శృంగార ప్రధాన ప్రబంధములు. ఇది భక్తి ప్రధాన ప్రబంధము. పై ప్రబంధములలో చంద్రోదయాది వర్ణనల యనంతరము చంద్రోపాలంభనాదులు కని పించును. ఈ ప్రబంధమున చంద్రోపాలంభనాదులకు తావులేదు. పై ప్రబంధములలోనిది లౌకిక శృంగారము. ఈ ప్రబంధ నాయికయగు గోదాదేవిది అతిలోక శృంగారము.

అట్టి శృంగార రసోపేతమగు వర్ణన చేయుటకు ఆముక్తమాల్యదలో వీలులేదు. అందువలననే శృంగార భావోన్మాదమునకు పూర్వరంగమయిన చంద్రోదయాది వర్ణనకు రాయలు అతిప్రాధాన్యమీయలేదు. అట్లని వర్ణన చేయకను పోలేదు.

అవసరమయినంత వఱకు వెన్నెల వర్ణన గలదు. అదియును గొప్పగా వర్ణితము. వసంతర్తువునందు వెన్నెలను వర్ణించుచున్నాడు.

> ''ఉరుశక్తిన్ మధుమాస దోగ్ధ పిసుకన్ జ్యోత్స్న గవీచంద్రమస్
> స్ఫురదూధః ప్రవిముక్తమైన నిబిడ జ్యోత్స్నాపయః పూరమున్
> విరియంజాఁగిన గొజ్జగల్ గురియ మున్నిరైన యక్కమ్మ నీ
> రురహింగూడిన నేర్పరించు గములై రోలంబ కాదంబముల్'' -ఆము. 5-120

వసంతర్తువు అను పాలు పితుకువాడు పిండగా-వెన్నెల రాత్రి యనెడి గోవు యొక్క చందమామ అను పొదుగు నుండి కురిసిన జ్యోత్స్న వలెనున్న పాలసముద్రము నందు, గొజ్జెగ నీరు కురిసి కలియగ-కమ్మనైన ఆ పాలసముద్రపు నీటిపై తుమ్మెద లనియెడి కలహంసలు చేరి నీటిని వేరుచేయుచున్నట్లున్నది.

వర్ణన మనోహరము-సహజము.

## చంద్రోదయాది వర్ణన-కళాపూర్ణోదయము

కళాపూర్ణుడు యుద్ధమునకు బయలుదేరు సమయ మందలి వర్ణన యిది.

> ''అంతనమరాధినాథు గృహాంగణమున
> జాల గంధపుఁ గలయంపిఁ జల్లిరనగ
> తూర్పు తెలుపయ్యెనంత నందును దదీయ
> గజము నిల్పిరో యన సుధాకరుడు దోచె'' -కళా. 8-14

వెన్నెల, గంధపు కలయంపిగను, చంద్రుడందు నిలువంబెట్ట బడిన ఐరావతముగను వర్ణితములు.

ఎన్ని విధములుగనో నన్నెచోడుడును, పెద్దనయును, తిమ్మనయును, బహుళః భట్టుమూర్తియును, పూర్వకవులయిన తెనుగు కవులును, సంస్కృత కవులును, చంద్రుని చంద్రికను, ఎన్నియో రీతుల వర్ణించి యుండగా, ఇంకను క్రొత్త భావములు పుట్టుట వింతలలో వింత!

ఈ భావుక కవిచక్రవర్తి విస్తారముగ చంద్ర చంద్రికా వర్ణన కావింపకున్నను, ఉన్నంతలో గొప్పగ నున్నది అతని వర్ణన.

తెల్లని మడుగు చీర విప్పినట్లుగా, పాలు ఆరబోసినట్లుగా, పిండి చల్లినట్లుగా, (పిండి యారబోసినట్లు అన్నది లోకోక్తి) పండు వెన్నెలలు కాసినట్లు వర్ణించినాడు.

"వెల్లమడుగుఁ గోక విచ్చిన రీతిఁ బా
లారబోసినట్టి యందమునను
బిండిచల్లినట్లు పండు వెన్నెలలు గా
యంగఁ దొడగె జలువ యమరనంత" –కళా. 8–16

చంద్రికలచేత తమఃకాలుష్యమును పోగొట్టుచున్న చంద్రమండలము పైకి అపుడపుడు మేఘములు వచ్చుచున్నవి. వానిని భవదోషక్రియగా ఉత్ప్రేక్షించుచున్నాడు.

సముద్రభవుడు చంద్రుడు. సముద్రభవమును గలవి మేఘాలు. అది జన్మదోసమట చంద్రునికి! ఇంతవఱకే కవియును ఇట్టి మేఘాచ్ఛాదనా సంబంధ వర్ణన చేయలేదు. అతివేల మనోహరముగా నున్నది వర్ణనయును, సమర్థనయును,

''కలయన్ లోకములందుఁ బర్విన తమః కాలుష్యముం జంద్రికా
ఖ్యల సత్సత్త్వగుణ ప్రకర్షమున బ్రక్షాళించుచుం దద్దయుం
బొలుపొందెన్ ద్విజరాజమండలము పెంపుల్మీఱ నొక్కొక్క చో
జలదం బుండెను మీద మీద భవదోష ప్రక్రియంబర్వగన్" –కళా. 8–17

## చంద్రాద్యుపాలంభనము

చంద్రుడు విరహము నధికము చేయువాడు. మధురలాలస చంద్రుని అగ్నినిగా భావించుచున్నది.

''కొఱవిచేత బట్టుకొని చంద్రుడదె వచ్చె
గ్రీష్మ సమయ భానురీతి మెఱయ
దనకు సేల యమృత ధామాఖ్య గోముఖ
వ్యాఘ్రమనగ నిట్టి వాడు సుమ్ము" –కళా 6-268

చక్కని పోలిక ప్రయోగించినాడు కవి. మధురలాలసకు మనసులో నెంత అక్కసు న్నదో అంతటిని వెలిగ్రక్కించినాడు.

పెద్దనాదులు చంద్రోపాలంభనమును, మలయమారుతో పాలంభనమును, మన్మథో పాలంభనమును చేసినారేగాని – కళాపూర్ణోదయమునందు సూరనవలె చిలుకలను, పికములను ఉపాలంభింపలేదు. ఈ సూరనే ప్రభావతీ ప్రద్యుమ్నమున పెద్దనాదుల దారినే త్రొక్కినాడు. కళాపూర్ణోదయ కావ్యపు ఇతివృత్తమును, రచనా ధోరణియును, కథాకథనమును అన్నియు భిన్నము లయినట్లే ఈ వర్ణన యందును గూడ భిన్నత్వము ప్రదర్శింప బడినది.

చిలుకను ఉపాలంభించుచున్నది మధురలాలస.

"చిలుక చదువనుట చదివిన
ములుచకు దృష్టాంత మట్టి మూర్ఖపు దుర్జా
తుల చిలుక రలిసినం దయ
గలదే మది బెదరవదరుగాక నిజేచ్ఛన్" — కళా. 6–269

చిలుక చదువుమీద నీమెకు కోపమున్నది. పూర్వజన్మమున ఈమె కలభాషిణిగను, అంతకు ముందు సరస్వతి కడ చిలుకగను నున్నదీమెయే! అప్పుడు జరిగిన పొరపాటున మనుష్య జన్మ సంభవించినది. అది గుర్తుకు వచ్చినది గాబోలు.

కోకిలను పరభృతముగా తిట్టుచున్నది. కాకులలో పెరిగినది గదా యని తిట్టు చున్నది. సహజత్వమును నిందగా పలుకుట గూడ ఒక సొగసే.

"కోకిలములు దెలిసినఁ బలు
గాకుల పొదిఁ బొదలినట్టి కష్టపుఁబులుగుల్
నాకు నసహ్యములని యా
హా కూతలు మాన గలవె యవి ప్రార్థనలన్" — కళా. 6–280

"కావునఁ జంద్రుగింద్రుఁ జిలుకంగిలుకంబికముంగికంబు న
న్గావుమటంచు వేడకుడు నా బ్రదుకి రిపుజాతి కిం బ్రియం
బే వివరింప మీకుబలె? బెంచిన వారికి ముద్దుగాక పె
న్బ్రావుకు బిల్లికిన్ గలుగునా మొగమాట మొకింత చిల్కవైన్ — కళా. 6–271

నిందార్థకముగా గిగీలుపయోగించినది. అతి తిరస్కార సూచన అది. కాని ఈ గిగీలు సార్థకములుగా ప్రయోగించినవాడు భట్టుమూర్తియే.

"నెనగు భసలములను గిసలములను నీరజాతములును గిరజాతములును"

— వసు. 3–132

ఉపాలంభనలో చంద్రుని యనంతరము చిలుకను, తరువాత కోకిలను ఉపాలంభించుచున్నది. చిలుకలును, కీరములును లెక్కేమియన్న భావము గలదు. ఇందులో అంతరార్థము గూడ నున్నది. చంద్రుని యనంతరము చిలుకనే యేల యుపాలంభించెను? అది మన్మథుని వాహనము గనుక. దానిని ఉపాలంభించుచో మన్మథోపాలంభన చేసినట్లే.

ఇక పికోపాలంభనములో గల అంతరార్థము గూడ నిట్టిదే. మలయమారుత ప్రసార వేళలలోనే కోకిల గానము చేయును. కోకిలను ఉపాలంభించుచో మలయమారుతోపాలంభన కావించినట్లే. అంతేగా దది మన్మథ పరివారములో నొకటి గూడ.

పైకి కీరశుకాద్యుపాలంభనము జరిగి నూత్నత్వము ప్రదర్శించినట్లును, అటు మన్మథ మలయమారుతముల నర్మగర్భముగా ఉపాలంభించినట్లును - రెండు కార్యములును నెరవేరినవి. ఇది సూరన అతిలోక భావుకతకు నిదర్శనము.

## చంద్రోదయాది వర్ణన - ప్రభావతీ ప్రద్యుమ్నము

చంద్రవర్ణన ప్రభావతీ ప్రద్యుమ్నమున సొంపులు మీరి యున్నది.

రాత్రి యను నాయిక తన్ను జూచుకొనుట కెత్తబడిన యద్దమా యన్నట్లు ప్రకాశించినది. తమస్సు యొక్క ప్రతిబింబమువలె చంద్రకళంకము గూడ చంద్రబింబమునందు ప్రతి బింబించినది.

> "తివిరి త్రియామకున్ సొగసు దిద్దికొనంగ బురోదిశాళిదా
> గవుసెన వెల్వరించు మణికల్పిత దర్పణ మోయనంగ గై
> రవకుల బంధు మండలము రాజిలెనోలి నిలీయమానమై
> మివులఁ గళంక లక్ష్యతఁ దమీ ప్రతిబింబము నంత నేర్పడన్" —ప్రభా. 4-122

ఒకే వర్ణనను భిన్న మార్గములో చెప్పినట్లున్నది పై వర్ణన. కాని ఈ క్రింది వర్ణన అమోఘమై సరికొత్తగ నున్నది. చదివిన వారందఱును జ్ఞాపకముంచుకొనెడి సొగసుగల వర్ణన. "తమ్ములు" శబ్దము మీద శ్లేష ప్రయోగించి చేసిన వర్ణన యిది.

ఇక్కడ సూరన ప్రయోగము చక్కగా నున్నది. లక్ష్మి చంద్రునికి తోబుట్టువు. కాని ఆమె (అతసి) తమ్ముల నాశ్రయించియున్నది. ఇపుడు లక్ష్మికి చంద్రుడు బావ (భర్తసోదరుడు) అగుచున్నాడు. భర్తయొక్క అన్నయైన బావను (అక్క భర్త గాదు) చూడగనే మరదలు తొలగిపోవును. ఇపుడు తమ్ములను వదలినది, లక్ష్మి. తోవలను ఆశ్రయించినది. తోవలు చంద్రునకు ప్రియులు. లక్ష్మికి వావి వరుసలు లేవనుట లోక ప్రసిద్ధముగదా,

"తామరఁగ లక్ష్మి లాచంద్రమామ రాక
గలుగుచును గుముదాలికై తొలఁగెనపుడు
తొలగు బావయె కాడె తమ్ముల వరించు
నట్టి సతులకు సతడు మున్నెట్టిడైన" —ప్రభా. 4-123

పైది ప్రఖ్యాతమైన పద్యము.

చంద్రికలు మనోహరముగా వర్ణితములు. మహా నటమూర్తికి అభిషేకము చేయగా పారిన పాలవెల్లివలె నున్నవట.

"నెలయను వెండికుండ గడు నించి నిశాఖ్య చకోర నేత్ర యిం
పలరగ నంబరాహ్వయ మహానటమూర్తి మహాభిషేకమున్
జలుపగ నెల్లదిక్కుల వెసంబ్రవహించెడు పాలవెల్లి నాఁ
బొలిచె సమస్తమున్ జలువఁ బొంద సమందత సాంద్ర చంద్రికల్"
—ప్రభా. 4-125

వర్ణన గొప్పగా నున్నది.

ఈ సందర్భమున వసుచరిత్రకారుని ప్రయోగమైన 'తమ్ములు' శబ్దమును సూరన 'తమ్ములు' (4-123) తో పోల్చవలసిన యవసరమున్నది.

"ఆ తన్వంగియనంగ ఝాంకరణ వజ్జ్యాముక్త చూతాస్త్ర ని
ర్ఘాతంబోర్వక తమ్ములంచు దటినీ గర్భైక సంజాత కం
జాత వ్రాతము మాటు జెంద నవియేచన్ సాగె మున్మున్నుగా
జ్ఞాతిశ్ఛేదన లేనకిమ్మనెడి వాచారూఢి సత్యంబుగాన్" —వసు. 3-101

ఇందు "తమ్ములు" శబ్దము సహజార్థములోనే వాడబడినది. వికృతార్థము లేదు.

రెండు కావ్యములందును 'తమ్ములు' శబ్దము చుట్టఱికమును స్ఫురింపజేయునవే. సూరనలో చంద్రునితోబుట్టువైన లక్ష్మి చందమామయొక్క తమ్ములను వరించినది. ఇపుడామెకు చందమామ బావ యయినాడు. సోదరుని తమ్ముల వరించుటే తప్పు. ఇవుడు బావ రాగానే, తప్పుకొని తమ్ములను వదలి కుముదముల చేరుచున్నది. ఎందుకు? చంద్రుడు కుముద ప్రియుడు గాన.

కుముదమనగా కలువ యని అర్థము. కలువలు చంద్రునికి ప్రియురాండ్రు. ఇపుడు లక్ష్మి కుముదములలో చేరి చంద్రునికి ప్రియురాలయినట్లే గదా! మొదట తమ్ముల చేరుటయే తప్పు. ఇపుడు చంద్రుని ప్రియురాండ్రతో చేరి ప్రియురాలు అగుట రెండవ తప్పు గదా? అనగా చంద్రుని యొక్క సోదరియైన లక్ష్మి, మొదట మరదలై, తరువాత ప్రియురాలగుట మరింత తప్పు.

కుముద శబ్దమును చమత్కారముగా మనము విడదీయుచో (కుముదము) చెడ్డ ముదము - చెడ్డ ప్రేమగల వారని యర్థము. అనగా విటులని యర్థము చెప్పవచ్చును. తమ్ములవరించుటే తప్పు కాగా, ఇంకను భ్రష్టులై విటుల జేరుట ఊహింపరాని విషయము. లక్ష్మి (సంపద) చంచల యనియు, వావివరుసలు లేనిదనియు లోక ప్రసిద్ధము. కవి ఆ లోకోక్తి శరణుచొచ్చి నాడనవలెను.

## వసుచరిత్ర-తమ్ములు

గిరిక వసురాజు పైని వలపుతో బాధపడుచున్నది. బాధగల ఆడపడుచులు సోదరుల దగ్గఱకు వచ్చుట సహజము. ఇపుడామె అట్లే వచ్చినది. కామభావముతో వచ్చినదనుకొనుట పొరబాటు. వివాహము చేయుదురేమో యని వచ్చి ఆశ్రయించినది. ఆ తమ్ములామె భావమును తెలిసికొనియో, తెలిసికొనకయో బాధింప సాగగా మరింత బాధపడినది. అవును దాయాదులు అగ్నితో సమానమని సమర్థించు చున్నాడు కవి.

సూరన "తమ్ములు" పదప్రయోగసమర్థనల కంటె, భట్టుమూర్తి "తమ్ములు" శబ్దప్రయోగ సమర్థనలు యుక్తియుక్తములుగను, సహజములుగను నున్నవి. సమకాలికులు గాన ఎవరు ఎవరిని చూచి వ్రాసిరో చెప్పుట కష్టము, కాని తరతమ భేద నిరూపణ అంతే!

## చాంద్రాద్యుపాలంభనము

ప్రద్యుమ్నుడెంతకును రాలేదు. లోపల మదన తాపము అధికమగుచున్నది. చంద్రుడు అగ్ని కురియుచున్నాడు. ఇక తాళలేక చంద్రోపాలంభనకు కడగినది ప్రభావతి,

> "నీ శైత్యము నమ్మితి న
> త్యాశన్ హిమధాముడును, సుధాంశుడనంగా
> నో శశధర యేలాఘృత
> కోశాతకి వయ్యెదేమి గూడెడుదీనన్" —ప్రభా. 4-151

ఈ సూరన కవియే కళాపూర్ణోదయమున చంద్రుని "గోముఖవ్యాఘ్రమని" నిందింప చేసినాడు (కళా. 6-288). ఇక్కడ నేతిబీరకాయ యనుచున్నాడు. "హిమ ధాముడు", "సుధాంశుడు" అన్న నామములు సార్థకముగావట! నేతి బీరకాయల్లో

నెయ్యి లేనట్లే సుధాంశునిలో సుధగాని, హిమధామునిలో హిమముగాని, లేవట! చక్కగానున్నది యీ నింద!

"శ్యామ ంత లలాట సామీప్య పరితప్య
మానంబులుగ గళల్ మార్చి మార్చి
సింధూద కాంతస్యమింధన బడబాన
లోగ్ర కీలలసెగ నూనియూని
ప్రత్యమావాస్య సంభవ దర్క సంయోగ
కలితాధికోష్ణిమ గ్రాగి గ్రాగి
విప్రయోగోష్ణ పాంథ ప్రాణ పరిపాన
ధూమజంబగు కాక పొంది పొంది

కాలకూటాహ్వయ భ్రాత పాలు పట్టి
పుచ్చుకొను దాహకత్వంబు ప్రోచి ప్రోచి
యింత వేడిమి సాధించితే మొ చంద్ర
నన్ను వేచుటకే ప్రయత్నంబు తోడ" —ప్రభా. 4-152

పై వర్ణన మామూలుగా పూర్వులందఱును చేసినట్లే యున్నది. కాని "నన్ను వేచుటకే" అన్న ప్రయోగమున నెంతయో బాధ వ్యక్తము చేసినాడు కవి. ప్రభావతిని బాధపెట్టుటకంత సాధన చేయవలసిన పని లేదు చంద్రునికి.

చంద్రుడు దేవతల కాహారము. ప్రథమ కళను అగ్నిదేవునికి అర్పించుచున్నాడు. "ప్రథమాంపిబతే వహ్నిః" అని శ్రుతి. ద్వితీయ కళను సూర్యునకిచ్చుచున్నాడు. "ద్వితీయాంపిబతేరవిః" అన్నది శ్రుతి వచనము. ఈ విధముగా ప్రథమ ద్వితీయ కళలను ముందుగా వారికిచ్చుట విరహిణుల వేధించుటకే.

"ప్రథమ కళల్ నెలన్ నెలనుపాయన మిచ్చుచు వహ్ని సూర్యులన్
బృథుతరమైన మైత్రిఁ గడుఁ బ్రీతులఁ జేయుట యీదృశోష్ణిమ
ప్రథమ ఫలీ భవద్విరహి బాధకె కావలయున్ శశాంక! యీ
పృథివి నధర్మికెన్నఁ బర పీడయె యుత్తమలాభ మెప్పుడున్" —ప్రభా. 4-154

దుర్మార్గులకు పరపీడనమే ప్రధానము. ఇట్టి వర్ణనమే ఇంకను సొంపుగా వసుచరిత్రమందున్నది. అది :-

"స్వామియై నిగమాతి శాయియై
... ... ... ... ...
దొలుదొలుత గృష్ణవర్త్మకుఁ గళయొసంగి
నంటు గావించు నెల్ల సనాథ యువతి
జనతనూ దాహ సాహాయ్యమునకుఁ గాక
కానవా వారి నెవ్వారి గమలవైరి" — వసు. 4-36

ఈ కవు లిరువురును సమకాలీనులే. ఎవరి గ్రంథము ముందు వ్రాయబడినదో? ఎట్లయినను రామరాజ భూషణుని పద్యార్థములు భవ్యతరములు.

చంద్రుడు నిజముగా వేంద్రపువాడే. ఎందుకనగా చకోరములు వేడి వెన్నెలల గ్రాగుచు వేడికి అలవాటు పడినవి కావుననే నిప్పులు మేయగలుగుచున్నవి.

"చలువయె భ్రాంతి మూలము నిశాకర! యింకొకటెన్ని చూడ గే
వలమును వేంద్రవుం బ్రకృతి వాడవయెట్లనినన్ జకోరముల్
వెలయగ గడంక నీ యుడుకు వెన్నెల జుఱ్ఱుచు దాన జేసి కా
కలవడ, శైత్యముల్ మరగినట్టివి నిప్పుల మేత కోర్చునే" —ప్రభా. 4-155

చకోరములు వెన్నెల త్రాగుననుటయు నిప్పుల తినుననుటయు కవి సమయము. దానిని చక్కగా వర్ణించినాడు కవి.

మలయమారుతము వేడిగానుండుటగూడ చంద్రుని దోషమేయట! మలయానిలునకా వేడి చంద్రికా స్పర్శవల్లనయినను సిద్ధించి యుండవచ్చును. లేదా 'యథా రాజా తథా ప్రజా' యను నీ నీతిని బట్టి రాజగుణమే మలయానిలుడు వహించుటవలననైనను సిద్ధించియుండవచ్చును.ఇందులకు గూడ చంద్రునిదేతప్పుగా ఉత్ప్రేక్షించబడినది. (ప్రభా. 4-156)

## మలయమారుతోపాలంభన

"తలప జగత్ప్రాణుడవై
వెలసిన నీవిట్లు నన్ను వేచుట తగునే
యిల వెలుగు చేను మేసిన
మలయానిల యెద్దికావు మది జింతింపన్" —ప్రభా. 4-158

జగత్ప్రాణ శబ్దము చాల సార్థకముగా ప్రయోగింపబడినది. కంచెయే చేనుమేసినచో దిక్కేమి.

మలయానిలుని వల్ల ఇంకను రెచ్చిపోయినది ప్రభావతి

"అంతకాశా సమాయాతత్వ మరసిన
జలువకు నీకును చాలదవ్వు
రౌద్రమూర్తిత్వ వార్తలు విచారించిన
జలవకు నీకును జాలదవ్వు

దహన సామర్థ్య తత్పరత భావించిన
జలువకు నీకును చాల దవ్వు
శ్రీఖండ విషధరోచ్ఛిష్టత యెంచిన
జలువకు నీకును చాలదవ్వు
పలుకులేటికి నీయందు మలయ పవన
చలువగలదను నట్టి సంశయము దగదు
వసుధనెందైన< జండాల వాటియందు
బ్రాహ్మణ గృహం౦బు వెదకుట భ్రాంతిగాదె" —ప్రభా. 4-160

దృష్టాంతమును ప్రయోగించినాడు. ఒక్కొక్క గుణమునే యెత్తి చూపుచు ఎత్తి పొడిచినట్లుగా నడిచినది పద్యము. ఈ ఘట్టమందలి ప్రతి పద్యమునను అర్థాంతర న్యాసముగాని, దృష్టాంతమునుగాని వాడుచు భావమునకు మిక్కిలి శోభగూర్చినాడు కవి. ఇందు సాంఘిక విషయమైన నాటి బ్రాహ్మణాధిక్య చండాల నీచత్వ తరతమ ప్రదర్శన ద్వారా అసంభవతను వర్ణించుట ఒక విశేషము.

## మన్మథోపాలంభన

తరువాత మన్మథోపాలంభన జరిగినది. చంద్రుడును, మలయమారుతమును బాహ్యప్రకృతి యగుచో, మన్మథుడు అంతః ప్రకృతి. అందువలన మన్మథోపాలంభన గూడ ప్రకృతి వర్ణనయే యగుచున్నది. పెద్ద నాదులవలెనే ఇతడు మన్మథోపాలంభనకు వెడలినాడు.

"భూనుత శీల రుక్మిణికి< బుట్టి మనోభవ మత్ప్రియత్వమున్
బూనిన వాడ వీవయట; పూర్వపు నీయతనుత్వ ధర్మమున్
మానక యేచుచున్న నది మామక భాగ్యము, నిన్నెటాడ బో<
గా నెటు వచ్చునో తడవగా వెఱతున్ గరముల్ మొగిడ్చెదన్" —ప్రభా. 5-3

ఇది చక్కనివర్ణన. అందమైన పలుకుబడి! శృంగారపూర్ణమై, నుతిమెత్తని బాధాన్వితానంద దాయకమైన భావవర్ణన! ఆ మన్మథుడు తన ప్రియుడే; కాని యిపుడు పూర్వపు రూపమున (మనసిజుడు = అనంగుడు) వేధించు చున్నాడు. తాను వలచిన రుక్మిణీసుతుడు దేహధారి, వీడును రుక్మిణీ సుతుడే. ఏమన్న నేమి యగునో; చాల ఇరుకులో బడినది ప్రభావతి. ఏమియుననలేక రెండు చేతులెత్తి నమస్కరించి తర్వాత మూర్ఛపోయినది. మన్మథోపాలంభన ఘట్టమున విజయవిలాసకారుడు దాదాపి ధోరణినే అవలంబించినాడు. దూకుడుగా తిట్టలేదు (విజయ. 3-44,45)

## చంద్రోదయాది వర్ణన —వసుచరిత్ర

చంద్రోదయము సూర్యాస్తమయానంతరమే జరుగును. రాత్రులయందే చంద్ర దర్శనము. రాత్రులే కామకార్యములకు కాటపట్టులు. ఈ కారణముచే ప్రబంధములందు చంద్రోదయమునకున్నంత స్థానము మరొక వర్ణనకు లేదు. శృంగార రసమునంతటిని సంతరించుకొను వర్ణన చంద్రోదయఘట్టమే. చంద్రికా విలసనమే.

చంద్రుని రాకకై పూర్వరంగమెంత మనోహరముగ సృష్టింపబడినదో చూతము.

"ఘనతర గాఢసంతమసకల్ప మహోదధి సన్నలోకముల్
తన యుదయారుణద్యుతి వితానము పేరి రజోగుణంబుచే
ననువుపడన్ సృజింపఁ గమలాసనుడై ద్విజరాజురా నమ
ర్చిన ధవళాబ్జ పీఠమునఁ జెన్నలరెందొలి తెల్పుతూర్పునన్" --వసు. 4-15

చీకట్లు అనెడి ప్రళయ సముద్రము తీసిపోయినది, ఇక పునస్సృష్టి చేయవలెను. అందులకు రజోగుణుడై ద్విజరాజు రానున్నాడు. అతని కొఱకై అమర్చబడిన ధవళాబ్జ పీఠమా అన్నట్లుగ తూర్పున తెలుపు వర్ణము కన్పించినది. మహాభావుక కవియైన భట్టు మూర్తి తన నూతన కవితా సృష్టికే ప్రారంభము చేయుచున్నాడా అన్న భావము గూడ ద్యోతకమగుచున్నది.

ద్విజరాజు ప్రత్యేక సృష్టిని చేయబోవుచున్నాడు. ఈ సృష్టిలో కామమునకే - ప్రేమ సామ్రాజ్యమునకే - పట్టాభిషేకము.

చంద్రబింబము కొంచెము కొంచమే ఎక్కి పైకెక్కుటను వర్ణించిన ఈ క్రింది వర్ణన మత్యద్భుతము; అహోవాగ్జనన కారణము; ఇట్టి వర్ణన నభూతో నభవిష్యతి.

''హరిదంభోరుహలోచనల్ గగన రంగాభోగ రంగత్తమో
భర నేపథ్యము నొయ్య నొయ్య సడలింపన్ రాత్రి శైలూషికిన్
వరుసన్ మౌక్తిక పట్టమున్ నిటలమున్ వక్త్రంబునున్ దోచెనా
హరిణాంకాకృతి వొల్చె రేకయి సగంబై బింబమై తూర్పునన్" -వసు. 4-17

వీధి భాగవతముల చూచిన వారెల్లరి కీవర్ణన అవగాహనమగును. నాయికా వేష ధారియైననటి రంగస్థలము ప్రవేశింపగనే తెర పట్టుదురు. తెరవెనుక నటిమాటలాడుటయు పాటపాడుటయు జరుగును. ప్రేక్షక లోక మా పాత్రను చూడవలెనని యువ్విళ్ళూరు చుండును. అపుడు తెరను కొలదిగ కొలదిగ తగ్గించుచుపోదురు. మొదట నాయికయొక్క మౌక్తిక పట్టము (నొసలికి పై భాగాన కట్టినది) కనిపించును. తెరను మరికొంత తగ్గింపగా నొసలు అర్ధచంద్రాకారముతో కనిపించును. ఆ తెరను మరికొంత తగ్గింపగా పూర్ణబింబమువలె ముఖమంతయు కనిపించును. ఇక్కడ నాయిక రాత్రియను శైలూషి. రంగస్థలము ఆకాశము. అడించువారు హరిదంభోరుహలోచనలు (దిక్కులు).

పై వర్ణన ఎంతయో నాటకీయముగ నున్నది. చంద్రోదయము నింత మనోహరముగ వర్ణించినవారు లేరు.

వెన్నెల ఎంత స్వచ్ఛముగ ఎంత తేజముగ, వ్యాప్తి పొందుచున్నదో వర్ణింపబడుచున్నది. తెల్లవస్తువుల నన్నిటి నధఃకరించి మించుట వర్ణింపబడుచున్నది. ఎట్టికార్యమయినను చేయ సామర్థ్యముండియు, ఉపేక్షా భావము వహించినట్లు వర్ణించుట గొప్పగ నున్నది.

> "మిత్రాధికారంబు మీర రాదని కాక
> వెసబట్టపగలు కావింప లేదె
> మ్రాకుల క్రింది సోమరులెంత యనికాక
> మలసి నీడల రూపు మాప లేదె
> బాడబాక్షేప పాపమున కోపక కాక
> యౌర్వాగ్నినైన జల్లార్ప లేదె
> రాజాకాంతాకృతి ప్రతి సర్గమని కాక
> శిలలెల్ల సరసముల్ సేయ లేదె?
> జగతి నిదియని జగములు వొగడ నెగడె
> హరుని తలయెక్కి తెలిదమ్మి నణగద్రొక్కి
> కలశవారాశి నెమ్మేన కలయద్రొక్కి
> కుముద రుచినేలి కౌముదీసముదయంబు" —వసు. 4-22

ఇంతకుముందు (వసు. 4-12) చీకట్లను, తద్వ్యాప్తిని, వర్ణించినపుడవి నాలుగు దిక్కులకు వ్యాపించి, పిదప భూమినాక్రమించి, మించి మించి మింటి నాక్రమించి, బ్రహ్మాండము పిక్కటిల్లినట్లుగ వర్ణించినాడు. తర్వాత చంద్రుడా చీకట్లను వేటాడి ఏనుగులను ఓదములలో పడద్రోసినట్లుగ వర్ణించినాడు (వసు. 4-19)

ఇపుడు కౌముదిని పైనుండి ఆక్రమించుచు క్రిందికి దిగి వ్యాప్తి పొందినట్లుగ వర్ణించుచున్నాడు. విజృంభించి అంతటిని ఆక్రమించినట్లు వర్ణించుచున్నాడు. వీరావేశము చేత చెలరేగి వీరవిహారము చేయుచు అంతట నదియే వెలసినట్లు వర్ణించుచున్నాడు (4-22). ఇతరులు వర్ణించిన దానికంటె మిన్నగ వర్ణించుచున్నాడు. ఇతరులు వర్ణించలేని ఘట్టములు ఇతనికి సుసాధ్యములు. ఇతరులను మించి వర్ణించ వలెనను పట్టుదల భట్టుమూర్తిలో నున్నంత మరియొకరి యందు గానము.

మనుచరిత్రలో అల్లసాని పెద్దన చంద్రికల వర్ణించుతటి

> "కగయ జగమున గలయట్టి నలుపులెల్ల
> దెలుపులుగ జేసి నీడలు దెలుపు సేయ
> గా వశముగామి బోడమ దుఃఖమున బోలె
> సాంద్ర చంద్రిక తుహిన బాష్పములు గురిసె"

అని వ్రాసినాడు. (మను. 3-27).

నలుపుల నన్నిటిని తెలుపు జేసి, పాపము నీడలను తెలుపు సేయలేక చంద్రికలు దుఃఖించిన వట! పెద్దన మనుచరిత్రను దగ్గర పెట్టుకొని ఛాలెంజి కావ్యముగ వసుచరిత్రను వ్రాసిన భట్టుమూర్తి కా వర్ణన అంతేనా యనిపించినట్లున్నది. అందులకే తన వెన్నెల 'మ్రాకులక్రింది సోమరులెంత యని కాక మలసి నీడల రూపు మాపలేదె' అని ఉపేక్షించి నట్లు వ్రాసినాడు.

విరహిణీ జనులకు చందమామ యగ్ని సమానుడు. చంద్రోదయము చూచి గిరిక చెలికత్తె మంజువాణి యిట్లనుచున్నది.

> ''అచ్చంపుం దెలినిండు వెన్నెలలతో నజ్జారి వచ్చెం గడున్
> హెచ్చెం బచ్చని వింటి జోదు చలిగాడ్పే తెంచె నిచ్చోట ము
> చ్చిచ్చుం గూడిన నోర్చునే చెలి యయో చెల్లించు నాళీజనం
> బిచ్చన్ మెచ్చగ మంజువాణి సకలాభీష్ట క్రియాధుర్యయై" --వసు. 4-24

నిండు వెన్నెలతోడి చంద్రుడొక యగ్నియట! మన్మథుడు మరొక యగ్నియట! చలిగాలి మరియొక యగ్నియట! ఈ మూడగ్నులును కలిసి ముచ్చిచ్చు అయి గిరికను బాధించునట!"కంతుసేనలకు ముయ్యాలిగుట్టయినట్టి యిందురానడుగు నెతాపవహ్ని "(మను. 3-34)" అను మనుచరిత్రలోని భావమున కిది సాటిగా నున్నది.

> ఎంతయో భయపడినది మంజువాణి;
> ఎంతయో తొందరగా పరుగిడుచున్నది;
> ఎంతయో కర్తవ్య పరాయణతచే ఆరాటపడుచున్నది.

> ''రిక్కరాయని కళల్ చెక్కుఁగీటకమున్న
> వెడతూపు దృగ్వీధి బడకమున్న
> యెలతుమ్మెదల దిమ్ము తలఁగ్రమ్మకయమున్న
> చిగురుచేపట్లకు డిగకమున్న
> కలికికోయిల గళగ్రహము సేయకమున్న
> రాచిల్కమాటకు రాకమున్న
> నిసువు తెమ్మెర దంట యసువులంటకమున్న
> కలహంస కాళ్లదవులకయమున్న
> యబ్జముఖులార యేఁ బోయి యచల కన్య
> యుత్తలముఁ దెల్పి వసురాజు చిత్తమరసి
> వత్తు నత్యంత శుభవార్త దెత్తు ననుచు
> గొమ్మపోరంబు పూని యేగుటయు నిచట" -వసు. 4-25

చంద్రకాంతి చెంప పెట్టువలె బాధించునట! గిరిక యొక్క అంగసాదృశ్యము లయిన ప్రకృతి వస్తువులన్నియు, చల్లనివై గూడ ఆమెను బాధించునట!

చంద్రుని పొలకువ విరహిణులకు గిట్టదు. బందిపోటు దొంగకంటె క్రూరుడుగా భావింపబడుచున్నాడు.

"క్రీడామందిర జాల మార్గముల చక్కిన్ సిక్కి జాబిల్లి యా
గోడల్నీరుగ జాఁ ద్రోచి నెలతక్కుల్ చొచ్చి వెన్నాడి మై
నాడం గోమలి యోర్వలేక వలవంతఁ బద్మినీ జాతికిం
గీడానుగ్రశిఖామణిం బలికె నక్షీణానులాపంబులన్" -వసు. 4-36

చంద్రకిరణ పాతమును చక్కగ వర్ణించినాడు. ఇది సహజవర్ణన! అందునను అతిశయోక్తి! శ్లేషను ప్రయోగించి ఎంతయో చక్కని అర్థమును, ఎంతయో సుందరముగ లాగుచున్నాడు. బందిపోటు కిటికీలదగ్గర గోడ బండలను పడగొట్టి, లోపలప్రవేశించి స్త్రీలను తరిమి, వారిని పొడిచి బాధించి దోచుకొనును. ఇక్కడ చంద్రుడు తన కిరణ జాలమును కిటికీ కడ చంద్రకాంత శిలానిర్మితమైన గోడల నీరుచేసి లోపలప్రవేశించి వెంటాడి గిరికమై నాటించగా పద్మినీ జాతి స్త్రీ అయిన గిరిక పద్మినీ జాతికి కీడుచేయు ఉగ్రశిఖామణిని సంబోధించి పలుకుచున్నది. ఉగ్రశిఖామణి యనగా దుర్మార్గాగ్రేసరుడని ఒక అర్థము. శివుని జుట్టునందలి మణియని మరొక యర్థము.

చంద్ర సంబంధిక వర్ణనలు పెద్దనకంటె కుమారసంభవకారుడును వారిద్దరి కంటె భట్టుమూర్తియును గొప్పగ వర్ణించినారు.

రెండవ యర్థము లేని పదమును-రెండవ యర్థము స్ఫురించని భావమును-వర్ణింపడు భట్టుమూర్తి!

## చంద్రోపాలంభనము-వసుచరిత్ర

వస్తు తత్త్వమునకును, మానవ తత్త్వమునకును లంకె యున్నది. మానవునితో సహా ప్రతి వస్తువును ప్రకృతికి సంబంధించినది కాన.

చంద్రుడు మనస్సంబంధి; అందులకే విరహిణులకు చంద్రదర్శనము హృదయ బాధాకరము.

వసుచరిత్రలోని చంద్రోపాలంభనాదులు ప్రత్యేకములయిన రసఖండములు. వసు చరిత్ర ఒక సవాలు కావ్యము (ఛాలెంజి కావ్యము).

మనుచరిత్రను దగ్గఱనుంచుకొని ప్రతిపద్యమును, ప్రతి వర్ణనను, చూచుచు, అంతకు మించి వ్రాసి సెహబాసనిపించుకొన వలెనను పట్టుదలతో వర్ణనలు కావించినాడు రామరాజ భూషణుడు. గెలిచినాడు గూడ. చంద్రాద్యుపాలంభనలు ఇందుకు ఒక తార్కాణము.

చంద్రుడు గిరికను బాధించుటకై బందిపోటు దొంగవలె వచ్చి పడుచున్నాడు. వెన్నాడి బాకులతో పొడుచుచున్నాడు (వసు, 4-26), రాజు దొంగల నుండి ప్రజను రక్షింపవలెను. ఇపుడు రాజు (చంద్రుడు) రక్షించుటలేదు సరిగదా; పీడించుచున్నాడు." అందుకామె నిందించుచున్నది.

"రాజీవాక్షుల నేచు పాతకివి చంద్రా రాజవా నీవు నీ
రాజత్వంబున చక్రముల్ మనియెనో రంజిల్లి సత్సంతతుల్
తేజంబందెనో డిందెనో యహి భయోద్రేకంబు తా జెల్లరే
రాజై పుట్టుట రశ్మి మాత్ర ఫలమే రాజౌట దోషార్థమే."
-వసు. 4-27

రాజశబ్దము యొక్క అర్థద్వయముచే నిట రాజగుణములను, చంద్రగుణములను, సాధించి చంద్రుని సహజగుణములను నిందార్హముగ వర్ణించుట జరిగినది. చంద్రుని చూచుకొలది కోపమెక్కువైనది కాబోలు గిరికకు.

"ఇంతుల నేచు పాతక మదింతటనంతటబోదు పాంథలో
కాంతక నిన్ను ఘోరతమమై ఘనమైయజహాత్కళంకమై
వంతల బెట్టి యాఱుపది వ్రక్కలు సేయక పూర్వపక్షపుం
గంతులకేమి చూచెదవుగా తుది నీ బహుశాస్త్రి ఖేదముల్"
-వసు. 4-28

"స్త్రీల బాధించుట మంచిదిగాదు. ఆ పాపము ఊరకపోదు. చెడుగు జరగనట్లుగ తాత్కాలికముగ కన్పట్టినను తర్వాత తప్పదు. ఓ చంద్రా! శుక్లపక్షమున నీకు వృద్ధి కనిపించుచున్నది. నిజమే! అదే శాశ్వతమని భ్రమ పడకు. దుర్మార్గుడా మిడిసి పడకు" అన్నది. దుఃఖార్తయై-కోపియై, అసహాయ స్థితిలోనున్న స్త్రీ శాపనార్థములు పెట్టినట్లున్నది, పై వర్ణన, ఇంకను,

''కమలించెగాక యింగజ విరోధి శిరోధి
తలకెక్క జాలెనే హాలహలంబు
క్రాచెగాక పయోధి కాండ ప్రకాండంబు
బైకి పొంగించెనే బాడబంబు
తూఱెగాక ముకుంద తుండ ప్రఘాణంబు
వెడలెనే యెదగాలి విపిన కీలి
యడలెగాక శిలోచ్చయచ్ఛదాహంకృతుల్
కరచెనే నీరుగా సురపహేతి

నీ కరణి నిట్లు దయలేక లోక మేర్చు
నీ కరణి యైన యలయత్రి నేత్రమునకు
ఖరకరాలోక గాఢ నిష్ఠుర తపోగ్ని
బెటిలి పడకున్కి-భరమె కృపీటజన్మ"

-వసు. 4-29

హాలాహలము శివుని కంఠమును కమలించినదే గాని నీవలె తలపై కెక్కలేదు (చంద్రుడు శివుని తలపై కెక్కినాడుగదా!) బడబానలము సముద్రమును క్రాచుచున్నది. అంతేగాని నీవలె పొంగింపలేదు. దవానలము శ్రీకృష్ణుని పొట్టలోదూరి వెడలి పోయినది. అంతేగాని నీవలె హృదయమును చీల్చుకొని బయటకి రాలేదు. వజ్రాయుధము పర్వతముల ఱెక్కల అహంకారమును అణచి వేసినది. అంతేగాని నీవలె నీరగునట్లుగా కరిగింపలేదు. నీవు కృపీట జన్ముడవు (చంద్రుడవు, అగ్నివి), కావుననే ఇంత బాధాకరుడవైతివి.

చంద్రుడు శివుని శిరోభూషణము, సముద్రమున కాహ్లాదకారకుడు, విష్ణు మనస్సంభూతుడు. చంద్రకాంత శిలల కరగించువాడు. కాని యిపుడు విపర్యయమయి నది. హాలాహలము, బడబానలము, దావాగ్ని, వజ్రాయుధము — ఇవి చంద్రునంత తీవ్రబాధాకరములుకావు. వాని కంటెను చంద్రుడే తీవ్రశత్రువు. ఇట వ్యతిరేక ధ్వనిచే చంద్రగుణములు, చంద్రనింద, రసవత్తరముగ సాధితములు. చేతి మెటికలు విఱిచి తిట్టినట్లున్న దృశ్యము - పదప్రయోగములో ప్రతిబింబింప జేసినాడు కవి.

చంద్రుడు విషపూరితుడని నిందించుచున్నది గిరిక. ఈ క్రింది పద్యమును చూడుడు.

"విషరాశిన్ జనియింపవో, విష సహోవిర్భూతి వాటింపవో,
విషభృన్మార్గమునంటవో, విషధరుల్ వేష్టింపఁ గాలూనవో
విషభుక్ చూలిక పిన్ననాడెగనవో విఖ్యాత కౌటిల్యమున్
విషమంబెట్లగు నీకు జీవకృత విద్వేషంబు దోషాకరా"

-వసు. 4-30

ఓ దోషాకరా! (పాపీ! - రాత్రిని చేయువాడా!) నీవు విషరాశిలో జన్మించితివి (విషం=నీరు) కాలకూట విషముతోగూడ బుట్టినవాడవు (సముద్రమథన సమయమున) విషమును భరించిన వారి మార్గము నవలంబించినవాడవు (విషభృన్మార్గము = ఆకాశము) సర్పముల చుట్టుకొన్న హరుని తలకెక్కిన వాడవు, పిన్ననాడే కౌటిల్యమును (చంద్రలేఖ వంకర)ను పొందినవాడవు. నీకు ప్రాణులయెడ విద్వేషము కలిగి యుండు టలో ఆశ్చర్యము లేదు (జీవ=ప్రాణి, జీవ=బృహస్పతి), (గురుభార్యాగమనముచేత గురు ద్రోహము చేసినవాడు). దీనికి సాటియగు వర్ణనను తర్వాతి వాడయిన విజయ విలాసకారుడు (విజయ. 3-52) కావించి యున్నాడు.

ఓ పాపీ! ఓ దోషాకరా!

> "కమలాభర్త భవద్విరోధిపయి జక్రంబుం బ్రయోగింప ను
> త్తమ శస్త్రం బది యాత్మనామకభిదా దర్పాంధు నిన్నున్ మొఱం
> గి మహా రాహువు దున్మియున్ దునుమ కేగెంగాక చక్రంబుచే
> తుములై పోవని వారలుంగలరె నీదోషంబు గాదే శశీ!" -వసు. 4-31

కమల నీ సోదరి. నీ సోదరి భర్త కావుననే నీ కొఱకై నీ వైరి రాహువు పైకి చక్రము ప్రయోగించినాడు. కాని ఏమి జరిగినది! తన పేరి చక్రవాకములకు నీవు పగవాడవుగాన, ఆ చక్రము రాహువును త్రుంచియు,తునుమక వదలివేసినది. అంతేగాని విష్ణు చక్రముచే చంపబడని వారుందురా? అది నీ దోషమేగదా! నీవు చేసికొన్న పాప ఫలమేగదా! పోనీ,

> "ఈ వఙ్బుందవు నీట బుట్టితి జుమీ యేవంచు మోమోటపుం
> ద్రోవల్ సెప్పగ సిగ్గుగాదె మఱి నీ తోబుట్టు శ్రీదేవి శ్రీ
> లావాసంబు సిరుల్ హరింతువనుచో, నయ్యో కళాదుండుచే
> తో వీధిన్ సహజాధనాపహరణోద్యోగంబు నెగ్గించునే" -వసు. 4-34

నీవు నీటబుట్టితివి, నేనును నీటబుట్టితిని. నీకు సోదరివంటిదానను అని మోమోటమిపెట్టి బాధించకు అని వేడుట నిజముగ నాకు సిగ్గుచేటు! అది నీవంటి నీచుల యెడ సాగదు. ఏలన, నీ తోబుట్టువైన లక్ష్మీదేవి నివాసమైన పద్మములను నీవు ధ్వంసము చేయుచున్నావుగదా! అవును గదా, స్వర్ణకారుడు తన సోదరియొక్క బంగారమయినను సరే-హరించి తీరును. వానికి పాపభీతి లేదు. నీవును అట్టి నీచుడవే! అని నిందించినది.

> "నీరజారాతి! నిను దన నెలవుగూల
> నేల సృజయించె విధి, సృజియించుగాక
> యేల జైవాతృకుని(జేసె, నేల తప్పు
> బుడమి "పాపీ చిరాయు వన్నెడగు నుడుగు" -వసు. 4-35

వేదాంతముల కతీతుడైనట్టియు, సురశ్రేష్ఠుడు అయినట్టియు హరి యున్నాడు. సకల భువన నిర్మాత పరమేష్ఠి యున్నాడు. పరమ పవిత్రుడు సూర్యుడున్నాడు. హాలా హలధారియై నిన్ను నెత్తికెక్కించుకొన్న ఈశ్వరుడున్నాడు. ఇట్టి వీరింద రంతంత వారుండగా నీవు అగ్నికే ప్రథమ కళ నొసంగి అతనిని పెద్దనుచేసితివి. (ప్రథమాం పిబతే వహ్నిః ద్వితీయాం పిబతే రవిః) అతనితో అంత సహవాసము చేసి నిన్నే అర్పించు కొనుట నిజముగా సద్బుద్ధితోనా? కాదు. అనాథ యువతీజన తనూదాహ సాహాయ్యము నకు! ఎంత దుర్మార్గుడవురా! (వసు. 4-36)

అని యీ విధముగ, అతిదూకుడుగ, కసిగా చంద్రోపాలంభన చేసినది. ఈ ఉపా లంభన ఇంత రసప్లావితముగ, ఇంత ప్రవాహ వేగముగ మరే గ్రంథమునందున్ను

గానము. రచన అద్భుతము! ఉద్దేశ పూర్వకమైన - సార్థకమైన - పదప్రయోగము. చక్కని - సులభమైన అర్థశ్లేష! సహజమైన భావధార. అనన్య సహజమైన ఊహాశక్తి! నిరాటంక భాషా ప్రవాహము అలంకారాల సాగరము.

చంద్రుడు ఉద్దీపనకారి. మన్మథావిష్టులకు బాధాకారి. మనస్సు చంద్ర సంబంధమైనది. చంద్రుని చూడగానే - మనస్సు స్వాధీనము తప్పుటకు వీలున్నది. అందులకే నాయికలు పిచ్చెత్తినట్లుగ చంద్రోపాలంభన చేయుదురు.

అల్లసాని పెద్దనాదుల చంద్రోపాలంభన సొగసుగనున్నది. భట్టుమూర్తి చంద్రోపాలంభన అత్యద్భుతానందప్రదాయినిగ నున్నది.

## మన్మథోపాలంభన

చంద్రదర్శనమున మన్మథ భావము మరింత తీవ్రించును. కామార్తలు తట్టుకోలేక మన్మథ దూషణకు పూనుకొందురు. గిరిక మన్మథుని మందలించుచున్నది. "నీ విరోధులందరికి ఆ చంద్రుడు మిత్రుడు. నీ మిత్రులందఱకును వాడు శత్రువు అట్టి వానితో నీకు మైత్రి యేల?" అని మన్మథుని చీవాట్లు పెట్టుచున్నది.

> "శంబరవైరి వీవు పటుశంబర పోషణ శాలి యాతడ
> బ్జాంబక ధారి వీవు మధితాబ్జు డతండు నిశాట ఝాట ద
> ర్పంబడగించు బల్లిదుని పట్టివి నీవు నిశాటుడాతడో
> యంబు చరాంక నీకు తగునా హరిణాంకుని తోడి కూటముల్" —వసు.4—89

అని వినయముగా చెప్పి ప్రాధేయ పడుచున్నది. మన్మథుడు కేవలము జీవమాత్ర చరితార్థకుడనుచున్నది. ఈశ్వరుని చేతిలో చచ్చిపోయిన వానికి బోధమెట్లు పుట్టును అన్నది.

> "అబు మధ్యాతతి మీద నంత విరసంబౌ చాపమున్ సీధు పా
> రణ మత్తాగొని సోలు నారి శిఖిమిత్రంబైన తేరున్ వనాం
> గణలుద్ధామగ కోటి బూని వెడలంగా నిట్టిదే ధర్మమే
> గుణమే యెక్కుడిదే బలంబు సుమనః కోదండ నీకెంతయున్" -వసు. 4—50.

స్త్రీలపైకి ఇత దండయాత్ర చేసి రావలయునా ? ఇదేమి న్యాయము, ఇదేమి ధర్మము (విల్లు) ఇదేమి గుణము (నారి) అని నిందించుచున్నది. ఇట సార్థక పదప్రయోగము జరిగినది. ధర్మము, గుణము, ఎక్కుడు, బలము - వీని శ్లేషార్థములతో అర్థపుష్టి

గొప్పగా కూర్పబడినది. చమత్కారార్థము అమోఘముగ నున్నది. ప్రకరణార్థము మనోరంజకముగ నున్నది.

గిరికకు మరింత కోపము హెచ్చినది. ఇంకను నిందింప సాగినది.

మకరగ్రస్త గజేంద్రుని - హిరణ్యాకశిపునుండి ప్రహ్లాదుని, మృత్యువును శాసించి బ్రాహ్మణ కుమారుని, ముక్కంటి కంటి మంటలచే భస్మమయిన లోకాలను, రక్షించిన విష్ణువు ఘటనాఘటన సమర్థుడు. పుత్రుడైన మన్మథుని రక్షింప సమర్థుడై యుండి గూడ నిటలాక్షుని నేత్రాగ్నికి ఆహుతియగుచుండగా చూచియు నూరకున్నాడు. మన్మథుని దుర్మార్గ ప్రవృత్తిని చూచియే అట్టి ఉపేక్షాదృష్టిని వహించినాడు. కొడుకయిన నేమి? ధర్మాచరణ గదా ముఖ్యము? ఎవరును చెప్పని విధమున, గొప్పగ జెప్ప నేర్పు భట్టుమూర్తికేగలదు. (వసు. 4—43).

ఆ తరువాత మలయానిలుని ఉపాలంభించ సాగినది.

''అనుచు ననవింటి వెనుదంట నాడరాని<br>
గెంటసములాడి మఱియు నమ్మింట మూరి<br>
గలయ నెక్కించుకొని వచ్చు మలయనగ భు<br>
జంగ విషదిగ్ధ పవనుపైఁ జలము వొడమ" —వసు. 4-44

ఇట్లు ప్రార్థనాపూర్వకముగా శాసించుచున్నది -

"విరియుఁ గువయంబు విక్షిపదంబు చళించు<br>
నెసగు భువన భంగ మీవు వొలయు<br>
మలయవలదు పవన జలద వేణికలపై<br>
మలయవలదు పవన వలయ భవన'' —వసు. 4-45

మలయ పవనుని దెబ్బకు భూవలయమే చలించి పోవుచున్నది! ఇక కన్యామణు లెంత? ఇట శ్లేషానుప్రాణితమైన సార్థక పదప్రయోగమున్నది. ఇంకను ఇట్లు ఎత్తి పొడుచు చున్నది :-

''కీలియు నీవు గూడి యుడికింతురు లోకమటంచు నెప్పుడున్<br>
మూలలవైచె మిమ్ము నలుమోముల వేల్పటు వైచినం జనం<br>
జాలక హవ్యవాహనుని సంగతి నుండి జగంబు గాలుపం<br>
గాలు పదంబు చేరితి ప్రకంపన నీవనుకంప చాలమిన్" -వసు. 4-46

"పవనా!

నీవు నిర్దయుడవు. నీదుష్టగుణము నలువకు బాగుగా తెలియును. సందు దొరికినచో జగముల నాశము చేసెదవేమో అని భయపడి ఆ చతుర్ముఖ బ్రహ్మ ఆగ్నేయ మూల యందు అగ్నిని (నీమిత్రుని) ఉంచి నిన్ను దూరముగా మరొకమూలకు (వాయవ్య మూలకు) విసరివైచెను. దుర్మార్గ బుద్ధిని వదలు వాడవు కావుగా నీవు! నీ

వంతటితో ఊరుకున్నావా? మరల హవ్యవాహనుని ప్రక్క చేరుకున్నావు. దక్షిణదిశ కాలునిది గదా, యముని స్థానమాక్రమించి అంతక బుద్ధిని కలిగి యున్నావు. ఇక నీవు చంపుటకు జంకుదువా" అని తెగ దిట్టినది.

ఈ పద్యమొక రత్నము.ఎంతయో భావుకతను సంతరించుకొన్నది! అగ్ని ఆగ్నేయ దిశాధిపతి. వాయువు వాయవ్యదిశాధిపతి. ఒకదానికొకటి ఎదురు. అవి రెండును లోక బాధకములని (రెండును కలిసినపుడు) బ్రహ్మ ఆమూలకు, ఈమూలకు, విసరి వైచినాడని సమర్థించుట ఎంతయో గొప్పగా నున్నది; (దక్షిణానిలము=దక్షిణ దిక్కు నుండి వసంత వాయువు) పైరగాలి బయలు దేరును. ఆ గాలి విరహిణులకు సహింప రానిది. దక్షిణ దిశాధిపతి యముడు. విరహిణుల బాధించుటకే వాయువు తన స్థానమును వదలి (వాయువ్యమును) దక్షిణ దిక్కుజేరినట్లుగా - కాలుని స్థానమాక్రమించి నట్లుగా - వర్ణించుట సహజత్వమునకు హేతువు కల్పించుట. ఇది గొప్ప ప్రజ్ఞావిలసనము.

మలయపవనుడు లోక కంటకుడు. చావడు. వానిని చంపుటకు విష్ణువు వేరే అవతారము ఎత్తవలెను.

"ఆమితోల్లాసి పలాశివృత్తివయి బాల్యావస్థ గొల్లాడితా
సుమనస్సంపద నింకనీవతను విస్ఫూర్తిన్ విజృంభింప లో
కము ధూళింజనదే ప్రభంజన రమాకాంతుం డనంతావతా
ర మహాయత్నము పూనికాని నిను దీర్పంజాల డల్పంబునన్" —వసు. 4-48

ప్రభంజనుడు (లోకమును మిక్కిలి భంజించువాడు!) రాక్షసుడు-బాల్యములోనే దేవతల నల్లాడించినవాడు (పిల్లవాయువుగా నుండియే పూలన్నిటిని రాల్చినవాడు) వాడిపుడు విజృంభించినచో లోకములు ధూళియైపోవును. ఇదివరకేవో కొన్ని అల్పావతారములెత్తి విష్ణువు రాక్షసుల సాధించెడి వాడు. ఇక అతనికోసమై అనంతావతార మెత్తవలసి యున్నది. అపుడుగాని వీడు సాధ్యుడుగాడు. అపుడు గాని వీడు రూపఱడు. (అనంతుడు=సర్పరాజు. సర్పమునకు వాయువు ఆహారము). శ్లేషార్థ ప్రయోగము.

"అని వనిత నాలిగాలిం
గనలుచుఁ బోనాడి తుహినకర కిరణ రుచిన్
మునుగజన జెలులు హాయని
వనరుచు తను నడ్డగింప నళి శోకమునన్" -వసు. 4-51

"ఆ జాబిల్లి వెలుంగు వెల్లికల డాయన్ లేక రాకానిశా
రాజశ్రీ సఖమైన మోమున పటాగ్రంబొత్తి యెత్తి యా
రాజీవానన యేడ్చె కిన్నర వధూ జక్కరాంభోజ కాం
భోజీ మేళ విపంచికా రవ సుధాపూరంబు తోరంబుగాన్" -వసు. 4-52

వెన్నెలలు విరహిణులకు వేడిగా నుండును. గిరిక వెన్నెల వేడికి తట్టుకొన జాలక పోయినది. ఆమె రాజీవానన! రాజీవ చంద్రుల మధ్య పగ యున్నది. అందులకామె మోమును జూచిన చంద్రునికి మంట! ఈమె ముఖముగూడ పూర్ణచంద్ర సదృశమే! అందుచేతనే బాధించుచున్న చంద్రుని చూడగూడదని మొగముపై బట్టగప్పకొని యేడ్చినది. బాధలలో, స్త్రీలు మొగముపై పైటకొంగు కప్పుకొని యేడ్చుట పరిపాటి.

విరహిణులపై చంద్రున కెంతో ప్రభావమున్నది. ఉపాలంభన భట్టుమూర్తి చేతిలో సాగినంత వేగముగ మరెవరి కావ్యములందును సాగలేదు. కఠిన పదప్రయోగ మెందును కనిపించదు. ఉపాలంభన చేయుచున్నది సుకుమారియైన రాజకాంత యని అతడు మరువడు. కాని నోటిమాటలలో రాజసమైన దూకుడు కనిపించకపోదు. వ్యక్తి స్థాన సహజమైన భావము, దానికి అనుగుణమైన భాష, దానికి సరిపడుశైలి - ఇవన్ని యును సమపాళ్ళలో భట్టుమూర్తిలోనే చూడగలము. ఎక్కడగూడ పొల్లు మాట కనిపించదు. సార్థకత లేని పదము కనిపించదు.

తెలుగు పదముల కెంత శబ్ద సౌందర్యము, అర్థశక్తి, వ్యంగ్యస్ఫూర్తి, చమత్కార పుష్టి, శ్లేష గర్భిత, గలవో - అది భట్టుమూర్తి రచన వల్లనే తెలియుచున్నది.

ఉపాలంభనము నందఱు కవులును సాగించినారు. అందటి రచనయును చాల సొగసును సంతరించు కొన్నది. చంద్ర మన్మథ మలయమారుతోపాలంభనల మూడింటిని సాగించిన వారు నలుగురే. వారు 1. పెద్దన (మనుచరిత్ర), 2. సూరన (ప్రభావతీ ప్రద్యుమ్నము), 3. రామరాజభూషణుడు (వసుచరిత్ర) 4. చేమకూర వెంకటకవి (విజయ విలాసము).

ఒకరి కొకరు పోటీపడి వ్రాసినట్లున్నది. పెద్దనకు వీరెవరితోగూడ లేదుగాని నైషధకారునితో (శ్రీనాథునితో) పోటీయున్నది. సూరనకు భట్టుమూర్తితో పోటీ యున్నది. అందరి రచనలను మించిన పోటీ రచన భట్టుమూర్తిది యని తేలినది.

## చంద్రోదయాది వర్ణనలు - విజయవిలాసము

తనకు పూర్వులైన పెద్దనాది ప్రబంధకారులవలె చంద్రోదయమును, చంద్రికా విలసనమును, ప్రత్యేకముగ వర్ణింపలేదు విజయవిలాసకారుడు. సూర్యాస్తమయ చంద్రోదయముల నొకపరియే వర్ణించుటతప్ప (విజయ. 1-208, 209) ప్రత్యేకించి చంద్రోదయ వర్ణన చేయలేదు, చంద్రికా వికసనముగూడ (విజయ. 1-210, 212,

213) కామోద్రిక్తతను హెచ్చించు మన్మథ, వసంత, మలయపవన, మధులిట్టులతో కలిపి వర్ణిత మయినదేగాని ప్రత్యేకముగ వర్ణింపబడలేదు.

## చంద్రాద్యుపాలంభనము

శిశిరోపచారముల యనంతరము చంద్రాద్యుపాలంభనముకావించినాడు చేమకూర కవి. ఈ విషయమున నితడు పూర్వప్రబంధకారులనే యనుసరించినాడు.

విజయ విలాసమందలి ప్రకృతి వర్ణనలలో ఉపాలంభనము చక్కని భాగము. పూర్వకవులకంటె ప్రత్యేక పద్ధతిలో కావింపవలెనన్న పట్టుదలతో కావించినాడు.

## మన్మథోపాలంభన

మన్మథోపాలంభనము చాల చమత్కారముగ నడిచినది. చెడుసహవాసము చేసెడి వారిని,ఒకవైపు వారి మంచితనమును ఉగ్గడించుచు మెత్తమెత్తగ చీవాట్లుపెట్టినట్లున్నది క్రింది వర్ణన.

> ''చక్కని వారిలో మిగులఁ జక్కనివాడవు గాన నీ వలెన్
> జక్కనివారిఁ జంద్రుని వస తునిఁ గూరుచుకొంటి నందమాఁ
> జక్కెరవింటిరాజ. యొకసక్కెమదేమని కూర్చుకొంటి వ.
> మ్మక్కయరూపకఁబయిన యాయెలతెమ్మెరనాలి బూతమున్'' -విజయ. 3-45

మిత్రభేదమును పాటించి మన్మథుని మలయమారుతముయొక్క సంగతినుండి వేరు చేయు పయత్నమది. చక్కని వారు గాన చంద్రుని తోడను వసంతునితోడను సాంగత్యము ఫరవాలేదని పైన వర్ణితము. కేవలము మలయమారుతముతోడి పొత్తుమాత్రమే మంచిది గాదని సుభద్ర చెలికత్తెలు నిషేధించినారు.

దండనాథుడయిన యీ కవికి భేదోపాయమందభినివేశమున్నట్లు చక్కగా విదిత మగుచున్నది. మన్మథ పరివారము నంతటిని మన్మథునుండి ఒక్కొక్కరినే వేరుచేసి మన్మథుని మాత్ర మేకాకిగాచేసి వేయవలయునను ఉద్దేశము స్పష్టముగా నీక్రింద గూడ కన్పట్టు చున్నది.

> ''అలరు విలుకాడ వమృతము
> చిలికెడు నెఁయ్యేల సాఖిచేగాదె విభ్యో

గుల నేచక వి డ్లమ్ముల
గలవారికిఁ దోడు చల్లకడవలవా రే" -విజయ. 3-44

పై విధముగ నన్న తరువాత చంద్రుని దుర్మార్గ ప్రవర్తనను ఎత్తిచూపి అతనితో చెలిమి వలదనుచున్నారు చెలికత్తెలు -

"రమకు నట్టింటి పగవాడు కమలవైరి
కంసుబోలిన యుగ్రశేఖరుడు వాడు
మేనమామని చూడకు మాను చెలిమి
యకట పై వచ్చు తెలుగవే హరికుమార" -విజయ, 3-45

మేనమామయయిన కంసుని వలన నీ తండ్రికి (కృష్ణునికి) అపాయము వచ్చినది. నీ మేనమామ యయిన చంద్రుని వలన నీకుగూడ అట్లే అపాయమువచ్చును. గాన చంద్రుని చెలిమి వదలుమని సుభద్ర చెలికత్తెలు హితోపదేశము చేయుచున్నారు.

వసుచరిత్రలో గూడ నిట్లే హితోపదేశమును మన్మథునికి చేయుట జరిగినది (వసు. 4-39) పై వర్ణన వసుచరిత్రలోని దానికి ప్రతిరూపమని చెప్పుటకు వీలుగాదుగాని తదనుసరణ మిట కన్పట్టుచున్నది.

## చంద్రోపాలంభనము

చంద్రదర్శనము మదనార్తికి ప్రబల హేతువు. వసుచరిత్రలో వలె నిట నాయిక చంద్రదూషణగావించుటలేదు. మొదట నాయిక చెలికత్తెలు కావించుచున్నారు. వసుచరిత్రలో వలె చంద్ర దూషణ దూకుడుగా లేదుగాని నిందలతో, హేళనా పూర్వకమైన దెప్పుళ్ళతో నిండియున్నది.

"అందినన్ సిగయు నందక యున్నను కాళ్ళు పట్టుకొందువు హరిణాంక (విజయ. 3-51)" అనియు, ఆ సందర్భముననే "వేలకొలదుల్ గద నీ నడకల్ (విజయ. 3-51)" అనియు, ''క్షీరసాగరమధన సమయమున పుట్టిన విషమును. నిన్నును త్రాగు తలఁబోసికొమ్మని హరునకిచ్చె (3-53)" ననియు, 'చనిపో' యియు అదృష్టరేఖ చే రక్కొనిక్రమ్మరం బ్రదికి రాగ (మన్మథుడు) వజీర్లయినారుగా శశీ (విజయ. 3-54)" అనియునన్న దెప్పిపొడుపులు ఉదాహరణములు.

వసుచరిత్రలో 'విషరాశింజనియింపవో, విషసహోవిర్భూతివాటింపవో, విషభృన్మార్గమునంటవో (వసు.4-30) అన్న పద్యార్థమునకు సమానమైన యీ క్రింది వర్ణన చక్కని వ్యంగ్య స్ఫోరకమైన నింద గలిగి యున్నది.

> "కలశవారాశిఁ బుట్టుట కప్పెనయుట
> శైలచాప శిరోధి వాసంబు గనుట
> యెవ్వరికి నంట రాకుంట యెఱిఁగి, కాల
> కూటమన నేమి నినుఁ జంద్ర నేటినుండి"  -విజయ. 3-52

## మలయమారుతోపాలంభనము

మలయపర్వతమునుండి వచ్చునది గాన దీనికి మలయ మారుతమని పేరు. గంధపు చెట్లుగల పర్వతమునుండి వచ్చుచున్నది గాన సుగంధము గలిగియుండును. చందనగంధము గలది గాన మలయపర్వతమునకు గర్వము గలదు. అట్లే తామరలు గల కొలకునకు గూడ గర్వముండును. అందులకై ఈర్ష్యగొని మలయపర్వతమును, తామరలకొలకులరమయును ఆమెపైకి మలయమారుతమును పురికొల్పుచున్నారా అని సుభద్ర చెలికత్తెలు నిందించుచున్నారు. (విజయ. 3-48).

తెమ్మెరలు, సర్వబలమును కూర్చుకొని దండయాత్ర సాగించుచున్నట్లుగా గల యీక్రింది వర్ణన చేమకూరకవి దండనాథత్వమును చాటుచున్నది.

> "తెమ్మెర నీకెంతెమ్మెర
> కమ్మని విలుకాని దొరవు కమ్మని నెలఁ జై
> రమ్మని యళి పిక శుక నిక
> రమ్మని గా నిలిపిముందరగవచ్చితివా"  -విజయ. 3-48

ఒకవైపు ప్రార్థన, ఒకవైపు బెదిరింపుగల యీక్రింది వర్ణన సార్థక పదప్రయోగము గూడియున్నది.

> "జొహారు మీకుఁ జల్లగాఁగఁ జూడుడో సమీరకం
> జహారులార, మంటమారి శంబరారిఁగూడి యీ
> గొహారు సేయనేల యాచకోర లోచనన్? భుజం
> గహారు పాదమాన మీకుఁ గాక లింకరేచినన్"  -విజయ. 3-49

భుజంగహారశబ్దము సాభిప్రాయముగ ప్రయోగించిన శబ్దము. ఆ శబ్దమువలన మన్మథునికి గూడ భయము గలుగును. భుజంగ శబ్దమువలన మందమారుతమునకును (సర్పము గాలి మేత్తరి) చంద్రునకును (రాహువు సర్పరూపుడు) భయమే.

## పికోపాలంభనము

కాలము చాల విచిత్రమైనది. మిత్రులు శత్రువులగుటయు, శత్రువులు మిత్రులగుటయు గూడ సంభవించు చుండును.

> "మా కలకంఠియు నీవును
> నేకగ్రీవముగనుందురిన్నాళ్లు నయో
> కోకిల యిపుడే లంచెదు
> నీ కగునే యిగురుబోడి నెత్తురుద్రావన్''
>
> -విజయ. 3-55

పై "ఏకగ్రీవముగ నుందురిన్నాళ్ళు'' అన్న ప్రయోగము సాభిప్రాయమైనది. సుభద్ర కంఠము గూడ కోకిల కంఠమే అని అర్థము. అందుచేత స్పర్థగూడ నుండుటకు వీలున్నది. అందులకే కోకిల తన కంఠముతో సుభద్రను బాధించుచున్నది. "ఇగురుబోడి నెత్తురు ద్రావన్" అన్న ప్రయోగము గూడ సార్థకముగనే యున్నది. సుభద్ర యిగురుబోడి. కోకిల ఇగురును భక్షించునది. అందులకే చిగురుకాలము వచ్చుసరికి అంతవఱకు మిత్రముగానున్న కోకిల ఇగురుబోడిని బాధించుచున్నది. కాలము మార్పు ననుసరించి మిత్రులు శత్రులగుట, శత్రులు మిత్రులగుట, అను ధర్మము నెరిగిన రాజకీయ వేత్త చేమకూరకవి.

## మరాళ పిక కేకి చకోరోపాలంభనము

ఒకే గుక్కలో కేకి చకోర మరాళపికముల ఉపాలంభనము జరుగుచున్నదే. ఇక్కడ గూడ భేదోపాయము పాటింపబడుచున్నది—

> కల్లరి త్రాచు నిప్పుకలు గైకొను కేకి చకోర పాళికిం
> జెల్లినఁ జెల్లుగాక సరసీజబిసంబు లిగుళ్ళు మేసి భా
> సిల్లెడు మీకయో విషము చిల్కగ వేడిమిగుల్కఁబల్కగాఁ
> జెల్లునె? యో మరాళ పిక శేఖరులార, వచింపుఁడింపుగన్"
>
> —విజయ. 3-57

నెమిళ్లు సర్పములను తినును. చకోరములు నిప్పులను మ్రింగును, కావున అవి సహజముగ క్రూరమైనవి. మరాళములు బిసకాండములను, పికములు చిగుళ్ళను మేయును. అవి సహజముగ సాధువైనవి. సాధువులైన యీ పికమరాళములు, పై కేకీచకోరములవలె విషము క్రక్కుటయును, రూక్షముగా పల్కుటయును చేయ గూడదని సుభద్ర చెలికత్తెలు మోమోటమిగ పలుకుచున్నారు. సుభద్రను బాధించుచున్న కేకీచకోరమరాళ పికములన్నియు చెడ్డవన్న భావమును పైకి చెప్పకుండ వ్యంగ్యముగ చెప్పి నట్లయినది.

ఇతర ప్రబంధములందలి యుపాలంభనముకంటె విజయవిలాసమందలి యుపాలంభనము భిన్నమయినది. ఇందు దూతకుడు లేదు. కాని మంద లింపులున్నవి. వినతులున్నవి. తనచెలికత్తెలు ఉపాలంభన కావించిన తరువాత సుభద్ర కూడ ఉపాలంభన కాని ఉపాలంభనము కావించు చున్నది. ఈ క్రింది వర్ణన చాల సొగసైన వర్ణన.

"ఈ క్రొవ్విరులఁ గ్రోలు నెలతుమ్మెదలు చెక్క
 చెమరింప కున్నవా చిగురుబోడి
ఈ కెంజిగురు మెక్కు కోకిలానీకముల్
 వసివాడకున్నవా వనజగంధి
ఈ నిండు వెన్నెలలాను చకోరముల్
 కసుగిందకున్నవా కంబుకంఠి
ఈ తూఁడ్లు భుజియించు జాతియంచలు సొట
 సొటలువోకున్నవా శోభనాంగి

తెలిసిరారమ్మ కలదుసందియము చాల
నలికి పడకవి లెస్సలై యుండెనేని
వజ్రికాయములే యౌను వానికెల్ల
నవుడు విరహుల యవడికినవధిలేదు" —విజయ. 3-62

పై పక్షులు వజ్రకాయములు గలవి యగుటచేత తన బాధకంతులేదని యభిప్రాయము.

చలిగాలిని ఉపాలంభించుచు సుభద్ర తన అవశతను, అశక్తతను చాటుచున్న ఈ క్రింది భావము సొంపుగ నున్నది.

"చలిగాలి గర్వమునఁ బం
గలిగెంజిలువలనియుఁడగా వానిపయిన్
గలిగె శిఖావళముఁ యో
చెలి తప్పనె వాయుసఖము శిఖియనువార్తల్" —విజయ. 3-63

పై పద్యము మనుచరిత్రమందు మలయమారుతోపాలంభనలోని "నాలుకలు రెండు నిన్నుం గ్రోలనె కల్పించె నలువ ఘోరాహికి (మను. 3-51)" అన్నపద్యమునకు దాదాపు అనుకృతిగా నున్నది. అట్టి సందర్భములోనే వసుచరిత్రకారుడు వ్రాసిన "కీలియు, నీవుగూడి యుడికింతురు లోకమటంచు నెప్పుడున్ మూలలవైచె మిమ్ము నలుమోముల వేల్పటు వైచినంజనం జాలక (వసు. 4-46)" అన్న పద్యానుసరణము గూడ గలిగియున్నది.

చంద్రుని నిందించు తఱి పెద్దన "గోవధము సేయు తురకల దైవంబవు (మను. 3-42)" అన్నట్లుగానే విజయవిలాస కర్తగూడ "తమినేడిది గోవధమాచరించుఁ బెంపడరలతాంగి పచ్చి తురకేగద యమ్మదనుండు చూడగన్ (విజయ. 3-66)" అన్నాడు. హిందూ మహమ్మదీయ పరస్పర ద్వేషములు రాయలవారి కాలములోవలె రఘునాధ రాయల కాలములో గూడ నున్నవనుటకు పై భావములు తార్కాణములు. కవులు, వారి మనసు లందలి రాగద్వేషములను ప్రకృతి వర్ణనద్వారా ప్రతిబింబింపఁజేయుట అపూర్వమైన విషయముగాదు.

విరహదశలో నున్నపుడు బాధించిన ప్రకృతి సంయోగదశలో బానిసగానయినట్లు వర్ణించిన ఘనత విజయవిలాసకారునికి దక్కినది. అపుడు ఆమె నేడ్పించిన శుకపికాదు లిపుడు సుభద్రను కొలిచియుండి సేవలు చేయుచున్నవని వర్ణింపఁబడినది.

''జిలిబిలి వలినాలి మొలక తెమ్మెరలు గ
 మ్మని మేని తావుల ననుసరింప
నలరుఁ దేనియలాని యలరు దుమ్మెద దిమ్మ
 జంటచూపుల వెనువెంటఁ దిరుగఁ
జికురాకు మేతలఁ బొగరొందు కోయిలల్
 పాటల నీటువెంబడి మెలంగఁ
గుల్కు బల్కుల ముద్దుగుల్కు చిల్కలు నేర్పు
 పలుకుల బెళుకుల పజ్జనిలువ

సతియుఁబతియును నారామతతుల నతుల
రతులఁ బెంగిరి చతురత లతిశయిల్లఁ
దొలుతఁదము నేచు వారలే కొలిచియుండు
వేడ్క కన్నను మరి వేఱ వేడ్కగలదె"

—విజయ. 3-226

పై భావమునకు ఛాయ వసుచరిత్ర యందుగలదు. అందు కీరముల నాఁగించు కొనుచు, అంచల వేడెంబులరసికొనుచు, నీలకంధరోజ్జ్వలగతుల్ గాంచికొనుచు, అరుణాప్తఖగ విహారప్రౌఢిఁ బొగడికొనుచు...సముచిత క్రీడసలిపిరి సతియుఁబతియు" అని యున్నది (వసు. 6-97). ఒకప్పుడు బాధాకరములయిన కీరములు, అంచలు, కేకులు, చక్రవాకములు, ఇప్పుడు తమ చెప్పుచేతలలో నున్నవని పైన వర్ణితము.

చంద్రాద్యుపాలంభన సాహిత్యము "ప్రకృతి మానవీకరణ"కు ఉదాహరణము. విజయవిలాస కర్త గావించిన ఉపాలంభనము మను వసుచరిత్ర లందలి వానికి దీటుగనే యున్నది. వారు చిలుకలను, హంసలను, పికములను, కేకులను ఉపాలంభింపలేదు. కళాపూర్ణోదయ కర్త మాత్రము చంద్ర మదన మలయమారుతములనే గాక శుకపికాదుల నుపాలంభించినాడు. విజయవిలాసకారుడా విషయమున మరియొక ఆకు ఎక్కువ చదివి నాడు.

## చంద్రాద్యుపాలంభన

| | చంద్రో పాలంభన | మన్మథో పాలంభన | మలయమారుతో పాలంభన | మొత్తము |
|---|---|---|---|---|
| 1. హర్షనైషధము .. | 33 శ్లోకాలు | 25 శ్లోకాలు | - | 58 |
| 2 శృంగార నైషధము .. | 11 పద్యములు | 6 పద్యములు | - | 17 |
| 3. కుమారసంభవము .. | 3 .. | 1 ,, | 1 | 5 |
| 4. మనుచరిత్ర .. | 9 ,, | 3 ,, | 3 | 15 |
| 5. పారిజాతాపహరణము | 1 ,, | - | - | 1 |
| 6. ఆముక్తమాల్యద .. | 11 హర్యుపాలంభ | - | - | 11 |
| 7. కళాపూర్ణోదయము .. | 4 ,, నము | - | - | 4 |
| 8. ప్రభావతీప్రద్యుమ్నము | 5 ,, | 1 ,, | 4 | 10 |
| 9. వసుచరిత్ర ,, | 11 ,, | 6 ,, | 7 | 24 |
| 10. విజయవిలాసము ,, | 1 ,, | 3 ,, | 3 | 7 |

కళాపూర్ణోదయమందును, విజయవిలాసమందును శుకపికాదుల ఉపాలంభనము గూడ గలదు.

### వేగుచుక్క

సాహిత్యమందు వేగుచుక్కకు కొంత ప్రాధాన్యము గలదు. సమయ బోధకత కిది యవసరము. కవులు తమకావ్యములలో దీనికి ప్రాధాన్యమును కల్పించియున్నారు విరహోత్కంఠితలగు నాయికలు చంద్రాతపమున రాత్రంతయు వేగిపోయి విసిగి వేసారిన తరుణమున - చంద్రుని బారినుండి తప్పించుకొనుట యెపుడా అని చూచుచుండు నవసరమున - ఇక సూర్యోదయము కాబోవుచున్నదని ముందే తెలుపునట్టి వేగుచుక్క యొక్క పొడుపు - ఆ విరహిణులకు ఓదార్పుగ నుండును. కవులందఱును ఆ ప్రయోజనము నపేక్షించియే - అట్టి ఘట్టములందే వర్ణించియున్నారు.

## మనుచరిత్ర - వేగుచుక్క

మను చరిత్రయందు వేగుచుక్క వర్ణన చాల మనోహరముగ నున్నది. సమయ స్ఫూర్తిగలిగి యున్నది. వరూధిని రాత్రంతయు వెన్నెలలో వేగిపోయినది. చంద్ర మదన మలయమారుతోపాలంభనలు కావించినది. బాధ ఇంకను తీవ్రమైనది గాని ఉప శమనము పొందలేదు. ఇక తెల్లవారిన గాని ఆ ఉపశమనము లభింపదు. ఎపుడు తెల్ల వారునా అని చూచుచున్నది. ఈ తఱిని వేగుచుక్క ఉదయించు చున్నది. విసిగిన వారికి ఆశావహముగ నున్నదీ వేగుచుక్క ఉదయము.

> "సకుటుంబముగ వీగి చరమశైలముఁ జేరు
> తుహినాంశు దముదారు దొరయనంగ
> నాసీరమై వచ్చు నలిన బాంధవు టెక్క
> యంబుపై దీపించు నద్దమనగ
> నరుణాగ్ర నిబిడ వాద్యములతోఁ గనుపట్టు
> సమయ శాంఖికు చేతి శంఖమనగ
> ఇనుడప్పుడజూడాట మునుమున్నపడి వాగె
> గొనివచ్చురాయంచ కొదమ యనఁగ
> నుదయగిరి మీద గోపురంబుండి నిగుడు
> నహిత రవిరశ్మిచే బద్ధుడగుచుఁదోడి
> బెఁగమైనట్టి చుక్కల వలస త్రోవ
> జూపనేతెంచె నన వేఁగుచుక్క వొడిచె"
>
> -మను. ఆ. 3-54

బాధాకరుడగు చంద్రదతిరోగమనమును సూచించుచున్నది గాన వరూధినికి ఊఱట కలుగును గదా!

## వేగుచుక్క - కళాపూర్ణోదయము

కోడి రెపరెప ఱెక్కలు కొట్టుకొనుచు కూత వేసినది. ఱెక్కల చప్పుడు అసమ శరుడు తప్పెట కొట్టుచున్నాడా యన్నట్లున్నది (8-25). కోడికూత గూడ మన్మథుని కేక వలెనే యున్నది.

అప్పుడు——

> "పారదబద్ధ సద్ఘుటిక పాకపరీక్ష గొనంగ జంద్రికా
> క్షీరమునంచునన్ సమయ సిద్ధుడు పెట్టెననంగ జాలనా

ప్పారెను వేగుచుక్క యది యంటిన చోటు సువర్ణమయ్యెనో
నా రమణీయమైన యరుణద్యుతి దద్దయు దూర్పుశోభిలెన్" కళా— 8—28

వసు చరిత్రమునగూడ నిట్టి పరిస్థితిలోనే వేగుచుక్క వర్ణన గలదు.

గిరిక వసురాజుపై విరాళిగొన్నది. వసురాజు ప్రేమ నామె యెఱుగదు. విరహ తీవ్రత హెచ్చినది. చంద్రాద్యుపాలంభన గావించినది. నీరసించి పోయినది. చెలులు తత్తరపడి పోయిరి. మంజువాణి వసురాజు చిత్తమఱసి వత్తునని ఎగిరిపోయి తిరిగి వచ్చినది. మంచివార్తే చెప్పినది. గిరికకు మరింత కూతూహలము అధికమయినది. కాలము ఎంతకును జరుగలేదు. ఈ నిరీక్షాసమయమున ఓదార్పుగా ఇక తెల్లవారును అన్నట్లుగా వేగుచుక్క ఉదయించినది. చంద్రుడస్తంగతుడయినాడు. రాత్రంతయు నిశాపతితో చంద్రుడు కవయగా మేనిగంధపుపూత రాలినట్లును, చంద్రుడాకాశమును వదలుట శయ్యను వదలినట్లును, రతిసంభ్రమమున తెగిన ముత్యాల హారముయొక్క ముత్తెములను ఏరి కుప్ప పోసెనా అన్నట్లుగను వేగుచుక్క ప్రకాశించెను.

"అమృతాంశుండు నిశాసతిం గలిసి శీర్యచ్చంద్రికా గంధ శి
ల్పముతో బుష్కర శయ్య బాసి చన వేళాదూతి తత్కాలసం
భ్రమ సంశీర్ణతరోరుహారమణి వారంబేరి తానొక్కచో
గుమిగా బోసెనొనా మినుక్కురను వేగుంజుక్క గంటే చెలీ" -వసు. 4-127

రతిసమయ వస్తువులతోనే వేగుచుక్కను పోల్చుట రసభావ బంధురతకు ఉదాహారణముగా నున్నది.

## చంద్రాస్తమయ సూర్యోదయ వర్ణన

ఇది చాల సుందరమయిన వర్ణన. సంస్కృతాంధ్రకవులు చాలమందిచేసి యున్నారు. కవులయొక్క భావనాశక్తికిని సౌందర్య దృష్టికిని దీనిని ఉదాహరణముగా చెప్పవచ్చును.

### కుమారసంభవమున

అష్టమాశ్వాసములో చంద్రాస్తమయ సూర్యోదయములను ఒక్కపద్యములో వర్ణించినాడు కవి.

''అస్తగిరి బొందెరా జుదయాద్రి నెక్కె
నినుడు తేజస్వులగు వారి కెల్ల ప్రొద్దు
మానితంబగు నిలనొక్క మాటపొందు
హాని వృద్ధులు సూచించునట్ల పోలె'' -కుమా. 8-190

పై పద్యమున లోకానుభవము వ్యక్తమగుచున్నది.

ఈ వర్ణనను నన్నెచోడుడు అభిజ్ఞానశాకుంతలమునుండి గైకొన్నట్లు ఈ క్రింది శ్లోకము నిదర్శనము. ఇది చతుర్థాఙ్క విష్కంభమునందలిది. శిష్యుడు నిద్రనుండి లేచి పూర్వాకాశమును పశ్చిమాకాశమును చూచి ఇట్లనుచున్నాడు.

''యాత్యేకతో౽స్త శిఖరం పతిరోషధీనా
మావిష్కృతో౽రుణ పురస్సర ఏకతో౽ర్కః
తేజోద్వయస్య యుగపద్వ్యసనోదయాభ్యాం
లోకో నియమ్యత ఇవాత్మ దశాన్తరేషు'' శాకుం. 4-2

(చంద్రుడు అస్తగిరికి పోవుచున్నాడు. సూర్యుడుదయాద్రి నధిరోహించుచున్నాడు. లోకములో మానవులకు కలుగు హాని వృద్ధులిట్లే యుండును.)

**మనుచరిత్రలోని** వర్ణనను ఒక చిత్రమును వలె వర్ణించినాడు పెద్దన. ఇందు ప్రయోగించిన పోలిక చాలమనోజ్ఞముగ నున్నది.

బ్రహ్మాండమంతయు ఒక సాము గరిడిసాల. దానిలో ఎరుపురంగుగల ఇసుకగాని, మట్టిగాని, యుండవలెను. సంధ్యారాగమే ఆ యెఱ్ఱమట్టి. కాలము, జెట్టియన్నమాట; ఆ జెట్టికి ఉదయాద్రి ఒక మూపును, అస్త్రాద్రి ఒక మూపును, అయి యున్నవి. సంకోల్తా అనగా గరిడి సాధనము. దానికి నిరువైపులను రెండు గుండ్లుండును. క్రుంకుచున్న చంద్రుడును, ఉదయించుచున్న సూర్యుడును ఆ సంకోల్తాకు రెండువైపులనున్న గుండ్లు. ఇది యొక చక్కని దృశ్యము.

పై వర్ణన ప్రకరణానుబంధము గలిగి యున్నది. వరూధిని రాత్రంతయు విరహబాధ ననుభవించినది. చంద్రుని దూషించినది. చంద్రాస్తమయము కొఱకు ఎదురు చూచు చున్నది. సూర్యోదయము కొఱకు అఱ్ఱులు చాచుచున్నది. ఆమె మనస్సుకు ఊఱట కలిగించునట్లుగా, ఒకేపరి, చంద్రాస్తమయమును, సూర్యోదయమును జరిగినవి (మను. 3-59)

## వసుచరిత్ర

మహాభావుకుడయిన భట్టుమూర్తి ప్రాతఃకాల వర్ణనలు చేయుసందర్భమున చంద్రాస్తమయ, సూర్యోదయ వర్ణనను రెండు పద్యములలో రమణీయముగ చేసినాడు.

"తారాసస్యము పండినన్ గగన కేదారంబునం జంద్రికా
నీరంబారగ గోసి తద్రుచి ఫలానీకంబు ప్రాతర్మహా
సీరిగ్రామణి తూరుపెత్తెనన దోచెం దూర్పునం దెల్పు త
ద్దూరస్య స్తపలాల రాశిక్రియ నిందుండేగె నిస్సారుడై" -వసు. 4-130

ఆకాశమను వరిమడియందు నక్షత్రములనెడి పంట (సస్యము), పండినది. చంద్రికా నీరమును అరగట్టి ప్రాతఃకాలము సూర్యుడు అను రైతు, పంటకోసి, ధాన్యముచేసి తూర్పెత్తి చేటలతో విసరగా నిస్సారమైన పొల్లంతయు పడమటివైపు విసరగొట్టబడి పోగయినది. అదియే చంద్రుడు. చక్కని చిత్రము వర్ణితము.

## మరియొక పద్యము

"కుముదాధార విహారముల్ కమల కన్గో జాల కంభోజ గే
హము మూయందెఱపింతు వేగనని వామాలోకమున్మా టియా
సమయోపేంద్రుడు దక్షిణాక్షి దెఱచెన్ సంజాత రాగానుబం
ధముతో వారిధుడేగె బ్రొద్దు పొడిచెన్ బంధూక బంధుచ్ఛవిన్"-వసు. 4-186

తనకున్న రెండు కండ్లలో ఒకేసారిగా ఒకటి మూసివేసి రెండవది తెఱచినాడు విష్ణువు. వలకన్నుసూర్యుడు, డాకన్ను చంద్రుడు. వర్ణన చాల ప్రజ్ఞావిలసితముగా నున్నది.

## పారిజాతాపహరణమున

ఈ దృశ్యము ముక్కుతిమ్మనకు మరొకవిధముగ సాక్షాత్కరించినది. పై వారివలె గాక యితడు సూర్యాస్తమయమును, చంద్రోదయమును ఒకేసారి కలిగినట్లుగా సాయంకాల వర్ణన చేయుచున్నాడు

సూర్యుడను అరటి దుంపను (ఎఱ్ఱనిది) పశ్చిమమను పొలమున నాటగా అది ఎదిగి, గెలవేసి తూర్పువైపుగా వ్రాలినది. ఆ గెలయే చంద్రుడు.

"పొందుగ పశ్చిమాబ్ధి తట భూస్థలి నంశుమదంశు మత్ఫలా
కందము వాసరాంత హాలిక ప్రవరుండిడ సాంధ్యవారి భృత్
కందళముల్ తమోదళ యుతంబులునై గెలపండి వ్రాలె బూ
ర్ణేంద్రుని పేర బ్రాచినది హేతువు వెన్నెలకల్మి కల్మికిన్" -పారి. 2-42

సూర్యుని వల్లనే చంద్రునికి ప్రకాశము గలదని వ్యంగ్యముగా స్ఫురింపజేసినాడు కవి.

చంద్రాస్తమయ, సూర్యోదయముల నొక్కసారే వర్ణించుటవలన మనకొక రహస్యము వెల్లడి యగుచున్నది. చంద్రోదయాదివర్ణనలు ఎల్లపుడును, వసంతకాలముననే జరుగును. అనగా వసంతర్తువు మొదటిలోనే యని భావింపవలెను. ఇది సరిగా విషువత్ కాలము. ఇది మార్చియందును సెప్టెంబరునందును 21, 22, తేదీలలో సంభవించును. విషువత్తనగా పగలును రాత్రియును సమానముగా నుండు కాలము. "సమరాత్రం దివేకాలే విషువద్విషువం చ తత్" అని అమరము (కాలవర్గ). సరిగా అప్పటి పూర్ణిమనాటి ఉదయమున ఇటు చంద్రాస్తమయమును, అటు సూర్యోదయమును జరుగును. చలి విరిగి పోయియు, ఎండల తీవ్రత లేకయు నుండు సమశీతల సమయముగావుననే కవులందఱును శృంగార వర్ణనలైన చంద్రోదయాది వర్ణనలను వసంతోదయమున చేయుచున్నారు.

## సారాంశము

1. దుఃఖముతో వేగిపోయిన వారికి వేగుచుక్క ఊఱట కల్గించునది గాన శృంగార ప్రబంధములలో దాని వర్ణన తప్పనిసరి యైనది.
2. వేగుచుక్క ఉదయముతో బాటు కోడికూతలు వినిపించును. బయటకి వచ్చి చూచువారికి మాత్రమే గదా వేగుచుక్క కనిపించునది! శృంగార ప్రబంధనాయికలు వసంతర్తువులో ఉద్యానవనమందే మన్మథార్తితో మేల్కొని యున్నారని యిందుమూలమున ద్యోతకమగుచున్నది. కోడికూతలతో తెల్లవారుచున్నదన్న భావము స్ఫురించును. అనంతరము కాకికూతలు వినిపించగనే తెల్లవారినదన్న భావము స్ఫురించును.
3. చంద్రాస్తమయసూర్యోదయములవర్ణన కేవలము విరహార్తుల బాధానివారణమును సూచించుటకును, రమ్యత కొఱకును అయియున్నది.

## ప్రకరణ సారాంశము

1. చంద్రవర్ణన వేదములందు గలదు. అందు చంద్రుడు ద్యుస్థాన దేవత. ఓషధీనాథుడు.
2. రామాయణమందు (వాల్మీకి) చంద్ర చంద్రికావర్ణనమును, దానిని పురస్కరించుకొని కలుగు కామభావాలను, వాల్మీకి కిష్కింధా, సుందర కాండలలో సర్వాంగ

సుందరముగ వర్ణించినాడు. రామాయణమందలి చంద్రవర్ణనను మించిన వర్ణన ఇతర కావ్యములందు లేదనవచ్చును.

3. కాళిదాసు కావ్యములందు చంద్రవర్ణన శృంగార రసావిష్టమై వెలసినది.

4. బాణుడు తన కాదంబరి యందు చంద్రవర్ణనకు ప్రముఖ స్థానమిచ్చినాడు. నైషధ మందు ఈ చంద్రవర్ణన అతి విస్తృతముగను, అనంత శృంగార రసవిలసితముగను వర్ణింపబడినది.

5. చంద్రవర్ణన శృంగార రస ప్రతిపాదనకు వీలయిన చోట్లనే వర్ణింపబడుచున్నది. తెనుగు ప్రబంధములలో నీ వర్ణన మనుచరిత్రమందును, పారిజాతాపహరణ మందును, వసుచరిత్రమందును, ఉత్తరోత్తర కావ్యాధిక్యముగా వర్ణితమైనది.

6. చంద్రుని పురస్కరించుకొనియే ఉపాలంభన సాహిత్యము బయలుదేరినది. ఈ చంద్రోపాలంభన అభిజ్ఞాన శాకుంతలమున బీజారోపస్థితిలో నుండి బాణుని కాదం బరి యందంకురించి చిగిర్చి, నైషధకావ్యమందున వృక్షముగా సాగి, ఆంధ్ర ప్రబంధములందది శాఖోపశాఖాంచితమై విలసిల్లినది.

7. ఉపాలంభన సాగిన ప్రబంధములైన మనుచరిత్ర, కళాపూర్ణోదయ, ప్రభావతీ ప్రద్యుమ్న, వసుచరిత్ర, విజయవిలాసములలో వసుచరిత్రమందలి ఉపాలంభనము సర్వోత్కృష్టమైనది.

8. "తమ్ములు" శబ్దముపై ప్రభావతీ ప్రద్యుమ్నమునను (4-123), వసుచరిత్రయందును (3-101) శ్లేషించుట జరిగినది. ఇందు వసుచరిత్రకారునిదే పైచేయి.

9. పారిజాతాపహరణమున ఉపాలంభన లేదు.

10. ఆముక్తమాల్యద యందు చంద్రవర్ణన లేశమాత్రమే. అది లౌకిక శృంగారము గాదు గాన చంద్రాద్యుపాలంభన లేదు.

11. సూరనలో ప్రతి విషయమునను ప్రత్యేకత కొట్టవచ్చినట్లు కానవగును. అందరి వలె చంద్ర మన్మథ మలయ మారుతోపాలంభన చేయక చంద్ర, శుక, కోకిలల ఉపాలంభించినాడు.

## సూర్యోదయ, సూర్యాస్తమయ, చంద్రోదయ, చంద్రాస్తమయాది వర్ణనలు

| | కుమారసంభవము | మనుచరిత్ర | పారిజాతాపహరణము | ఆముక్తమాల్యద | కళాపూర్ణోదయము | ప్రభావతీ ప్రద్యుమ్నము | వసుచరిత్ర | విజయ విలాసము |
|---|---|---|---|---|---|---|---|---|
| | 1. | 2. | 3. | 4. | 5. | 6. | 7. | 8. |
| సూర్యోదయవర్ణన | 5 | 4 | 4 | — | 1 | 3 | 2 | 4 |
| సూర్యాస్తమయవర్ణన | 2 | 6 | 6 | — | 3 | 1 | 2 | 1 |
| సంధ్యావర్ణన | 1 | 1 | 2 | — | 1 | — | 3 | 6 |
| అంధకారవర్ణన | 7 | 3 | 4 | — | 1 | 1 | 4 | — |
| నక్షత్రవర్ణన | 3 | — | 1 | — | 2 | 1 | 1 | — |
| శైత్యోపచారములు | 30 | 6 | — | — | 4 | — | 19 | 6 |
| చంద్రోదయాదివర్ణన | 80(విటవిటీ వర్ణనతో) | 15 | 15 | 1 | 10 | 7 | 13 | 1 |
| చంద్రోపాలంభన | 3 | 9 | 1 | 11 సూర్యోపాలంభన) | 4 | 5 | 11 | 7 |
| మన్మథోపాలంభన | 1 | 3 | — | — | — | 1 | 1 | 6 |
| మలయమారుతోపాలంభన | 1 | 3 | — | — | — | 4 | 2 | 7 |
| వేగుచుక్క వర్ణన | — | 1 | 1 | — | 1 | — | — | 1 |
| చంద్రాస్తమయ సూర్యోదయ వర్ణన | — | — | 7 | 1 | 1 | — | 8 | — |

# ఉపసంహారము

"ప్రబంధములలో ప్రకృతి వర్ణనలు" అన్న విషయముపైన విస్తారమైన చర్చ జరిగినది.

ప్రథమ ఖండమందలి ప్రథమ ప్రకరణమున కవి, కవిత్వము, ప్రకృతి, వర్ణన అను విషయములపై జరిగిన చర్చాఫలితముగా కవిత్వమనగా వర్ణించుటయే అని తేలినది. కవి యనగా వర్ణించువాడనియు, ప్రతిభావంతుడును, ఋషితుల్యుడును, సృష్టికర్తృసదృశుడనియును, వాగర్థముల సాహాయ్యమున కవితాసృష్టి చేయువాడనియు తేలినది.పాశ్చాత్య పండితుల యభిప్రాయముగూడ నంతే.

ద్వితీయ ప్రకరణమున ప్రకృతి యొక్క వివిధరూపములు చర్చింపబడినవి. ప్రకృతితో నిరంతర సాహచర్యము గల మానవుడు ఆదిలో ప్రకృతిని భయాశ్చర్య భావములతో తిలకించినను, పోనుపోను ఆరాధన దృష్టితో చూచినాడనవలెను. ప్రకృతి నుండియే మానవునికి ఆహారముగూడ లభించుచున్నదనియు, మానవేతర ప్రాణికోటి నియత జీవన విధానము గల్గి యున్నందున అవి సమయగణనకు పనికి వచ్చుచున్నవి. అంతేగాక శకునరూపమున గూడ ఉపకరించుచున్నవని తేలినది. వేద పురాణ కావ్యాదులనన్నిటిని పురుషులు వ్రాసినారు గాన, బలరూప ప్రకృతిని పురుషరూపముగను, బలహీనమును అందమును అయిన ప్రకృతిని స్త్రీ రూపముగను భావించుట జరిగినదని నిరూపింపబడినది. ఉపమా ఉత్ప్రేక్షాద్యలంకార జననమునకు సుందర ప్రకృతియే ఆలంబనమని గూడ నిరూపింపబడినది.

ఇందు కవిసమయముల గూర్చియు, దోహదక్రియల గూర్చియు గూడ చర్చింపబడినది. ప్రకృతివర్ణనలు చాలభాగము కవిసమయ ప్రాధాన్యములనియు, కావ్యప్రయోగములలోని మర్మములు తెలిసికొనవలెనన్నచో కవిసమయములను తెలిసికొన వలసి యున్నదనియు, కవిసమయములు శాస్త్రమర్యాదలకును లోకమర్యాదలకును భిన్నమైన వనియు, రసపోషణకును, సౌందర్యసిద్ధికిని నివి ముఖ్యమయినవనియు నిరూపింపబడినది. దోహదము లోకశృంగార చేష్ట. ఇది కావ్యమున కింకను అందము గూర్చినది. సర్వ వృక్షములును పుష్పించు వసంతకాలముననే దోహదముల నడపుట జరుగుచున్నదనియు, మదవతుల దోహద చేష్టలవలన వృక్షములు పుష్పించినవనుట కేవలము ఆ శృంగారవతుల

రూపలావణ్య శృంగార భావాదుల నతిశయించి వర్ణించుటయే యనియు నిరూపింప బడినది.

మూడవ ప్రకరణమున వేదములందలి ప్రకృతి వర్ణనల గూర్చి చర్చ జరిగినది. ఇంద్ర, అగ్ని, వాయు, వరుణాదులు ప్రకృతి శక్తులనియు, వానికి మూర్తిమత్త్వము కల్పించి ప్రార్థించుట జరిగినదనియు నిరూపింపబడినది.

ఉషస్సును చూచిన తరువాత ఋషులు రసభావావిష్టులై సౌందర్యదృష్టితో వర్ణించినారని స్పష్టమయినది. సర్వవిధ వర్ణనలకును, ఉపమా ఉత్ప్రేక్షాద్యలంకారములకును, సర్వ ఋతువర్ణనలకును వేదములే మూలములని నిరూపింపబడినది.

చతుర్థప్రకరణ మంతయు లౌకిక సంస్కృత వాఙ్మయము నందలి ప్రకృతి వర్ణనల గూర్చి చర్చ సాగినది.

రామాయణము ప్రకృతి వర్ణనలకు ఆలవాలము. వేదములందు ప్రకృతి మూర్తిమత్త్వము నొందినట్లుగా రామాయణమందున మానవీకరణ పొందినది. రామాయణ మందలి ప్రకృతి వర్ణనలే తర్వాతి లాక్షణికులు అష్టాదశ వర్ణన నియమము గావించుటకు ముఖ్యకారణమని స్థిరీకరింపబడినది. అష్టాదశ వర్ణనా నియమము తర్వాత బుట్టిన కావ్యములలో శిశుపాలవధ, కాదంబరి, నైషధకావ్యములు అష్టాదశవర్ణనా నియమమును పూర్ణముగ పాటించినవని నిరూపింప బడినది. ఉపాలంభన సాహిత్యము రామాయణమున, బీజప్రాయముగనుండి, కాళిదాసుయొక్క శాకుంతలమున అంకురముగ కనిపించి కాదంబరియందు మారాకు దొడిగి, నైషధమున వృక్షమై తరువాత ఆంధ్రప్రబంధములలో శాఖోపశాఖాంచితముగా పరిణమించినదని నిరూపింపబడినది.

పంచమ ప్రకరణమున తమిళ, కర్ణాట సాహిత్యములందలి ప్రకృతి వర్ణనల గూర్చిన చర్చాఫలితముగా తమిళ సాహిత్యము పురాతన సాహిత్యమనియు, ప్రకృతి వర్ణనలు విశేషముగ గలిగియున్నవనియు, వర్ణనా పద్ధతిలో స్వాతంత్ర్యము గలదనియు, అందలి వర్ణనా నియమములకును సంస్కృతమునందలి వర్ణనా నియమములకును భిన్నత్వమున్నదనియు, తమిళ వర్ణనా నియమములను అర్థము చేసికొననిదే ఆ వర్ణనా సందర్భము లర్థము కావనియు, తేలినది. కన్నడమందలి ప్రకృతివర్ణనా పద్ధతి కొంతవరకు సంస్కృతము ననుసరించినదే యనియు నిరూపింపబడినది.

ద్వితీయ ఖండమున ప్రబంధ నిర్వచనమును గూర్చియు, వర్ణనా నియమముల గూర్చియు, అష్టాదశవర్ణనల గూర్చియు, ఆంధ్రప్రబంధములందలి ప్రకృతివర్ణనల తులనాత్మక పరిశీలన గూర్చియు వివరింపబడినది.

ప్రబంధ శబ్దమును సంస్కృతమున నేయేయర్థములలో ప్రయోగించిరో – ఆంధ్ర కవి లాక్షణికులు గూడ నదే యర్థములలో ప్రయోగించిరని నిరూపింపబడినది. కృష్ణదేవ

రాయలకాలమునుండి రచియింపబడిన స్వతంత్ర శృంగార కావ్యములకే ప్రబంధములను పేరు కలిగినదని నిరూపింపబడినది తెనుగున గల అష్టాదశ వర్ణనా నియమము సంస్కృతమునుండి సంక్రమించినదేయని రుజువు చేయబడినది.

సంస్కృతాంధ్ర కవిలాక్షణికులందరిలోను, 'అష్టాదశ' అన్న శబ్దమును మొట్టమొదట ప్రయోగించిన కీర్తి ప్రథమాంధ్ర ప్రబంధ కవియైన నన్నెచోడునికే దక్కినదని నిరూపింపబడినది.

దండి, విశ్వనాథ, కేశవమిశ్రాదులు చెప్పిన నానావర్ణనా నియమములు వాల్మీకి కాళిదాసాది కవులు ప్రయోగించిన నానా ప్రకృతివర్ణనలను బట్టియే యని నిరూపితమైనది. వర్ణనలకును, కావ్యములకును, పద్య సంఖ్యలకును సంబంధించిన పట్టికలు గూడ నీయబడినవి.

తులనాత్మక పరిశీలనకు గైకొనబడిన నన్నెచోడ కుమారసంభవము, పెద్దన మనుచరిత్ర, తిమ్మన పారిజాతాపహరణము, రాయల ఆముక్తమాల్యద, సూరన కళాపూర్ణోదయ ప్రభావతీప్రద్యుమ్నములు, భట్టుమూర్తి వసుచరిత్ర, చేమకూర వెంకటకవి విజయవిలాసములు మాత్రమేల గైకొనబడినవో సహేతుకముగ వివరింప బడినది.

పురవర్ణన అష్టాదశ వర్ణనలలో నొకటి. ఆంధ్రప్రబంధములందంతటను ఆ వర్ణన కొన్నియెడల సహజముగను, మరికొన్నియెడల సంప్రదాయానుసరణముగను వర్ణింపబడినది. మనుచరిత్రమందలి అరుణాస్పద పురవర్ణనయును, ఆముక్తమాల్యదయందలి విలుబుత్తూరు వర్ణనయును సహజముగ సాగినవి. కుమారసంభవమందలి ఓషధీప్రస్థపుర వర్ణనమును, పారిజాతాపహరణమందలి వైజయంతీపురవర్ణనమును. కవిసమయ పద్ధతిలో సాగినవి. అవి దేవభూములయినను భూలోకపు వర్ణనముందుగల పరిఖ, వప్ర, గజ తురగాదులును, నిమ్మ, పనస మొదలుగా గల వృక్షములును ఆ దేవభూములందున్నవని వర్ణింపబడుట కేవలము వర్ణనా సంప్రదాయము ననుసరించి చేసినదే యని నిరూపింప బడినది.

కొన్ని ఆంధ్ర ప్రబంధములందు సముద్రవర్ణన అవసరములేకున్నను వర్ణింప బడుట కేవలము అష్టాదశవర్ణనా నియమమును పాటించుటకు చేసినదే యని నిరూపింప బడినది.

పర్వతవర్ణన అష్టాదశవర్ణన గానే స్వీకరింపబడి వర్ణింపబడినను, వసుచరిత్రమందలి కోలాహల వర్ణన పర్వతవర్ణన వలె కనిపించదనియు, అది ఒక సుందర యువకుడగు రాజకుమారుని వర్ణనవలె నున్నదనియు నిరూపింపబడినది.

వనవర్ణనమనగా ఉద్యానవన వర్ణనమే యనియు, అదియుగూడ వసంతమాసమ ననే జరుగు వర్ణన యనియు ఆంధ్రప్రబంధములందలి ప్రకృతి వర్ణనా పరిశీలనయనంతరము తేలినది.

శైత్యోపచారములు ఒక సరసక్రీడ. అభిజ్ఞాన శాకుంతలమందిది ప్రథమముగా కని పించుచున్నదనియు, శైత్యోపచారములు నడిచిన ప్రప్రథమాంధ్రప్రబంధము కుమార సంభవమనియు, అందరు నాయికలకు శైత్యోపచారములు తరతమ భేద సుందరముగా సాగినను కళాపూర్ణోదయమందలి నాయికకు ఒక శీతల గృహమునే నిర్మించి శీతలమైన పాన్పునువేసి, శైత్యోపచార క్రియ అమోఘముగా సాగింపబడినదనియు నిరూపింప బడినది.

ఋతువర్ణనలు వేదకాలమునుండి వచ్చుచున్న సంప్రదాయము. సంస్కృత, ఆంధ్ర ప్రబంధకారులందరికంటెను ఆముక్తమాల్యద కర్త సర్వఋతువులను సాకల్యముగను, సహజముగను, సూక్ష్మముగను విస్తృతముగను వర్ణించినాడని నిరూపితమైనది.

నదీ సరోవర్ణనలు సంప్రదాయ సంబంధులయిన ప్రకృతివర్ణనలయినను వసు చరిత్ర మందలి శుక్తిమతి నదిగా గాక కేవలమొక శృంగారనాయికగా, కులీనకన్యగా, ఉత్తమ మాతగా మానవీకరణ పొందినదని నిరూపింపబడినది.

సూర్యోదయము అష్టాదశ వర్ణనలలోనిదే యయినను ఆంధ్రప్రబంధకారులు దాని నంతగా వర్ణించ లేదని తేలినది.

అంధకారము యొక్క ఉద్దండతను సంస్కృతాంధ్ర ప్రబంధకారులెల్లరును వర్ణించిరి. కుమారసంభవ, మనుచరిత్ర, పారిజాతాపహరణ, వసుచరిత్రల యందీ ఘట్టమున సీస పద్యములనే వాడుట అంధకారముయొక్క దైర్ఘ్యమును ఉద్ధృతను చాటినట్లు అయినది.

చంద్ర చంద్రికా వర్ణనలు అమోఘములు. ద్యుస్థాన దేవతగా వేదములందు వర్ణింపబడిన చంద్రుడు రామాయణమందు మధుర శృంగారదేవతగా ప్రత్యక్షమయినాడు. రామాయణమందలి చంద్రవర్ణనకు మించిన వర్ణన మరేకావ్యమందును లేదని చెప్ప వచ్చునేమో !

చంద్రవర్ణన శృంగారరస ప్రతిపాదనకు వీలయినచోట్లనే జరుగుచుండుట గమనింప దగినది.

చంద్రుని పురస్కరించుకొనియే ఉపాలంభన సాహిత్యము బయలుదేరినది. ఈ చంద్రోపాలంభన మనుచరిత్ర, కళాపూర్ణోదయ, ప్రభావతీప్రద్యుమ్న, వసు చరిత్రలలో చాల దూకుడుగా సాగినది. అందును వసుచరిత్రమందలి ఉపాలంభన సర్వోత్కృష్టమయి నదని తేలినది.

పైన పేర్కొన్న కుమారసంభవ, మనుచరిత్ర, పారిజాతాపహరణ, ఆముక్త మాల్యద, కళాపూర్ణోదయ, ప్రభావతీప్రద్యుమ్న, వసుచరిత్ర, విజయవిలాసము లందలి

ప్రకృతి వర్ణనలలో వసుచరిత్రమందలి ప్రకృతి వర్ణనలు సర్వోత్కృష్టమైనవనియు, వసుచరిత్రమొక సవాలు కావ్యమనియు తేలినది.

మేధానిధులగు ఆంధ్రప్రబంధకారులు వర్ణించిన ప్రకృతివర్ణనలు అతిస్వతంత్రములు. స్వకపోల కల్పనలు, స్వీయవిజ్ఞాన విలసితములు. అశేష శేముషీ ప్రదర్శకములు.

అనేక భాషాప్రబంధపరిశీలనముయొక్క సారమేమనగా మన ఆంధ్రప్రబంధకారుల వర్ణనా నైపుణ్య మమోఘమనియు, వర్ణనా వైదుష్య మతివేల మనియు, వర్ణనా స్వాతంత్ర్య మప్రతర్క్యమనియు తేలినది. అదియే యీ సిద్ధాంతవ్యాస సారాంశము.

# సంక్షిప్తసంకేతములు

| | | |
|---|---|---|
| భార | : | భారతము |
| భాగ | : | భాగవతము |
| రామా | : | రామాయణము |
| హరి | : | హరివంశము |
| కుమార | : | కుమారసంభవము |
| మను | : | మనుచరిత్ర |
| వసు | : | వసుచరిత్ర |
| ఆము | : | ఆముక్తమాల్యద |
| ప్రభా | ; | ప్రభావతీ ప్రద్యుమ్నము |
| కళా | : | కళాపూర్ణోదయము |
| పారి | ; | పారిజాతాపహరణము |
| ఋ | : | ఋగ్వేదము |
| సామ | : | సామవేదము |
| యజు | : | యజుర్వేదము |
| రఘు | : | రఘువంశము |
| కుమా | : | కుమారసంభవము |
| మేఘ | : | మేఘసందేశము |
| ఋతు | : | ఋతుసంహారము |
| శాకుం | : | శాకుంతలము |
| కాదం | : | కాదంబరి |
| శిశు | : | శిశుపాలవధ |
| నైష | : | నైషధము |
| కావ్య | : | కావ్యప్రకాశము |
| బాల | ; | బాలకాండ |
| అయోధ్య | : | అయోధ్యాకాండ |

| | | |
|---|---|---|
| అరణ్య | : | అరణ్యకాండ |
| కిష్కింధా | : | కిష్కింధా కాండ |
| సుందర | : | సుందర కాండ |
| యుద్ధ | : | యుద్ధకాండ |
| ప్రతాప | : | ప్రతాపరుద్రీయము |
| అలం | : | అలంకార శేఖరము |
| విజయ | : | విజయ విలాసము |
| కావ్యాలం | : | కావ్యాలంకార చూడామణి |
| నాట్య | : | నాట్యశాస్త్రము (భరతుడు) |

# సహాయక గ్రంథములు

## 1. ఆంధ్ర గ్రంథములు


ఆంధ్ర మహాభారతము

ఆముక్తమాల్యద

కళాపూర్ణోదయము

కవికర్ణ రసాయనము

కుమార సంభవము (నన్నెచోడ) 1948

కేయూరబాహు చరిత్రము

దక్షిణాంధ్రసాహిత్యము (డాక్టర్ కె.వి. ఆర్, నరసింహం)

నృసింహపురాణము (ఎఱ్ఱన)

పండితారాధ్యచరిత్ర

పారిజాతాపహరణము

ప్రభావతీప్రద్యుమ్నము.

బసవపురాణము

భాగవతము (పోతన)

భాస్కర రామాయణము

మను చరిత్ర, 1951

మార్కండేయపురాణము

రంగనాథరామాయణము

వర్ణనరత్నాకరము (దాసరి లక్ష్మణస్వామి) పిఠాపురం 1928

వసుచరిత్ర

విద్యార్థికల్పతరువు (వెంకట్రామా అండ్ కో, 1967)

విష్ణుపురాణము (కలిదిండి భావనారాయణ)

వేదవాఙ్మయము (తిరుమల శ్రీనివాస శర్మ)

హరివంశము (ఎఱ్ఱన)

హరివంశము (నాచన సోమన)

శృంగారనైషధము (శ్రీనాథ) వేదం 1961

## 2. సంస్కృత గ్రంథములు


అభిజ్ఞాన శాకుంతలము - కాళిదాసు

ఋగ్వేదము (అనువాదము) బంకుపల్లి మల్లయ్యశాస్త్రి - 1940

ఋతుసంహారము - కాళిదాసు

కాదంబరి (బాణుడు) కాశీనాథ పాండురంగపరబ్. బొంబాయి, 1948

కిరాతార్జునీయము, భారవి, (వావిళ్ళ)

కుమారసంభవము-కాళిదాసు

గురుబాల ప్రబోధిక - వావిళ్ళ

తైత్తిరీయోపనిషత్తు (స్వామి శర్వానంద) 1949

నిష్పన్న యోగావళి- అభయాకరగుప్త, వ్యాఖ్యాత భట్టాచార్య, వినయ తోష్‌రోడ్

నైషధము-హర్షుడు

భారతము (వ్యాస) వావిళ్ళ

మేఘసందేశము, కాళిదాసు

యజుర్వేదము (అనువాదము) బంకుపల్లి మల్లయ్యశాస్త్రి

రఘువంశము - కాళిదాసు

రామాయణము (వాల్మీకి), వావిళ్ళ, 1954

వేదములు (హిందీ) శ్రీరామశర్మ ఆచార్య బలదేవ్, 1969

శిశుపాలవధ, మాఘుడు - నిర్ణయసాగర్ ప్రెస్, 1923

సంస్కృతవాఙ్మయచరిత్ర, వేదవాఙ్మయచరిత్ర - మల్లాది సూర్యనారాయణశాస్త్రి

సంస్కృతకవులచరిత్ర- మల్లాది సూర్యనారాయణశాస్త్రి

సామవేదము (అనువాదము) బంకుపల్లి మల్లయ్యశాస్త్రి

సుభాషిత రత్న భాండాగారము, కాశీనాథ పాండురంగ పరబ్, నిర్ణయసాగర ప్రెస్ 1886


## 3. హిందీ


కవిసమయ మీమాంస (హిందీ) డాక్టర్ విష్ణుస్వరూప్, కాశీవిశ్వవిద్యాలయము, 1963

మహాకవి కాళిదాస్ - (రమాశంకర్ తివారి) 1961

సంస్కృత సాహిత్యకా ఇతిహాస్ - వాచస్పతి గైరోలా

హిందీ ప్రకృతి చిత్రణ్ - డాక్టర్ కిరణకుమార్ గుప్త

హిందీ సాహిత్య మే వివిధ వాద్ - ప్రేమ నారాయణ శుక్లా

## 4. తమిళ గ్రంథములు

అగనానూరు, నాము వెంకటస్వామి నాటార్, (1965), మద్రాసు
తమిళ సారస్వత చరిత్ర. జె. యం. సోమసుందరపిళ్లై 1968, అణ్ణామలైనగర్
తమిళ సారస్వత చరిత్ర, ప్రొఫెసర్ మీనాక్షిసుందరం, 1965. „
తొల్కాప్పియం, డాక్టర్ పి. యస్. సుబ్రహ్మణ్యశాస్త్రి, 1945 „
తిరుక్కురల్ - S. I. S. S Publishing Society, Madras - 1962
సంగం సాహిత్యము - ప్రకృతి వర్ణన - డాక్టర్ యం. వరదరాజన్.

## 5. కర్ణాట గ్రంథములు

కుమార వ్యాస భారతము, బెంగుళూరు, 1936
జగన్నాథ విజయము
నాగవర్మ 'కావ్యావలోక'
పంప భారతము
సూక్తిసుధార్ణవము

## 6. ఆంగ్ల గ్రంథములు

Ancient History and Culture - Universal Book Stationery & Company Delhi.
Epics, Mythes and Legends of India - Universal Book and Stationary & Co., Delhi, 11th Edition
History of Sanskrit literature - A. A. Macdonnell. 1958
History of Sanskrit literature - Universal Book Stationery & Co., Delhi, 1951
History of Sankrit Poetics - P. V. Kane 1951
History of Sanskrit literature, Keith
Some concepts of the Alankara, Universal Book Stationery and Company, Delhi.
The Origin of the Totamism - Fortnightly review, April & May 1887

## 7. అలంకార గ్రంథములు

అగ్ని పురాణము
అలంకార చింతామణి - అజిత సేన
అలంకార శేఖర - కేశవ మిశ్ర, నిర్ణయసాగర్ ప్రెస్, 1926
అప్పయ్యదీక్షీయము, అప్పకవి
ఆంధ్ర ప్రతాపరుద్రీయము, జమ్మలమడక మాధవరాయశర్మ
కావ్య ప్రకాశము, జమ్మలమడక మాధవరాయశర్మ

కావ్యాలంకార చూడామణి - విన్నకోట పెద్దన
కావ్యాదర్శము - దండి
కావ్యమీమాంస - రాజశేఖర
కావ్యాలంకార సంగ్రహము - వ్యాఖ్యాత, సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి, యం. శేషాచలం కంపెనీ, 1965
కువలయానందము - చౌకాంబా విద్యాభవన్, బెనారస్, 1956
ధ్వన్యాలోకము - ఆనందవర్ధన
ధ్వన్యాలోకము (ఆనంద వర్ధన), జమ్మలమడక, 1963
నాట్యశాస్త్రము (భరత) డాక్టర్ పి. యస్. ఆర్. అప్పారావు
ప్రతాపరుద్రీయము - విశ్వనాథ
భరతుని నాట్యశాస్త్రము - ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్ - బరోడా, 1954
సరస్వతీ కంఠాభరణము - భోజుడు, నిర్ణయసాగర ప్రెస్, 1934
సాహిత్యదర్పణము - విశ్వనాథ

### విమర్శ గ్రంథములు

కావ్యలహరి - ఆచార్య దివాకర్ల వెంకటావధాని
నన్నెచోడ కుమార సంభవము - దేవరపల్లి కృష్ణారెడ్డి
వసుచరిత్ర విమర్శ - వఝుల చిన సీతారామస్వామిశాస్త్రి

### పరిశోధన గ్రంథములు

ఆధునికాంధ్రకవిత్వము - సంప్రదాయములు ప్రయోగములు | డాక్టర్ సి. నారాయణరెడ్డి
ఆంధ్ర భాషావికాసము - జి. జె. సోమయాజి
ఛందః శిల్పము (ఆంధ్రమహాభారతము) డాక్టర్ పాటిబండ మాధవశర్మ
తెలుగు జానపద గేయాలు, గాథలు-డాక్టర్ నాయని కృష్ణకుమారి
నన్నెచోడ కుమారసంభవము డాక్టర్ తమ్మారెడ్డి నిర్మల
ప్రబంధములు - అవతరణ వికాసములు - డాక్టర్ కె. వి. ఆర్. నరసింహం
హృదయోల్లాస వ్యాఖ్య (విజయ విలాసము) తాపీధర్మారావు
తెలుగు జానపద గేయసాహిత్యము - డాక్టర్ బి. రామరాజు

# సూచిక

## అ

## ద